తాళ్ళపాక పద సాహిత్యము-సంపుటము-

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానములు

తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 14

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్తలు

కీ॥ శే॥ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

T.T.D. Religious Series - 546

ప్రథమ ముద్రణ : 1965
ద్వితీయ ముద్రణ : 1998






ప్రతులు : 2,000

వెల : రు. 26-00




ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

ఇందరికి అభయంబు లిచ్చు చేయి
కందువగు మంచిబంగారు చేయి ॥

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మైక విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థాన 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదా 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచు ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయి కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యక ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రి బడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణ సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్ర పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్య పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేక పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొ నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించ ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీ కలి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు అధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహక శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సి సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచ సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యా తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్య నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌర శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతాఙ్జతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| పుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| త్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| త్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| త్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| త్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ర సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ర సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| ంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| కీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| కీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| కీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| ర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| నలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయ బడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక



శ్రీ అన్నమాచార్యుల శృంగారసంకీర్తనలు, రేకులు ౫౦౧ నుండి ౬౦౦ ల వరకును గలవానియందలివి ౫౩౭ కీర్తనలను ౧౯-వ సంపుటముగా యథాశక్తి పరిష్కరించి, కడచిన ౧౮-వ అన్నమాచార్యోత్సవ సందర్భమున వెలువరుపగలుగు. శ్రీ శ్రీనివాసుల యనుగ్రహఫలము.

ఇప్పుడు ౬౦౧ నుండి ౭౦౦ ల దాక గల రేకులలోని పాటలను ఈ ౨౦ వ సంపుటముగా ప్రకటించుచున్నాను. ఈ రెండు సంపుటములను గూడ పై యుత్సవమునాటికే ప్రకటింప సంకల్పించి, సిద్ధపరచి యున్నను ముద్రణసౌలభ్యము చాలక అట్లు చేయ వీలుపడలేదు. రాబోవు ఉత్సవకాలమున ఇది గాక మరి రెండు సంపుటములైనను ప్రకటించి, నన్నీ కైంకర్యమునకు నియోగించి ప్రేమగౌరవములు వెలయించిన శ్రీదేవస్థాన శ్రీకార్యనిర్వాహకుల పెద్దయప్పుమీది వడ్డియైనను చెల్లించు ప్రయత్నముచేయు సంకల్పము గలదు. ఈ కైంకర్యమునకు సర్వవిధముల సాహాయ్యము నెరపు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు నా రెండుచేతుల యూత. అందుమీద శ్రీ శ్రీనివాసుల దయ.

> "అకించననిధిం సూతి మపవర్గ త్రివర్గయోః ।
> అంజనాద్రీశ్వర దయామభిష్టౌమి నిరంజనామ్" ॥
>
> — (దయాశతకం. ౧౦.)

అను శ్రీ వేంకటనాథ సూక్తిని నమ్మి స్మరింతును.

౧౯ - వ సంపుటములోవలె ఇందును మరికొన్ని అపూర్వపదముల సమీక్షచేసి చేర్చినాము. (అను. ౧) ఈ సందర్భమున కడచిన సంపుటమందే కృతజ్ఞతతో తెలిపికొనవలసిన విషయమొక్కటి, పొరపాటున తప్పినది. ఇప్పుడు తెలుపుకొనుచున్నాను. ఈ పరిష్కరణ

భారము వహించినప్పుడు, మిత్రులు శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డిగారు, శ్రీ వేంకటేశ్వర విశ్వకలాశాలయందు ఆంధ్రోపన్యాసకులు, తమవద్ద నున్న ప్రాచీనమైన పెద్ద తమిళ—ఇంగ్లీషు నిఘంటువొకటి—(A Dictionary, Tamil and English, Based on Johann Philip Fabricious's Malabar-English Dictionary) నాకు ప్రీతితో దానము చేసిరి. వారికి నా యనంత ధన్యవాదములు. అది పదార్థస్వరూప వివేచనకు నా కెంతో యుపకరించినది. మేము ఇక్కడ చేసినది సమీక్షమాత్రమే. నిర్ణయము గాదు. ఆ విషయమున సౌహార్దముతో సహృదయ పండితులు చేయు విమర్శలు సూచనలును శిరసావహించి పరిశీలింపబడును.

ఎప్పటి వలె ఈ కార్యమున తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాలయమువారు చూపుచున్న ఉత్సాహసౌహార్దములు కృతజ్ఞతతో పేర్కొనదగినవి.

తిరుపతి
12—4—65

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ,
పరిష్కర్త.

---

శ్రీరస్తు

# శ్రీ తాళ్లపాక అన్నమాచార్యుల
# శృంగార సంకీర్తనలు

—✳✳✳✳—

[ స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటి క్రోధి సంవత్సరమందు శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను. అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరువానకు తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార సంకీర్తనలు. ]

రేకు - 601 సాళంగనాట

వేగినంతా నేమి చెప్పే వెలుమ జోలి
వాగమై నాకు మేనవాఁ డౌనో కాఁడో ॥ పల్లవి ॥

యెగసక్కేలకు నాతో నేమైన ననెఁ గాక
అగపడి నాకు లోనౌనో కాఁడో
నగుతా నెంతైనాఁ బెనఁగినాఁ బెనఁగెఁ గాక
తగవున కిపుడు నా మొగఁడౌనో కాఁడో ॥ వేగి ॥

యెమ్మెలకుఁ దా మరి యెట్టుండినా నుండెఁ గాక
యిమ్ముల నాకుఁ జనవిచ్చెనో లేదో
వుమ్మడి తా సిగ్గువడి వుండినా నుండెఁ గాక
కమ్మర మొదల నన్నుఁ గైకొనెనో లేదో ॥ వేగి ॥

దిమ్మరియై ఇట్టె సాదించితే సాదించెఁ గాక
నమ్మించి నన్నిట్టె యెనసనో లేదో
వమ్మి శ్రీవేంకటేశుఁడు పైకొంటేఁ బైకొనెఁ గాక
నెమ్మదిఁ గృపారసము నించెనో లేదో ॥ వేగి ॥ 1

## పాడి

చెలులాల యాతనికిఁ జెప్పరే మీరు
యెలమి నెదిరివారి యింగిత మెరఁగఁడా ॥ పల్లవి ॥

ప్రియము చెప్పేడిమాట పెదవిపై నుండఁగాను
క్రియ యెరఁగకేల వేగిరించీఁ దాను
నయములు వినయాలు నావొళ్ల నుండఁగాను
దయ యెఱఁగక యేల తమకించీనే ॥ చెలు ॥

కడుఁ జల్లని చూపులు కన్నులనే వుండఁగాను
పొడిఁబడి తనకింత పొక్కనేఁటికే
చిడుముడి నవ్వులు నాసెలవుల నుండఁగాను
గొడవలు తనకేలే కొసరీఁ దా నిపుడు ॥ చెలు ॥

పూఁచినట్టి కాఁగిలి బుజముల నుండఁగాను
లోఁచి చూడఁ దనకేలే లోలో నన్ను
యేఁచక శ్రీవేంకటేశు నిట్టె తన్ను నేఁ గూడితి
పాఁచిరతులిఁక నేలే పైపై నా యెడకు. ॥ చెలు ॥ 2

## సామంతం

తెరమరఁగేఁటికి దిష్టమువో చెలి
పురుష విరహ మిటు పొలసీని ॥ పల్లవి ॥

వంచిన శిరసును వాలుక చూపులు
పెంచిన నెరుల యీపెనుఁగొప్పు
మంచముపైఁ బతి మతిలోఁ దలఁచుచు
పొంచిన చెమటతోఁ బొరలీని ॥ తెర ॥

చెక్కుటిచెయి నీసెలవుల నవ్వులు -
పుక్కిటి పీడెపు భోగములు
వక్కణ నీతఁడు వాకునఁ బొగడుచు
గక్కన లోలోఁ గరఁగీని ॥ తెర ॥

మోవికెంపులును మొలకల పులకలు
సావధానమగు చనుకట్టు
భావించి కూడెను బలిమి నిన్ను నిటు
శ్రీవేంకటేశుఁడు చెలఁగీని. ॥ తెర ॥ 3

## నీలాంబరి

ఆయ రావయ్యా లోనికి నారగింతువు
కాయమెంత అంటినాను కరఁగీ నామనసు ॥ పల్లవి ॥

సడనుండి వచ్చి సతులెందరు చెనకినాను
వేడుక కాఁడవు నీవు వేసరేవా
జాడతోడ మదనశాస్త్రము లెన్ని చదివినా
తోడనే నీవీనుఁ గొందులు తనిసీనా ॥ ఆయ ॥

తరుణులెంత నీనోటఁ దములము వెట్టినాను
ధర నీనోరు నొచ్చీనా దక్కుఁగాక
దొరకొన్నా(ని + ఒ)కరొకరి తొడమీఁదఁ గూచుండినా
గరిమ నలసీనా కాయగాచుఁ గాక ॥ ఆయ ॥

యెందరు కాఁగిట నిన్ను నెంగిలి సేసినాను
యెందుకైనా నొగ్గక నీ వేవగించేవా
ముందె శ్రీవేంకటేశ ముంచి నన్ను నేలితివి
అందె యింకా నన్నే కూడకారడిఁ బెట్టేవా. ॥ ఆయ ॥ 4

ఆహిరినాట

సేయువయ్యా ఇంకా నీకుఁ జెల్లినట్లెల్లా
యీయెడ మేలనుచు నిన్నిట్టే మెచ్చేమయ్యా ॥ పల్లవి ॥

మారుమాటలాడక మనసు సోదించక
చేరి నీ చెప్పినట్లెల్లాఁ జేసేమయ్యా
సారెఁ గొసరక చలము సాదించక
వూరకే చేతులు మూసుకుండేమయ్యా ॥ సేయ ॥

యెగ్గులేమీఁ బట్టక యెకసక్కేలాడక
వొగ్గుచుఁ జేతులఁ జాదాలొత్తేమయ్యా
శిగ్గులునుఁ బడక శిరసు వంచుకొనక
అగ్గమై నీవు నవ్వినట్టే నవ్వేమయ్యా ॥ సేయ ॥

తప్పులేమీనెంచక తగవులఁ బెట్టక
ముప్పిరి సరసములు ముంచేమయ్యా
యిప్పుడె శ్రీవేంకటేశ యెనసితివిటు నన్ను
తప్పకుండ వేవేలు దండాలు వెట్టేమయ్యా. ॥ సేయ ॥ 5

సావేరి

ఎల్లవారి ముందరను యేల కాకుసేయ నీకు
కొల్లున నవ్వితేనో గొల్లవారి పెండ్లి ॥ పల్లవి ॥

ఆసుద్దులు చెప్ప౹ి అంగనకు నీవు మెడఁ
బూసలు గట్టినప్పుడే పొందెరిఁగెను
౯ాసి కన్నెపడుచును రవ్వసేయనేల నీవు
శేస వెట్టినప్పుడే సిగ్గు వుట్టెను ॥ ఎల్ల ॥

యీడకు నాడకు మరి యెడతాఁకించఁగనేల
వీడెమందుకొన్నప్పుడె విందులబ్బెను
వాడికగా నొండొరులు వావె(వి+అ)డుగనేల చల్ల-
చాడె దించుకొన్నప్పుడే సతమాయను ॥ ఎల్ల ॥

ఆదిగొని నీవు నేఁడు ఆస ఛేఁచనేల మించి
పాదము దొక్కినప్పుడే భాగ్యమాయను
యీదెస శ్రీవేంకటేశ యేలితివి యింతి నిట్టే
పోదులు మరిఁ జేయఁగ పొంకమాయను. ॥ ఎల్ల ॥ 6

రేకు - 602 సోమరాగం

ఊరకుండుమనవే పొడఁబాటులిఁక నేలే
కోరికలు గోరుకొంటా గొణఁగేఁ గాని ॥ పల్లవి ॥

అగపడితిమి తొల్లే ఆయను తన పొందు
యెగసక్కేలాడక తానిఁక నెన్నఁడే
జగడించ నోపము జవ్వనము మోచుకొని
మొగము చూచి చూచి మూలిగేఁ గాని ॥ ఊర ॥

సేవలెల్లాఁ జేసేము చెల్లుబడి గలవాఁడు
యీవల నవ్వులు నవ్వకిఁక నెన్నఁడే
చేవట్టి తియ్యనేల సిగ్గులు పైవేసుకొని
దేవరంటా మొక్కుకొంటా దీవించేఁ గాక ॥ ఊర ॥

కూడితిమి కాఁగిటను గురుతు చన్నులనంటె
యీడనే ప్రియాలు సేయకిఁక నెన్నఁడే
జోడై శ్రీవేంకటేశ (కు?) చుట్టరికపుఁదనాన
మేడెపు రతులలోన మెచ్చేము గాక. ॥ ఊర ॥ 7

కోకిల పంచమం

ఇంటిలోని కేఁగరయ్యా ఇద్దరు మీరు
పంటలవలె నిందేల పచరించ నిపుడు ॥ పల్లవి ॥

మాటలాడఁ బోతేను మాణికేలు రాలీని
కాటుక కన్నులపై తేఁ గారీ నీలాలు
యేఁటికి నీవు రేఁచేవు ఇంతివోళ్ళఁ గలఁడు
మూటలు గట్టఁగరాదు ముంగిలెల్లా నిండెను ॥ ఇంటి ॥

చేతులెత్తి మొక్కితేను చిగురులే తొలఁకీని
 ఆతల నవ్వితే మొల్లలటు మించీని
 కాతరించి పట్టేవు కామిని సింగారమింతే
 జాతి దండగట్టరావు సముకాన నిండెను ॥ ఇంటి ॥

సంగడిఁ గూచుండితే చక్కెరే పుట్టిపడీని
 అంగము సోఁకితే నూరీ నమృతములు
 సంగతిగాఁ గూడితివి సతిని శ్రీవెంకటేశ
 కొఁగునఁ గట్టఁగరాదు కోరికెల్లా నిండెను ॥ ఇంటి ॥ 8

## నారాయణి

చిత్తమెందుండెనో యంటా సిబ్బితిపడేను నేను
 కొత్తలేమి గలిగినాఁ గోరి తెలుసుకొమ్మీ ॥ పల్లవి ॥

నివ్వటిల్లి కొలువులో నీవున్న బావము చూచి
 యెవ్వతె యేమాడునో యేమిసేసునో
 పువ్వువలెఁ బొదుగుదు భోగించేవేళ నేను
 నవ్వుల నీ మైరేకలు నావిగావు సుమ్మీ ॥ చిత్త ॥

వూరివారి సొమ్ములెల్ల నొగిఁ బెట్టుక గాఁగాను
 యేరీతినున్నాఁడవో నాకెట్టు దెలుసు
 నేరుపుతో సింగారింతు నీమేను సోఁకేటివేళ
 భారపుదండలు నాకుఁ బనిలేదు సుమ్మీ ॥ చిత్త ॥

సందడి నీ మోమునకు సరికళలు రేఁగెను
 యెందుఁ గలదో మోహమెరుఁగుగునా
 పొందితి శ్రీవెంకటేశ పొరపొచ్చెము లేకుండ
 విందుల నీ మోవితేనె వేరుసేయ సుమ్మీ. ॥ చిత్త ॥ 9

## శ్రీరాగం

రాఁగదె వోచెలియా రమణుఁడున్నాఁడకు
ఆఁగి నీచక్కఁదనాన కాసపడీ నిదివో ॥ పల్లవి ॥
వలిపె పయ్యద నీవు వల్లెవాటు వేసుకోఁగా
వెలిఁబడె సిగ్గులెల్ల విచ్చనవిడి
అలవోకగా సొమ్ములట్టె నీవు నించుకోఁగ
మెలుపు జవ్వనానకు మెరుఁగెక్కెను ॥ రాఁగదె ॥
విరులు తురుమునిండ వెస నీవు ముడువఁగ
పెరిగెఁ జక్కఁదనము పెంటలుగాను
పరిమళములు నీవు పైపై నలఁదుకోఁగా
సురతగందములకు జోడుగూడెను ॥ రాఁగదె ॥
వెక్కసపు వేడుకతో విడెము నీవు సేయఁగ
యెక్కువ మోవిపండు యెఱ్ఱఁగా మాఁగె
అక్కరతో శ్రీవెంకటాధిపునిఁ బెండ్లాడఁగ
తక్కక మనసుకవి తలపోఁతలాయను. ॥ రాఁగదె ॥ 10

## కురంజి

ఇదివో విచారము యేమందు నిన్ను
పెదవి నీవే యొసఁగి పిరితియ్యనేలా ॥ పల్లవి ॥
మారుమాఁటలాడక మానాన నుండేటివారి
ఆరీతి వేఁడుకొంటా నంటుకోనేల
వూరకే తప్పితారి నీగోరే నిన్నుఁ దాఁకితే
బీరానఁ దప్పులువేసి బిగియనేల ॥ ఇదివో ॥
శిరసు వంచుకొనుచు సిగ్గున నుండేటివారి
తెరలించి వొడివట్టి తియ్యఁగనేల
నిరతపు నీ చేఁతల నీతురు మే వీడితేను
సరుగ నెగ్గులువట్టి జంకించనేలా ॥ ఇదివో ॥

కళవట్టి రతులలో కాఁగిటనుండినవారి
తెలిపి సారెసారెకు దీకొననేలా
కలసి శ్రీవేంకటేశ కడు నీవే యలసితే
నలువంక నాతో నవ్వు నవ్వఁగ నేలా. ॥ ఇదివో ॥ 11

తెలుఁగుఁగాంబోది

తనకే తెలుసునే తరవాతి పనులు
మనకేఁటికే సనతిమచ్చరములు ॥ పల్లవి ॥
మగువమోవి మెత్తన మాఁటలైతేఁ గడువాఁడి
మగఁడెట్లోరుచునో మర్మములంటి
మొగము చంద్రబింబము మొక్కలపుఁ జూపు చీకు (చీఁకు?)
యెగసక్కెపు పొందులు యెట్టు గట్టుకొనెనే ॥ తనకే ॥
చెలిచేతులు చిగుళ్లు చెనకే గోరులు చేగ
చెలువుఁడెట్లాను మచ్చిక సేసెనే
సెలవినవ్వు క్రమము పలుసోఁకులు కారాలు
యెలయింపు వలపులు యెట్టు గట్టుకొనెనే ॥ తనకే ॥
అంగనచన్నులు బిగు వట్టె సిగ్గుపలచన
సంగతానే శ్రీవేంకటేశ్వరుకూటమి
ముంగిటిమొక్కులు పెక్కు మూఁచిన గుట్టొక్కటే
యింగిత మెరిఁగి రట్టు యెట్టు గట్టుకొనెనే ॥ తనకే ॥ 12

రేకు - 603 భూపాళం

అందుకేమి దోసమా అందరికీఁ గలదే
చెంది నన్నుఁజూచి యేల సిగ్గువడేవిపుడు ॥ పల్లవి ॥
కలలోని మాటలెల్ల కలికి నీతోఁ జెప్పఁగ
కల విరిచితివిట్టే కద్దో లేదో
తలుపుమాటుననుండి తప్పక వింటి నేను
యెలమి నాతో నీసుద్దులేల దాఁచేవిపుడు ॥ అందుకేమి ॥

కోరినకోరికలెల్లఁ గొమ్మ విన్నవించఁగా
గారవించియ్యకొంటివి కద్దో లేదో
చేరి తెరమాటునను చెవులార వింటి నేను
యీరీతి నీకతలెల్ల నేల దాఁచేవిపుడు ॥ అందుకేమి ॥

రతులలో ముచ్చటలు రమణి యాడుకోఁగా
గతిఁ గూడ మెచ్చితివి కద్దో లేదో
తతి శ్రీవేంకటేశ నీదండనుండి వింటి నేను
యితవై నన్నేలితివి యేల దాఁచేవిపుడు. ॥ అందుకేమి ॥ 13

ధన్నాసి

ఎంతకు నంతేకాక యెక్కుడేలయ్యా
కాంత నేసేవని సేయఁగలమా నేమయ్యా ॥ పల్లవి ॥

మలసి పంతమాడేవు మాతోనే నవ్వేవు
చెలియకు నీమాట చెప్పేమయ్యా
పిలువ వచ్చితి మింతే పెక్కులు నేరము నేము
యెలమి మారుమాటలు యేమనేవయ్యా ॥ ఎంత ॥

భావించి సిగ్గువడేవు పాదాలు గుద్దుమనేవు
వావులు ఆపె నడిగి వచ్చేమయ్యా
పూవులు దెచ్చితి మింతే పొలఁతి యప్పణలేక
సేవసేయ వెరతుము చెప్పిపంపవయ్యా ॥ ఎంత ॥

కరఁగి నీవే చొక్కేవు గక్కనఁ గాఁగిలించేవు
కెరలి యాపెకు నెఱఁగించేమయ్యా
ఇరవై శ్రీవేంకటేశ యింతి వచ్చి నిన్నుఁ గూడె
మరిగె నిన్నిటా నిన్ను మన్నించవయ్యా. ॥ ఎంత ॥ 14

### మలహరి

ఇంకనేల వెరపు యెదుటనే వున్నారము
వంకలొత్తకిఁక మఱి వద్దు వద్దు ఇపుడు ॥ పల్లవి ॥
వావులు నీకెంచనేల వాడల గొల్లెతలకు
దేవరవు గావా తెలిసినదే
యీవల మావంక నిట్టె యేమి చూచేవు తప్పక
మోవనాడితి మిదివో మొదలనే నేము ॥ ఇంక ॥
చందాలు చెప్పఁగనేల సతినెత్తుక వచ్చితి-
విందుకు రాజవు గావా యెఱిఁగినదే
దిందుపడి మమ్ము నేల తిట్టేవు పెదవులను
నిందవేసితి మిదివో నిన్ననే నేము ॥ ఇంక ॥
వెలినవ్వేల పదారువేలఁ బెండ్లాడితివి
బలిమికాఁడవు గావా భావించినదే
చెలఁగి పులివిందల శ్రీరంగదేవుఁడవని
కలసితి మిదె శ్రీవేంకటరాయ నేము. ॥ ఇంక ॥ 15

### ముఖారి

ఏమనేము నిన్నును యెరఁగవా నీవు
నేమాన వలపించేవి నీమాయలే కావా ॥ పల్లవి ॥
మొగము చూడఁగానే మొలనూలు వట్టేవు
వెగటు లేనిది నీవేడుకే కాదా
సగము మాటాడఁగానే సారె నెగ్గులు వట్టేవు
నగవు రప్పించేది నీనాయమే కాదా ॥ ఏమ ॥
ప్రియములు చెప్పఁగానే పెదవులఁ దిట్టేవు
నయగారాలిచ్చి నీసన్నలే కావా
క్రియ నీకుఁ జెప్పఁగానే కేలు బంచి పెనఁగేవు
దయదలపించేది నీతగులే కాదా ॥ ఏమ ॥

సేవలు సేయఁగానే సిగ్గులు రప్పించేవు
    వావులు దెలిపేది నీవలపే కాదా
    యీవల శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
    మోవితేనె లూరించేవి ముచ్చటలే కావా. ॥ ఏమ ॥ 16

నాదరామక్రియ

మమ్ము నేమియడిగేరు మాటిమాటికి
    తెమ్మైన మీపెదవుల తేనెలు చెప్పీవమా ॥ పల్లవి ॥
పలికిన పలుకులు పట్టఁ జెప్పుదుము గాక
    తలఁపు చెప్పుదుమా తరుణులము
    వలసినట్లు మీనావులు చెప్పేము గాక
    చెలువపు మీలోని సిగ్గులు చెప్పుదుమా ॥ మమ్ము ॥
ఖాసలు చేసుకొనిన పనులు చెప్పేము గాక
    ఆసలు చెప్పుదుమా అంగనలము
    నేసలు వెట్టుకొనిన చేఁతలు చెప్పేము గాక
    రాసికెక్కినటువంటి రతులు చెప్పుదుమా ॥ మమ్ము ॥
తగినయట్టి మీచక్కఁదనము చెప్పేము గాక
    నగవు చెప్పుదుమా నాతులము
    మిగుల శ్రీవేంకటేశ మీరిద్దరు గూడితిరి
    మొగమోడినట్టి మీలో ముచ్చట చెప్పుదుమా. ॥ మమ్ము ॥ 17

సాళంగనాట

చెలియవేడుక నీవు చెల్లించవయ్యా
    తలఁచినట్లనే తమకించవయ్యా ॥ పల్లవి ॥
చెలరేఁగి చెలరేఁగి చెప్పీనాపె మాటలెల్ల
    వెలయఁగ నిచ్చగించి వినవయ్యా
    పొలసి పొలసి నిన్నుఁ జూచీ తప్పక యిట్టె
    నిలుపున యెదుటనే నిలుచుండవయ్యా ॥ చెలి ॥

కడఁగి కడఁగి నీకుఁ గానుకలిచ్చీనాపె
అడరి యెదురుకొని అందుకోవయ్యా
కడు నవ్వటి నిన్ను గాతలుగాఁ జెనకీని
చిడుముడితో నన్నిఁ జేయించుకోవయ్యా ॥ చెలి ॥

వొద్దనుండి వొద్దనుండి వూడిగాలు సేసీనాపె
పొద్దువొద్దునను నీవు బోగించవయ్యా
తిద్దుక ఆపెను నన్నుఁ దేకువతో నేలితిరి (వి?)
గద్దరి శ్రీవేంకటేశ కరుణించవయ్యా ॥ చెలి ॥ 18

రేకు - 604 మలహరి

నవ్వేవు నీ వప్పటిని నాతోడను
చివ్వన నే లోననుండి సిగ్గువడఁగాను ॥ పల్లవి ॥

చలము సాదించకురా జాణరాయ నీకు
మొలకచన్నులనాఁడే మొక్కితి నేను
తిలకించి వొడివట్టి తీసేవేలరా నేను
తలుపు మాటున నిట్టే దాఁగి వుండఁగాను ॥ నవ్వే ॥

పంతాలు నెరపకురా ప్రాణనాథుఁడ నేను
ఇంతినై పుట్టిననాఁడె యిరవైతిని
వింతగాఁ బువ్వుల బంతి వేసేవేలరా
కొంత పానుపుపై నొరగుచు నుండఁగాను ॥ నవ్వే ॥

వేగిరించకురా శ్రీవేంకటేశుఁడ నీకు
ఈగతి వావైననాఁడే యెనసితిని
చేగదేరఁ గొనగోరఁ జిమ్మేవేలరా నీపై
నాగురుతులు చూచుక నవ్వు నవ్వఁగాను ॥ నవ్వే ॥ 19

## దేశాక్షి

ఏమి చెప్పేరిబుద్ధు లెందాఁకా మీరు
నేమముమీఁదటఁ గాని నెట్టుకోదు సమ్మతి ॥ పల్లవి ॥
మొగిమిచ్చుమాటలు ముంచి యెన్ని ఆడినాను
తెగువలు చూపక తేరదెంతైనా
నగవులు సెలవుల నవ్వి యెంత కొసరిన (నా?)
తగవు పట్టునఁగాని తలఁపొడఁబడదు ॥ ఏమి ॥
సరసపుఁ జెనకులు సారె యెంత చెనకినా
నొరసి మేనులంటక వొద్దిక గాదు
వరుసవంతుల వట్టి వలపెంత చల్లినాను
సరవి రతులఁ గాని చవిపుట్టదు ॥ ఏమి ॥
ఆసలె సారెకుఁ జూపి అయాలెంత ముట్టినాను
సేసవెట్టి పెండ్లాడక సిగ్గువాయదు
వేసరక నన్నిట్లే శ్రీవేంకటేశుఁడిదె కూడె
బాసలు సేసినఁగాని పట్టి పెనఁగరాదు ॥ ఏమి ॥ 20

## వరాళి

నేమేమైనా ననేమంటా నీకేల వెరవు
అముక సరసమాడి ఆదరించరాదా ॥ పల్లవి ॥
చనవు సేసుక నీసంగడిఁ గూచుండినా పె-
నెనయక యేల లోని కేఁగుమనేవు
పనిసేయ నోపకున్నాఁ బాదాలొత్తఁ గొరగాదా
అనువుకుఁ దెచ్చుకొని యాదరించరాదా ॥ నేమే ॥
మచ్చిక సేయుచు నాకు మడిచియిచ్చినా పె
ప(ఁబ ?)చ్చిదేర వేరె యేల పనిచెప్పేవు
యెచ్చుకుందు గలిగినా నిందుకైనా మేలుగాదా
ఇచ్చకము సేసుకొని యాదేర్చరాదా ॥ నేమే ॥

చుట్టరికము నెరపి చొక్కించి కూడె నాపె
గుట్టుమాని చెక్కులేల గోర నూఁదేవు
యెట్టు గబ్బిరైనాను యిందుకు లోనుగాదా
గట్టిగా శ్రీవేంకటేశ కరుణించరాదా. ॥ నేమే ॥ 21

దేసాళం

కొత్తలేల సేసేవు కొసరనేల వచ్చేవు
చిత్తములో వుండినట్టి చెలినే కానా ॥ పల్లవి ॥
యిక్కువలేలంటేవు యింత యేల సేసేవు
మొక్కితి నీకు నేను మొన్ననే కాదా
పెక్కుమాట లేలాడేవు పెనఁగ నేల వచ్చేవు
అక్కర దీరుచు తొల్లే ఆల నీకుఁ గానా ॥ కొత్త ॥
సన్నలేల సేసేవు సరసమేలాడేవు
నిన్ను నే వేఁడుకొంటిని నిన్ననే కాదా
చన్నులేల పిసికేవు జవ్వన మేలొరసేవు
కన్నెనాఁటనుండి నీకాంతనే కానా ॥ కొత్త ॥
పాదమేల తొక్కేవు పంతము లేలాడేవు
నీదయకు లోనైతి నేఁడే కాదా
యీడెస శ్రీవేంకటేశ యేలితి విన్నిటా నన్ను
భేదములేని యప్పటి ప్రియురాలఁ గానా. ॥ కొత్త ॥ 22

శంకరాభరణం

ఇసుమంత పనికి యెంత సేసేవు
కొసరె నంటానే కొప్పు వట్టేవు ॥ పల్లవి ॥
కలిమిగల విభుఁడు కాంతలకుఁ గొలువైతే
చలపట్టి కోపింతురా సారెసారెకు
మొలక చన్నులమీఁద మొనగోరు మోపెనంటా
పలికి నెపమువేసి పరచేవప్పటిని ॥ ఇసు ॥

రతి యెరిఁగినవాఁడు రామలకు నేరుపఁగా
 తతిగొని తిట్టుదురా తప్పులు మోపి
 చతురతలను మీతో సరిఁ బెనఁగె నంటా
 మతకము వేసి నీవు మచ్చరించేవు ॥ ఇసు ॥

శ్రీవేంకటేశ్వరుఁడు చెలులతో నవ్వఁగాను
 కావరించి పట్టుదురా కతలు చెప్పి
 యీవేళ నీతఁడు నిన్నే ఇచ్చగించి కూడెనంటా
 వావులు చెప్పుచు నీవు వలపించేవు. ॥ ఇసు ॥ 23

శంకరాభరణం

నేఁటికిఁ జేసేవు బాస లేలపెట్టేవానలు
 నేఁటివలె నుంటేను నీవే మంచివాఁడవు ॥ పల్లవి ॥

మగువపట్టుకు నీవు మనసున వాకునఁ
 దగవు నడపితేనే తప్పు లేదు
 అగపడి యాపెమాట కట్టే లోనై నడచితే
 నిగిడి యెన్నటికి నీవే మంచివాఁడవు ॥ నేఁటి ॥

వనితకు నీవూరకే వద్దఁ గాచుకుండితేను
 తనసొమ్మైనట్టే నీకు తప్పులేదు
 యెనసి యాపెచనవు లింతటాను జెల్లించితే
 నినుపు జాణతనాన నీవే మంచివాఁడవు ॥ నేఁటి ॥

వెలఁదికాఁగిట నీకు వేరే చింత లేకుండితే
 తలఁపులోపల మరి తప్పులేదు
 యెలమి శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
 నిలువెల్లా వలపుతే నీవే మంచివాఁడవు. ॥ నేఁటి ॥ 24

రేకు - 605 శుద్ధవసంతం

వలపు కొలఁది గాదు వద్దు వద్దయ్యా
చెలి కోపగించుకొంటే సేసేదేమయ్యా ॥ పల్లవి ॥

వూడిగపుదాన నన్ను నొడివట్టి తీసేవు
ఖూడ నీపట్టపుదేవి యేమి సేసునో
వేడుక యీవేళనైతే వెనక నాపె చిక్కించు-
కేడనైనాఁ బరచఁగ నేమిసేసేవయ్యా ॥ వలపు ॥

దూతికె నింతే నేను తొడికేవు నాచన్నులు
కాతరించి నన్నెంత నీకాంత దూరునో
యేతులిప్పుడు సేసితే నింటికాడ వచ్చి యాపె
చేతులు చాఁచవచ్చితే చేరి యేమందునయ్యా ॥ వలపు ॥

పరిచారకపుదానఁ బైకొని నన్నేలితివి
యిరవై నమగువ నన్నెట్టు నవ్వునో
సరుస శ్రీవేంకటేశ చలివాసి యిఁక నాపె
గరిసించితే మరి గతి నీవే అయ్యా. ॥ వలపు ॥ 25

రామక్రియ

ఎంత వెనఁగినా మానఁ డేమీననరాదు మాకు
యింతటి మాముంగురులు యివి చూడఁగదవే ॥ పల్లవి ॥

ఆతనిఁ దోడుతెమ్మనే వంగనలము నేమైతే
కాతరీఁడాతఁడు మమ్ముఁ గాఁగిలించీనే
యీతల నేమెఱుఁగుదు మీసుద్దులు వెనకకే
చేతుల మెడల నివే జీరలు చూడఁగదే ॥ ఎంత ॥

యేకతమాడి రమ్మనే వింతులము మొదలనే
కాతరి యాతఁడు చెనకక పోనీఁడే
కైకొని నాఁడే నేము కంటిమీగుఱాలెల్లా
జోకలైన మోవిమీఁది నొమ్ములు చూడఁగదే ॥ ఎంత ॥

కానుకిచ్చి రమ్మంటివి కాంతల మమ్ముఁ జూచి
ఆనుక శ్రీవేంకటేశుఁ డట్టె కూడెనే
తానే మావెంట విచ్చేసి తగిలి నివ్వెదె యేలె
పూనిన మాచన్నులపై వొత్తులు చూడఁగదే. ॥ ఎంత ॥ 26

బౌళి

వేగిరించేనా నీవు వింతవాఁడవా
సాగిలి నీకు మొక్కితే చక్కనయ్యా పనులు ॥ పల్లవి ॥
పొందులు సేసి నిన్నుఁ బొగడుట మేలుగాక
యిందరిలో నిన్ను నేరాలెంచనేఁటికి
యిందుముఖులము నేము యిచ్చకములే యాడి
సందడి నీకు మొక్కితే చక్కనయ్యా పనులు ॥ వేగి ॥
సరసములాడి నీకే సమ్మతౌట మేలుగాక
గరిసించేయట్టి జగడమేఁటికి
తరుణులము నేము నీతలఁపులోనే మెలఁగి
సరుగ నీకు మొక్కితే చక్కనయ్యా పనులు ॥ వేగి ॥
కొల్లున నీతో నవ్వి కూడుట మేలుగాక
కెల్లురేఁగి నిన్ను విసుగించనేఁటికి
యిల్లిదె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
చల్లఁగా నీకు మొక్కఁగ చక్కనయ్యా పనులు. ॥ వేగి ॥ 27

సాళంగనాట

ఇంతకంటే నేరుపులు యిఁక నేవయ్యా
పంతమిచ్చే నిఁక మమ్ము బదికించవయ్యా ॥ ఇంత ॥
మలసి మలసి నీతో మాటలాడి చూచితి
సొలసి కన్నుల మొక్కి చూచితిని
పలుమారు వలపులు పైఁజల్లి చూచితిని
తెలుసుకొంటే (టి?) నీవు దేవరవయ్యా ॥ ఇంత ॥

ఇందరి ముందరా నీకు నింపు పుట్టించి చూచితి
చిందుచెమటతో సేవ చేసి చూచితి
పొందుల చనవులెల్లా పొసగించి చూచితి
దిందు పరచుకుండాన దేవరవయ్యా ॥ ఇంత ॥

గక్కన బలిమి నిన్నుఁ గాఁగిలించి చూచితి
చొక్కుచు నిన్నుఁ బొగడి చూచితిని
వొక్కటై శ్రీవేంకటేశ వొడివట్టితి విప్పుడు
దిక్కుల నిన్ను మెచ్చితి దేవరవయ్యా. ॥ ఇంత ॥ 28

గౌళ

నీమాఁట వినినదాఁక నిలుచున్నాఁ డాతఁడు
భామ నీగుట్టెల్లా నిట్లె పచరించఁ గదవే ॥ పల్లవి ॥

మఱసిన నీమాఁటలు మరఁగులలో నున్నవి
తలఁపులు వలపులఁ దగిలున్నవి
నెలకొన్న మురిపెము నిలువున నున్నది
యెలమి మీఁదటిమాఁట యేమనేవే యిఁకను ॥ నీమా ॥

చిఱుత నవ్వులు నీసెలవులలో నున్నవి
మెఱయు చెమటలు నీమేన నున్నవి
కఱతల నేరుపులు కడకన్నుల నున్నవి
యెఱఁగము నీవుపమ లేమనేవే యిఁకను ॥ నీమా ॥

సందడించే సిగ్గులెల్ల చనుమొనల నున్నవి
కందువ తేనెలు మోవిఁ గప్పి వున్నవి
యిందుకే విచ్చేసి నిన్ను నేలె శ్రీవేంకటేశుఁడు
యిందరివంటివారమే(?) యేమనేవే యిఁకను. ॥ నీమా ॥ 29

## సామంతం

ఏల సారెకుఁ జెప్పేవు యెడమాటలు
    తాలిమి. నేసుకొంటిఁ దనిసితివే ॥ పల్లవి ॥

కానీవే అతఁడు మేరలు దప్పఁడనేవు
    కానీవే నీవేమి కల్లలాడేవా
    పోనీవు యెంతైనఁ బోయిన సుద్దులు నీవు
    యీనిజమే కలితే నిన్నియు మెచ్చేనే ॥ ఏల ॥

పట్టనీవే నాచెరఁగు బత్తిగలఁ డనేవు
    అట్టె యవునే నీ వంతదానవు
    గట్టిసేసే వప్పటిని కప్పి తొల్లిటిబాసలు
    చుట్టుకొంటే వలపులు సులభ మయ్యీనే ॥ ఏల ॥

చెప్పనీవే ప్రియములు సేవకు మెచ్చెననేవు
    చిప్పిల నీవే మాకుఁ జెలికత్తెవు
    యిప్పుడె శ్రీవేంకటేశుఁ డేలె నన్నుఁ గరుణించి
    వొప్పుకొంటే మనసులు వొక్కటే యయ్యీనే. ॥ ఏల ॥ 30

రేకు - 606

## భైరవి

నీయంతవారమా నేము నెట్టుక నవ్వులు నవ్వ
    యీయెడ నీవు మన్నించే ఇంతులము నేము ॥ పల్లవి ॥

గోర గీరితే వలపు కొండలుఁ గోట్లు నగును.
    నేరుతుమా నీవంటి నేరుపులు
    బార చాఁచితే నీకు పదివేగురు చుట్టాలు
    ఆరీతివారమా నీఇల్లాండ్లము నేము ॥ నీయంత ॥

చూచితే నందరియాస సుంకులు మోపు నీమీఁద
    మాచేత నింతేసి పని మట్టుపడునా
    కాచితే నీననుపులు కాయలుఁ బండ్లు నేను
    లాచేటివారమా నీలలనలము ॥ నీయంత ॥

మాటాడి నంతటిలోన మర్మములెల్లఁ గరఁగు
సూటిఁబడినా మాకిట్టే సులభానను
గాఁటాన శ్రీవేంకటేశ కలసితివిటు నన్ను
దీఁటు వెట్టుకొనేమా నీ దేవుళ్లము. ॥ నీయంత ॥ 31

దేసాళం

నేమటువంటివారమా నీవెరఁగ వింతె కాక
దోమటి యెంతైనానుఁ దొడికేవు గాక ॥ పల్లవి ॥
అమ్మమాటలెల్లా నీకు నట్టే విన్నవించరాఁగా
యెమ్మెలకు నీవు నాకొంగేల పట్టేవు
దొమ్మికాఁడ గొల్లెతలఁ దొడికిన యలవాటు
ఇమ్ముల నెవ్వరిఁ గన్నా నేల మానునయ్యా ॥ నేమటు ॥
యేలినాపె నీకు విడెమిచ్చి రమ్మని యంపఁగా
కాలు దొక్కి నన్ను నేల కాఁగిలించేవు
ఆలరీఁడ రుక్మిణిఁ బయ్యాడించి తెచ్చినలవాటు
పోలిమి (మీ?) తో నంటుఁగాక పోనిచ్చునటయ్యా ॥ నేమటు ॥
అక్క నన్నుఁ దోడువెట్టు కట్టే నీవద్దికి రాఁగా
గక్కనఁ దోడఁ బెండ్లి గైకొంటివి
చక్కని శ్రీవేంకటేశ జమళిపెండ్లె(డ్లి + అ)లవాటు
తొక్కి తొక్కి నీకు వెన్నతోనే పెట్టిరయ్యా ॥ నేమటు ॥ 32

గౌళ

ఏమనేమయ్యా నీవే ఇంత సేయఁగా
చేముట్టి చెనకితేను చిత్తము గరఁగేవు ॥ పల్లవి ॥
మొగము చూచితేను మొక్కేవు నీతో
నగితే నన్ను నిట్టే నమ్మితినవేవు
మొగసక్కెలాడినాను యియ్యకొనేవు
తగవు గాదంటేను తగుల నాడేవు ॥ ఏమనే ॥

మాటలాడితేనే మరిగేవు-నీ
చోట నిలిచితేనే సొలయ వచ్చేవు
పాటలు వాడితే బళి యనేవు — నిన్ను
నాటుకొనఁ జూచితేను నయము చూపేవు ॥ ఏమనే ॥

దగ్గరఁ గూచుండితే తమకించేవు — నే
సిగ్గులు వడినంతనే చేయి చాఁచేవు
కగ్గక శ్రీవేంకటేశ కలసితివి
వొగ్గి విడెమియ్య రాఁగా వొడి వట్టేవు. ॥ ఏమనే ॥ 33

### కాంబోది

చెప్పినట్టు సేయవే చెలువునికి
కప్పురపు నవ్వులనే కరఁగీ నీయెదుట ॥ పల్లవి ॥

మాఁటాడితే వెంగెమే మగుడి చూచేచూపులు
గాఁటముగ రాలేటి కామునమ్ములు
యేఁటికి నింత సేసేవే యెంత నేరుచుకొంటివే
చోటిమ్మంటా రమణుఁడు సోఁకీని నిన్నును ॥ చెప్పి ॥

పట్టితేను తప్పులే పైపై సన్న సేసితే
జట్టిగొన్న కనుబొమ్మ జంకెనలే
రట్టుపెట్టే విదియేమే ఇట్టె రాజసముతోడ
పట్టుమంటా వీడెమిచ్చి భ్రమయించీ విభుఁడు ॥ చెప్పి ॥

మేలమాడితే నెమ్మెలే మిగుల నేకతమైతే
కోలుముందైన రతుల కోలాహలమే
మేలుదాన వౌదువే మించఁ బట్టపురాణివే
చాలి శ్రీవేంకటేశుఁడు చనవిచ్చీ నిపుడు ॥ చెప్పి ॥ 34



### ఆహిరి

అప్పటి కోపాన నన్ని నంటి నేను
తప్పులన్నిఁ దేరెను దండకు రమ్మనవే ॥ పల్లవి ॥
సంకెలెల్లాఁ దీరెను సరసుఁడు తానె వచ్చె
మంకుఁదనము మానితి మాటలాడవే
ఇంకా నేడసుద్దు లేమిసేసినాఁ జెల్లె
పంకించక చేతికి బాగాలియ్యవే ॥ అప్పటి ॥
మనసు నిర్మలమాయ మన్ననలన్ని నిచ్చె
పెనఁగక బంగారుపీఁట వెట్టవే
పనిలేని వాదులేల పంతములన్ని వచ్చె
పొనుఁగక గందమూనుఁ బూవు నీయవే ॥ అప్పటి ॥
చిడుముడి సిగ్గు దేరె శ్రీవేంకటేశుఁడు గూడె
వొడఁబడితి పాదాల కొగ్గి మొక్కవే
వెడఁగు నవ్వులు నిండె వేడుకలె సమకూడె
తడవక పన్నీరు దప్పికీయవే. ॥ అప్పటి ॥ ౪౫

### శంకరాభరణం

తారుకాణించఁగ నేల తతిగొని నాతోను
నేరిచి బదుకనీవే నిజమరై తేను ॥ పల్లవి ॥
వెఱచి తనకు నాపె విన్నవించకుండితేను
తలి నింతులలో మాట తానెఱుఁగునా
గుఱిమె (మే?) లెల్లాఁ గట్టుకోనీవే తా నాపెవల్ల
చెఱఁగు వట్టందరికి సేవ సేసేదానను ॥ తారు ॥
ఆశల మతకమున నాపెఁ ద(పె ద?)ను నంపకుంటే
సూతకమైనయట్టి సుద్దెరుఁగునా (?)
గాతల తమపొందులు కవెల వా(వ్రా?)సుకోనీవే
జాతిగా తమకే నేను సాకిరయ్యే దానను ॥ తారు ॥

గక్కన నాపె తనచే కాఁగిలింపించుకొంటేను
ఇక్కువ లాఁడువారివి యివెఱుఁగునా
చిక్కి శ్రీవేంకటేశుఁడు చేరి నన్ను నేఁడు గూడె
నిక్కముఁ(?) దనకు నేఁ బనికివచ్చేదానను. ॥ తారు ॥ 36

రేకు - 607 ధన్నాశి

అన్నిటాఁ బరిణామమైతే నదే చాలును
వున్నతపు సంతోసాన నున్నాఁడవా ॥ పల్లవి ॥

అప్పుడాకె మేడలోన నంకెకు వచ్చినట్టెల్ల
చెప్పినట్టి బుద్ధులెల్ల చెవిఁ బట్టెనా
దప్పిదేరే నిన్నుఁ జూచి దయదలఁచి మోవికి
కప్పుర మిచ్చినందున కాఁక దేరెనా ॥ అన్నిటా ॥

పఱపుపై ఆపె నిన్నుఁ బవ్వళించఁ జేయఁగాను
మెఱసి నిద్దిరించి మేలుకొంటివా
తఱి చూచి ఆడ నీకు తమ్ములము వెట్టఁగాను
వెఱపులెల్లఁ దీరి వేడుకాయనా ॥ అన్నిటా ॥

అట్టె కాఁగిటఁ గూడి నిన్నలయించి విసరఁగా
గట్టిగా నీమోమున కళ దేరెనా
రట్టడి శ్రీవేంకటేశ గట్టిగా నన్నేలితివి
ఇట్టె యందునిందు యింపు లాయనా ॥ అన్నిటా ॥ 37

మాళవిగౌళ

కాదంటివా నేను కడు నానవెట్టి
సోదించితి నాఁడే జోకలాయనే ॥ పల్లవి ॥

చల్లని మెల్లని జాజర మాఁటలు
చెల్లఁబో యెందాఁకఁ జెప్పెనె
కల్లలూనుఁ గావు కావు నిజములు
తొల్లే నే వింటిని తుద కెక్కెనే ॥ కాదంటి ॥

పూచిన కాచిన పున్నమ చేతలు
చేచేత నెందాఁకఁ జేసీనే
వాచవియుఁ గాదు వాఁటితీపు వోదు
ఆచాయనే వున్నవందుకోనీవే ॥ కాదంటి ॥

వెచ్చియు వేవసి వేడుక రతుల
చెచ్చెర నేఁటికిఁ జెనకీనే
యిచ్చట శ్రీవేంకటేశుఁ డేలెఁ దానే
వచ్చెఁ బదివేలు వాఁటమాయనే. ॥ కాదంటి ॥ ౩౭

## నాదరామక్రియ

మమ్మేమి యాడుకొనేవు మర్మములు రేఁచేమని
చిమ్ముల మరుఁడు తొల్లే సేసినమాయలివి ॥ పల్లవి ॥

మొక్కలానఁ బొలసితేను మురిపెము లొలికేది
చక్కని సతులకును సాజమే యిది
తెక్కుల మాఁటలాడితే తేనెలట్టే వూరేది
గక్కన జవ్వనులకుఁ గలదే యిది ॥ మమ్మేమి ॥

చివ్వన నిలిచితేను సింగారాలుట్టిపడేది
జవ్వనపుటింతులకు సాజమే యిది
రవ్వలుగ నవ్వితేను రసము లుట్టిపడేది
మవ్వపు మానినుల మతము లివి ॥ మమ్మేమి ॥

తమకించి చూచితేను తళుకున మెరిచేది
సమమోహపుటింతుల సాజమే యిది
అమర శ్రీవేంకటేశ అన్నిటా నన్నేలితివి
కొమరెలకు సిగ్గులే గుణములివి ॥ మమ్మేమి ॥ ౩౮

## వరాళి

విన్నవారు నవ్వేరు వెఱపు లిఁకేఁటికి
నిన్నటి మొన్నటిగుట్టు నేఁడు మాముందరనా ॥ పల్లవి ॥
సిగ్గులు వడఁగనేల చింతించ నీకనేల
బగ్గన నితఁడు వొడివట్టి తియ్యఁగా
వెగ్గళించి మీ పొందులు వెనకకే ఆయనట
నిగ్గుల మీ మొరఁగులు నేఁడు మాముందరనా ॥ విన్న ॥
చెలుల నడుగనేల చెమరించే భావాలేల
బలిమి నీతఁడు తొడపైఁ బెట్టుకోఁగా
తలపడి వొకమాట తనువులు సోఁకెనట
నిలువున మీవేసాలు నేఁడు మాముందరనా ॥ విన్న ॥
వేవేలు విన్నపాలేల వెనకకు వీఁగనేల
(శ్రీ) వేంకటేశుండితఁడే చేరి కూడఁగా
మావలెనె నిన్ను నిట్టె మన్నించి యేలెనట
నీవింతేసి పెనఁగేది నేఁడు మాముందరనా ॥ విన్న ॥ 40

## ఆహిరి

అడుగరే చెలులాల ఆతని నీసుద్ది
తడవితే నిలువెల్లఁ దడిసీఁ జెమటలు (ల?) ॥ పల్లవి ॥
యెనయక తలవంచు కింతవడి నూరకుండె
కనువిచ్చి చూచితేనే కాఁక రేఁగెను
అనయము మాటాడక అట పరాకున నుండె
చెనకి నే మాటాడితే చిమిడీ వలపులు ॥ అడుగ ॥
కొలువులో పరాకున కూరిమి మరచి యుండె
చెలఁగి నే నవ్వితేనే సిగ్గు రేఁగెను
వెలుపటి విచారాన వేరే బ్రమసి యుండె
తలపించి నే మొక్కితే తమకము రేఁగెను ॥ అడుగ ॥

సేస వెట్టి వేగిరాన చేరి నివ్వెరగై యుండె
ఆసగాఁ గానుకిచ్చితే నంటుకొనెను
యీసరి శ్రీవేంకటేశుఁ డెనసె నన్నిటాను
వోసరించి నే గిరితే పులకించె మేను ॥ అడుగ ॥ 41

## సామంతం

నీతితో నడచితేను నెగులే లేదు
జాతి దప్పకుండితేను చలమే ఫలము ॥ పల్లవి ॥
వొలిసి కైకొంటేను వొగరైనాఁ దీపే
తెలిసితేఁ దనలోనే దేవుఁడున్నాఁడు
పలుకులు మంచివైతే పగవారుఁ జుట్టాలే
చెలఁగి దిష్టించితేను చీఁకటిల్లు వెలుఁగు ॥ నీతి ॥
నేరిచి బతికితేను నేలెల్లా నిధానము
వోరిచితేఁ దనపంత మూరకే వచ్చు
సారెకు నుతించితేను చక్కైనాఁ గరఁగును
వూరకే గుట్టుననుంటే వూరికెల్లా నెక్కుడు ॥ నీతి ॥
వాడికె సేసుకొంటేను వలపెల్లా నిలుపౌను
వేడుకతో నుండితే వెనకే ముందౌ (ను?)
యీడులేని శ్రీవేంకటేశ్వరుఁ గొలిచితేను
జాడుపడ్డపనులెల్లా సఫలమౌను ॥ నీతి ॥ 42 ॥

608 - రేకు గుజ్జరి

ఎవ్వరి నేమనవచ్చు యెగ్గులెట్టు పట్టేవే
జవ్వని వీనివల్లనే చలివాసె వేఁపు ॥ పల్లవి ॥
తెగువతో రమణునిఁ దిట్టఁగానే కదవె
చిగురు నీ మోవెల్లాఁ జిల్లులాయను
పగటున దట్టికొంగు పట్టఁగానే కదవె
నిగుడి చన్నులమీఁద నెలవంకలాయను ॥ ఎవ్వ ॥

సారెసారెకు నితని జంకించఁగాఁ గదవె
భారపుఁదురుము చిక్కువడె నిదె
నారుకొన్న సెలవుల నవ్వఁగానే కదవె
తారితారి పయ్యదెల్లాఁ దడిసెఁ జెమటల ॥ ఎవ్వ ॥

శ్రీవేంకటేశ్వరునిఁ జెనకఁగానే కదవె
మూవంకలా నీపోఁకముడి వీడెను
వేవేలురతులఁ గూడి వెలయఁగాఁ గదవె
కైవసమై మొగమునఁ గళలెల్లా నిండెను ॥ ఎవ్వ ॥ 43

## రామక్రియ

ఇటువలె నుండవద్దా యింతివై పుట్టినందుకు
అటువోయి నన్నేలితి వంతేసి నేరుతునా ॥ పల్లవి ॥

చక్కని నీవదనము సారె సారెఁ జూచుకొంటా-
నక్కరతో నట్టే మాటలాడుకొంటాను
చెక్కు నొక్కి బుజముపైఁ జేతులు వేసుకొంటా
కుక్కి కుక్కి మోహమాపె కుప్పవోసెఁగా ॥ ఇటు ॥

ముంగురులు చేతఁ బట్టి మోవితేనె లానుకొంటా
అంగవించి మర్మములు అంటుకొంటాను
చెంగలించి గోరనొత్తి చిరునవ్వు నవ్వుకొంటా
సెంగలిరతు లెల్లాను సెద వెట్టెఁగా ॥ ఇటు ॥

చల్లనైన నీవురము చన్నుల నదుముకొంటా
వొల్లనే కాఁగిటఁ గూడి వుబ్బుకొంటాను
మెల్లనే శ్రీవేంకటేశ మేలము లాడుకొంటా
వెల్లవిరిగా వేడుక వెద వెట్టెఁగా ॥ ఇటు ॥ 44

పాడి

ఎక్కువైతే మొగచాటలౌ నెందరు గావలెనయ్యా
చిక్కని చన్నులమీఁదఁ జేయి చాఁచేవిపుడు ॥ పల్లవి ॥

వెల వెట్టి కొనవద్దు వేడుకైన వలపు
కలగూరగింపవలెఁ గాచుకున్నది
చెలులు మందపట్ల చెట్టడిచితేఁ జేటుఁడు-
కలిగుండఁగా మామీఁదాఁ గాలుచాఁచేవిపుడు ॥ ఎక్కు ॥

పంట పండి తేవద్దు పాయని చుట్టరికము
పెంటలవలె నంతటాఁ బెరిగున్నది
గొంటరిసతుఁ బొందు కొంగ్రఁ గొంగ్ర వేయేసి
అంటేవు మాకుచములు అప్పటి నీవిపుడు ॥ ఎక్కు ॥

కరఁగించి సేయవద్దు కాఁగిటలోనిరతి
వోరసిన సొమ్మువలె వొళ్లనున్నది
తరుణుల సరసాలు మెరచినంతే మెరుఁగును
ఇరవై శ్రీవేంకటేశ యేలితి నన్నిపుడు ॥ ఎక్కు ॥ 45

నారాయణి

సేసి సేయించుకోనేల చెల్లఁబో వోరమణుఁడ
అసవెల్లాఁ జూపితెను అట్టె తొక్కెఁ బాదము ॥ పల్లవి ॥

పంతము నెరపఁబోతే పడతి గోరు దాకించె
మంతన మాడఁగానే మర్మము లంటె
వంతులకుఁ బెనఁగితే వత్తువ చన్నుల నొత్తె
చెంతఁ జెరఁగు వట్టితే చెక్కుచేత నంటెను ॥ సేసి ॥

బొమ్మల జంకించితేను పుక్కిటి తమ్ముల మిడె
రమ్మని పిలచితే నురము దట్టెను
వుమ్మడిఁ బొత్తుకుఁ బోతే వొళ్లెల్లాఁ బెట్టె నీకు
ముమ్మాటికిఁ దిట్టితేను మోవిగంటి సేసెను ॥ సేసి ॥

గక్కనఁ గాఁగిలించితే గబ్బితనమెల్లాఁ జూపె
చొక్కించితే చెప్పరాని సుద్దులు చెప్పె
ఇక్కువెరిఁగి శ్రీవేంకటేశ నీవు మన్నించితే
వెక్కసపు రతులను వెల్లిగాఁ గొలిపెను. ॥ నేసి ॥ 46

నాట

ఏల ఇంతి నేసేవు యెఱఁగవా మాలాగు
చాలుకొన్నమాతో నీచల మేమున్నది ॥ పల్లవి ॥
చిగురుఁగొమ్మాఁ జేఁగె చెలులలోపల నెల్ల
యెగసక్కేలాడఁ జోటు యేది నీకు
బిగువు చనుఁగొండలఁ బిరితియ్యారెప్పుడును
మగవాఁడవు నీకైతే మనసే మెత్తన ॥ ఏల ॥
ననల కొనలు వాఁడే నాతులలోపల నెల్ల
యెనయక వట్టిమాట లేఁటికి నీకు
కొనగోరి కత్తులతో కొంకరెంతపనికైన
ఘనుఁడవు నీకైతే కాయమే కోమలము ॥ ఏల ॥
వొగరు పూఁపలు తీపే వువిదలలో నెల్ల
ఒుగిలింపు నవ్వుబీరా లేల ఆదేవు
అగపడి శ్రీవేంకటాధిప నన్నేలితివి
మగఁడవు నీవైతే మర్మమే పైపైని. ॥ ఏల ॥ 47

పాడి

ఇన్నియుఁ దానే యెరుఁగు నేమనేనే
కన్నులఁ జూచితేనే కాఁక లనీని ॥ పల్లవి ॥
యియ్యకొంటే నెందుకైన నిచ్చగించు మనసు
కయ్యమడిచితే నన్నీఁ గాదనను
ముయ్యెడ నామాటలు ముద్దునేసు నిన్నాళ్లు
వెయ్యింటికి నేఁడైతే వెంగెము లనీని ॥ ఇన్ని ॥

వారించితే భోగాలకు వొడిగట్టుఁ దమవు
పూరకే వొల్లకవుంటే వోకిలించును
చేరి నాచేఁతలకెల్లా సిగ్గువడఁ డిన్నాళ్లు
ఆరసి నేఁడై తే నంటితే లోఁగివి ॥ ఇన్ని ॥

ఆస గలిగితే రతులన్నిటికిఁ దానే గురి
వేసరితే నలపులు వేళమే వచ్చు
సేసవెట్టి కాఁగిలించు శ్రీవేంకటేశుఁ డిన్నాళ్లు
వాసితో నేఁడై తేఁ గావరించి కూడీని. ॥ ఇన్ని ॥ 48

రేకు - 609 ఆహిరి

వెనక నప్పటి దూరి వేసరించ నేనోప
యెనసి బిగిసితేను యేమి సేతునే ॥ పల్లవి ॥

యిచ్చినమాటలే రాకాసింతులను భ్రమయించె
యీతల నింకా మరియెట్టు నమ్మేదే
నీతితో వంకలొత్తుచు నీవు నన్నొడఁబరచే-
వేతులకు సమ్మతించి యేమి సేతునే ॥ వెనక ॥

తనపొందులే గొల్లెతలను వలలఁ బెట్టె
కనియు నింకా నెట్టు కానీమ్మందువే
చెనకి చక్కట్లుగాఁ జేసి నన్నుఁ గూడించేవు
యెనలేక తగిలి మరేమి సేతునే ॥ వెనక ॥

నంటున శ్రీవేంకటేశు నవ్వు శ్రీసతిఁ జొక్కించె
అంటి కూడితి నింకా నెట్టొఁ గాదందునే
జంట చవులు పుట్టించి చనవు లిప్పించితివి
ఇంటనే సంతోసమిచ్చె నేమి సేతునే. ॥ వెనక ॥ 49

నాట

ఊరకుండు చాలుఁ జాలు వోప నింతేసిపనికి
కూరిమి నీకొసరు లీకోమలులెరఁగరా ॥ పల్లవి ॥
చల్లనినీళ్లే కావా జలజలఁ జారేవి
మెల్లనిమాటలే కావా చిల్లులయ్యేవి
మల్లాడి నాతోఁ బెనఁగి మంచితనాలు చూపేవు
వెల్లవిరి నీసుద్దు లీవెలఁదులెరఁగరా ॥ ఊర ॥
కప్పుర మించుక గాదా కన్నులఁ బదనయ్యేది
రెప్పల చూపులే కావా రేసు రేఁచేవి
ముప్పిరి నా కిటువచ్చి మోవితేనె లొసగేవు
వొప్పుగా నెలయింత లీవువిద లెరఁగరా ॥ ఊర ॥
చిగురిప్పటిదె కాదా చేగలు మీర నయ్యేది
పగటు నవ్వులే కావా పచ్చి సేసేవి
అగపడి శ్రీవేంకటాధిప నన్నేలితివి
తగవరి మన్నన లీతరుణు లెరఁగరా. ॥ ఊర ॥ ౬౦

రామక్రియ

ఏమి నాయము చెప్పేవు ఇంతులతోను
గామిడి కన్నులయితే కపరవద్దా ॥ పల్లవి ॥
చెలి సిగ్గుతో నుండఁగ చెరఁగు నీవు వట్టితే
తిలకించి యాపె నిన్నుఁ దిట్టఁగ వద్దా
చెలఁగి యాపె లోన చీర గట్టుకొనేవేళ
కులికి చూడఁగఁ బోతే గొణఁగవద్దా ॥ ఏమి ॥
కొమ్మ యేమీఁ దడవక గుట్టుతోడ నుండఁగాను
దొమ్మిఁ జన్నులంటితేను దొబ్బవద్దా
సొమ్ము వెట్టుకోఁగా నెడచొచ్చి సందులపయి
కుమ్మొగా గోర నూఁదితే కోపించవద్దా ॥ ఏమి ॥

పడఁతి యలవుతోడ పవ్వళించి వుండఁగాను
నడుమఁ గాఁగిలించితే నవ్వవద్దా
యెడఁయక శ్రీవేంకటేశ నిన్నుఁ గలయఁగ
ండియాలాలు నించితే నట్టె మెచ్చవద్దా. ॥ ఏమి ॥ 51

సాళంగనాట

వేగిరింతురటే నీవు విభునితోను
చేగదేర నీ చేతికిఁ జిక్కుదాఁకాను ॥ పల్లవి ॥

ఆడినట్టె ఆడవే ఆతనితోను
వాడికె నీకై వశమై వచ్చుదాఁకాను
కూడినట్టె కూడవే కోమలి నీవు
జోడయి నీరతులను చొక్కుదాఁకాను ॥ వేగి ॥

సేసినట్టె సేయవే సిగ్గువడక ఆతఁ-
డాసపడి నీకు లోనైనదాఁకాను
వేసినట్టె వేయవే వేసరక పాశి(చి?)కలు
బాసయిచ్చి నీకు కిందుపడుదాఁకాను ॥ వేగి ॥

నవ్వినట్టె నవ్వవే నలువంకలా ఆతఁ-
డివ్వల నీకుఁ జన విచ్చుదాఁకాను
రవ్వగ శ్రీవేంకటరాయఁ డితఁడె కూడె
వువ్విళ్లూరించకువే నిన్నుబ్బించుదాఁకాను ॥ వేగి ॥ 52

రామక్రియ

కలికి నీయెదుట నివె కానుకలు వట్టీని
యెలమి నేఁడిఁక నీకు నింపవునో కావో ॥ పల్లవి ॥

కప్పురములో పిసరు కాంతనవ్వుల కొసరు
చిప్పిలుఁ దేనెల వెగటు చెమట సొగటు
ముప్పిరిఁ బన్నీటి జాలు మొదల వలచిన మేలు
యిప్పుడు నీకివియెల్ల నితవౌనో కావో ॥ కలికి ॥

పొగరు వెన్నెలవేఁడి పొలఁతి చూపులవాఁడి
చిగురు గుత్తుల మినుకు చేతిచెనకు
వొగరు వీడెపు మదము వుబ్బరి చిత్తపు మదము
బిగియ నేఁటికి నీకుఁ బ్రియమౌనో కాదో ॥ కలికి ॥

విరుల దొంతరసరులు వెలఁది చనుఁగవ గురులు
సరిఁ జెలుకువిలు బలుపు సకియనిలుపు
గరిమ శ్రీవేంకటేశ కలసితివి యీసతిని
సరసములు దొరకె నివి చవులౌనో కాదో ॥ కలికి ॥ 58

## సామంతం

నీ వోపిక యిఁక నేమిది యెలుఁగము
చేవదేరె మాచేఁతలు సుమ్మీ ॥ పల్లవి ॥

పంతగాఁడవై బలిమి సేసితే -
నింతుల మింతే యేమందుము
చెంతల మాపైఁ జేతులు వేసేవు
కాంతుఁడ చన్నులు గట్లు సుమ్మీ ॥ నీవోపిక ॥

కొనబుకాఁడవై కొంగిటు వట్టిన
వనితల మేమనవచ్చు నిఁక
చెనకుచు సాములు సేసే విటువలె
కొనగోళ్లు కడుఁ గొయ్యలు సుమ్మీ ॥ నీవోపిక ॥

కొల్లకాఁడవై కూడితి విటు మము
గొల్లెతల మేమని కొసరేము
ఇల్లిదె శ్రీవేంకటేశుఁడ నవ్వేవు
వెల్లువేఁకములు పిలుఁదులు సుమ్మీ. ॥ నీవోపిక ॥ 59

రేకు - 610 హిజ్జిజి

ముసిముసి నవ్వులతో ముసుఁగులు వెట్టుకొని
పనలుఁగ మేలుకొని పవ్వళించి వున్నారు ॥ పల్లవి ॥
సిగ్గులు విడిచినట్టి సిఁటవలపులవారి -
కెగ్గులు దప్పులున్న వా యెవ్వరన్నాను
అగ్గమైన సతులు వచ్చి అట్టె కొలువు సేయఁగా
బగ్గన నావేఁ దానూఁ బవళించి వున్నారు ॥ ముసి ॥
వెఱవు మఱపు లేని వేడుకకాండ్లకు
మఱఁగు మొఱఁగున్న దా మాపుదాఁకాను
తఱి మేలుకొలిపే పదము లింతులు వాడఁగ
పఱపుపై నాఁవేఁ దాను పవ్వళించివున్నారు ॥ ముసి ॥
గొంటరులై వుండినట్టి కోడెకాండ్లకు నెల్ల
జంట వాయనున్న దా సారెసారెను
యింటనే శ్రీవేంకటేశుఁ డీపెఁ గూడి మనముల
బంటులఁ దొత్తులఁ జేసి పవళించి వున్నారు. ॥ ముసి ॥ 55

ఆందోళి

ఓపను నే నందుకెల్లా నొడ్డుకొంటా మన్నదాన
చేపట్టి నీవు నాచే సేవ గొనవయ్యా ॥ పల్లవి ॥
పెక్కుమాట లాడించఁగ బెరసి నేనేమందునో
అక్కరతో మన్నించితి వదే చాలు
వెక్కసమై నవ్వించఁగ వెసనెందుకు వచ్చునో
చిక్కులెల్ల మాని నాసేవ గొనవయ్యా ॥ ఓప ॥
తొడపై నిడుకోఁగాను దొమ్మిఁ గాలు దాఁకునేమో
అడరి నేసవెట్టితి వదే చాలు
పొడలు వోఁకించఁగాను వొద్దికై యెట్లుండునో
చిడుముడి నిట్టే నాసేవ గొనవయ్యా ॥ ఓప ॥

కందువఁ గాఁగిలించఁగ కళ వట్టునో యేమో
అందుక విడెమిచ్చితి వదే చాలు
పొందితి శ్రీవేంకటేశ బోదించఁగ నదియెట్టో
చిందుఁ జెమటల నాచే సేవగొనవయ్యా. ॥ ఓవ ॥ 56

బౌళి

ఊరకుండవయ్యా అంత కోపుదుమా
గోర గీరి అప్పటిని కొసరేవు గాక ॥ పల్లవి ॥
నిగ్గుల మాటలు నీతో నేరుతుమా మమ్ము
సిగ్గులు వడఁగ నాడి చెనకేవు
దగ్గరి పై కొన నీతోఁ దగుదుమా
బెగ్గిలపు మాచన్నులు పిసికేవు గాక ॥ ఊర ॥
పొంచి నీతో నవ్వ నిన్నుఁ బోలుదుమా మమ్ము
మంచముపైకి రమ్మని మన్నించేవు
చంచుల నీరతులకుఁ జాలుదుమా
పంచల నాపెద్దకొప్పు పట్టేవు గాక ॥ ఊర ॥
వడి నీసతుల సరి వత్తుమా మమ్ముఁ
దడవి కాఁగిటఁగూడి తమకించేవు
యెడయక శ్రీవేంకటేశ నీకె తగుదుమా
విడువక మాపై చొక్కు వేసేవు గాక ॥ ఊర ॥ 57

వరాళి

ఇందుకుఁగాఁ దమకించ నేఁటికి మాకు
అందెందె తనిసితిమి అల్లనాఁడే నేము ॥ పల్లవి ॥
ప్రియమెంత చెప్పినాను పెడరేఁచి యేమనిన
నియతముగ వినేవి నీచెవులే కా
క్రియ యెంత దెలిపిన కేలెంత చాఁచినాను
నయమిచ్చి కెమలేమనసు నీదే కా ॥ ఇందు ॥

మొక్కులెన్ని మొక్కినాను ముందర నెంతవుండినా
గక్కనఁ జూచేవి నీకన్నులివే కా
పక్కన నెట్టు నవ్వినా బాఁతిపడి పైకొనిన
గుక్కక కరఁగేది నీ గుండె యింతే కా ॥ ఇందు ॥

పచ్చిగా నేమిసేసిన పసగా నెంత కూడిన
యిచ్చగించి లోనయ్యేది యీతనువే కా
అచ్చమై శ్రీవేంకటేశ అంతలో నన్నేలితివి
మెచ్చి యెంత పొగడినా మేలు నీదే కా ॥ ఇందు ॥ 58

దేసాళం

పిడికిటి తలఁబాల పెండ్లికూతుర. నేను
వొడివట్టి తియ్యకున్న వూరకే యేమాయెను ॥ పల్లవి ॥

కనుఁగొన నిచ్చితివి కడుమోహ మిచ్చితివి
మనసియ్యకుండితేను మరేమాయెను
పెనఁగఁగఁ జేసితివి బెట్టు రట్టు సేసితివి
ననుఁ బొందుసేయకున్న నడుమ నేమాయెను ॥ పిడికి ॥

సడి నాపై వేసితి వాసలఁ గింద వేసితివి
యెడసి చేవేయకున్న నేమాయెను
వడి సటలాడితివి వట్టి మేలాలాడితివి
కడు జూజాలాడకున్న కమ్మటి నేమాయెను ॥ పిడికి ॥

జట్టి నొట్టు వెట్టితివి సవతులఁ బెట్టితివి
యిట్టె తమ్మ వెట్టకున్న నేమాయెను
గుట్టున శ్రీవేంకటేశ కూడి కోపమాఁపితివి
అట్టె తమి యాఁపకున్న అందుకు నేమాయను. ॥ పిడికి ॥ 59

భవుళి

పొరుగుకు వెంగెమైన పొందు లేఁటికి
విరసపువారెల్ల వింత సేసేరు ॥ పల్లవి ॥

చన్నుమొనలు నాఁటీని సారెఁ బైఁ బడకువయ్యా
కన్నవిన్నవారందరు కడు దూరేరు
చిన్నిగోరు లిట్టె నాఁటేఁ జేతులు వట్టకువయ్యా
నిన్నుఁ బొందే సతులెల్ల నేరాలు వేసేరు ॥ పొరుగు ॥

కొప్పు వాడుఁబువులంటీ కుచ్చి పెనఁగకువయ్యా
చొప్పులెత్తి యెవ్వరైనా సోదించేరు
గొప్ప పిఱుఁదు తొడెత్తి కూచుండఁ బెట్టకువయ్యా
యెప్పటి నీదేవుళ్లెల్ల యీసడించేరు ॥ పొరుగు ॥

మేనిచెమటలు ముంచీ మిక్కిలి రతులేలయ్యా
నానఁబెట్టి సవతులు నవ్వు నవ్వేరు
యీనెపాన శ్రీవేంకటేశ నను గూడితివి
వూని కడమవారెల్ల వుప్పటించేరు. ॥ పొరుగు ॥ 60

రేకు - 611 సాళంగం

ఎఱఁగని వానివలె నిప్పుడు విచ్చేసితివి
గుఱిగా నిన్నియుఁ గనుఁగొనవయ్యా నీవే ॥ పల్లవి ॥

నెలకొని నీవే కావా నేరిపిన నేరుపులే
వలపులతోడి యీవసివాళ్లు
యెలమి నప్పటి మరి యిచ్చిన యీవులే కావా
చెలరేఁగి చెక్కుచేతి చింతలు ॥ ఎఱఁగ ॥

చిత్తగించి నీవే కావా సేసిన చేఁతలివి
చిత్తడి మేనిమీఁది చెమటలు
బత్తితోడ మీఁద మీఁదఁ జాలించినవే కావా
పొత్తుల విరహవేళ పులకలు ॥ ఎఱఁగ ॥

మక్కువతో నీవే కావా మన్నించిన మన్ననలు
పుక్కుమీరినట్టి అసురుసురులు
యిక్కువ శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
చక్కని నీవల్ల నేకా సంతసములు. ॥ ఎఱఁగ ॥ 61

కాంబోది

నే నెగ్గులు వట్టనోప నీచిత్తమిఁకను
కానిమ్మని కైకొంటి కలదెల్లా మేలే ॥ పల్లవి ॥
సారె సారె నవ్వఁగాను చప్ప ననేవు వలపు
వోరసేసు కూరకున్న వుప్పననేవు
నేరమి వట్టితే తననీడే తనకుఁ బగ
కూరిమి మాటలాడితే నూరెల్లాఁ జుట్టాలే ॥ నేనెగ్గు ॥
అగ్గలమై చూచితేను అనుకనేవు ననపు
సిగ్గులు వడితే నట్టే చిక్కననేవు
వెగ్గళించితేఁ దనవెంట్రుకలే వేఁకము
వొగ్గితేఁ బువ్వులు గంపెడొకరికిఁ జాలవు ॥ నేనెగ్గు ॥
తెక్కులఁ బుక్కిట నించితే నెట్టి ననేవు తమ్మ
పక్కన విడె మిచ్చితేఁ బచ్చననేవు
గక్కన శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
యెక్కితే యేనుఁగు గుజ్జు యెక్కకున్నఁ బొడవు. ॥ నేనెగ్గు ॥ 62

నాదరామక్రియ

దవ్వులనుండి యేమి తరితీపు సేసేవు
జవ్వనము చిందకుండా జాశెఁ బోయరాదా ॥ పల్లవి ॥
సిగ్గరి పెండ్లికూఁతురు చేసన్న లెఱుఁగునా
వెగ్గళించి నీవీడకు విచ్చేయరాదా
బగ్గన నక్కడ నిన్ని పనులు గలిగినాను
ముగ్గిన యీవేళకు మూటగట్ట[illegible]దా ॥ దవ్వుల ॥

కన్నెప్రాయపు నెలఁత కందువ మాటెఱుఁగునా
పన్ని తెలియఁగ నొడఁబరచరాదా
అన్నిటా నవ్వుల నీకు నాసలెన్ని గలిగినా
పెన్నిధిగా యీవేళకు పెట్టెఁ బెట్టరాదా ॥ దవ్వుల ॥

చెలువపు ముద్దరాలు చెనకు లివేమెఱుఁగు
కలసి కాఁగిటఁ జేర్చి కైకొనరాదా
అలరి శ్రీవేంకటేశ అతివ నేలితి విట్టె
వలెనా నవ్వీవేళకు వామి వేయరాదా. ॥ దవ్వుల ॥ 63

ఆహిరి

ఎటువలె బుజ్జగించి యీడేరించేవో కాని
తటుకన నీకు మొక్కె తలియేదో కాని ॥ పల్లవి ॥

మత్తగజగమనకు మనవి యెంతైనాఁ గద్దు
చిత్త మెరఁగక నీతోఁ జెప్పదు గాని
హత్తి నీతో మాటలాడే ఆస యెంతైనాఁ గద్దు
తత్తరపు సిగ్గులతోఁ దలవంచీఁ గాని ॥ ఎటు ॥

ముసిముసి నవ్వులకు ముచ్చటెంతైనాఁ గద్దు
సుసరాన తనగుట్టు చూపదు గాని
వసివాడుతనముల వలపెంతైనాఁ గద్దు
పసురు వయసుతోడఁ బదరదు గాని ॥ ఎటు ॥

అట్టె నిన్నుఁ గూడె నిదె అలపెంతైనాఁ గద్దు
దిట్టతనాన వెనక తియ్యదు గాని
నెట్టన శ్రీవేంకటేశ నీవె యేలితి వాపెను
ఒట్టిగొన నిన్నాపె జంకించదు గాని. ॥ ఎటు ॥ 64

## కుంతలవరాళి

మాకేల యిటువంటివి మగనాండ్లము
యీకొలఁది నీకమరు నెమ్మోకాఁడవందురు ॥ పల్లవి ॥

చెక్కు గోరనొత్తకుమీ సిగ్గుతోడిదాన నేను
యిక్కడనే నవ్వేరు నన్నెవ్వరైనాను
నిక్కముగ నివియెల్ల నీచెక్కుల నుంటే మేలు
అక్కడివారు విటుఁడవని నిన్ను నందురు ॥ మాకే ॥

తుఱుము వంగఁదియ్యకు దొరపాటిదాన నేను
యెఱఁగకాడుకొనేరు యెవ్వరైనాను
నెఱి నిటువంటివి నీకుఁ గలిగితే మేలు
గుఱిగా రేపల్లెలోని కోడెకాఁడవందురు ॥ మాకే ॥

మోవి గంటిసేయకుమీ మొదలి యిల్లాల నేను
శ్రీవేంకటేశ దూరేరు చెలులెల్లాను
నీవు నన్నుఁ గూడితివి నీకే వుండితే మేలు
భావించి నిన్నెవ్వరైనా బయకాఁడవందురు. ॥ మాకే ॥ 65

## లలిత

ఘనుఁడవు బొంకకుమీ కద్దో లేదో
చెనకి చేయిమీఁదుగాఁ జేఁత సేసెఁగా ॥ పల్లవి ॥

చెలరేఁగి చెలరేఁగి చేతులు వట్టుకొని
పిలిచి అప్పుడాపెతోఁ బెనఁగితివి
అలిగి ఆయింతి నిన్ను నట్టె బొమ్మల జంకించి
తిలకించి చెప్పరాని తిట్లు దిట్టెఁగా ॥ ఘను ॥

చెక్కునొక్కి చెక్కునొక్కి చేరి ప్రియములు చెప్పి
వెక్కుల నాపె వాడివట్టి తీసితివి
వెక్కసపు కోపముతో వెలఁది నిన్నావేళ
పక్కన చేతిపువ్వుబంతిఁ గొని వేసెఁగా ॥ ఘను ॥

కాఁగిలించి కాఁగిలించి కందువలకుఁ దీసి
ఆఁగి శ్రీవేంకటేశుఁడ అట్టె కూడితి
రాఁగిన తమకముతో రమణి నిన్నంతలోనే
చేఁగచన్నులనుఁ గుమ్మి సెలవుల నవ్వెఁగా. ॥ ఘను ॥ 66

రేకు - 612 సింధురామక్రియ

ఇంచుకంత సన్నె అఁగఁ డిదేమె తాను
మంచముపై నుండితేనే మర్మము సోఁకె ననీ ॥ పల్లవి ॥

చెవిలోమాట చెప్పితే సెలవుల నవ్వీని
తివిరి గోర నూఁదితే తిట్టు దిట్టీని
చివురున వేసితేను చిత్తగించి మిట్టిపడీ
జవళిఁ గూచుండితేను చన్నులొత్తె ననీని ॥ ఇంచు ॥

మొగము చేతనెత్తితేను మోవి గంటిరేఁగె ననీ
తగిలి చూచితేను చేతను దొబ్బీని
పగటున మొక్కితేను పాదము లొత్తె ననీని
వొగిఁ గాలు దొక్కితేనే వొరట్లనీని ॥ ఇంచు ॥

పచ్చడము గప్పితేను పట్టి తీసితి ననీని
యిచ్చక మాడితే వెంగె మేఁటి కనీని
పచ్చిగా శ్రీవేంకటాద్రిపతి నన్ను నిటు గూడి
మెచ్చినా నప్పటి మితిమీరితి ననీని. ॥ ఇంచు ॥ 67

శ్రీరాగం

బదుకఁగలవు పెక్కుపడఁతులలోన నెల్లా
పదర వన్నిటికిని బందుగుఁడవయ్యా ॥ పల్లవి ॥

కోరి యిందరు ముడిచే కొప్పులోని తామెరవు
గారాబుఁ జన్నులఁ బూసే గందమవు
చేరి పరిమళించే చెవిలో జవ్వాదివి
నేరుతు విన్నిటా నిఁక నిన్నేమనేమయ్యా ॥ బదుక ॥

కొండుక పాయపువారి కొడివేలుంగరమవు
అండనే మెడఁ దగిలే హారమవు
దండిగా వినయాన పాదాలఁ బెట్టిన యందెవు
నిండా నల్లుకొంటి వికఁ నిన్నేమనేమయ్యా ॥ బదుక ॥

కావలె ననేటివారి కట్టినట్టి చీరవు
మూవంక రతివేళ మేల్ముసుఁగవు
శ్రీవేంకటేశ నన్నుఁ జెందితి వింతటిలోనే
నీవంగడిసరకవు నిన్నేమనేమయ్యా. ॥ బదుక ॥ 68

## సౌరాష్ట్రం

అట్టె సేయవయ్యా యెదురాడ నేఁటికి
పట్టి యలవాటు లప్పటిఁ జేసుకొనేవా ॥ పల్లవి ॥

తిలకించి చెప్పరాని తిట్టు నీవు దిట్టితేను
పలికినట్టే పలుక పంతమా మాకు
నెలకొని యీడనాడ నేరుచుక వచ్చి యీడ
పలుమారు గుణించుక పాటము గొనేవా ॥ అట్టె ॥

సేసవెట్టి సేయరాని సేఁతలెల్లా మించఁగాను
సేసినట్టే సేయ మాకుఁ జెల్లుబళ్లా
లాసి యిందరి గరిడి లలిసాము సేసి వచ్చి
వగాసిపోకుండా నీడ మరి తేఁ పోసేవా ॥ అట్టె ॥

నయగారితనములు నవ్వులెల్లా నవ్వేవు
మొయికి మొయి మళ్ళించ ముచ్చట గాదా
నయతో శ్రీవేంకటేశ తగ నన్నుఁ గూడితివి
నియతి జాణతనాలు నీవే నేర్చేవా. ॥ అట్టె ॥ 69

గంభీరినాట

మాకు వింతలా నీమతకములు
కై_కొని నీవు పుట్టఁగానే పుట్టినవి ॥ పల్లవి ॥
వద్దు వద్దు మాతోను వట్టి సటలింకా నీకు
పొద్దువోదా ఆపె నీకు బుద్ది చెప్పదా
బద్దులును బాసలును పలుమారు వినయాలు
గద్దరి నీవు పుట్టఁగానే పుట్టినవి ॥ మాకు ॥
యేల యేల సేసేవు యింతలోనే యిచ్చకాలు
వేళలేదా ఆపె నీకు విన్నవించదా
చాలుకొన్న తమకాలు సరసాలు వేసాలు
కాలమందే నీవు పుట్టఁగానే పుట్టినవి ॥ మాకు ॥
మెచ్చు మెచ్చు నన్నింతలో మేఁకుసేసి కూడితివి
అచ్చు మోపే వాపె నిను హెచ్చరించదా
అచ్చమై శ్రీవేంకటేశ అందికలు పొందికలు
గచ్చుల నీవు పుట్టఁగానే పుట్టినవి. ॥ మాకు ॥ 70

కన్నడగౌళ

ఎడమాట ఇఁకనేల యిద్దరునుఁ గూడితిరి
అడరి జవ్వనపాయ మాఁపలేక వచ్చెను ॥ పల్లవి ॥
చెమటలు గారఁగాను చిరునెరులు దూలఁగ
తమకాన నీవద్దికిఁ దానే వచ్చెను
మము నీవద్దికి నంపి మనసు నిలుపలేక
ప్రమదాన నిట్టే పెద్ద పరువున వచ్చెను ॥ ఎడ ॥
కొప్పు గడు వీడఁగాను కుచములు గదలఁగ
నప్పసము నీవద్దికి నాపె వచ్చెను
యిప్పుడే కమ్మలు వ్రాసి యిట్టె మాచేతికి నిచ్చి
చప్పుడుగాఁ దానే యీడ చదువఁగ వచ్చెను ॥ ఎడ ॥

నడపు దడఁబడఁగ నలిఁ బోఁకముడి వీడ
పడఁతి నీవెంటఁ జానుపు పైకి వచ్చెను
యెడమిచ్చి శ్రీవేంకటేశ యింతిఁ గూడితివి
జడియని రతుల నీసరి వచ్చెను. ॥ ఎడ ॥ 71

ఆహిరి

నీతోఁ బెనఁగదు నిన్ను నౌఁగాదనదు
నీతలఁపు దెలియక నిట్టూర్పు వుచ్చీని ॥ పల్లవి ॥
పక్కన నీవాపెను పయ్యదకొంగు పట్టితే
చెక్కునఁ జెయి వెట్టుక సిగ్గువడీని
చక్కఁగా నప్పటి గోరు చన్నులపై నూఁదితేను
నెక్కొన్న వేడుకతోడ నివ్వెరగందీని ॥ నీతో ॥
తొడఁబడ నీవాపెను తొడపైకిఁ దీసుకొంటే
చిడుముడి మేనెల్లాఁ జెమరించీని
తడఁబడి యట్టె మోము తప్పక చూచితేను
పొడలుగాఁ జెక్కులెల్లాఁ బులకించీని ॥ నీతో ॥
సారె సారె నీవాపెతో సరసములాడఁగాను
గారబాన నిన్నందుకుఁ గాఁగిలించీని
యీ రీతి శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి నీ —
నేరుపులెల్లా మించ నిన్ను మెచ్చీని. ॥ నీతో ॥ 72

రేకు - 613 అహురసింధు

పండెఁ దెచ్చుకొనవయ్యా పైపైనె వలపులు
బండుల కొలఁదులివె పాయరాని రతులు ॥ పల్లవి ॥
కుప్పలాయ జవ్వనము కోమలి కుచములై
ఇప్పుడే కోరుఁగొందు విందు రావయ్యా
లప్పల కస్తూరి పూఁత లచ్చన వెట్టివున్నది
దెప్పరమై కాఁగిటిగాదెనుఁ బోయవయ్యా ॥ పండె ॥

నాపపంట వచ్చె మరి నలిసాంకి మోవిరైయె
తీపు చవిగొందువు యుందే రావయ్యా
మోపుల కొలంది మరుముద్రలు వెట్టివున్నవి
కోపుల నీపుక్కిటి కాంగులం బోయవయ్యా ॥ పంటె ॥
ముదిత తమ్ములమున ముక్కారు పంట వండె
ఇది చేకొందువు గాని ఇందు రావయ్యా
పొదిగి శ్రీవేంకటేశ భోగపు నీగురుతబ్బె
చదరాన మేనికణజాన నించవయ్యా. ॥ పంటె ॥ 73

గౌళ

మానాపతులతో నింతమంకులుం జలముతేల
పూనిన నీవే బుజ్జగించి బుద్ధి నేర్పరాదా ॥ పల్లవి ॥
సిగ్గులు చేటండేసి చిరునవ్వు మూటెండేసి
యెగ్గులుం దప్పులునైతే యేరాళము
వొగ్గి యాపెం గొలువులో నొడివట్టెల తీసెవు
తగ్గక నీవే యేకతానకు రారాదా ॥ మానా ॥
కోరికలు బారెండేసి గుంపెనలు మూరెండేసి
బీరములైతే మితిమీర లేదు
కూరాకుగా నీ వాపెకొప్పెల పట్టి తీసేవు
దారదప్పకిట్టే యేకతానకు రారాదా ॥ మానా ॥
సరసాలు గంపెండేసి సలిగెలు గుంపెండేసి
సిరుల రాజసములు శేనా శేన
అరిది శ్రీవేంకటేశ అలయించీకెం గూడితి -
విరవై యేకతమున కిప్పుడే రారాదా. ॥ మానా ॥ 74

పాడి

నీ వెరంగవా ఇది నేము విన్న చనేల
వావులు గలసితేనే వశము [illegible] ॥ [illegible]వి ॥

పంతము లాడఁగనేల పడఁతులకు లోనైతే
పొంతనే ప్రియము చెప్పి పొసఁగవలె
వింతలు సేయఁగనేల వీడుదోళ్లాడితేను
యెంతైనా సరసముల నెనయఁగవలెను॥ ॥ నీవెరఁగ ॥

సిగ్గులు వడఁగనేల సేసలు వెట్టినప్పుడే
బగ్గన నవ్వులు నవ్వి పైకొనవలె
యెగ్గులు వట్టఁగనేల హృదయాలు గలసితే
నెగ్గలపు సంతోసాన నిట్టవీఁగవలెను ॥ నీవెరఁగ ॥

వెనకముందెంచనేల వేడుకతోఁ గూడితేను
చనవులు మెరసి పచారించవలెను
ఘనుఁడ శ్రీవేంకటేశ కలికి నేలితి విట్టె
ననుపులైనపుడే మన్నన లెంచవలెను. ॥ నీవెరఁగ ॥ 75

కురంజి

నే మెఱఁగము సుమ్మీ నిలుచుండి చూచే విట్టె
కోమలులకు నీకు గురుతాయ వలపులు ॥ పల్లవి ॥

వింత వింతమాటలు వేడుకతో పాటలు
దొంతులు వెట్టేరు నీపై తొయ్యలులెల్లా
చింత లనేవిరులు సిగ్గులనే సరులు
బంతి కట్టుగాఁగ నీపైఁ జల్లేరదివో ॥ నేమె ॥

కనుచూపు గురులు కొనగోరి గెరలు
పెనచేరు నీమీఁదఁ బ్రియురాండ్లు
చనుఁగవ కొండలు జంకెనల యండలు
ననుపులుగా నీపై నాటువేసే రదివో ॥ నేమె ॥

[illegible]సపు పొందులు కాఁగిటిలో విందులు
యేతులఁ జేసేరు నీకు యిల్లాండ్లు
యీ[illegible] శ్రీవేంకటేశ యిందరిఁ గూడితి విట్టె
పో[illegible]ముగా మీకు పో[illegible]వోసే రదివో ॥ నేమె ॥ 76

## సామంతం

ఊరకున్న వానిమీఁద నుడుకులు గట్టేమా
దారదప్పక తనంత తానుండరాదా ॥ పల్లవి ॥

చేయెత్తి మొక్కేటివాఁడు చేరి వేడుకొనేవాఁడు
సేయరాని పనులెల్లాఁ జేయనేఁటికే
ఆయాలు ముట్టేటివాఁడు ఆనలు వెట్టేటివాఁడు
పాయపు సతులతోను పందేలాడనేఁటికే ॥ ఊర ॥

అలుకలు దిద్దేవాఁడు ఆసలఁ బెట్టేవాఁడు
చెలుము లెక్కడనైనా సేయనేఁటికే
పిలువ వచ్చేటివాఁడు ప్రియాలు చెప్పేటివాఁడు
చలివాసి గొల్లెతల చన్నులంట నేఁటికే ॥ ఊర ॥

కప్పుర మిచ్చేటివాఁడు కాఁగిటఁ గూడేటివాఁడు
చొప్పులఁ బరకాంతలఁ బాడనేఁటికే
ఇప్పుడు శ్రీవేంకటేశుఁ డింత నన్నేలినవాఁడు
కుప్పలుగా నింతులను కూడపెట్టనేఁటికే. ॥ ఊర ॥ 77

## లలిత

వేడుకొనవయ్యా ఆపెవెత దీరను
పోడిమి నాడినమాట బొంకవు గదా ॥ పల్లవి ॥

శిరసు వంచుకొన్నది చెక్కుచేతితో నున్నది
తరుణి కిచ్చినబాస దప్పవు గదా
మరిగి కూచున్నది మారుమాటాడ కున్నది
వొరసి కొనగోర వూఁదవు గదా ॥ వేడు ॥

బొమ్మ ముడితో నున్నది పొరపొచ్చాన నున్నది
చిమ్ముచు నాపెతో మేకు సేయవుగదా
సమ్మతించక వున్నది చలముతోడ నున్నది
యెమ్మెలకు సవతుల నెంచి చూపవు గదా ॥ వేడు ॥

చేతుల మొక్కుచున్నది సెలవి నవ్వుచున్నది
యీతల రతుల నలయించవు గదా
గాతల శ్రీవేంకటేశ కడుఁ గొసరుచున్నది
రేతిరిఁ బగలు తమి రేఁచవు గదా ॥ వేడు ॥ 78

రేకు-614 దేశాక్షి

తగినంతే చాలుఁజాలు తమకములు
నగిన మాత్రములోనే ననుపయ్యీనా ॥ పల్లవి ॥

పలుమారు నిన్ను నెంత బలుములు సేసినాను
వలపు గలంతే కాక వచ్చేవా నీవు
పిలువనై తినంటా పెడరేఁగి కొసరేవు
చలము సాదించఁ బోతే చవి వుట్టీనా ॥ తగి ॥

జాడతోడ నిన్ను నెంత చనవులు నెరసినా
వేడుక గలంతేకాక వియ్యాపుందేవా
వీడె మియ్యనై తినంటా వెసఁ దప్పులు వట్టేవు
వాడికలు చూపితేనే వయిపయ్యీనా ॥ తగి ॥

మెట్టి పట్టి నీతో నెంత మేలములాడినాను
చుట్టరిక మింతే కాక సొంపు గూడీనా
నెట్టుక శ్రీవేంకటేశ నేఁడు నన్నుఁ గూడితివి
బట్టబయ లీఁదఁబోతే పనికి వచ్చీనా. ॥ తగి ॥ 79

మధ్యమావతి

వేడుకకు వెలలేదు విభునితో ననరాదు
సూడిదెవంటి వలపు సులభానసే ॥ పల్లవి ॥

సలుఁగు మొరఁగుమాట తలఁపులోపలితీఁట
తలితో నాయందునుంటేఁ దనకేమే
కలికరిఁ బెట్టఁబోతే కలిముదిరి మెడిదె
యెలుక సేసుకోరాదు యేమందునే ॥ వేడు ॥

గుట్టుతో నవ్వినవవ్వు కొప్పులోపలిపువ్వు
యెట్టు వలసినా వచ్చు నేమనీనే
ముట్టినదెల్లా ముయి పట్టినదెల్లా బంగారు
అట్టు సేయరాదు మేలాఅడి కెక్కెనే ॥ వేడు ॥

కన్నుల మొక్కిన మొక్కు కాఁగిటఁ గూడిన చొక్కు
చన్నుబంటె (టా)య నీఁక సాదించ నేలే
యిన్నిటా శ్రీవేంకటేశ్వరుఁ డింతలో తా నన్నుఁ గూడె
పిన్ననాఁడే సేసవెట్ట బిగియ నేలే. ॥ వేడు ॥ 80

## కేదారగౌళ

వేగిరించకురే మీరు వెలఁదులాల
సోగ కన్నులఁ దప్పక చూచేఁ గాక ॥ పల్లవి ॥

సరసములాడఁగాను జంకించ వచ్చునా
తెరువేదో పతిమతిఁ దెలిసేఁగాక
శిరసు వంచుకుండఁగానుఁ జేరి తిట్టవచ్చునా
అరుదైన సుద్దులెల్లా నడిగేఁ గాక ॥ వేగి ॥

తగ్గక కూచుండఁగాను తలమనవచ్చునా
వెగ్గళించక మాటలు వినేఁ గాక
వొగ్గి వొడివట్టఁగాను వోప ననవచ్చునా
సిగ్గు పడుచు నూరకే చేత మొక్కేఁగాక ॥ వేగి ॥

యిట్టె కాఁగిలించఁగాను యీసడించ వచ్చునా
చుట్టరికము తనది చూచేఁ గాక
వొట్టుక శ్రీవేంకటేశుఁ డొద్దికతో నను నం
నెట్టుకొన్న మోహముతో నిండుకుండేఁ గాక. ॥ వేగి ॥ ౮౧

## శుద్ధదేశి

* అతఁడూ నీవూ నొక్కటే అండవారలే వేరు
సతులతో నీగుట్టు సారెఁ జూపేవు ॥ పల్లవి ॥

కప్పి నీవును నతఁడు కలహించినందుకును
కొప్పు వీడిన దిదయె గురుతు గాదా
చొప్పు లెత్తుచుఁ జెలులు సోదించి యడిగితే
అప్పటి లేదనుచు నాన వెట్టేవు ॥ అత ॥

యెలమిఁ జేపట్టులకు యిద్దరుఁ బెనఁగినందు-
కలసి పయ్యెదజారు టదియె గురుతు
లలి నూడిగపువారు తెలియ నిన్నడిగితే
పొలసి బొంకుచుఁ బతికి పూనుక వచ్చేవు ॥ అత ॥

పంతములు మిలోనఁ బచరించి నందుకును
రంతులను గురుతు లధరము నిండెను
వింతగా నిన్ను శ్రీవేంకటేశుఁడు గూడె
సంతసంబులు మాకు చవులు చూపేవు. ॥ అత ॥ 82

## ఆహిరి

విరహాన బడలెను విభుఁడు యిందాఁకాను
పురుషార్థ మిందువంకఁ బొందేదేమే ॥ పల్లవి ॥

కంతుని దీమమవై ఘనుని భ్రమయించేవు
పొంత నిందువంక నేమి పుణ్యమే నీకు
పంతమున వలపించి పలుమారు నలిగేవు
యెంత లాభము గలిగె నిందువంక నీకు ॥ విర ॥

---

* 'అతఁడు నీవూ నొకటె' అనుట యీపాటలోని పంచమాత్రాకగతి కను కూలము

చెఱకు సింగిణివై చెలువుని నేఁచేవు
గుఱిగా నెంతధనము గూడెనే నీకు
వెఱగు వడుచు నీవు వెంటవెంటఁ దిప్పేవు
నెఱదొరతన మెంత నేర్చితివె నీవు ॥ విర ॥

పూవులగాలమవై పురుషునిఁ దగిలేవు
వేవే యెంతరాజ్య మేలితివె నీవు
యీవల శ్రీవేంకటేశుఁ డితఁ డిట్టె నిన్నుఁ గూడె
కైవశమై యెంతకొడిగట్టితివె నీవు. ॥ విర ॥ 83

మాళవిగౌళ

ఎఱఁగమా నీ లాగు యెన్ని విద్యల వాఁడవు
వొఱపులు సేసుకొంటా నున్నాఁడవు ॥ పల్లవి ॥

చల్లలమ్మే గొల్లెతలు జాజరాడఁ బోలుదురు
అల్లదె నీమేన జిడ్డయి వున్నది
యిల్లిదె తట్టుపునుఁగు యిందుకుఁగాఁ బూసుకొని
వొళ్లెల్లా మెఱుఁగు సేసుకున్నాఁడవు ॥ ఎఱఁ ॥

సారె గోపికలెల్లా వసంతమాడఁ బోలుదురు
సారపు నీమేను బూదచరచున్నది
యేరా కప్పురధూళి యిందుకుఁగాఁ బూసుకొని
వోరిచి నెపము వేసుకున్నాఁడవు ॥ ఎఱఁ ॥

సిగ్గుల మందసతులు సేసవెట్టఁ బోలుదురు
అగ్గలమై మేను కళయై వున్నది
నిగ్గుల శ్రీవేంకటేశ నీ విందుకు నన్నుఁ గూడి
వొగ్గుచు సొమ్ములు నించు కున్నాఁడవు. ॥ ఎఱఁ ॥ 84

రేకు-615 శ్రీరాగం

ఎంత రాజసపువాఁడ వేమిచెప్పేది
పంతములే యీపెమీఁదఁ బచరించేవు ॥ పల్లవి ॥



ఇందుముఖి ఆకుమడిచియ్యఁగా నీవిప్పుడు
అందుకొనక పరాకై వున్నాఁడవు
అందుకు నప్పటియాపె అల్గి చన్నుల నొత్తితే
సందడి సతులతోడ సరసమాడేవు ॥ ఎంత ॥

కప్పురపు లప్ప చెలి గక్కన నీకియ్యఁగాను
దప్పిదేరఁ జేకొనక తల వంచేవు
నెప్పున వాలారుగోళ్ళ నీగడ్డ మాపె యొత్తితే
దెప్పరాన వేరొకతె దిక్కు చూచేవు ॥ ఎంత ॥

వనిత తమ్ములము నీ వదనాన నిడఁగాను
మునుకొని అరవసమున నుండేవు
యెనసె శ్రీవేంకటేశ యింతలోనె యాపె నిన్ను
చనవరి కాంతలకు సన్న సేసేవు. ॥ ఎంత ॥ 85

ధన్నాశి

ఒకరి కొకరు దాపు వోపనంటేఁ బోదు యిఁక
వెకలి చన్నీళ్లకు వేనీళ్లు దోడు ॥ పల్లవి ॥

ఆడరానిమాట లాడి ఆపె నీకుఁ జెప్పింపఁగా-
నీడ నీవు వూరకుండే దిది యేఁటిది
వీడనాడఁ జాలని వెరపు నీకుఁ గలితే
తోడు వచ్చే నే నీకు దోసముగా దిందుకు ॥ ఒక ॥

వొరటుగాఁ జూపి మోపి వుంట వింట వేయఁగాను
సొరిది చేత నొడ్డించుకొననేలా
ధరలోన నీకింత మొగదాకిరి గలితే
తొరల నే యెచ్చరించే దోసముగా దిందుకు ॥ ఒక ॥

గొబ్బునఁ దాలెచిపచ్చి కొంగువట్టి యియ్యఁగాను
సిబ్బితి పడేవు యిఁకాఁ జెల్లఁబో నీవు
గబ్బితనము లేకుంటే గక్కన శ్రీవేంకటేశ
దొబ్బె నిన్ను నాపె మీఁద దోసముగా దిందుకు. ॥ ఒక ॥ ౮౬

## పాడి

ఏమైనా నాయఁగాక ఇఁకనీతో యేమనేము
భూమిలో యెవ్వతె నిన్ను భోగించి వేసినదో ॥ పల్లవి ॥

వలచినవారికి వాసులెంచనున్నదా
వొలిసినందుకెల్లాను వొగ్గుట గాక
పిలిచిపెట్టేవు నాకు పెదవిమీఁదటితమ్మ
యెలయించి తొల్లి నీకు యెవ్వతె వెట్టినదో ॥ ఏమై ॥

పెండిలాడినవారికి బిగియఁగ వున్నదా
అండ నెట్టు పరచినా నౌనంట గాక
గండుమీరి రొమ్ముమీఁది గందము వూసేవు నాకు
మెండుగ నెవ్వతె వూసి మిగిలించినదో ॥ ఏమై ॥

మేనరికపువారికి మేకు సేయ నున్నదా
మోనాన కాఁగిటఁ గూడి మొక్కుట గాక
కానీతే శ్రీవేంకటేశ కలసి విఱులిచ్చేవు
వూని యెవ్వతె కొప్పుననుండి వచ్చినదో. ॥ ఏమై ॥ 87

## నారాయణి

ఇంతకంటే లాభము యెట్టు గడించుకొనేవు
యెంతలేదు విచారము యేమి సేసే వీడను ॥ పల్లవి ॥

చెలరేఁగి నవ్వుకొంటా చెలులతో నీసుద్దులే
పలుమారు నాడుకొనీ పడఁతి
తలుపుమాటుననుండి తగ విందువు రావయ్యా
యెలమి మాపుదాఁకా నేమిసేసే వీడను ॥ ఇంత ॥

నీ కెదురే చూచుకొంటా నీపదాలె పాడుకొంటా
జోకలుగా వేగించీ సుదతి
వాకిటవుండే తప్పక వడిఁ జూతువు రావయ్యా
యీకడ నెంత పొద్దైనా నేమి సేసే వీడను ॥ ఇంత ॥

నీ రూపే వ్రాసుకొంటా నీపేరఁ బిలుచుకొంటా
ఆరసి వలపు చల్లి నలివ
యీరీతి శ్రీవేంకటేశ యిటు విచ్చేసి కూడితి-
వీరచ్చలు సేయవచ్చే వేమిసేసే వీడను. ॥ ఇంత ॥ 88

## రామక్రియ

ఆసోదకాఁడవు అన్నిటికి నోపుదువు
మోసపోకుండా నీపై మూట గట్టేఁ జుమ్మీ ॥ పల్లవి ॥
వెలవెట్టని వలపు వెస చల్లదుబ్బేఁ దేసి
పొలసి గొల్లెతలెల్లాఁ బోసిరి నీకు
మలసి మామీఁదనట్టె మారుగొల గొలచేవు
కలిగినదెల్లా నీకే గాదేఁ బోసేఁ జుమ్మీ ॥ ఆసో ॥
సుంకము లేనివలపు సూటిచనుగుబ్బేఁ దేసి
అంకెలఁ బదారువేలు అమ్మిరి నీకు
పొంకాన నదె తలపోసేవు నాతోను
పంకించక నీకన్నియుఁ బౌఁజు చూపేఁ జుమ్మీ ॥ ఆసో ॥
కొల్లవచ్చినవలపు కోరికెతో సందేఁ దేసి
వల్లెవేసి యెనమండ్రు పంచిరి నీకు
యిల్లిదే యలమేలుమంగ నిదె నమ్మా నేలితివి
వొల్లనె శ్రీవేంకటేశ వొడిగట్టేఁ జుమ్మీ. ॥ ఆసో ॥ 89

## కన్నడ గౌళ

పట్టకు నన్నిఁకను బడలితి నన్నిటాను
చుట్టరికమున నే సొలసేఁ గాని ॥ పల్లవి ॥
జాడ మడువ నోప సాకిరి పెట్టఁగ నోప
మొగము చూచి నీకు మొక్కే నేను
వగపులు చెప్పనోప తప్పులు వట్టఁగ నోప
[illegible] పాదాలసేవ సేసేఁగాని ॥ పట్ట ॥

అనలు వెట్టఁగ నోప ఆఱడిఁ బడఁగ నోప
పూని మంచిదాననై పొగడే నేను
ఆనుక జంకించ నోప ఆసలు చూపఁగ నోప
కానుకిచ్చి నీచేఁతకు లోనవుండేఁ గాని ॥ పట్ట ॥

బొమ్మల జంకించనోప పొద్దులు గడప నోప
చిమ్ముచు సేసవెట్టి చెనకే నేను
నెమ్మది శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
సమ్మతించి నీమోవి చవిగొనేఁ గాని. ॥ పట్ట ॥ 90

రేకు-616 సాళంగనాట

ఏఁటికే తనకు వెరపింతలోననే
మాటెందులేని బిరుదు మగవాఁడుగదవే ॥ పల్లవి ॥

పేరుకొని పిలువఁగఁ బ్రియమునఁ బలుకఁడు
సారె నెవ్వతైనాను సాదించీనటే
గారవించి తనకు నేఁ గానుకియ్యఁగాఁ బట్టఁడు
కూరిమి మఱెవ్వతైనా కోపగించీనటవే ॥ ఏఁటి ॥

నమపున నేనెంత నవ్వినాఁ దా నవ్వఁడు
చనవున నెవ్వతైనా జంకించీనటే
చెనకి నేఁ దనకు సేవ సేయఁగాఁ గొంకీని
తనపై మఱెవ్వతైనాఁ దప్పు వెంచీనటవే ॥ ఏఁటి ॥

ముచ్చట నేఁ జేతులెత్తి మొక్కితేఁ దలవంచీని
వచ్చి వచ్చి యెవ్వతైనా వద్దనీనటే
అచ్చపు శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
యిచ్చ నన్నుఁ గూడె మది యెవ్వతె మీరినే. ॥ ఏఁటి ॥ 91

ముఖారి

పొత్తుల వలపు గద్దా భూమిలోనను, వాసి-
కత్తెవై తే నీ వింత గయ్యాళింతువా ॥ పల్లవి ॥

అంగవించి నాతోనే ఆతఁడు మాటలాడఁగ
  సంగడి జాణతనాలు సారె వాడేవే
  చెంగట నవ్వటి నాతో చేరి చేరి నవ్వఁగాను
  యెంగిలి నవ్వులు నీవు యేల నవ్వేవే ॥ పొత్తు ॥

చెలువుఁడు నామీఁద చేతులు చాఁచఁగాను
  చెలరేఁగి నీవేల చేతులొడ్డేవే
  తిలకించి నన్నాతఁడు దిష్టించి చూడఁగాను
  నెలవై అడ్డమువచ్చి నిలుచుండేవేమే ॥ పొత్తు ॥

శ్రీవేంకటేశ్వరుఁడు చేరి నన్నుఁ గూడఁగాను
  వావులు నీవేమి చెప్పవచ్చేవే యిందు
  యీవల నలమేల్మంగ నిట్టె నన్ను మన్నించఁగ
  కైవసమై అప్పటి చక్కట్లు చెప్పేవే. ॥ పొత్తు ॥ 92

రామక్రియ

ఇన్నిటా నీబత్తులు నే నెరిఁగినవే
  పిన్నదాన నా చన్నులు పిసుకకువయ్యా ॥ పల్లవి ॥

చెక్కులు నొక్కుచు నాకుఁ జేరి ప్రియాలు చెప్పేవు
  పక్కనఁ దిట్టకుంటేనే పదివేలు
  యెక్కడి సుద్దులు మమ్మునేల తడవేవు నీవు
  మొక్కేముగాని మాకొంగు ముట్టకువయ్యా ॥ ఇన్ని ॥

పంతమున నాకు యిన్ని బాసలేల సేసేవు
  వింతవారిఁ దేకుండితే వేవేలు
  యెంత లేదు నీవుమాతోనేఁటికిని నవ్వేవు
  యెంతైనా సేవ సేసేము యిక్కువంటకువయ్యా ॥ ఇన్ని ॥

జట్టిగొని నన్ను నేల సారె సారెఁ బొగడేవు
  గుట్టున నీవుండితేనే కోటానఁగోటి
  యిట్టె శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
  బెట్టుగ మెచ్చేఁగాని పెనఁగకువయ్యా. ॥ ఇన్ని ॥ 93

నాగవరాళి

చూచినవారేమందురు సుదతులెల్లా
యేచి సదమదముగా నింత పెనఁగితివి ॥ పల్లవి ॥

ఆఁటది వలచెనంటా నంగడిఁ బెట్టేవు నీవు
నాఁటకుఁడ యెవ్వరైనా నమ్మఁగవద్దా
నీటుతోడ సిగ్గువడి నిలుచుండఁగాఁ బయ్యద-
చాటున నున్నగుబ్బలు సారెకు గీరితివి ॥ చూచి ॥

కన్నె నీతో డెక్కెనంటా కాకుసేసే విన్నిటాను
వన్నెకాఁడ వాడవారు వలవవద్దా
వున్నతిఁ దలవంచుక వుండఁగానే మోవితేనె
సన్నలఁ బరచి చప్పుచాడు సేసితివి ॥ చూచి ॥

ముద్దరాలలమేల్మంగ మొక్కెనంటా నవ్వేవు నే-
మద్దో శ్రీవేంకటేశ నిన్నవుననవద్దా
గద్దించి కాఁగిటిరతిఁ గలయఁగ మేనెల్ల
చద్దివేడి చెమటలఁ జొకులు రేఁచితివి ॥ చూచి ॥ 94

దేశాక్షి

కోడెకాఁడు గదవమ్మ గోవిందరాజు
వేడుక మోవులతేనె విందారగించీని ॥ పల్లవి ॥

కొలువు కూటములోన గోవిందరాజు వాఁడే
పలుమారుఁ జెలులతోఁ బందేలాడీని
నిలువుల మేడమీఁద నిలిచి గోవిందరాజు
వలపులు చల్లుచును వసంతాలాడీని ॥ కోడె ॥

కోరి కేళాకూళిలోన గోవిందరాజు వాఁడే
సారె నింతులతో నీరు చల్లులాడీని
తూరుచు సింగారపుఁ దోటలో గోవిందరాజు
వైరణ చేసంగరిలో జాజరలాడీని ॥ కోడె ॥

గోముల శ్రీవేంకటాద్రి గోవిందరాజు వాఁడె
రామలతోడుతను సరసమాడీని
గామిడై పాన్పుపైఁ గూడి కందువగోవిందరాజు
మోములు చూచెందరితో ముచ్చటలాడీని. ॥ కోడె ॥ 95

పాడి

అప్పటి నెరఁగనలే ఆడనున్నాఁడు
చెప్పేఁగాని తగబుద్ధి చేరఁ బిల్వవే ॥ పల్లవి ॥
వొట్టుక యెవ్వతో చీర కట్టి విడిచినది నా-
పెట్టెలోనఁ బెట్టినాఁడు పిలువఁగదే
గుట్టుతోడ రాకున్న కొమ్మలిందరుఁ జూడఁగ
అట్టె కొంగువట్టి తీసి ఆనవెట్టవే ॥ అప్ప ॥
బాలకి యెవ్వతో మెట్టి పాదానఁ బెట్టినది నా
వేలఁ బెట్టిపోయినాఁడు వేగఁ బిల్వవే
ఆలరి పరాకు సేసుకట్టె వుంటే నిందరిలో
వోలిఁ గొప్పువట్టి తీసి వొట్టు వెట్టవే ॥ అప్ప ॥
యెవ్వతో బన్నసరము ఇదె నామెడ వేసెను
చివ్వన శ్రీవేంకటేశుఁ జేరఁ బిల్వవే
మవ్వాన నన్నిదె కూడె మతకాన రాకున్న
రవ్వగాఁ జేవట్టి తీసి రచ్చవెట్టవే. ॥ అప్ప ॥ 96

రేకు-617 దేసాళం

ఏమి సాకిరి వెట్టే వింతులనెల్లా
చేముంచి కొనగోరఁ జెనకుదుఁగాక ॥ పల్లవి ॥
మంకుతోడి మానిని మాటలాడీనా నీతో
జంకించి బొమ్మల నిన్ను సాదించుఁగాక
అంకెలఁ జెరఁగు వట్టి అట్టె లోనికిఁ దీసి
కంకిగాఁ గాఁగిట నిట్టే కలతువుగాక ॥ ఏమి ॥

మందెమేళమైన సతి మరియుఁ గిందుపడీనా
    యెందునైనా నీవుర మెక్కుఁగాక
సందడి నీవె యాపెను చన్నులంటి పాన్పుపై
    చిందర వందర సేసి చేకొందువుగాక ॥ ఏమి ॥

గబ్బితనమైన సతి ఘాతలకు లోఁగీనా
    వుబ్బున నీమేనిఁ బెట్టి వోరసుఁగాక
అబ్బురమై శ్రీవేంకటాధిప కూడితి విట్టె
    నిబ్బరానఁ జనవిచ్చి నెరవేర్తుగాక. ॥ ఏమి ॥ 97

## భైరవి

ఏడమాటలైనా నాడి యెలయించేవారము
    జోడుగూడి నిన్నంతేసి చొక్కించఁ గలమా ॥ పల్లవి ॥

మందెమేళమున మారు మలసేటివారము
    సందడిఁ బెండ్లాడేటి సతులము
పందెపు సరసములఁ బదరేటి వారము
    చెంది రతుల మెప్పించఁ జిత్తము వచ్చేనా ॥ ఏడ ॥

వుద్దండపుఁ జెనకుల వోరసేటి వారము
    గద్దరి తనముల బింకపు వారము
పెద్దరికానకు మోవి పిప్పిసేసేవారము
    వద్దనుండే యట్టి యితవరులఁ బోలేమా ॥ ఏడ ॥

ఇచ్చకపు సేవసేసి యింపు చల్లేవారము
    కొచ్చి చనుఁగొండలను కుమ్మేవారము
మచ్చిక శ్రీవేంకటేశ మమ్ము నిట్టె కూడితివి
    తచ్చి తచ్చి నిన్నానుద్ది తలపించ నోపేమా. ॥ ఏడ ॥ 98

## మధ్యమావతి

వేఁడుకొనఁ గదవయ్యా వేగమె నీవు
    వాఁడి గోరితాకులకు వడఁ దిట్టకుండునా ॥ పల్లవి ॥

ఆఁటది చిగురువంటి దంతగాసి కోపదు
గాఁటపుమాటాడితేనే కసుగందును
యేఁటికిఁ బిసికితివి యెగసక్కేనఁ జన్నులు
గూఁటఁ జిక్కి యిందుకాపె కోపగించకుండునా ॥ వేఁదు

జవ్వని పూవువంటిది సడిఁబడ నోపదు
నవ్వితేనే పసివాడి నాము వేసును
రవ్వగా గిలిగింతురా రచ్చలోన మర్మములు
ఇవ్వల నెందుకునాపె యెగ్గువట్టకుండునా ॥ వేఁదు ॥

కన్నియ పూఁపవంటిది కాఁకలకు నోపదు
పన్నిచేతఁ బట్టితేనే పాలుదీసును
అన్నిటా శ్రీవేంకటేశ అలయించితి కాఁగిట
సన్నల నిన్నిందుకాపె సాదించకుండునా. ॥ వేఁదు ॥ 99

గౌళ

దానికేమి అన్నియును తరవాత మెచ్చుయ్యాని
నానఁబెట్టుకున్నదాన నవ్వకుండేదాననా ॥ పల్లవి ॥

కోరి నిన్ను నే నిక్కేఁకొంగు వట్టితీసితేను
వోరి! నన్నుఁ గాదనేవా వొల్లననేవా
పారితెంచి నీలోనిబత్తి చూతామంటాఁ గాక
వూరకున్నదాన నీకు నోపకున్నదాననా ॥ దాని ॥

ముప్పిరిఁ గాఁగిట నించి మోవి గంటిసేసితేను
వొప్పి కరఁగకుండేవా వొల్లననేవా
దెప్పరపు నీబాస తెలిసేకొంటకుఁ గాక
చప్పుడు సేయకుండాన జడిసి వుండాననా ॥ దాని ॥

నగుల నీనోరిలోనఁ దమ్ములమునే నిడితే
నొగిఁ జేకొనకుండేవా వొల్లననేవా
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్ను నేలితివి
అగపడి వున్నదాన నలసి వుండాననా ॥ దాని ॥ 100

## ఆహిరి

ఏల వేగిరించేవు యెమ్మెలేల సేసేవు
తాలిమితోఁ గాని కాని దక్కేవు నీవు నాకు ॥పల్లవి॥

సిగ్గుతో నేమరుండఁగాఁ జెక్కు గోర నొత్తితివి
దగ్గరుమా గోరు నిన్నుఁ దాఁకించే నేను
సగ్గక అల్లంతనుండి సాములెన్ని సేసినాను
అగ్గమై రావలెఁగా మాయండకు నీవిపుడు ॥ఏల॥

పరాకై వుండఁగా నిమ్మపంటు నీవు వేసితివి
మరల వేయుమా నిన్ను మళ్ల వేసేను
తెరాకడనుండి నీవు తిలకించి చూచేవు
విరాలిఁ జానువుపైకి విచ్చేయవలెఁగా ॥ఏల॥

నిద్దిరించేవేళఁగా నీవు నావురమెక్కితి-
వొద్దికఁ బొరలుమా నీవుర మెక్కేను
గద్దరి శ్రీవేంకటేశ కాఁగిట బిగించేవు
వద్దు ఇంకా నావంతుఁ రావలెగా రతులకు ॥ఏల॥ 101

## తెలుఁగుఁగాంబోది

నేనేమిసేతునే నెలఁతలాల
వ్వాని వెరపు దెలిపి బుద్ది చెప్పరే ॥పల్లవి॥

తనమోము చూచితేను తతిగొని నాకు నవ్వు
యెనయక తానేల యెగ్గుపట్టీనే
అనువుగా నేనెంత ఆనవెట్టినా నమ్మఁడు
తనచేఁత దలఁచుక తానే యలిగీనే ॥నేనేమి॥

పలికితే తాఁ జేసేపనులు తొరలి వచ్చీ
యెలమిఁ దానేల యిందు కెగ్గుపట్టీనే
పలుమారు నిందుకుఁగా బాససేసినా నమ్మఁడు
చెలఁగి తనకుఁ దానే సిగ్గులు వడీనే ॥నేనేమి॥

కూడితేను తనవొళ్లి గురుతులు రేఁగిని
ఝూడనె తావేల యిందుకెగ్గువట్టినే
ఆడ నంటే శ్రీవేంకటాద్రీశుఁడు నమ్మఁడు
వేడుకఁ దనలోఁ దానే విచారించుకొనీసే ॥ నేనేమి ॥ 102

రేకు-618 హిందోళం

ఆలరిజాణఁడవని అంటిఁగా నేను
ఆలనైతి నింతయేఁటికంటిఁగా నేను ॥పల్లవి॥
చేరిచేరి నీవు నాతో సెలవుల నవ్వఁగాను
ఆరు చేతఁ బట్టకుమనంటిఁగా నేను
నేరుపుల మాటలెల్లా నీవు నాతో నాడఁగాను
ఔరా మెచ్చితినని అంటిఁగా నేను ॥ ఆల ॥
సేసవెట్టి యట్లానే చేతులు చాఁచఁగాను
ఆసలఁ బెట్టకుమని అంటిఁగా నేను
లాసి సరసముల నీలాగు లెల్లాఁ జూపఁగాను
ఆసుద్దులు యెరుఁగుదు నంటిఁగా నేను ॥ ఆల ॥
కప్పురము నీవిచ్చి కాఁకలు చల్లార్చఁగాను
అప్పుడే సంతోషించి అంటిఁగా నేను
ముప్పిరి శ్రీవేంకటేశ ముంచి నన్నుఁ గూడితివి
అప్పణిచ్చుదాఁకానుంటి నంటిఁగా నేను ॥ ఆల ॥ 103

లాళి

ఇంత దొడ్డవాఁడవు యెరఁగని మముబోంట్ల
పొంతనే తీరుకుఁ దెచ్చి భోగించవయ్యా ॥ పల్లవి ॥
సేవ సేయ నేరకున్నా చేయెత్తి మొక్కనేరుతు
కైవసమై మాబత్తి గైకొనవయ్యా
యేవలపించ కుండినా నింట నుండఁగల నీకు
పాపముతోనుండి మమ్ము బదికించవయ్యా ॥ ఇంత ॥

కొనియాడ నేరకున్నా కోరి పిలువ నేరుతు
ఘనుఁడవు మామచ్చిక గైకొనవయ్యా
వొనరి పొందకుండినా వొద్ద నుండఁగల నీకు
యెనలేని మాకోరిక యీడేర్చవయ్యా ॥ ఇంత ॥

పైకొనఁగ నేరకున్నా పాన్పు వరచ నేరుతు
కాకు సేయక నాయాస గైకొనవయ్యా
యీకడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నీకు దేవుల నైతి మన్నించఁ గదవయ్యా ॥ ఇంత ॥ 104

నాట

విడె మందుకొనవయ్యా వెస నంది యిచ్చీని
విడనాడ నున్నదా వెలఁది యెడాటాన ॥ పల్లవి ॥

సలిగె గలుగువారు సాదించ దొరకొంటే
కొలఁది మీరుదురు కోపగింతురు
కలసి మెలసి నట్టి ఘనుఁడవు నీవింత
చలపట్టనున్నదా సతియెడాటాన ॥ విడె ॥

ననుపు గలుగువారు నవ్వు నవ్వ దొరకొంటే
తనువులు సోఁకింతురు తమి రేఁతురు
చన విచ్చినటువంటి జాణఁడవు నీవింత
పెనఁగఁగ నున్నదా ప్రియురాలెడాటాన ॥ విడె ॥

తగవులు గలుగువారు తమకించ దొరకొంటే
పగటు నెరపుదురు పచారింతురు
మగువఁ గూడితివి నెమ్మది శ్రీవేంకటేశుఁడ
అగడు సేమనున్నదా అంగనయడాటాన ॥ విడె ॥ 105

## మంగళకౌశిక

నీ చిత్తమిఁకను నేరములెంచకు నన్ను
యేచి నీ ముందర యిఁకనేమి సేతురా ॥ పల్లవి ॥

సిగ్గులు వడఁగఁ బోతే సెలవినవ్వులు వచ్చి
వెగ్గళము నవ్వితేను వేడుక పుట్టీ
అగ్గలపు వేడుకకు ఆయములు గరఁగీని
యెగ్గెరఁగదు జవ్వన మేమిసేతురా ॥ నీచిత్త ॥

మాటలణఁచుకొంటేను మనసెల్లాఁ జిమ్మిరేఁగీ
పాటించి మనసొగ్గితే పట్టీఁ దమి
నీటునఁ దమి పెంచితే నెలకొనీ విరహము
యీటుమీరీ జవ్వనము యేమి సేతురా ॥ నీచిత్త ॥

పాదా లొత్తుకుండితేను పారీఁ గాఁగిటికిఁ జేయి
పోదిఁ జేతులు చాఁచితే భోగ మబ్బీని
యీదెస శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
యేదెసా మించీ జవ్వన మేమిసేతురా. ॥ నీచిత్త ॥ 106

## బౌళి

ఇంటిలోనే వుండేను యింపుదనకు మీఁదెత్తి
కంటకము లేక వూడిగము గొననీవే ॥ పల్లవి ॥

నగఁగా నెట్లనో నాండ్లే లేదొరతోడ
మొగము చూడఁగా నేడ వెగల్లానో
బిగువుఁ జన్నుల నొత్తిపెనఁగితే నేపంతమో
అగడు సేయక బుద్ది ఆనతిమ్మనఁగదే ॥ ఇంటి ॥

మాటలాడఁగా నెట్టో మదించినవానితోడ
గాఁటాన విడె మియ్యఁగా కార మెంతోనో
కాటుక కన్నులఁ జూడఁగా నేడఁ దాఁకునో
ఆఁటదాన నాకు బుద్ది అది యిమ్మనఁగదే ॥ ఇంటి ॥

చేరి కొలువఁగా నెట్టో శ్రీవేంకటేశ్వరుతోడ
మేరతోఁ గూడితే మందెమేళ మెంతానో
గారవించి తానె నన్నుఁ గాఁగిలించి మన్నించె
కూరిమితో నింకా నిట్లఁ గూడుండుమనఁగదే. ॥ ఇంటి ॥ 107

## పాడి

ఇన్నిటా దేవరవు నిన్నేమీ ననఁజాలను
తన్నుఁదానే వచ్చీ మేలు దండము నీకు ॥ పల్లవి ॥
యెక్కడో ఆపెను నన్నునిద్దరి మాట లాడించి
తక్కులఁబెట్టకు మిదె దండము నీకు
వొక్కరిచేతివిడె మొక్కరిచేతికిచ్చి
తక్కువ సేయకు మిఁక దండము నీకు ॥ ఇన్ని ॥
వొప్పి వొరట్లు వెట్టి వూడిగాలు సేయించుక
దప్పి దేరించకు మోవి దండము నీకు
కప్పి వొక్క రొక్కరినిఁ గాఁగిలించు కొమ్మని
తప్పించుకోకుమిఁక దండము నీకు ॥ ఇన్ని ॥
యెగసక్కెల కిద్దరి నిరుమేలాఁ బెట్టుకొని
తగవులఁ బెట్ట కంత దండము నీకు
నిగిడి శ్రీవేంకటేశ నేఁడు మమ్ము నేలితివి
తగులు విడువకిఁక దండము నీకు. ॥ ఇన్ని ॥ 108

రేకు-619 ## సౌరాష్ట్రం

ఈడేరె నీచలములు యిఁక రావయ్యా
యీడు మిగిలినవాఁడవిఁక రావయ్యా ॥ పల్లవి ॥
పంతగాఁడ వౌదువు బలుదొర వౌదువు
యింతదడవు రాపైతి విఁక రావయ్యా
దొంతి నున్నది వలపు దోమతెరలోపల
యింతి నీ కెదురు చూచీ నిఁక రావయ్యా ॥ ఈడే ॥

గట్టివాయ (యి?) వెదువు గద్దరీఁడ వౌదువు
యిట్టె కానికిచ్చితిమి యిఁక రావయ్యా
పట్టి వున్నది బోనము పడఁతి మోవితేనెల
యెట్టనెదిటిమేడకు నిఁక రావయ్యా ॥ ఈడే ॥

వేడుకకాఁడ వౌదు శ్రీవేంకటేశుఁడ వౌదువు
యీడకు రప్పించి కూడి తిఁకరావయ్యా
సూడిదె వట్టి వున్నది సుద్దు లలమేలుమంగ
యీడేరెఁ బీఁటమీఁదికి నిఁక రావయ్యా. ॥ ఈడే ॥ 109

## సామంతం

మంచిముహూర్తమున శ్రీమంతులిద్దరు
చంచులఁ బూవుదండలు చాతుకొనే రదివో ॥ పల్లవి ॥

సొరిదిఁ బేరటాండ్లు సోబానఁ బాడఁగాను
హరియు సిరియుఁ బెండ్లియాడేరదే
తొరలి యంతటా దేవదుందుభులు మొరయఁగ
గరిమ బాసికములు గట్టుకొనే రదివో ॥ మంచి ॥

మునులు మంగళాష్టకములు చదువుచుండఁగ
పెనగుచు సేసలు పెట్టే రదే
ఘనులు బ్రహ్మాదులు కట్నములు చదువఁగ
వొనరి పెండ్లిపీఁటపై నున్నా రదివో ॥ మంచి ॥

అమరాంగనలెల్లాను ఆరతు లియ్యఁగాను
కొమరార విడే లందుకొనే రదివో (రదే?)
అమరి శ్రీవేంకటేశుఁ డలమేలుమంగఁ గూడి
క్రమముతో వరములు గరుణించే రదివో. ॥ మంచి ॥ 110

## కాంబోది

అగపడితిమి నీకు నాస లాసలా
నగవు లాయఁ బనులు నవ్వవయ్యా ॥ పల్లవి ॥

అట్టె నీమీఁద నానలెల్లాఁ బెట్టఁగాను
బట్టబయలు వచ్చితిఁ బని యేమయ్యా
రట్టు సేసితివి తొల్లే యిట్టె కడు వలపించి
చిట్టకమేమి సేసేవు సేయవయ్యా ॥ అగ ॥
పైకొని నా కొంగు వట్టి బలుములు సేయఁగాను
ఆకడిమోమీకడై తి నానతీవయ్యా
చీకాకు సేసితివి సేస తురుముపైఁ బెట్టి
చేకొంటివి నీ విచ్చలఁ జెనకవయ్యా ॥ అగ ॥
కందువకుఁ దీసి నన్నుఁ గాఁగిలించుకొనఁగాను
యిందుకే నిన్నుఁగూడితి నేమనేవయ్యా
అందపు శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
చెందితి నాపై దయసేయవయ్యా. ॥ అగ ॥ 111

ఛాయానాట

గొంటరి విన్నిటా నిన్నుఁ గొసరఁగఁ జోటేది
వింట గాక నీసుద్దులు వెలిచేవా ఇందుకు ॥ పల్లవి ॥
పల్లదపుమాటలాడి పక్కన వేడుకొనేది
చెల్లునయ్యా నీకే యిట్టి చేఁతలెల్లాను
కల్ల నీ మీఁదనే మోపి కడవారేమనినాను
వెల్లవిరిగా నీవు. వెలిచేవా ఇందుకు ॥ గొంట ॥
విరులనుఁ దాఁకవేసి విడెము చేతికిచ్చేది
దొరవు నీ కలవాటు తొల్లే యిది
తరమిడి నీకింత తగవని యెవ్వరన్నా
విరివి గొందువుగాని వెలిచేవా యిందుకు ॥ గొంట ॥
గక్కన గోరు దాఁకించి కాఁగలించ కూడేది
దక్కెనయ్యా శ్రీవేంకటోత్తముఁడ నీకు
చక్కని యలమేల్మంగ సాదించి నీవుర మెక్కె
వెక్కస మౌదువుగాక వెలిచేవా యిందుకు. ॥ గొంట ॥ 112

### మాళవి

అన్నిటా దొడ్డవాఁడవు అననేమి వున్నదిఁక
వున్నతి నెందరి నిఁక మన్నించ నున్నాఁడవో ॥ పల్లవి ॥

బడిబడి చెప్పఁగానే పండ్లు వులిసీ నిదే
కడు నీసుద్దులు చింతకాయ వంటివి
జడియక యెప్పుడూ నీ సంగడిఁ గూచుండితేను
యెడయక ఇఁక మరి యెంత నోరూరించునో ॥ అన్ని ॥

సోమరించి యేపాటి సోకిఁనాఁ గాఁకలు రేఁగీ
ప్రేమ నీచేఁతలు ఆవపిండివంటిది (వి?)
దోమటి నీ కంచము దొడికితే వలపులు
తామెర దంపరలై తల కెంత యెక్కునో ॥ అన్ని ॥

సొగిసి శ్రీవేంకటేశ చూచితేనే ఆస వుట్టీ
తగునీనవ్వులు పంచదారవంటివి
అగడుగఁ గూడితివి అలమేలుమంగ నేను
జగతి నీ మోవితేనె చవెంత వుట్టించునో ॥ అన్ని ॥ 118

### దేశాక్షి

మాతోనేల చెప్పేవు మాటి మాటికి
నీతో నవుఁ గాదన నేరము నేమెన్నఁడు ॥ పల్లవి ॥

తప్పని బొంకని నీ తగవులేల చెప్పేవు
తప్పు నీయందేమి గల్లాఁ దధవేరా
చెప్పేరు గొల్లెతలే చేరి యడుగుకోవయ్యా
నెప్పున నిన్నుఁ గాదన నేరము నేమెన్నఁడు ॥ మాతో ॥

నగుచు నీ వోరుపులు నాతోనేమి చెప్పేవు
జగడించినా నిన్ను సాదించే...
పగటు నీ దయలు చుప్పనాతికిఁ జెప్పవయ్యా
నిగిడి నిష్టూరమాడనేరము నేమెన్నఁడు ॥ మాతో ॥

సారెకు శ్రీవేంకటేశ సత్యాలేల చెప్పేవు
కారులాడినా నిన్నుఁ గాదనేరా
పోర కలమేల్మంగను బొంకు దైత్యాంగనలతో
నీరతిఁ గూడనే కాని నేరము నే మెన్నఁడూ. ॥ మాతో ॥ 114

రేకు 620 పూర్వగౌళ

చెలి యాతనికి నీవే చెప్పవే బుద్ది
వొలపతాల కింతేసి వోపుదునటే ॥ పల్లవి ॥

కాతరించి పలికేది కమ్మటి వేఁడుకొనేది
ఆతనికిది సాజము ఆయలేవే
పోతరించి వున్నవాఁడు పొద్దువోక పెనఁగీని
వో తరుణి తనతో నేనోపుదునటే ॥ చెలి ॥

దుండగాలు సేసేది తూరి యానలు వెట్టేది
నిండ నాతనివిద్యలు నేఁడు గొత్తలా
కండ గర్వములవాఁడు కైకొని చేతులు చాఁచీ
వుండవే యింతేసిపని కోపుదునటే ॥ చెలి ॥

కన్నుల జంకించేది కాఁగిలించి కూడేది
పన్ని శ్రీవేంకటేశుని బయకారాలు
మన్నించె నన్నలమేలుమంగను నే ననఁగాను
వున్నతి నెదురాడఁగ నోపుదునటే. ॥ చెలి ॥ 115

సాళంగనాట

నీ చెయే మీఁదుగాక నే నెంతదానను
చేచేత నింకానేమి చెక్కునొక్కేవయ్యా ॥ పల్లవి ॥

సాదవు నీవై తేను సారె గోళ్లె వాఁడి
యేదెస నెవ్వరినని యేమందును
సాదించ నీతోడిపొందు చలువయు వేఁడీ నాయ
వేద దీర నింకనేమి వేఁడుకొ నేమయ్యా ॥ నీచే ॥

మాట నీది చక్కనైతే మతకాలు వంకరలు
చీటికి మాటికి నెంత చింతింతును
చాటువ నీ గుణములు చప్పనానుప్పనా నాయ
బూటకాన నీవెంత బుజ్జగించేవయ్యా ॥ నీచే ॥

దైవికము నీదైతే తగవులు మానుషాలు
యీవల నలమేల్మంగ నేమి చెప్పేను.
శ్రీవేంకటేశ నీచేతలు చిగురుఁ జేఁగా
యీవేళఁ గూడితి వింకా నేమి చెప్పేవయ్యా. ॥ నీచే ॥ 116

శుద్ధవసంతం

నెలఁత చెప్పేదెల్లా నిజమాయను
చెలుల మింతే మాకుఁ జెప్పరాదా యిపుడు ॥ పల్లవి ॥

అలసి సొలసి యాపె యానలు వెట్టఁగా నీవు
యెలమిఁ జెవులు మూసుకొనేఁటికిపుడు
మెలఁగి యట్లైతే మేర మీరేవాఁడవే కదా
కలనీగుణములెల్లఁ గానవచ్చెనిపుడు ॥ నెల ॥

చెనకుచు నాపైఁ జేతులు చాఁచఁగా నే
పెనఁగి యేల ముసుఁగు వెట్టుకొనేవు
మనసు రాకట్లైతే మండాడేవాఁడవే కద
ఘనుఁడవు నీవిద్యలు కానవచ్చెనిపుడు ॥ నెల ॥

కందువ నలమేల్మంగ కాఁగిలించి కూడఁగా నే
వింతవై శ్రీవేంకటేశ వెరగందేవు
యిందులోనే యిట్లైతే ఈయకొంటివె కదా
కందులేని నీ మోహము కానవచ్చెనిపుడు. ॥ నెల ॥ 117

నట్టనారాయణి

వింత నీతనిఁ జూడవే వేడుకయ్యీని
యెంతైనాఁ దనమేని యెమ్మె చూపీనిపుడె ॥ పల్లవి ॥

చెలువునితోఁ బెనఁగి సేసకొప్పు వంచుకువే
కొలువులో శింగారించుకొనెనిప్పుడే
కలువ పూవులు వేసి కపురు మాయించకువే
పొలసి గందపుఁబూఁత పూసినాఁడిపుడే ॥ వింత ॥

నాయకుని పచ్చడము నలఁగఁ దొక్కకువే
వేయరాని వల్లెవాటు వేసెనిప్పుడే
చేయిచాఁచి హారములు చిక్కులు వరచకువే
కాయకముగా నతఁడు కట్టుకొనెనిపుడే ॥ వింత ॥

శ్రీవేంకటేశ్వరుని సిగ్గులు వరచకువే
కోవిదుఁడై నిన్నుఁదానే కూఁడె నిపుడు ( డే? )
వావిరిఁ గెమ్మోవెల్ల వాడఁగఁ బిరుచకువే
చేవదేర విడేలు సేసినాఁడిపుడే. ॥ వింత ॥ 118

## ముఖారి

మునుపే యెరఁగవద్దా ముందరెత్తులు
వెనకఁ దలఁచుకొని వెరగందేవా ॥ పల్లవి ॥

యెట్టనెదురుకట్ల నింతి నిలుచుకుండఁగా
అట్టె తల వంచేవు అది యేమయ్యా
అట్టడివై యాపెమఱఁగున నేమైనఁ జేసి
చిట్టకాల కింతలోనే సిగ్గువడేవా ॥ మును ॥

మఱఁగున నుండి యాపెమాటలు నిన్నడుగఁగి
చిఱునవ్వులు నవ్వి కొంచేవేమయ్యా
మెఱసి దుండగాలెల్ల మీఁద మీఁదఁ జేసి
మఱపు లిప్పుడు నేఁడు మందలించేవా ॥ మును ॥

గక్కన నీ దేవులు కాఁగిలించుకొనఁ గానే
యెక్కుడుప్రియాలు చెప్పే విదియేమయ్యా
వొక్కటై శ్రీవేంకటేశ వొడ్డినరతులఁ జొక్కి
మిక్కిలి చనవు లిచ్చి మెచ్చ మెచ్చేవా. ॥ మును ॥ 119

ధన్నాశి

ఆయ నాయ మమునింత ఆఱడిఁ బెట్టకువయ్యా
చేయి చాఁచితే నీవే చిక్కక మానేవా ॥ పల్లవి ॥

సారెసారె నీతోను సలిగెలఁ బెనఁగితే
కేరడమాడేవు గాక కిందుపడేవా
గోరపడక నాయంత గుట్టున నేనుండఁగాను
చేరి దైవమైన దయ సేయకుండీనా ॥ ఆయ ॥

వువ్విళ్లూర నినునెంత వోడఁ బరచుకొనినా
నవ్వులు నవ్వేవు గాక నన్నుఁ గూడేవా
జవ్వనపాయముతోడ చందము సేసుకుండఁగా
యివ్వల మాపుణ్యమైనా యీడేర్చకుండీనా ॥ ఆయ ॥

సేసలు నేఁ బెట్టినాను శ్రీవేంకటేశ నీవు
ఆసలఁ బెట్టేవు గాక అంట నిచ్చేవా
బాసగొని నిను నిట్టే బలిమిఁ గాఁగిలించఁగాను
వాసికైనా మీ మనసు వలవకుండీనా ॥ ఆయ ॥ 120

రేకు 621-వ సింధురామక్రియ

వలపులిద్దరివిని వన్నెకెక్కెను
సళుపుల తమకము సరివచ్చెను ॥ పల్లవి ॥

మొలక ముత్యాలవంటి మొనవాఁడి దంతముల
కలికి నీకెమ్మోవి గంటిసేసెను
బలిమి నీవు జంకించి పగడాలవంటిచూపు
చిలికించఁగానట్టే చెలిమేనఁ గప్పెను ॥ వలపు ॥

మొనమాణికాలవంటి ములువాఁడిగోళ్ళ
వనిత నీ సందుల వంకలొత్తెను
చెనకఁగానీకొప్పు చెదరి యాపెపై నిండి
జినుగునీలచీరయై సిగ్గులెల్లాఁ గప్పెను ॥ వలపు ॥

పసిఁడికుండలవంటి పంతపు చన్నులు నిన్ను
  కొసరి యంగన కులుకుచుఁ గూడెను
  యెసఁగి శ్రీవేంకటేశ యిట్టె నీలాలనీమేను
  మిసిమితోఁ బెనఁగఁగా మించుఁలెల్లాఁ గప్పెను. ॥వలపు॥ 121

## సాళంగం

ఔలే యెంతటివాఁడవయ్యా నీవు
  యేలుకొమ్మని మొక్కితే నెమ్మెలాయ నీకు ॥ పల్లవి ॥

చనవు మెరసి నిను సతి గోరుదాఁకించితే
  కనలి కుచ్చితమంటాఁ గాఁతాళించేవు
  యెనసి యెవ్వరిచే నేమేమి సేయించుకొనవు
  వనితచేఁతలకే వాసివచ్చె నీకు ॥ ఔలే ॥

పొందెరుఁగుదువంటాను పువ్వుల నిన్ను వేసితే
  నిందుకే మచ్చరమంటా నీసడించేవు
  అందరిచే సోఁకినప్పు డాఁగాదని యనవు
  యిందుముఖి చెనకులే యెరవాయ నీకు ॥ ఔలే ॥

చుట్టరికానఁ జన్నులు సోఁకఁ గాఁగిలించితేను
  గట్టువాయతనమంటాఁ గడుఁ దిప్పేవు
  ఇట్టె శ్రీవేంకటేశ యెందరి నీవు గూడవు
  అట్టె యీపెరతులు అలవాయ నీకు. ॥ ఔలే ॥ 122

## శుద్ధదేశి

ఎఱఁగరాదా నీకు నేఁటికింత సేసేవు
  చిఱునవ్వుతోడ లోలోఁ సిగ్గులు వడఁగను ॥ పల్లవి ॥

మానెపె కరఁగీపెను మాటలాడవలెనా(?)
  తనువులోపలి మేలు దై వారుఁగాక
  వనిపడి నీపెల పలుకుమనేవాపెను
  తనుఁదానె మోము తప్పక చూడఁగను ॥ ఎఱఁగ ॥

చేరి పానుపుపైనుండే చెనకఁగ వలెనా
తారుకాణై పులకలు దాఁచవు గాక
సారెకు నీవాపె నేల సరసమాడుమనేవు
వూరకే నీమీఁదఁ దాను వొరఁగుకుండఁగను ॥ ఎఱఁగ ॥

కందువ సేసవెట్టితేఁ గాఁగలించవలెనా
చిందుచు మోవితేనెలు చిప్పిలుఁగాక
యిందునె శ్రీవేంకటేశ యింకేమి సేయుమనేవు
ముందె కూడి నీవురమునఁ దానుండఁగను. ॥ ఎఱఁగ ॥ 123

సాళంగనాట

పదరి నీ వేమిటికిఁ బతికిఁ బతిసేసేవు
వుదుటుఁదనము మేననుండదా ఆపెకు ॥ పల్లవి ॥

మొక్కలాన నాపె నిన్ను మోవనాడెనంటాను
చిక్కని కన్నుల మీఁదఁ జీర దీసేవు
వెక్కసపు జవ్వనాన విట్టువీఁగేచెలి గాన
పక్కన నేమైనాఁ జేయఁ బాడిగాదు ఆపెకు ॥ పదరి ॥

సగుతానాపె నిన్ను సాటఁ జూచెనంటాను
పగటుపెనుఁదురుము పట్టి తీసేవు
మిగులా మురిపెమున మించినట్టి యింతి గాన
తగిలి నీకంటె మీరఁ దగదా ఆపెకు ॥ పదరి ॥

చనవునఁనాపె నిన్నుఁ జన్నుల నొత్తెనంటాను
కనుఁగొని యూపె మోవి గంటి సేసేవు
ఘనసె నిన్ను శ్రీవేంకటేశ నీ దేవులుగాన
చెనకి నిన్నింతసేయఁ జెల్లదా నేఁడాపెకు. ॥ పదరి ॥ 124

శంకరాభరణం

షగవు నీ వెఱఁగవా సమకించేవు
వొగరుఁ బ్రియములకు వోరుతురా చెలులు ॥ పల్లవి ॥

అక్కరతో నీకునాపె ఆకుమడిచియ్యఁగాను
కక్కసించి నీవే యలుకలు రేఁచేవు
చక్కఁగా వోజతోడుత సాజాన నుండినవారి-
నొక్కటొక్కచే సేసితే నోరుతురా చెలులు ॥ తగవు ॥

పనివడి యాపె నీకుఁ బాదములు విసుకగా
పెనఁగి చలములెల్లాఁ బెడరేఁచేవు
ఘనుఁడ నీతోఁ జుట్టరికమున నుండినవారి-
నొనర బాఁపుసేసితే నోరుతురా చెలులు ॥ తగవు ॥

కందువతో నాపె నిన్నుఁ గాఁగిలించి కూడఁగాను
మందలించి కూడుచు మైమఱపించేవు
అందపు శ్రీవేంకటేశ ఆండ్లై వుండిన వారి-
నొందిలి గోరనంటితే వోరుతురా చెలులు. ॥ తగవు ॥ 125

## సామంతం

చెలులచనవులెల్లాఁ జెల్లించవలెఁ గాక
యెలమి మారుమలసేదింత నీకు వలెనా ॥ పల్లవి ॥

వలచినతమకాన వలసినట్లంటేను
చలము సాదింతురా సతితోడను
నిలువెల్లఁ జెమరించి నీమీఁద సొలసితే
పలుమారు నీకు నెగ్గుపట్టఁ దగునా ॥ చెలు ॥

సేవ సేసేవేగిరానఁ జెయిగాలుఁ దాఁకితేను
కావరించి తిట్టుదురా కలికి నింత
వావిగలుగఁగఁ జూచి వచ్చి సరసమాడితే
భావించి అందుకు నీవు పంతమాడఁ దగునా ॥ చెలు ॥

కూడిన నిబ్బరమున గురుతులు సోఁకితేను
సూడుకుఁ బట్టుదురా సుదతి నేఁడు
జోడై శ్రీవేంకటేశ సొమ్ముతో నురమెక్కితే
ఆడినట్లాడుట గాక అలయఁగఁ దగునా. ॥ చెలు ॥ 126

రేకు-622 భూపాళం

ఎందులోనిదానను యిప్పుడిట్టె వచ్చెఁ దాను
సందడి సరసముల జాణకాఁడు దాను ॥ పల్లవి ॥

పవ్వళించి విరహాన బడలి వుండేదాన-
నెవ్వరితోడి మాఁట లేఁటికి నాకు
నవ్వితేఁ దానవ్వనీ నా సెలవులకు రావు
అవ్వల వేడుకకాఁడు అన్నిటాను తాను ॥ ఎందు ॥

అచ్చలాన వేగించి అలసి వుండినదాన
యిచ్చకపు మొక్కు మొక్కనేఁటికి నాకు
హెచ్చి తా సంతోషించితే యింపు నామతిఁ బుట్టదు
పచ్చిసింగారాలతోడి పంతగాఁడు తాను ॥ ఎందు ॥

తనకాఁగిటనె కూడి దక్కివుండినట్టిదాన
యెనలేని మెచ్చు మెచ్చనేఁటికి నాకు
యెనసె శ్రీవేంకటేశుఁ డింతకంటె నేమి సేతు
మనసిచ్చి అందరికి మంచివాఁడు దాను. ॥ ఎందు ॥ 127

మలహరి

నాలికాఁ డింతులలాగు నాఁడెరఁగఁడా
మేలుతోనే కిందట మీఁదటకాఁగాక ॥ పల్లవి ॥

చనవిచ్చినట్టివాఁడు సతినేల తాఁ దిట్టె
పెనఁగి యేమి సేసినాఁ బ్రియమె కాక
ననుపు గలుగువాఁడు నవ్వితే నెగ్గేలపట్టె
గునియక అట్టె వోర్చుకొనుఁ గాక ॥ నాలి ॥

మచ్చిక గలుగువాఁడు మారుమాట లేలాడే
కొచ్చి యేమాడినా నియ్యకొనుఁ గాక
పచ్చిగా వలచువాఁడు పంతా లేఁటికిఁ జూపె
యిచ్చకములే నెరపి యెనయుఁగాక ॥ నాలి ॥

పొదిగి కూడినవాఁడు బొమ్మలేల జంకించె
కదిసినరతులెల్లాఁ గైకొనుఁగాక
యిదివో శ్రీవేంకటేశుఁ డిప్పుడేఁటికిఁ బదరె
యెదపై నాపెఁ బెట్టుక యిల యేలుఁగాక ॥ నాలి ॥ 128

ఆహిరి

అందుకెంత సేసేవు అప్పటి నీవు
కిందుపడి మొక్కఁగాను కేలు దాఁకెనపుడు ॥ పల్లవి ॥

వెక్కసా లాడఁగ నేల వేడుకో నప్పటి నేల
వొక్కరీతినే గుట్టున నుండనీరాదా
చక్కనిరమణికి నీచనవిచ్చి రమ్మనఁగా
చెక్కునొక్కఁ బోతేను జీరవారె నపుడు ॥ అందు ॥

సోఁక నలయించనేల సురటి విసరనేల
వూఁ కొనినమేలుతోడ నుండనీరాదా
యేఁకరి నీవే మోవి యిమ్మనఁగాఁ దనపల్లు
సోఁకితేనే ముద్రలై చూపకట్టెనపుడు ॥ అందు ॥

కడుఁగాఁక రేఁచనేల గందము వుయ్యఁగనేల
వొడికాన నీవద్ద నుండనీరాదా
అడరి శ్రీవేంకటేశ అప్పణిచ్చి కూడఁగాను
వుడివోక వురముపై నునికాయనిపుడు. ॥ అందు ॥ 129

హిజ్జిజి

మఱివేళ లేదా మనసు నిలుపరాదా
గుఱిగానిప్పుడే నన్నుఁ గూడఁగ వలెనా ॥ పల్లవి ॥

చెలఁగు మాసినదాన సిగ్గువడుచున్నదాన
జలసి సరసమేల సారెనాడేవు
చిఱునవ్వుతో నుందాన చెమటచి తడిదాన
యెఱుఁగుదువన్నియును యేమి ఱాఁతి నేను ॥ మఱి ॥

చెదరఁ గురులదాన చేయెత్తి మొక్కేదాన
అదనెఱఁగక యేల అంటవచ్చేవు
మదమొలికేటిదాన మాటున నుండేదాన
యిదివో యిట్టున్నదాన నేమిబాఁతి నేను ॥ మతి ॥

మంచముపైనున్నదాన మతిలో లోఁగేదాన
యించుకంతా సిబ్బితిలేకేల కూడేవు
మంచి శ్రీవేంకటేశ నీ మనసు చూచినదాన
యేంచక నన్నేలితివి యేమిబాఁతి నేను ॥ మతి ॥ 180

## దేవగాంధారి

ఇద్దరు మీరు గూడితిరిది మాకుఁ బదివేలు
చద్ది వేఁడి బాసకు నే సాకిరయ్యే మీకును ॥ పల్లవి ॥
కోరిన కోరికలాయ కొమ్మ నీతో మాటలాడె
కూరిమి నెవ్వరితోడి గొడవేఁటికి
చీరకొంగేల పట్టేవు సిగ్గుగాఁగా మాకిఁక
ధీరతతో నుండరయ్యా తెర వేసే మీకును ॥ ఇద్దరు ॥
సేసినచేఁతలు చెల్లె చెలి నీకు విడెమిచ్చె
ఆసల నెవ్వరితోఁ జెలాటాలేఁటికి
బాసికమేల కట్టేవు సంతమా మాకేమైనా
సేస వెట్టుకోరయ్యా నెచ్చెలినయ్యే మీకును ॥ ఇద్దరు ॥
పట్టినవ్రతము చెల్లె పడఁతి నిన్నిటు గూడె
[illegible]గా [illegible]వ్వరితోడి సడ్డ యేఁటికి
[illegible]ట్టిగా శ్రీవేంకటేశ కలసితివిటు నన్ను
యి[illegible] [illegible]నుండరయ్యా చుట్టమ నే మీకును. ॥ ఇద్దరు ॥ 181

## కన్నడగౌళ

[illegible] నేను చెప్పఁక పోదు
[illegible] నీయే[illegible]కు యెడమెంత [illegible]దు ॥ పల్లవి ॥

మగువ నీతోనిపుడు మంచిమాటలాడరాదా
యెగసక్కెలకుఁ బొద్దు యెంత లేదు
మొగము చూచి యాపెమొక్కులు చేకొనరాదా
మగతనపుబీరము మరి యెంత లేదు ॥ చెలి ॥

చెలియ సేసేటి యట్టి సేవ లియ్యకొనరాదా
యెలయింపు నవ్వులకు యెంత లేదు
కలసి యాపెనిందుకు కాఁగిలించుకొనరాదా
అలమి నీలోనిగుట్టు అది యెంతలేదు ॥ చెలి ॥

చనవిచ్చి యాపెతో సరసమాడఁగరాదా
యెనసిన నివ్వెరగు యెంతలేదు
పనివడి యాపెఁ దొడపై నిడుకొనరాదా
అనుఁగు శ్రీవేంకటేశ ఆలపెంతలేదు. ॥ చెలి ॥ 132

రేకు 623 కన్నడబంగాళం

ఎంతైనా నాడువారము యించుకంతగుట్టు వలె
పంతమున నొరపులు పట్టవద్దు మమ్మును ॥ పల్లవి ॥

యెవ్వతెకు వలతువో యెరఁగము నీ మనసు
నవ్వఁగానెట్టుండునో నడుమంత్రాన
ఇవ్వలనంతే కలితే నేకతానకు రావయ్య
చివ్వన మమ్మీడఁ గాకుసేయవద్దు నీవు ॥ ఎంతైనా ॥

యేడయింతిఁ దలఁచితో ఇంపు నీ కెటువలెనో
పీడె మీఁగా నెట్టుండునో వేళెరఁగక
వేడుక నీకుఁ గలితే విడిదికి రావయ్య
వాడలోన రట్టుసేయవద్దు మమ్ము నీవు ॥ ఎంతైనా ॥

యేసతి మీకుఁ జుట్టమో యెంత గద్దో నీయాస
సేసవెట్టితేనెట్టో సిగ్గువడక
వాసితోడ శ్రీవేంకటేశ్వర మమ్ము నేలితివి
వేసాలకు మాపైదూరు వేయవద్దు నీవు. ॥ ఎంతైనా ॥ 133

## దేశాక్షి

పోలేవయ్యా యెఱుఁగుదు మందరిముందర నీవు
మేలములాడితేనే యెమ్మెలు మెరసేవా ॥ పల్లవి ॥

శిరసు వంచుకుండఁగాఁ జిన్నఁబోయుందాననంటా
అరిదిఁ జెక్కువట్టి ఆడుమనేవు
దొరవు నీ వెఱఁగవా తొల్లి సేసినసేఁతలు
తిరిగి యాడించుకొను (న?) దేవరకు వేడుకా ॥ పోనే ॥

అవలిమోమై వుండఁగా నలిగి వుందాననంటా
చేవట్టి తీసి నన్నుఁ జెప్పుమనేవు
నీవే యెఱఁగవా నీ నడక లన్నియును
వావాత నే విన్నవించ దేవరకు వేడుకా ॥ పోనే ॥

పానుపుపై నుండఁగాను పంతాన నుందాన నంటా
సేనగా శ్రీవేంకటేశ చెప్పుమనేవు
నీ నటనలెఱఁగవా నేఁడు నన్నుఁ గూడితివి
తేనెమోవి నాడించుకో దేవరకు వేడుకా ॥ 134 ॥

## లలిత

నేము వచ్చి తడవాయ నీజాగెంతైనాఁ గద్దు
రామవద్దికి నిప్పుడే రాఁగదవయ్యా ॥ పల్లవి ॥

మాపుదాఁకా నీతోను మాటలాడనే పట్టె
యేపొద్దు చెలియవద్ది కేఁగేదయ్యా
చూపుల నీసింగారాలు చూడనే యిందాఁకాఁ బట్టె
ఆపె వూడిగాన నెప్పుడుండనుండేమయ్యా ॥ నేము ॥

కాచుకుండి నీ కిందాఁకాఁ గానుకలియ్యనే పట్టె
ఆ చెలితో మారుమాటేమనేమయ్యా
చేచేత నీ చేఁతలకు సెలవినవ్వనే పట్టె
చూచి యాపెతో నేపొద్దు రాజమాడేమయ్యా ॥ నేము ॥

రా జసపు నిన్నింటికి రప్పించనే వట్టె
తేజము లాపె కెప్పుడు తెలిపేమయ్యా
సాజాన శ్రీవేంకటేశ సతినిట్టె కూడితివి
యీజాడ నింక నెట్టు యెచ్చరించేమయ్యా ॥ నేము ॥ 185

## మాళవిగౌళ

కాదంటేఁ బోవునా ఘనుఁడు చెప్పినపని
ఆదుకొని యాడినట్టే ఆడవలెఁ గాక ॥ పల్లవి ॥

తగవు తాఁ జెప్పునట తప్పులెంచఁ జోటేది
వెగటు లేకిద్దరము వినేముగాక
జగడాలు వెట్టి తానే సందిమాటలాడునట
పొగడి మాలో నేమే పొసఁగేము గాక ॥ కాదంటే ॥

దోసము లేదనునట తోసి పోనాడఁగనేమి
వేసారక యిద్దరము వినేము గాక
వాసులు రేఁచి తానే వద్దని కూరుచునట
బాసలు నేమే సేసుక బతికేము గాక ॥ కాదంటే ॥

ఇద్దరిఁ దా నేలునట యీసడించ నేమిపని
వొద్ద నిరుదిక్కులా నుండేము గాక
అద్దో శ్రీవేంకటేశుఁడంటె బుద్ధి చెప్పునట
వుద్దండాలు మాని నేమే వొనరేము గాక. ॥ కాదంటే ॥ 186

## శంకరాభరణం

ఓరుచుక యింటిలోన నుండనేరాదా
తూరనిచ్చి వలపుల దొడ్డిఁ బెట్టవలెనా ॥ పల్లవి ॥

వూరకున్న వారికేల వుడుకులు గట్టేవు
సారె సారెఁ బిలిపించి చౌక సేసేవు
కూరిమి గొసరుతానే గుట్టుతోడఁ దిట్టేవు
గారవించి మమ్మునింత కాకు సేయవలెనా ॥ ఓరు ॥

యేమీ నెఱఁగనివారికిట్టె యాస వుట్టించేవు
చేముట్టి సరసమాడి సిగ్గు రేఁచేవు
దోమటి దొడుకుతానే దొమ్మిసేసి చెనకేవు
సాము సేసేనంటూ మమ్ముఁ జండి పెట్టవలెనా ॥ ఓరు ॥

సాదువై వుండినవారిఁ జలపట్టి కూడేవు
వోదించి నానారతుల బుజ్జగించేవు
ఆదిగొని శ్రీవేంకటాద్రీశ నన్నేలితి-
వీదెసనె మమ్మునింత యెచ్చరించవలెనా. ॥ ఓరు ॥ 187

దన్నాశి

మంచితనాన వచ్చేది మచ్చరించఁగా వచ్చీనా
కంచువలె వాయించి గాసి సేతురా ॥ పల్లవి ॥

కక్కసించి మాటలాడి కాతరాన మొక్కు మొక్కి
చెక్కు నొక్కి యేల యింత చిమ్మిరేఁచేవే
అక్కరగలఁడు నీపైనాతఁడు మొదలనే
లక్కవలెఁ గరఁచి యీలాగు సేతురా ॥ మంచి ॥

వేసరించి వెడ్డువెట్టి వెక్కసానఁ బెనఁగుచు
గోస నాసచేసి యేల గోరసేసేవే
ఆసపడి వుండు నీకునాతఁడు నీమోము చూచి
వాసె(వ్రాసే?) బలపమువలె వడి నింతరాతురా । మంచి ॥

పంతమాడి కాఁగిలించి బలిమిని గోరుదీసి
మంతనానఁ గూడి యెంత మరిగించేవే
చెంతల నీప్రాణము శ్రీవేంకటేశ్వరుఁడు
బంతివలెఁ బట్టి పట్టి బడలింతురా. ॥ మంచి ॥ 188

రేకు-624 వసంతవరాళి

వేసరితిమన్నిటాను వేడుకొనేమిఁక నిన్ను
సేస వెట్టి మము దయసేయవయ్య యిఁకను ॥ పల్లవి ॥

చలపాదివాఁడవు సాదెనకు లోనుగావు
గెలువ వశమా నిన్నుఁ గెరలి మాకు
మొలకనవ్వులతోనె మొక్కేము పలుమారు
చెలులము మాపై దయసేయవయ్య ఇఁకను ॥ వేస ॥

మొక్కలీఁడవెప్పుడును మొనచూపరాదు నీకు
చిక్కించ వశమా నిన్నుఁ జేచేత మాకు
పెక్కువినయములతో ప్రియములు చెప్పేవిట్టె
చెక్కు నొక్కి మాపై దయసేయవయ్య ఇఁకను ॥ వేస ॥

శ్రీవేంకటేశుఁడవు చెనకఁగరాదు నేఁడు
సేవించ వశమా నిన్నుఁ జేకొని మాకు
దేవుఁడవు నిన్నె నుతించి కూడితిమిదె
చేవదేర మాపై దయసేయవయ్య ఇఁకను. ॥ వేస ॥ 139

గౌళ

పెంటలై వున్నారిదివో పేరటాండ్లిందరును
గొంటరివి యని యాడుకొనేరు గదయ్య ॥ పల్లవి ॥

కడుఁగొత్త పెండ్లికొడుకవు యింతి (జెనకేవు
అడఁగి సిగ్గువడవు అదేమోయి
వొడివట్టి తీసేవు వొద్దనిందరు నుండఁగ
తొడ యెక్కించుకొనే విందుకు నవ్వేరయ్యా ॥ పెంట ॥

బాసికము గట్టుకొని పడఁతిమోమే చూచేవు
ఆసల సిగ్గువడవు అదేమోయి
సేసవెట్టి తనియవు చెలులచేనందుకొని
లాసి పొత్తుకుఁ బిలిచే వీలాగుకు నవ్వేరయ్యా ॥ పెంట ॥

పీఁటమీఁదఁ గూచుండి ప్రియురాలిఁ గూడితివి
ఆఁటదని సిగ్గువడ వదేమోయి
కోటికి శ్రీవేంకటాద్రి గోవిందరాజ నన్నేలి
పాటించి చెప్పేవా పెకు ళామలు నవ్వేరయ్యా ॥ పెంట ॥ 140

## పాడి

ఏమి నేరములెంచేవు యెంచాఁకాను
గామిడితనాననుంటేఁ గడురేఁచుట గాదా ॥ పల్లవి ॥

కొప్పు వట్టి తీసి నీవు గోరఁ గీరఁగాఁ జెలికి
ముప్పిరిఁ జెక్కుంటరాదా తప్పాయిది
వుప్పతిల్ల మొదల నీ వుద్దండాలు సేసితేను
అప్పుడే చేఁతకుఁ జేఁతకప్పణించుట గాదా ॥ ఏమి ॥

పాదాల ఖిగించి పట్టి పడఁతిఁ గాఁగిలించఁగ
తోదోపు లాడఁగరాదా దోసమా యిది
సాదువలెనున్న వారి సదమదము సేసితే
పాదుకొని నిన్ను సూఁశువట్టుమనుట గాదా ॥ ఏమి ॥

పానుపుపైఁగూడి నీవు పరవశమందించఁగ
మేనిపై నొరఁగరాదా మీరుటా యిది
మేనవారిఁ బెండ్లాడితే మెచ్చగ శ్రీవేంకటేశ
యీ నెపాన నీవుర మెక్కుమనుటగాదా. ॥ ఏమి ॥ 141

## భైరవి

ఏమని విన్నవించేము ఇన్నియు నీ చిత్తమే
నీమతకమంతయును నెరవేరెఁగా ॥ పల్లవి ॥

గోవిందుఁడవైతివి గోపాలుఁడవైతివి
వావులెంచ కిందరిని వలపింతురా
పూవుల వేసినవారు పుప్పొడి చల్లినవారు
వోవరిలోపల నీకు వొక్కసరేకా ॥ ఏమని ॥

రాచవాఁడవైతేనేమి ఠచ్చగొల్లవైతే నేమి
చూచి పాలు వెన్నలు ముచ్చులు కొందురా
కాచుక వుండినవారు గక్కన వచ్చినవారు
చేచేత సేస వెట్టితే చెలఁగి సరే కా ॥ ఏమని ॥

మంచిదేవుఁడవు గా మానిసి రూపైనాఁ గా
కొంచక సతుల నెత్తుకొని వత్తురా
పొంచి శ్రీవేంకటేశ్వర పొరుగువా రిరుగువా-
రెంచ నీకు మంచముపైనిందరు సరేకా. ॥ ఏమని ॥ 142

మేఁచబౌళి

అమ్మలాల అక్కలాల అతివలాల
దిమ్మరి గదవే వీఁడు తిల్లగోవిందరాజు ॥ పల్లవి ॥

యీవలనావల సతులిరుమేల నుండఁగాను
చేవమీర నవ్వు నవ్వ సిగ్గువడఁడు
పూవుల నొకతె వేసీ పొం చొకతెతో మాటాడీ
దేవర గదవే వీఁడు తిల్లగోవిందరాజు ॥ అమ్మ ॥

పేరడిగా నందరును పెనఁగుచు నుండఁగాను
చేరి కొంగులు వట్టీని సిగ్గువడఁడు
మారుకొనొకతెఁ జూచీ మర్మము లొకతె నంటీ
తేరినవాఁడు గదవే తిల్లగోవిందరాజు ॥ అమ్మ ॥

యిట్టె పాదాలొత్తఁగాను ఇందిరను భూసతిని
చిట్టంటుఁ జేఁతలఁ గూడీ సిగ్గువడఁడు
గుట్టున శ్రీవేంకటాద్రిఁ గూడెనిందరు సతుల
దిట్టయైనవాఁడు గదే తిల్లగోవిందరాజు. ॥ అమ్మ ॥ 143

పాడి

ఎంత దడవైనాఁ గద్దా యేలాటాలు
వింతప్రియములు చెప్పి వియ్యమందరాదా ॥ పల్లవి ॥

ఆయములంటినప్పుడే అలుకేడదే పతి
చేయి చాఁచినప్పుడే సిగ్గులేడవే
పాయపు విభునినేల పంగించేవే యింకఁ
జాయల సన్నల మొక్కి చనవీయరాదా ॥ఎంత॥

కన్నుల నవ్వినప్పుడే కసరేడదే
చన్నులనొత్తినప్పుడే సటలేడవే
కన్నచోటఁ బతినేల కాకుసేసేవే
విన్నపములెల్లాఁ జేసి విడెమియ్యరాదా ॥ ఎంత ॥

కాఁగిలించుకొన్నప్పుడే కడమేడదే
చేఁగదేర మోవియ్యఁగ చింత యాడదే-
యేఁగఁడు శ్రీవేంకటేశు నేల లోఁచేవే
వేఁగక శాసలు వెట్టి వేడుకొనరాదా. ॥ ఎంత ॥ 144

రేకు-625 తోఁడి

విన్నవించేమని వచ్చి వెరగంది వున్నారము
యిన్నిటాను తెమలవు యేమనేమయ్యా ॥ పల్లవి ॥

సరసమాడఁగానే సరివొద్దువోయెను
తెరదీసేననఁగానే తెల్లవారెను
పరగనింతివలపు పండి కైవాలెను
యెరవు సేయవు నిన్ను నేమనేమయ్యా ॥ విన్న ॥

మనసు చూడఁగానే మాపటిపొద్దాయెను
చనవిచ్చే ననఁగానే జామెక్కెను
వనజాక్షియాసలు వడఁబడి ముదిరెను
యెనయవద్దా నిన్ను నేమనేమయ్యా ॥ విన్న ॥

పంతములాడఁగానే పదుమటజామాయ
మంతనమాడేకొద్దికి మద్దేనమాయ
చెంతల శ్రీవేంకటేశ చెలికి బాగ్యముచేరె
యింతగా మన్నించితివి యేమనేమయ్యా. ॥ విన్న ॥ 145

సావేరి

కల్లలాడకుమీమాట కద్దోలేదో
యెల్లవారిలో మాదిక్కు యేమి చూచేవయ్యా ॥ పల్లవి ॥

పలిగె గద్దంటానాపె సారె నిన్నుఁ దిట్టెఁగాక
    అలసి సొలసినా నే మంత సేసేమా
    నెలకొని నీమన్న నే నీకుఁ జైకొని వచ్చె
    యెలమిఁ దప్పక మమ్ము యేమి చూచేవయ్యా ॥ కల్ల ॥
బాసగొంటినంటా నాపె బలుములు చూపెఁగాక
    వేసరించినా నీతో వెగ్గళించేమా
    ఆసల నీతమక మే అంతటట్టుగాఁ జేసె
    యేసచూపులను మమ్మునేమి చూచేవయ్యా ॥ కల్ల ॥
పట్టపుదేవులనంటా భామ నిన్నుఁ గూడెఁగాక
    యెట్టు నీవు గూడినాను ఇదేలనేమా
    గుట్టున శ్రీవేంకటాద్రి గోవిందుఁడ మమ్మేలితి-
    విట్టె నవ్వుతా మమ్మునేమి చూచేవయ్యా. ॥ కల్ల ॥ 146

బౌళి

ఇప్పుడేఁక నడుగరే యేమనీని
    రెప్పలెత్తి చూడకుంటే రేపే మాపాయెను ॥ పల్లవి ॥
అప్పటినుండియు విభుఁడక్కడనే వుండఁగాను
    కప్పురము నోటికి కారమై తోఁచె
    చిప్పిలుఁ దనమాటలు చెవులుసోఁకకుండఁగా
    దప్పికిఁ గొన్నపన్నీరు తానే వుడుకాయను ॥ ఇప్ప ॥
నగుతా నాతోఁదాను నంటు చూపకుండఁగాను
    పొగరుఁ గస్తూరిపూఁత పోగులాయను
    పగటునఁ బాన్పుపైఁ దాఁ బవ్వళించకుండఁగాను
    జిగిఁ గట్టినచెంగావిచీరే వెట్టాయను ॥ ఇప్ప ॥
శ్రీవేంకటేశ్వరుఁడు చేతికి లోనుగాఁగా
    వేవేలు భోగములు వేడుకాయను
    యీవేళఁ దా నన్నుఁ గూడి ఇన్నిటా మన్నించఁగాను
    కావలసిన పనులు కడుమంచివాయను ॥ ఇప్ప ॥ 147

## సాళంగనాట

ఔనయ్యా మంచివాఁడ వౌదువయ్యా
పూని పట్టి వలపులు పులియఁ బెట్టుదురా ॥ పల్లవి ॥

సిగ్గువడ్డాపె నొయ్యనే చెక్కునొక్కుదురు గాక
బగ్గనను గిలిగించి పచ్చిసేతురా
వొగ్గి తలవంచుకుంటే నొడఁబరతురు గాక
బెగ్గిల లేఁతచన్నులు పిసుకుదురా ॥ ఔన ॥

ముసుఁగు వెట్టుకుంటే మొగము చూతురు గాక
అసురుసురై పెనఁగి అలయింతురా
అసు (స?) దై వుండిన కన్నెనాదరింతురు గాక
కిసుకాటపురతుల గిజిబిజి సేతురా ॥ ఔన ॥

దండనింతి గూచుండితే తమి రేఁతురు గాక
గండుమీరి మేనెల్లా రేకలు దీతురా
నిండార శ్రీవేంకటేశ నెలఁత నిన్నుఁ గూడెను
దుండగపుసరసాన దొమ్మిసేతురా ॥ ఔన ॥ 148

## శ్రీరాగం

దయదలఁచఁగరాదా తరుణిపై నీకనైన
ప్రియములు చెప్పేనంటాఁ బెనఁగుచునలసె ॥ పల్లవి ॥

వొగరులాడకుమంత వోపదుచెలి నీతో
నగవుల చేతనే మిన్నక యలసె
జగడాలడువకుమీ సంగతులు గావిఁక
మొగమోడి సారెసారె మొక్కి మొక్కి అలసె ॥ దయ ॥

పంతాలు చూపకుమంత పనిలేదు యాపెతోను
వింత నీబాసలు విని విని యలసె
చింతలు రేఁచకుమిఁక సేసినట్టెల్లాఁ జెల్లె
అంతరంగముగ నిచ్చలాడి యాడి యలసె ॥ దయ ॥

అలయించుకుమంత అరదేల ఇల్లాలితో
కలసి కాఁగిటిలో రతులనలసె
చెలిమి శ్రీవేంకటేశ ఇంతసేసి కూడితివి
అలరిన నీమన్నన లందియంది యలసె. ॥ దయ ॥ 149

ఆహిరి

మన్నించవయ్యా ఇఁక మానినికి నీవె దిక్కు-
పన్నిన వలపే నీకు పాయరానిచుట్టము ॥ పల్లవి ॥

చెంతఁ జెక్కునఁ బెట్టినచేతితోడ నుండఁగాను
దొంతరతామెర అయఁ దొయ్యలిమోము
మంతనానఁ జూచితేను మనసిజబాణమది
అంతరంగానఁ దగులకది యేల వుండును ॥ మన్నించ ॥

వొండొండఁ జన్నులు మోవనొత్తగిలి వుండఁగాను
అండ జంటబాణమాయ నతివమేను
వెండియు మరునికే విరులబంతులవి
దండితనాన నీమదిఁ దగులఁగవలదా ॥ మన్నించ ॥

విందుగాఁ దమ్మిలములు పీడుదోడులాడఁగాను
అంది చిగురుఁగత్తులాయఁ జెలిమోవి
చెంది మరుఁడు సేసిన చిగురుఁగానుకలవి
కందువ శ్రీవేంకటేశ కడుఁ బొందులు గావా. ॥ మన్ని ॥ 150

రేకు-626 కన్నడగౌళ

ఇయ్యకొనవద్దా నీవేమిటికైనా
పయ్యెదంటి యాతఁడు పనులు చెప్పఁగను ॥ పల్లవి ॥

పంతము సాదించకువే సారె సారెను
చెలువుఁడు వేఁడుకొని చెక్కు నొక్కీని
పెలుచవై యానలు పెట్టుదురటే
చెలరేఁగి యాతఁడు చేతులు చాఁచగను ॥ ఇయ్యా ॥

మంతులు నెరపకువే మాఁటిమాఁటికి
అంకెలనాతఁడు నిన్నునలమీని
సంకెలేక బొమ్మలను జంకింతురఁటే
వంకలొత్తి కొనగోర వలపు రేఁచఁగను ॥ ఇయ్యా ॥

పొదిగి పెనఁగకువే పొద్దు వొద్దుకు
యిదివో శ్రీవేంకటేశుఁడెనసె నేఁడు
సదరమనుచును కొసరుదురఁటే
పదిమారులును నీకు బాఁతిపడఁగాను. ॥ ఇయ్యా ॥ 151

## సాళంగనాట

ఇంత నేరమే నేము యిచ్చకములే సేతుము
చెంతలనే కిందుపరచితివే విభుని ॥ పల్లవి ॥

మొక్కలాన నదలించి మొనచూపులనుఁ జూచి
వెక్కసాన వంచుకొంటివే పతిని
చక్కనిగోరు మోఁపి చలములు సాదించి
గుక్కక యిన్నిటాఁ బనిగొంటివే విభుని ॥ ఇంత ॥

పొరలింపు మాటలాడి బొమ్మలను జంకించి
వెరసుగ సాదించితివే విభుని
తెరమరఁగుకుఁ దీసి దీకొని చన్నులనొత్తి
గురుసు మోవ లోఁజేసుకొంటివే విభుని ॥ ఇంత ॥

కలకల నవ్వు నవ్వి గక్కననుఁ గాఁగిలించి
కలసితివే శ్రీవేంకటవిభుని
అలపులెల్లాఁ దీరిచి అట్టె మర్మములంటి
కొలిపి మమ్మేలించి చేకొంటివే విభుని. ॥ ఇంత ॥ 152

## ఆహిరినాట

ఎప్పటివలెఁ గావు యేతులు
యిప్పుడింతటిలోనే యెవ్వతె నేరిపెనే ॥ పల్లవి ॥

గురువుతోనే చూపే గుట్లు
వరుసవంతుల తన వట్టిరట్లు
తెరమరఁగు పెదవితిట్లు
యిరవుగఁ దనకిది యెవ్వతె నేరిపెనే ॥ ఎప్ప ॥
పెనఁగేటి తన మేని బిగువులు
వనితలతోఁ జెప్పే చేవతగవులు
నసువుల సెలవుల నగవులు
యెనలేక తనకిది యెవ్వతె నేరిపెనే ॥ ఎప్ప ॥
పిక్కటిల్లుఁ గాగిటిలో బీరాలు
పక్కన సరసములోఁ బలుబేరాలు
యిక్కువై శ్రీవేంకటేశుఁడేలెను నన్ను
యెక్కుడుగ నేఁడు తనకెవ్వతె నేరిపెనే. ॥ ఎప్ప ॥ 153

ముఖారి

ఎందాఁకాఁ జేసేవు యెడలేని తరితీపు
కందువ మా విన్నపాలు గైకోనరాదా ॥ పల్లవి ॥
ననుపు నీసెలవికి నవ్వు లెన్నియైనా వచ్చు
అనువుగానూరకే మాటాడఁగరాదా
చెనకేవేళనే నీకు సిగ్గులెందుండైనా వచ్చు
వునికిగా నిట్టె నావొద్దఁ గూచుండరాదా ॥ ఎందాకా ॥
పలుమారు నీమతికి పరాకెంతైనా వచ్చు
చెలరేఁగి నీ యాతుమ చెప్పఁగరాదా
బలిమిఁ బెనఁగేవేళ పనులెందుండైనా వచ్చు
వెలయఁగ నా చేతివిడె మందుకోరాదా ॥ ఎందాఁకా ॥
అంకెలఁ గూడేయప్పుడే అలపెందుండైనా వచ్చు
సుంకుల నీ నేరుపెల్లఁ జూపఁగరాదా
లంకెల శ్రీవేంకటేశ లావు లెందుండైనా వచ్చు
పొంకపు నాగాఁగిటిలోఁ బొసఁగుండరాదా. ॥ఎందా॥ 154

వరాళి

నిరతినెఱుఁగుదుము నీ సుద్దులిన్నియును
తెరమఱఁగు దీసితే దేవరవు గావా ॥ పల్లవి ॥

పాసిక విద్యలవారి పక్షపాతివైన నీవు
శాసలెన్ని చేసినాను పాటిలేవు
ఆసపడి నిన్ను నమ్మినట్టి గొల్లెతదలెల్లా
దోసమెంచక పాసినతోంటినీవే కావా ॥ నిరతి ॥

గోమున రాజుకుఁ బుట్టి గొల్లవాఁడవైననీవు
నేమమెంత సేసినాను నిజమేది
ప్రేమతోడ మేనవాని పెండ్లికిఁ బోయి పడుచు
గామించి తెచ్చుకొనిన ఘనుఁడవే కావా ॥ నిరతి ॥

పెగటురాకాసుల వేఁటలాడినట్టినీవు
నగవెంత నవ్వినాను నమ్మరాదు
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నేలి వేవేలు
మగువలఁ దెచ్చుకొన్నమగఁడవే కావా. ॥ నిరతి ॥ 155

భైరవి

అలసితిమన్నిటాను ఆసలనే పొంది పొంది
నెలకొని యింతటా మన్నించవయ్యా మమ్మును ॥ పల్లవి ॥

సారె సారె మాటాడించి చౌక సేసేవు వలపు
ఆరీతి నవ్వుచు మరి అలయించేవు
పేరఁబెట్టి గుట్టుసేసి బేరమాడేవు వలపు
నెరుపరివౌదువు మన్నించవయ్యా మమ్మును ॥ అలసి ॥

సరసములాడించి చెప్పఁజేసేవు వలపు
వొరసి వొరసి కాఁక లోడిఁ బెట్టేవు
తొరలఁగ నవ్వించి దొడ్డిఁ బెట్టేవు వలపు
నెరపెతివి మేలు మన్నించవయ్యా మమ్మును ॥ అలసి ॥

గక్కనఁ గాఁగిట నించి కళరేఁచేవు వలపు
చెక్కుట రేకలు దీసి సిగ్గు వెంచేవు
యెక్కువ శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
నిక్కమాయ నీబాస మన్నించవయ్యా మమ్మును. ॥ అలసి ॥ 156

రేకు-627 భైరవి

చూడవయ్యా యెంతకెంత సోద్యము నేఁడు
వాడికె వలపు రేఁచి వడిఁబెట్టేదాననా ॥ పల్లవి ॥

పలుమారు నిన్నునింత పంగించేదాననా
తలఁగక సేవసేసేదానఁ గాక
చెలఁగి నీవే రట్టు సేసుకొనేవింతే కాక
చలపట్టి నిన్ను నేను సాదించేదాననా ॥ చూడ ॥

ఆసలోలిపి నిన్నింత అలయించేదాననా
తాసువలె లోనై వుండేదానఁ గాక
వాసి రేఁచుకొని నీవే వచ్చిటు దూరేవు గాక
వేసాలకు నీపై తప్పు వేసేటిదాననా ॥ చూడ ॥

కాఁగిట నిన్నుఁగూడి కాఁక రేఁచేదాననా
దాఁగక రతుల మెచ్చేదానఁ గాక
వీఁగక శ్రీవెంకటేశ వేడుక నన్నేలితివి
చేఁగగోరు నాఁటు నిన్నుఁ జేతసేసుదాననా. ॥ చూడ ॥ 157

నాదరామక్రియ

ఇన్నాళ్లు లేనిగుణ మేడనుండి వచ్చె నీకు
చెన్నుమీర వినేఁగాని చెప్పవయ్యా నాకును ॥ పల్లవి ॥

చెలరేఁగి చెలరేఁగి చేతులు చాఁచేవు నాపై
మలసి యిచ్చటనే సుమాళ మెత్తెనో
పిలువదాయనో నిన్ను ప్రియురాలు యీవేళ
బలుపాయపు మదము పట్టరాదో నీకు ॥ ఇన్నా ॥

సారెసారె నాతోనే సరసములాడేవు
మేరతో వీడెపుచొక్కు మేననుబ్బెనో
చేరనీక వనితలు చేతుల నిన్ను దొబ్బిరో
ఆరీతి రతులమీఁది ఆసోదమో ॥ ఇన్నా ॥

కమ్ముకొని నన్నునిట్టె కాఁగిలించి కూడేవు
రమ్మా నాపైవలపు శిరసు కెక్కెనో
ఇమ్ముల శ్రీవేంకటేశ యెవ్వతైన నిన్నంపెనో
నెమ్మది నాపై మన్నన నిజమో యిపుడు. ॥ ఇన్నా ॥ 158

## మాళవిగౌళ

ఇందులోనే నీపంతమేమి దప్పెను
చెంది వినయములెలాఁ జేయరాదా యిఁకను ॥ పల్లవి ॥

కప్పురగంది నిన్నుఁ గంటేనే తిట్టునని
అప్పుడే యీమాట నీతోనాడనా నేను
చెప్పరానిచేఁతలెల్లాఁ జేసినవాఁడవు నీవు
ముప్పిరి మంచిమాటాడి మొక్కరాదా యిఁకను ॥ ఇందు ॥

అంగన నీవు మాటలాడితేఁ గోపించునని
సంగతిగాఁ జూపి మోపి చాటగా నేను
అంగడిసతులనెల్లా నంటినవాఁడవు నీవు
చెంగక ప్రియములెల్లాఁ జెప్పరాదా ఇఁకను ॥ ఇందు ॥

నెలఁత నీవు గూడితేను నిన్నునిట్టె మెచ్చునని
వెలయనిప్పుడే విన్నవించనా నేను
చెలులు పదారువేల శ్రీవేంకటేశుఁడవు
కలసితివి నీకొంగు గప్పరాదా యిఁకను. ॥ ఇందు ॥ 159

## నాగగాంధారి

పైపైనే వున్నది బత్తి మీయిద్దరికిని
దాపగు భోగముల తనియఁగనోపవు ॥ పల్లవి ॥

సిగ్గులు వడకువే చెలువునివద్దనింక
అగ్గలము నీజవ్వన మాఁపఁగ లేవు
యెగ్గులు పట్టకువే యేమిటికైనానిట్టే
వెగ్గళపుఁదమకము విడువనోపవు ॥ పైపై ॥
వంతులు వట్టకువే వానికి నతనితోను
దొంతినున్న యాసోదాలు తోయఁగ లేవు
పంతములాడకువే పలుమారునప్పటిని
మంతనాన మొక్కక మానవోపవు ॥ పైపై ॥
చేతులఁ బెనఁగకువే శ్రీవేంకటేశ్వరుతోను
కాతరపు సరసము కాదనలేవు
యీతఁడిదె నినునేలె యింక మారాడకువే
యేతులనైనా నీవు యెడయఁగనోపవు. ॥ పైపై ॥ 160

సౌరాష్ట్రం

దానికేమి వేగిరమా తడవకువే
కానుకగా నన్నియునుఁ గానఁబడీనిఁకను ॥ పల్లవి ॥
వేసాలకొకమాట వేడుకతో వినేఁగాక
సేసీనా తానిట్టే చెప్పినట్టెల్లా
ఆస విడువఁగ లేక అండనున్నారము నేము
యీసటలు నిజములు నేరుపడీనిఁకను ॥ దాని ॥
యెమ్మెలకునేమో మాయింటికి విచ్చేసెఁ గాక
సమ్మతించీనా సరసములెల్లాను
కమ్మరఁ దనవేళలు గాచుకున్నారము నేము
తెమ్మలుగఁ దననేర్పు తేటపడీనిఁకను ॥ దాని ॥
కరుణించి తనుఁదానె కాఁగిలించి కూడెఁగాక
వొరుల మాటలు వినీనా వోపినట్టెల్లా
యిరవై శ్రీవేంకటేశు నెనశున్నారము నేము
సురతపు గురుతులు చూపట్టీ నిఁకను. ॥ దాని ॥ 161

## శుద్ధవసంతం

తలపోసి చూడరాదా తనివి మనసులో
పొలపవేడుకలెల్లాఁ బొదవౌనా నీకు ॥ పల్లవి ॥

యెందరు లేరు చుట్టాలు యెక్కడనైనా నీకు
విందులు గొల్లయిండ్ల వెన్నలెల్లాను
సందడింపు వలపులు చవిగావు నీకింత
పొందులు మాతోడివి పొసఁగీనా నీకు ॥ తల ॥

యింటింటివావులు యెన్నైనాఁ గలవు నీకు
తొంటి నీనెలవులే దొడ్డ (డ్డు?) లెల్లాను
పెంటపట్టునగవులు పిప్పిగట్టు సారె సారె
అంటి ముట్టి మాతో నవ్వులనువౌనా నీకు ॥ తల ॥

కొల్లపెండ్లికూఁతులే గోపికలెల్లా నీకు
చల్ల జాణతనాలే రేపల్లె యల్లాను
యెల్లగా శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె
పల్లుసోఁకు మాగురుతు బాగౌనా నీకు. ॥ తల ॥ 162

రేకు-628

## నీలాంబరి

ఎదుటనే నన్నుఁ జూచి యేల లోఁగేవు
కదిమి నిన్నెప్పుడైనాఁ గాకు సేసేనా ॥ పల్లవి ॥

చెలిమి సేసినయాపె చెట్టవట్టి తీసితేను
బలిమిఁ బెనఁగుదురా పలుమారును
నెలఁతనింతే నేను నీకేల పట్టివెరపు
చెలఁగి యెక్కడనైనాఁ జెప్పేనా నేను ॥ ఎదు ॥

చుట్టరికమైన యాపె సుద్దులు నీకుఁ జెప్పఁగా
నట్టు నిట్టుఁ బరాకులౌదురా నీవు
పట్టుపుసనితనింతే భావము దాఁచఁగనేల
అట్టు సేసేనా నిన్ను యిట్టె రచ్చలను ॥ ఎదు ॥

పొందులు సేసినయాపె పొదిగి నిన్నుఁ గూడఁగ
చెంది సిగ్గువడుదురా శ్రీవేంకటేశ
అంది నీకాఁగిటిదాన ననుమానమిఁక నేల
నిందలాడేనా నిన్ను నీసతులలోనను. ॥ ఎదు ॥ 163

కాంబోది

విన్నవించరే యీమాట విభునితోను
సన్నల చాయలఁ జూచే సతులే నవ్వరా ॥ పల్లవి ॥

కొంత గొంత మాటాడి కొమ్మ దలవంచుకొంటే
యెంత వేడుకొనీ నీతఁడిదె చూడరే
పంతగాఁడిన్నిటాఁ దాను పక్కనఁ గిందుపడీని
వంతుకు తనుఁగొలిచేవనితలే నవ్వరా ॥ విన్న ॥

భావించి చూచి పడఁతి పానుపుపైఁ బండితేను
యీవలఁ జేయెత్తి మొక్కీనిదె చూడరే
లావరి యిన్నిటాఁ దాను లలనకు లోఁగీని
సేవ సేయ వచ్చినట్టి చెలులే నవ్వరా ॥ విన్న ॥

తొయ్యలి చేత దొబ్బి దోమతెర వేసుకొంటే
కొయ్య శ్రీవేంకటేశుఁడు కూడెఁ జూడరే
చియ్యాన దేవుఁడు దాను సతులజారికిఁ జిక్కె
యియ్యెడఁ గొలువు సేసేయింతులే నవ్వరా. ॥ విన్న ॥ 164

రామక్రియ

వెరవుతో నింకాఁ జూచే విశేషాలు
పెరమరఁ గెటువలెఁ దీసేవయ్యా ॥ పల్లవి ॥

పలుసన్నలేమిటికి పనులేమి గలిగిన
తెలియనానతీరాదా తెలిసేను
నిలువు నూరు వండీ నీమేనిపచ్చిచేఁతలు
నలువంక నికనెట్టు నమ్మించేవయ్యా ॥ వెర ॥

వట్టిగుట్టులేమిటికి వలపింతగలిగిన
గట్టిగాఁ జూపవయ్యా కానిమ్మనేను
పుట్టెడు పోఁకకమ్మీ బొంకుల నీబాసలు
బట్టబయలెట్టు వొడఁబరచేవయ్యా ॥ వెర ॥
శిరసు వంచనేఁటికి సిగ్గులెంత కలిగినా
వొరసి కూడితివయ్యా వొడఁబడేను
కురిసేఁ దేనెలు మోవి కోరి శ్రీవేంకటేశుఁడ
తరవాతిరతినెట్టుఁ దనిపేవయ్యా. ॥ వెర ॥ 165

## ద్రావిళభైరవి

కంటినంటే పలుమారు గరిసించేవు
వొంటినున్నవారినంత వొరయఁగ వచ్చునా ॥పల్లవి॥
వొప్పుగా నెవ్వతెనో కూడుంటివని యంటేను
అప్పటి నీవేడనుంటి వనెడిగేవు
అప్పటిమాటలు వింటినంటేఁ జెప్పుమా యనేవు
చెప్పరానిసుద్దులవి చెప్పవచ్చునా ॥ కంటి ॥
నలిరేఁగి పకపక నవ్వితిరిగా యంటేను
అలరి యెట్టుదెలిసె ననెడిగేవు
చెలఁగి మీచేఁతలు చూచితినంటే నడిగేవు
సొలసి మర్మములవి చూపవచ్చునా ॥ కంటి ॥
శ్రీవేంకటేశుఁడ కలసితివిగా యనెంటేను
ఆవిధాన నన్నుఁగూడి అదెడిగేవు
చేవదేర రతులు మెచ్చితినంటేఁ గొసరేవు
ఆవేళ సుద్దులవి యీవేళ వచ్చునా. ॥ కంటి ॥ 166

## ఆమరసింధు

ఇంకనేఁటిమాటలు యీడేరెఁ బనులు
సంకేదేరి యాపెతోనే సరసాలాడేవు ॥ పల్లవి ॥

నిన్నుఁ బిలిచితేనొక్క నెలఁతఁ గైదండ వట్టె
వన్నెతోఁ జుట్టమవై వచ్చితివి పెట్టె
తిన్నఁగా మంచము వేసితే నందుమీఁద నాపెఁ
బెన్నిదిగాఁ గూచుండఁ బెట్టుకొంటివి ॥ ఇంక ॥
చేరి నీకు మొక్కితేను చెలియను సన్నచేసి
ఆరీతి నాపెచేత లెమ్మనిపించేవు
గారవాన నేఁ బువ్వులు గానుక నీకిచ్చితేను
పోరచిగా నాపువ్వులఁ బూజించే వాకెను ॥ ఇంక ॥
శ్రీవేంకటేశ నిన్నుఁ జేరి కాఁగిలించుకొంటే
ఆవేళ నాపెనుఁ గూడ నంటఁబట్టేవు
వేవేగ నీమోవితేనె వేడుకొంటే నీవాపె
తావితేనెలాని యీతల నాకిచ్చేవు ॥ ఇంక ॥ 167

శంకరాభరణం

మేలుమేలు మెచ్చితిమి మెలుఁతలము
పేలరివై యీపనికే పెరిగితివయ్యా ॥ పల్లవి ॥
ఆలరివనితలు యేమనినా నోరుతువు
తాలిమిగలవాఁడవు తగుదువయ్యా
మూలల చనుఁగొండలు మోవఁగ నోపుదువిట్టె
వాలనట్టి దిగ్గజము వంటివాఁడవయ్యా ॥ మేలు
అట్టె యంగనలు నీతో నలిగిన ములుగవు
చుట్టరికపువాఁడవు సుగుడవయ్యా
గట్టిగాఁ దురుముల మేఘములెల్ల నానుదువు
వొట్టి కొండవంటివాఁడ వోపుదువయ్యా ॥ మేలు ॥
తొయ్యలుల పాదాల తొక్కుడుకు నోరుతువు
యెయ్యెడ భారకుఁడవు యేలికెవయ్యా
వొయ్యనె శ్రీవేంకటేశ వొనఁగూడితివి నన్ను
నెయ్యపు చింతామణి వంటివాఁడవయ్యా ॥ మేలు ॥ 168

రేకు-629 కన్నడగౌళ

తరుణిమొగము చూచి దయ పుట్టె మాకెల్ల
నిరతాన నవ్వుకొంటా నీ వద్దనే వున్నది ॥ పల్లవి ॥

చక్క వొడచినదాఁకా జూజాలే యాడితివి
వెక్కసపు రతులకు వేళ యేది
అక్కటా చెలియనింత అటమాటింతురా నీవు
నిక్కమంటా నాసపడి నీవద్దనే వున్నది ॥ తరుణి ॥

కోడి గూసినందాఁకా సొగుడుఁగతే చెప్పితివి
వీడెమిప్పించుకొనను వేళ యేది-
పాడితోనే చెలినింత భ్రమయింతురా నీవు
నీడల నిన్ను నమ్మి నీవద్దనే వున్నది ॥ తరుణి ॥

బగ్గనఁ దెల్లనౌదాఁకాఁ బరాకులే సేసితివి
వెగ్గళించి చొక్కుదేర వేళ యేది
తగ్గి శ్రీవేంకటేశ కాంతను మఱపించితివి
నిగ్గుల కాఁగిటఁగూడి నీవద్దనే వున్నది. ॥ తరుణి ॥ 169

ఆహిరి

కోమలపువాఁడంటాఁ గొంకి యున్నదానఁ గాక
నేమాననేమి సేసినా నెంజెరివి దీరునా ॥ పల్లవి ॥

పలుమారు మాటలాడి పడఁతుల పలపించి
యెలయించే రమణుని నేమి సేసేది (దే?)
పిలిచి పానుపుమీఁదఁ బెనఁగఁగానే చన్నుల
నెలకొనఁ గుమ్మినాను నెంజెరివి దీరునా ॥ కోమ ॥

నగుతా దగ్గరఁ దీసి నాలిసేసి యేచెటి
యొగసక్కెపు విభుని నేమి సేసేదే
మొగము చూడఁగానే ముంగురులు చుట్టి పట్టి
నిగిడి గోర గీరినా నెంజరివి దరునా ॥ కోమ

మట్టు మీరి నన్నుఁ గూడి మరులుగొలిపినట్టి
యిట్టి శ్రీవేంకటేశ్వరు నేమి సేసేదే
గట్టిగా మోవియాని గంటిసేసి పలుమారు
నెట్టుకొని కొసరక నెంజెరివి దీరునా. ॥ కోమ ॥ 170

సామంతం

కడమ లున్నవా యింకఁ గైకొన్నదాన
యెడయని దొరవు నీయిచ్చ యింతేకాక ॥ పల్లవి ॥

వాసులెంచవలెనా వలచినదాన నేను
సేసినట్టెల్లా నీకుఁ జెల్లెఁగాక
వేసరఁగఁ దగునా నీవేలువట్టినట్టిదాన
రాసికెక్కినట్టి నీరపమాయఁ గాక ॥ కడ ॥

వోపననవలెనా వూడిగపుదాన నేను
చేపట్టినట్టెల్లా నీకె చెల్లెఁగాక
కోపగించఁ దగునా కొలువు సేసేటిదాన
దాపుగ నీవాడినపంతము దక్కెఁగాక ॥ కడ ॥

గోర గీరవలెనా కూడినట్టిదాన నేను
చీరకొంగంటినదెల్లాఁ జెల్లెఁగాక
ధీరుఁడ శ్రీవేంకటేశ తిట్టఁదగునా నీదాన
నేరిచిన నీనేరుపు నెరవేరెఁగాక. ॥ కడ ॥ 171

రీతిగౌళ

తానెంత నేనెంత తరవాతిపనులెంత
కానుక చేకొన్నదే కలిమెలాఁ గాదా ॥ పల్లవి ॥

చెప్పనేలే ప్రియములు సారెసారెఁ
గొప్పు దువ్వినదే నాకుఁ గోటి గాదా
కప్పుర మియ్యఁగనేలే కమ్మటిని దోసెఁడేసి
రెప్పలెత్తి చూచుటే మీరిననిధి గాదా ॥ తానెంత ॥

వీసమంతపవికిఁగా వెడ్డువెట్టి వేఁడనేలే
చేసన్న సేసినదే సేనగాదా
వేసరక యేడలేనివిరులు ముడువనేలే
సేసవెట్టినదే మేలు చేతికిచ్చుట గాదా ॥ తానెంత ॥

శ్రీ వేంకటేశుఁడు నన్నుఁ జెయివట్టి తియ్యనేలే
యీవల నాతో నవ్వులే యిన్నియుఁ గాదా
తావించి నామేన నిండా గందము వూయఁగనేలే
యీవేళ నన్నిట్టే కూడె నెక్కుడు గాదా. ॥ తానెంత ॥ 172

సింధురామక్రియ

చూతము యిదియు నొక్కసోద్యము నేఁడు
వాతులు మోచిన మనవావులేమి సేసీనో ॥ పల్లవి ॥

నీవు చేవట్టి తియ్యఁగా నేఁ గోపగించుకోఁగా
యీవల చెలులు నవ్వేరిది చూచి
కావరము నీకుఁ బట్టె కడుఁజలము నాకంటె
లావుకై యిద్దరివలపులేమి సేసీనో ॥ చూతము ॥

కప్పురము నీవియ్యఁగా కాఁకలు నేఁ జల్లఁగాను
తప్పక చిలుకలు సైతము నెంచీని
దప్పిదేరె నీమోవి తనువు నాకునలసె
యిప్పుడే మదను డింకనేమి సేసీనో ॥ చూతము ॥

చన్నులు నీ వంటఁగాను సమ్మతించి నే నుండఁగా
పన్నినపంచబాణాలు పంతమిచ్చీని
యిన్నిటా శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
యెన్నరానితమకము లిపి యేమి సేసీనో ॥ చూతము ॥ 173

తెలుఁగుఁ గాంబోది

చిప్పిలుఁదేనెలమోవిచెంచెత—కటు.
జెప్పరాదె నీచెలువు చెంచెత ॥ పల్లవి ॥

చెఱకువింటి బొమలచెంచెత—నిండెఁ
జిఱునవ్వు నీమోవిఁ జెంచెత
చెఱఁగు మూయకువే చెంచెత-నీ
చిఱుతతనాలు మాని చెంచెత ॥ చిప్పి ॥

చెక్కులెల్లా జీరలాయఁ జెంచెత
చిక్కుదీయవే నెరుల చెంచెత
చిక్కని చెమటగారే చెంచెత
చెక్కుకో మొగలిరేకు చెంచెత ॥ చిప్పి ॥

శ్రీవేంకటేశుఁడ నేఁ జెంచెత
చేవదేరఁ గూడితివి చెంచెతా
తేవురు బొట్టు నొసలి చెంచెతా
చేవల్లనుండుమా యిట్టె చెంచెతా. ॥ చిప్పి ॥ 174

## రేకు-630 హిందోళ వసంతం

ఎప్పుడుఁగల సాజమె యిన్నియు మాకు
కప్పి యిందుకుఁగానెంత కాచుకుందువయ్యా ॥ పల్లవి ॥

మబ్బులైన చూపులూ మంకుల రాజసములు
గబ్బి గబ్బి మాటలు కలవే మాకు
నిబ్బరపు దొరవూ నేరుపరివన్నిటాను
అబ్బురపడుతానేల ఆసపడేవయ్యా ॥ ఎప్పు ॥

గుట్టుతోడి సిగ్గులూ కొసరుల మేకులు
గట్టి గట్టిచన్నులూ కలవే మాకు
అట్టడివి మిగులాను ఆతిగుండె వాఁడవు
పట్టి పట్టి చూచి యేల భ్రమసేవయ్యా ॥ ఎప్పు ॥

బొమ్మల జంకెనలూ పొలుల మందెమేలాలు
కమ్మి కమ్మి సింగారాలు కలవేమాకు
దిమ్మరి శ్రీవేంకటేశ దిష్టమై మమ్మేలితివి
పమ్ముచ నింకానేమి బాఁతిపడేవయ్యా. ॥ ఎప్పు ॥ 175

### సాళంగనాట

మాపుదాఁకా నూరకే మామనసరసేవు గాక
కోపగించి నీకు బత్తి గొట్టానఁ బెట్టేమా ॥ పల్లవి ॥

పొందైన యాపె నీకు బుద్ధి చెప్పవలెఁగాక
మందలించి యితరులమాట వినేవా
సందడి నీగుణా లాపె చక్కఁ బెట్టవలెఁగాక
కందువ నీలోనివంకలు దిద్దేమా ॥ మాపు ॥

కూరిమియాపె నీకు కొనఁబెట్టవలెఁగాక
వూరివారెల్లా నీవొడిఁ గట్టేరా
మారుకొని యాపె నిన్ను మట్టుపెట్టవలెఁగాక
ఆరితేరఁ గాక నిన్ను నదలించేమా ॥ మాపు ॥

పచ్చి సేసి కూడి యాపె భ్రమయించవలెఁగాక
వచ్చిపోయిన వారికి వసమయ్యేవా
యిచ్చగించి శ్రీవేంకటేశ నన్ను నేలితివి
నిచ్చలు నీ రతులెల్లా నీకు నేరిపేమా. ॥ మాపు ॥ 176

### గంభీరనాట

అదియూఁ జూతము గాని అందుకేమాయ
యెదుటనే వుండేనని యిట్టె యాన వెట్టుమా ॥ పల్లవి ॥

ఆఁపలేక గొల్లెతల నందరినిఁ జెనకేవు
కాఁపురము సేసేవారిఁ గాకు సేతురా
తీపులనే యింత సేసితివి యిఁకనైన నిన్ను
యేఁపక యేలేనని యిట్టె యానవెట్టుమా ॥ అది ॥

గొరబుగా మగనాండ్లఁ గొప్పువట్టి తీసేవు
నెరుసు లేనివారిపై నిందవేతురా
వరవాత నెలయించి వలపించిన వాఁడవు
యిరవై యేలేనని యిట్టె యాన వెట్టుమా ॥ అది ॥

సేసవెట్టి కూడితివి శ్రీవేంకటేశ్వర మమ్ము
ఆసతోడివారి నిన్నాళ్లలయింతురా
రాసికెక్క బ్రమయించి రవ్వసేసినవాఁడవు
యీసేవ మఱవనని యిట్టెయాన వెట్టుమా. ॥ అది ॥ 177

## శంకరాభరణం

చెప్పుడు బుద్దులు చెవి సోఁకీనా
ముప్పిరితమకము మొలఁచినది ॥ పల్లవి ॥

సొలపుఁ జూపులను సుదతి చూడఁగా
తలఁపున నీకవి తగిలినవి
మలకలమాఁటలు మరియును నాడఁగ
యెలమి వలపు తలకెక్కినది ॥ చెప్పుడు ॥

నారీమణి చిరునవ్వులు నవ్వఁగ
ఆరీతి నీకవి అందినవి
సారెకు సరసము చవిగా నాడఁగ
పేరడియాసలు పేరినవి ॥ చెప్పుడు ॥

కొమ్మ నిన్నపుడు గుబ్బల నొత్తఁగ
నమ్మికలైయవి నాటినవి
యిమ్ముల శ్రీవేంకటేశ నన్నేలఁగ
నెమ్మదిరతులివి నిండినవి. ॥ చెప్పుడు ॥ 178

## కన్నడగౌళ

ఏమి పరాకై వున్నాఁడ వెందాఁకాను
కామిని నింతటనైనా గరుణించవయ్యా ॥ పల్లవి ॥

కొలుముందుగా నాపె గోర గిలిగించఁగాను
నాలి వెట్టుకొని యేల నవ్వేవయ్యా
మేలు మేలనుచు నిన్ను మెచ్చిమెచ్చి పాడఁగా
జాలిదీర నాపెమోము చక్కఁ జూడవయ్యా ॥ ఏమి ॥

గరిమె నాపె చేతికానుక నీకియ్యఁగాను
మురులేల కొలిపేవు మాటాడవయ్యా
సరసము చూపి నీతో జాణతనాలాడఁగాను
తరితీపులింకానా దగ్గరవయ్యా ॥ ఏమి ॥

పైకొని యట్టె కూడి పంతము నీకియ్యఁగాను
యీాకె దలఁచినవెల్లా నీడేర్చవయ్యా
శ్రీకాంతుఁడవు నీవు శ్రీవేంకటేశ్వర
చేకొలఁదివాఁడవై సేవ గొనవయ్యా. ॥ ఏమి ॥ 179

మధ్యమావతి

ఏల వొత్తడించేరే యిన్నియు నయ్యాఁగాక
పోలికలొక్కటే యెట్టు పొందు సేసేదే ॥ పల్లవి ॥

సిరులతో మేననెల్లాఁ జెమటలు నిండఁగాను
గరిమనెట్లాఁ దన్నుఁ గాఁగిలించేదే
నిరతమై అంతకంటె నివ్వెరగు ముంచఁగాను
అరుదుగానెట్టు విడెమంది యిచ్చేదే ॥ ఏల ॥

ముక్కున నూరుపులు ముంచుకొని చెలఁగఁగా
మొక్కలాన నెటువలె మోవి యిచ్చేదే
లక్కవలె మనసు యీలాగునఁ గరఁగఁగ
మక్కువతో నెటువలె మాటలాడేదే ॥ ఏల ॥

జడిగొని పులకలు జాజుకొని మొలవఁగా
చిడుముడి నెటువలె సేసవెట్టేదే
యెడయక శ్రీవేంకటేశుఁడిట్టె నన్ను నేలె
కడలేని యాసలెట్టు గాదెఁ బోసేదే. ॥ ఏల ॥ 180

రేకు-631 లలిత

చెప్పనేలే యింకాఁ దనచేఁతలు నాకు
కప్పురమిచ్చి నామతి కరఁగించవలెనా ॥ పల్లవి ॥

ముందరితనలాలన మోములోనే కానరాద
కిందుపడి యింత బుజ్జగించవలెనా
మందలించిన నిజము మాటలోనే కానరాదా
విందువలెఁ జెక్కునొక్కి వేఁడుకొనవలెనా ॥ చెప్ప ॥
నమ్మికలు తానిచ్చేవి నవ్వులోనే కానరాదా
పిమ్మటివారిపై నాన పెట్టవలెనా
పమ్మిన తనవలపు పానుపుపైఁ గానరాదా
చిమ్ముల మోవెల్ల గంటిసేయఁగ వలెనా ॥ చెప్ప ॥
బలుతమకము చేయివట్టినందే కానరాదా
సొలసి తనభావము చూపవలెనా
యెలమి శ్రీవేంకటేశుఁ డిన్నిటాను నన్ను నేలె
తెలివి నయగారాలతేనె వుయ్యవలెనా. ॥ చెప్ప ॥ 181

మంగళకౌశిక

చుట్టపువరుస నన్నిఁ జూచేము గాక
యెట్టైనానాయ నిన్ను నేమనేమయ్యా ॥ పల్లవి ॥
చెయ్యార నీసేసినట్టి చేఁతలైతేఁ జెప్పరావు
తియ్యని నీ మాటలైతే తేనె గారీని
కొయ్యతనపు విభుఁడ కొంగువట్టి తీసేవు
యియ్యెడ నీతో నిఁక నేమనేమయ్యా ॥ చుట్ట ॥
తక్కరి నీ గుణములు తలఁచ నలవిగావు
పక్కన నీనవ్వులైతే పాలు గారీని
వెక్కసపు రమణుఁడ వేడుకకాఁడవు నీవు
యెక్కుడు పంతగాఁడవు యేమనేమయ్యా ॥ చుట్ట ॥
చేవదేరె నీ కాఁగిటఁ జిత్తడి చెమట నిండె
కేవలమై మోవినే చక్కెర గారీని
శ్రీవేంకటేశుఁడవు చేరి నన్నుఁ గూడితివి
యీవిధపు నిన్నుఁజూచి యేమనేమయ్యా. ॥ చుట్ట ॥ 182

### దేసాళం

ఎఱఁగమా నీసుద్దులెప్పుడు నేము
నెఱవుగా మమ్ము మన్నించక మానేవా ॥వి పల్లవి॥
చెప్పరాని మాటలకు చెవియొగ్గేవాఁడవు
కప్పి మమ్ము సుద్దలడుగక మానేవా
చిప్పిల నెందుకునైనా చేయి చాఁచేవాఁడవు
అప్పటిమాతో సరసాలాడక మానేవా ॥ఎఱఁ॥
చూడరాని చోట్లెల్లఁ జూచేటి వాఁడవు
జాడతో మర్మాలు సోదించక మానేవా
చేడెలకందరికిని సేవలు సేసేవాఁడవు
యీడ మాకు నాకు మడిచియ్యక మానేవా ॥ఎఱఁ॥
నగరాని వారితోడ నవ్వేటివాఁడవు
మగుడ మమ్ముఁ గూడక మఱి మానేవా
యెగసక్కెపు శ్రీవేంకటేశ వూరఁజుట్టమవు
పొగిసి మమ్మేలితివి జోడుగాక మానేవా. ॥ఎఱఁ॥ 183

### నాగవరాళి

ఎంత కాతరీఁడ వేమని విన్నవించేరి
వంతుకుఁ జిరునవ్వుతో వడిఁదిట్టేఁ జెలియ ॥పల్లవి॥
పలకమాడేచోటికి సారెఁ జొచ్చివచ్చేవు
వెలఁదిఁ గస్సాన మరి వేళ లేదా
యెలమిఁ జీరఁగట్టగా నింటిలోనికి వచ్చేవు
మలసి మాటలాడ మరి వేళ లేదా ॥ఎంత॥
నెఱులచిక్కుఁ దియ్యఁగా నీ వాడకు వచ్చేవు
వెఱగయ్యీ నీకు మరి వేళ లేదా
పటి పరిమళమలఁదగా నండకు వచ్చేవు
మఱి పొందుసేయఁగ మంచివేళ లేదా ॥ఎంత॥

తోడ నద్దము చూడఁగాఁ దొక్కులాడ వచ్చేవు
వేడుకకు నీకునిట్టె మరి వేళ లేదా
కూడి శ్రీవేంకటేశుఁడ కొలువుండ వచ్చేవు
మాడుగులోనికిని కమ్మటి వేళ లేదా. ॥ ఎంత ॥ 184

బౌళిరామక్రియ

పొద్దువోనివాఁడవు బొమ్మల జంకించేవు
వుద్దండాలకెల్ల నీవే వోరుతువు గాక ॥ పల్లవి ॥

చనవు గల కాంతలు జడుతురా యెందుకైన
చెనకి పతిని రట్టుసేతురు గాక
పనిమాలిన తప్పులు పట్టుదురా యిందుకు
నసుపులు సేసుకొని నవ్వుదురు గాక ॥ పొద్దు ॥

వింతలేని మగువలు వెరతురా యేమైన
అంతరంగ నాయములు సోఁకింతురు గాక
పంతము లీపెతోనే యెంతురా నీవందుకు
యెంతసేసినాను మన్నింతురు గాక ॥ పొద్దు ॥

కూడినట్టి వనితలు కొంకుదురా యెప్పుడైన
వోడక కాఁగిటిలోనే వుందురు గాక
యీడుగా శ్రీవేంకటేశ యేలితివి నీ వందుకు
యేడనైనా యిట్లనే యీడేర్తురు గాక ॥ పొద్దు ॥ 185

నాట

ఇప్పుడు మాయింటికాడ నెమ్మెల్లా నాడేవు
అప్పుడు చూతమువో నీఆయితము లెల్లను ॥ పల్లవి ॥

గుఱుతులై నీమాటలు గుండెలలో నుండఁగాను
మఱతురా గొల్లెతలు మరియెంతైనా
మెఱసి రేపల్లె చొచ్చి తఱితో వెళ్ళఁగ రాదా
చెఱఁగు వట్టి నిన్నేమి సేసేరో చూతువు ॥ ఇప్పు ॥

తారుకాణై నీచేఁతలు తమమేనుల నుండఁగ
వూరకె చెలులు నిన్ను దూరకుందురా
మేరతో వారిముంగిళ్లు మెట్టియటు రారాదా
కోరి నిన్ను వారెంత కొసరేరో విందువు ॥ ఇప్పు ॥

తడఁబడి నీతమ్మ దవడల నుండఁగాను
విడుతురా కాంతలు నీవెంటనే రాక
యెడయక శ్రీవేంకటేశ నన్ను నేలితివి
తడవరాదా వారితలఁపులు మెత్తువు. ॥ ఇప్పు ॥ 186

రేకు-632 ధన్నాశి

ఏమనేమయ్యా నీవు యెఱఁగనిపని లేదు
కోమలి కొప్పంటేవు కొంకక నాయెదుట ॥ పల్లవి ॥

యెఱఁగమి సేసుకొని యెంతవున్నా నెఱఁగవు
వెఱవక మాటాడేవు వెలఁదితోను
వొఱిమ గలదాననై వోరిచినా నెఱఁగవు
మఱి సరసమాడేవు మఱసి నాయెదుట ॥ ఏమ ॥

అనఁజాలక కోపమణఁచినా నెఱఁగవు
పెనఁగేవా పెచన్నుల బెడిదముగా
వెనక మొకమోటాన పేఁడుకొన్నా నెఱఁగవు
చెనకేవు కొనగోరఁ జెలితో నాయెదుట ॥ ఏమ ॥

ప్రియపడి కాఁగిట బిగించినా నెఱఁగవు
క్రియతోడ నాపెపక్కె చూచేవు
నియతి శ్రీవేంకటేశ నేనలమేలుమంగను
నయఁ గూడితి వావెళ దక్కేవు నాయెదుట. ॥ ఏమ ॥ 187

దేసాక్షి

ఎన్నంటి మూర్తికి ఘనలు మానేయయ్యా
కోటులఁ గోడికళలెల్లా నీమేననే వున్నవి ॥ పల్లవి ॥

కాంతమేనఁ బూసినట్టి గంధపుఁ బూఁతలచొప్పు
యిం(లిం?)తలోనే మేన నిండి యిట్టె వున్నవి
చెంతలనాపె చెలఁగి సేసేవిడేలెల్లా
పొంతల నేఁడిప్పుడు నీపుక్కిటనే వున్నవి ॥ మాటి ॥

పొలఁతి ముడిచినట్టి పూవులవాసన చొప్పు(లు?)
మొలచినట్టు నీతురుమున నున్నవి
మలసి యాపె వెట్టిన మంచి మంచి సొమ్ములెల్లా
నెలకొని యిప్పుడు నీనిలువున నున్నవి ॥ మాటి ॥

పడఁతి మైఁ జల్లుకొన్న పన్నీటి చొప్పులెల్ల
తడిసి నీపచ్చడానఁ దతిఁ గొన్నవి
అడరి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
కడఁగి నిన్నుఁ గూడితి కలలెల్లా నున్నవి. ॥ మాటి ॥ 188

మలహరి

పొద్దువోని విభునికి బుద్దులు చెప్పరే మీరు
హొద్దికతోఁ దనునెట్టు వొడఁబరచేనే ॥ పల్లవి ॥

తటిఁ దనలోని మేలు తానె యెఱుఁగుఁ గాక
యెఱుకలదానివలె నెట్టుచెప్పేనే
కలికరిఁ బెట్టి నన్నుఁ గమ్మటిఁ జెప్పుమనీని
తలచైన మొఱఁగులు దైవమే యెఱుఁగునే ॥ పొద్దు ॥

యేల మొక్కి యడిగీని యింపు తానెరుఁగుఁగాక
వేలుపులదానివలె వినిపించేనా
చేలకొంగు వట్టి నన్ను చేఁతలెల్లనడిగీని
ఆలి మగనిసుద్దులు అతనుఁ డెరుఁగునే ॥ పొద్దు ॥

మొగమేమి చూచీని ముందు తానెరుఁగుఁగాక
సగినాలదానివలె సారెననేనా
అగపడి నన్నుఁ గూడె అలమేల్మంగను నేను
నగు శ్రీవేంకటేశుఁడు తానె యెఱుఁగునే. ॥ పొద్దు ॥ 189

### కొండమలహరి

నీ వేమి సేతువయ్యా నీవంకఁ గడమేది
వేవేలు సిరులెకా వేడుకలు సేసేవి ॥ పల్లవి ॥

తరుణిఁ గాఁగిటఁ గూడి దగదొట్టినవాఁడవు
యిరవుగా నెఱఁగవా యీపెగురుతు
ఎరవులవానివలె యిప్పుడు పేరడిగేవు
దొరతన మిదేకా యిందుల భ్రమయించేది ॥ నీవేమి ॥

చెలరేఁగి యీపెమీఁద సేసవెట్టినవాఁడవు
తెలియవా యేమైనా మతిలో గుణము
లలిఁ గొత్తవానివలెఁ దలఁచుకొనేవు నీవు
నిలువు గర్వమేకా నిన్నింత సేసేది ॥ నీవేమి ॥

వూని యలమేలుమంగ వురముతోడివాఁడవు
కానవా నీ వేమైనా చక్కఁదనములు
కానీలే శ్రీవేంకటేశ గరిసించేవప్పటిని
ఆనుకొన్నమనమేకా ఆయాలు సోఁకించేది. ॥ నీవేమి ॥ 190

### సాళంగం

అందరిముందరానేల ఆడించేవు
కందువ నీమేనిపులకలు సాటి గాదా ॥ పల్లవి ॥

చెప్పనా అప్పుడే నీచెవిలోన మాటలెల్లాఁ
దప్పక అట్టే నీవు తలఁచరాదా
ముప్పిరినప్పటి నామోమేమి చూచేవు
కుప్పళించే చెమటలే గురుతు గాదా ॥ అంద ॥

వొడఁబరచనా నీవొడి వట్టుకొని నాఁడె
తడఁబడక అవే తలఁచరాదా
నడుమ సెలవులను నవ్వులేమి నవ్వేవు
గుడిగొన్న కరఁగులే గురుతుగాదా ॥ అంద ॥

నేరుపనా రతిఁ గూడి నెలకొన్నకతలెల్ల
తారుకాణగానవి తలఁచరాదా
అరయ శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
కోరి మనచెనకులే గురుతు గాదా. ॥ అంద ॥ 191

## మనోహరి

చెలికత్తెలము నేము చెప్పఁగలవారమింతె
యెలమి నిన్నియును నీవియ్యకొనవయ్యా ॥ పల్లవి ॥
నీ తోడిమాటలకు నెలఁత వేడుకపడి
జాఁతిపడి వున్నదిట్టె పలుకవయ్యా
యేతరితనమునను యేల పరాకై వుండేవు
నాతో నవ్వినయట్టె నవ్వవయ్యా ॥ చెలి ॥
మొగము చూచేనంటా ముదిత గాచుకున్నది
యెగసక్కేలేల తల యెత్తవయ్యా
నిగిడి రాజసమున నిల్లే (ల?) చూపే (చే?) వు
వొగి నన్నొరసినట్టే వొరయవయ్యా ॥ చెలి ॥
అలమేల్మంగ నీ వురమందె నెలకొన్నది
కలసితివి ప్రియము గైకొనవయ్యా
వెలయ శ్రీవేంకటేశ వింతగాఁ దమకించేవు
యిల నన్ను నేలినట్టే యేలవయ్యా. ॥ చెలి ॥192

రేకు-633

## ముఖారి

అప్పుడే మెచ్చితిమి అన్నిటా నిన్ను
ఇప్పుడే నిన్నుఁ బొగడి యింత సేయవలెనా ॥ పల్లవి ॥
చెంది యెక్కడ చూచినాఁ జెప్పరాదు నీనిజము
కెందమ్మి నీ మోవిపైనే కానరాదా
ముందే యెఱుఁగుదురు ముంచి యసురసతులు
నిందించరాదు నిన్ను నే మెఱఁగవలెనా ॥ అప్ప ॥

ముంచి యొక్కడ చూచినా మోవరాదు నీకూరిమి
యెంచఁగ నీమోము చూచే యెఱఁగరాదా
కొంచక పాసి కూడిన గొల్లెతలే చెప్పేరు
నించి మానోరులు నిండా నేము చెప్పవలెనా ॥ అప్ప ॥

కూరిమెక్కడ చూచినాఁ గొసరరాదు రతిఁ
దేరిన నీకాఁగిటిలోఁ దెలియరాదా
కోరి యలమేల్మంగను గూడితి శ్రీవేంకటేశ
నేరిపేరు నీకందరు నేము నేర్పవలెనా. ॥ అప్ప ॥ 193

## నాట

కంటికంటి నీ గుణాలు కతలుగాను
వొంటి నొడ్డించుకొంటేను వొరయక మానేవా ॥ పల్లవి ॥

సిగ్గు వడఁగానే మరిఁ జెనకేవు సారె సారె
యెగ్గు పట్టితేఁ గనక యేమి సేతువో
దగ్గరనుండఁగానే తమకించేవప్పటిని
కగ్గి తెరవేసితేను కాతరించకుండేవా ॥ కంటి ॥

వొదిగి వూరకుండఁగా నొడి వట్టి తీసేవు
యెదురుమాటాడితేను యేమి సేతువో
పొదుగుక వుండఁగానే పొంచేవు చన్నుల
వుదుటున జంకించితే నొలిసి పైకొనే(న?)వా ॥ కంటి ॥

గక్కనఁ గాఁగిలించఁగాఁ గలసితి వింతలోనే
ఇక్కువ లంటితేనిఁక నేమి సేతువో
అక్కరై శ్రీవేంకటేశ అలమేల్మంగనే నేను
చిక్కితివి నే మొక్కితేఁ జెలరేఁగదా(వా?). ॥ కంటి ॥ 194

## సామంతం

ఇంక నేలే (ల?) నిన్నుదూర నింతటిమీఁద
అంకెల నా యిచ్చకమే అమరదు గానీ ॥ పల్లవి ॥

ముంచి నీతో నాడినట్టి ముచ్చటలెల్లా నాకెతో
కొంచక చెప్పితి పూసగుచ్చినట్టు
మంచివాఁడవే నీవు మతక మెరఁగనట్టి
నించిననావొల్లదే నేరమి గాని ॥ ఇంక ॥

చేతికి నే నిచ్చినట్టిచెంగలువబంతి నాకె-
నేతులకు వేసితివి యీడనుండే
నీతి నీ వెరుఁగుదువు నేనే యిచ్చకాలు నేసి
ఘాతల నలుగనిదే కల్ల నాకుఁ గాని ॥ ఇంక ॥

నిన్ను నేఁ గాఁగిలించఁగ నీకు నీకే ఆసఁ జూచి
కన్నులనే సన్న సేసి కదియించేవు
పన్నిన శ్రీవేంకటేశ పంతగాఁడవౌదు నీవు
నన్నుఁ గూడితివి నీతో నవ్వితిఁ గాని. ॥ ఇంక ॥ 195

సౌరాష్ట్రం

నీ వేమి గడించుకొన్నా నీ చిత్తమయ్యా
వేవేలకు మాచెరఁగు విడువవయ్యా ॥ పల్లవి ॥

సిగ్గువడి నేనుండితే చిన్నఁ బోయితి ననేవు
వెగ్గళించ నీ మాటకు వెలితుమయ్యా
అగ్గమై నిద్దిరించితే నలసితి నేననేవు
యెగ్గులుఁ దప్పులింతేసి యెఱఁగమయ్యా ॥ నీవే ॥

గుట్టున నే నూరకున్నఁ గోపగించితి ననేవు
వట్టి దూరులు మాకింత వలదయ్యా
కట్టఁగడ నిలుచుంటే కపటమే * నెననేవు
యెట్టును బోనీవు చలమేఁటికయ్యా ॥ నీవే ॥

నెచ్చెలుల నేఁ దిట్టితే నీ పైకిఁ దీసుకొనేవు
చెచ్చెర మమ్మింత ఱట్టు సేయకుమయ్యా
యిచ్చకుఁడ శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
ముచ్చటలన్నియుఁ దీరె మొక్కేమయ్యా. ॥ నీవే ॥ 196

* కపటమేమ అవి అనేవు

సాళంగనాట

మట్టుమీరఁ జాలక నే మానితిఁ గాక-నీకు
దిట్టతన మపుడు నేఁ దెచ్చి పెట్టవచ్చునా ॥ పల్లవి ॥

కన్నుల మొక్కఁగ నిన్నుఁ గాదనఁగ రాదుగాక
నిన్న నీవు రాకున్న దే నేరమిగాదా
అన్నిటా నేనందుకే అలిగితేఁ గనక నీ-
చిన్నఁబోయిన విధము చెప్పి చూపవచ్చునా ॥ మట్టు ॥

అట్టె నీ వానవెట్టఁగ నది దోయరాదు గాక
నెట్టన నీ మేనికాఁకే నేరమి గాదా
బెట్టుగా నీ వాడేవి పెంచితేఁ గనక నీ-
పట్టరానితమకము భావించవచ్చునా ॥ మట్టు ॥

వూరకే నీవు గూడఁగా నొద్దనఁగరాదు గాక
నీరచన లిన్నియును నేరమిగాదా
యేరా శ్రీవేంకటేశ యేకమైతేఁగాక నిన్ను
దూరి యాడితే మోము తొంగిచూడవచ్చునా. ॥ మట్టు ॥ 197

పడవంజరం

చుట్టమవై వున్నాఁడవు చూచినవారికిఁ జూడ
తొట్టుదీరిచేవు యింత దోసమేల యిఁకను ॥ పల్లవి ॥

చేరి నాపైఁ జేయి వేసి సెలవినే నవ్వు నవ్వి
మేరమీరినందుకే ఫో మెచ్చితిరా నిన్ను
వోరి నీ విందాఁక నెందో వుండి వచ్చి యిదినొక్క-
దూరు గట్టేవా వట్టి దోసమేల యిఁకను ॥ చుట్ట ॥

వల్లనిచూపులఁ జూచి సరసపుమాటలాడి
మెల్లనె వోడి వట్టేవు మెచ్చితిరా నిన్ను
తెల్లవారఁగా వచ్చి తెగి యానలు వెట్టేవు
తొల్లిటి బాసలే చాలు దోసమేల యిఁకను ॥ చుట్ట ॥

వెట్టి వలపులు చల్లి విరులచెండున వేసి
మెట్టేవు నాపాదము మెత్తిరా నిన్ను
గుట్టున శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
తొట్టి నిన్ను వెంగమాడేదోసమేల యిఁకను. ॥ చుట్టు ॥ 198

రేకు-634 మాళవిగౌళ

కంటిమి యిద్దరివంకఁ గలిగినమేలెల్లా
అంటే ననఁగరాదు అన్నిటాను జాణలు ॥ పల్లవి ॥

వలపులు ముదిరితే వసివాడులు
తలఁపులు వూచితేను తగుఁగాఁకలు
అలపులు గనమైతే నదలింపులు
కలవే యిందరికినిఁ గాంతలాల చూడరే ॥ కంటి ॥

కనుచూపు వాఁడైతే కాంతాళములు
ననుపు లోనఁగూడితే నయగారాలు
తనువులు సోఁకితేనే తమకములు
యెనయ నిందరికిని ఇతవులే చూడరే ॥ కంటి ॥

భావములు గరఁగితే పరవశాలు
కైవశములైతేను కడుమోహాలు
శ్రీవేంకటేశుఁడు గూడె చెలియ నలమేల్మంగను
తావుల నందరికిని తారుకాణ చూడరే. ॥ కంటి ॥ 199

కేదారగౌళ

ఇందరుఁ దెలిసినవే యీపనులు
కందువ నీపచ్చడము గప్పఁగరాదా ॥ పల్లవి ॥

పంతమాడవచ్చుఁ గాని పాసి వుండఁగరాదు
దొంతరమాట లెందాఁకాఁ దొరలించేవు
యింతి నిన్ను వేఁడుకోఁగా నేఁటికిఁక బిగిసేవు
పొంతఁ గూచుండఁ బెట్టుక పోదిసేయరాదా ॥ ఇంద ॥

జంకించవచ్చుఁగాని చలముతో నుండరాదు
పొంకపుగుట్టు లెందాఁకాఁ బోహళించేవు
లంకెనాపె వెనఁగఁగ లావులేల చూపేవు
సంకెదీర నాపెతోడ సరసమాడరాదా ॥ ఇందు ॥

గయ్యాళించ వచ్చుఁ గాని కలయక మానరాదు
చెయ్యాటాన నెందాఁకా సాముసేసేవు
ఇయ్యెడ నలమేల్మంగ యెనసె శ్రీవేంకటేశ
నెయ్యమును నాపెతోనే నెట్టుకొనరాదా. ॥ ఇంద ॥ 200

బౌళి

ఆడవే నేనన్నట్టె ఆతనితోడ
వేడుకకాఁడు దోసము విచారించీనటే ॥ పల్లవి ॥

వొక్కయింతికిఁ బుట్టి వొక్కతెకొడుకననే
తక్కరికి నిజములు తనకేడవే
ముక్కు గుట్టించుక తానే మురిసి సిగ్గువడఁడు
యిక్కడ మాతిట్లకు నెగ్గులేల పట్టీనే ॥ ఆడ ॥

పరకాంతలఁ బొంది బ్రహ్మచారి ననుకొన్న
యెరవుల సటకాని నేడ నమ్మేదే
నిరతిఁ జన్నిచ్చుదానినెత్తురు దాగినయట్టి
యెరపరి వీనితోడ నేఁటిచుట్టరికమే ॥ ఆడ ॥

చెల్లెలి నెత్తుకపోను సెలవిచ్చె మరఁదికి
కొల్లతాపికాఁడు వీనిగుణమేఁటిదే
ఇల్లిదె శ్రీవేంకటేశుఁ డింతలోనే నన్నుఁగూడె
వెల్లవిరులాయ నేఁడు విచారము నేఁటికే ॥ ఆడ ॥ 201

శంకరాభరణం

ఏమన్నా దనకే చెల్లునింతెకాక
వోముచు నాపై నేల వాలవేసీనే ॥ పల్లవి ॥

మనసు నొచ్చీనంటాను మాటలాడకుండఁగాను
తనుఁ గోపించితినంటాఁ దమకించీని
కనుఁగొన సళుపులు కాంతలకు సహజమే
మొనసి మాపై నేల మోపు గట్టీనే ॥ ఏమ ॥
తలఁపు దెలియలేక తలవంచుకుండఁగాను
చలము సాదించెనంటా జంకించీని
అలపులు సొలపులు నంగనలకుఁ గలవే
తొలుతనె మాకు నేల దూరు గట్టీనే ॥ ఏమ ॥
తానే వచ్చీనంటాఁ దఁగఁలోననుండఁగాను
నేనే పంతగత్తెనంటా నేర మెంచీని
ఆనవెట్టి శ్రీవేంకటాధిపతి నన్నుఁ గూడె
తేనె వోసి మము నేల తేలించీనే ॥ ఏము ॥ 202

## ముఖారి

అవులే యెంతలేదు నీ యాసోదము
చవులమీఁదాఁ జవులై తే సందడిగాదా ॥ పల్లవి ॥
చెంతనాపె మాటాడగా చేరి నేనాడననేవు
పంతాన సరుసఁ జార బండికండ్లా
బంతిని మోహముక్కటెపై నిలిచివుండఁగాను
దొంతివలపు నేఁ జల్ల దోసము గాదా ॥ అవు ॥
మంచమెక్కాపె వుండఁగా మరినేరాననేవు
పంచిపెట్ట నిది యేమి బంతికూళ్లా
యించుకంత చనవాకె కెక్కుడిచ్చి వుండఁగాను
చంచుల నేఁ జైకొనేది చప్పనేకాదా ॥ అవు ॥
పొత్తులనాపె వుండఁగా బువ్వానకు రమ్మనేవు
కొత్తలుగా నిది యేమి గొల్లదోమటా
యిత్తల శ్రీవేంకటేశ యిటు నన్నుఁగూడితివి
తత్తరించకుండ నేఁక దగవేకాదా ॥ అవు ॥ 203

కురంజి

వచ్చి వచ్చి చెనకేవు వద్దన్నా మానవు
యిచ్చకము నేరము నీకింతేసి వలెనా ॥ పల్లవి ॥

ఆదేవి గొణఁగులు అమ్మేవి సణఁగులు
యీడనే మాపొందు నీకు నితవయ్యీనా
వాడుఁజూపే చూతుమూ వలలఁ బెట్టుదుమూ
వోడక మాతోడిపోరుకోపేవా నీవు ॥ వచ్చి ॥

సెలవినే నవ్వులూ చేఁతలెల్ల రవ్వలూ
పలుమారు మాచేతఁ బడఁగలవా
చలము సాదింతుమూ చనవు మెరతుమూ
వొలసి యీరాఁపులకు నోడిఁ గట్టఁ గలవా ॥ వచ్చి ॥

కాఁగిటికి మెత్తుమూ కసరఁగఁ జొత్తుమూ
దాఁగక యీరతుల సందడికోపేవా
చేఁగదేరఁ గూడితివి శ్రీవేంకటేశుఁడ నన్ను
మాఁగిన మామోవితీపు మనసు వచ్చీనా. ॥ వచ్చి ॥ 204

రేకు-635 సామంతం

ఎన్నఁడు మఱవవచ్చు యీచేఁతలు
విన్న కన్నవారికెల్ల వింతలివి కావా ॥ పల్లవి ॥

వున్నతి నీవాపెవొద్దనుండి నాకే మోహించి
సన్న సేసి పిలుచుటే చాలదా నాకు
మన్నించి నీ వాకెతోడ మాటలాడుతా నాదిక్కు-
కన్నులఁ జూచినదే కానరాదా మేలు ॥ ఎన్న ॥

చయ్యన నాపె నీవు చదురంగమాడుతాను
పైయ్యెత్తు చెప్పుమంటివి బాపురా నన్ను
వుయ్యాలపై నాకె నీవు వుండి నన్ను రమ్మంటా
పయ్యెద వట్టి తీసితి పంతమిది గాదా ॥ ఎన్న ॥

చలివాయ నాపె నీవు సరసములాడుతాను
 సెలవి నాతో నవ్వితి చెల్లదా నీకు
 యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
 చెలిచేత మొక్కించితి చెప్పరాదు మోహము. ॥ ఎన్న ॥ 205

శుద్ధదేశి

ముక్కుననే వున్నది ముంగోపమైతేను
 యెక్కువ తక్కువలంటే నేమందువో ॥ పల్లవి ॥

వేడుకకు వెలలేదు వెన్నెలకు కొలలేదు
 ఆడేటి నీ మాఁటలకు నడ్డము లేదు
 వాడెనంటే నీ మోము వాదులకు వచ్చేవు
 యేడనుంటివంటే నీఁక నే మందువో ॥ ముక్కు ॥

నవ్వు సిగ్గరఁగదు వున్నతి రాయి గరఁగదు
 రవ్వల నీసేఁతలైతే రాఁపు మానదు
 యివ్వల నే విసరితే నీరసానఁ జూచేవు
 యెవ్వతెవాఁడంటే నీఁక నే మందువో ॥ ముక్కు ॥

చిత్తానకు గురియేది చీఁకటికి గెర యేది
 హత్తిన నీ మాయలకు నలవి యేది
 యిత్తల శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
 యెత్తి నిన్నుఁ బొగడితే నే మందువో ॥ ముక్కు ॥ 206

సామవరాళి

అంకె వచ్చినపుడన్ని నయ్యీఁగాక
 పొంకము గానియందుకు పోరు గొంత వలెనా ॥ పల్లవి ॥

మంచిమాటలాడితిఁబో మాపుదాఁకా నీగుణము
 చంచలము మాని వోజకు వచ్చినా
 కంచు గంచే పెంచు వెంచే కాలమెంత జరపినా
 పంచనుండి ఇందుకుఁగా బతిమాలవలెనా ॥ అంకె ॥

చేతులెత్తి మొక్కితిఁబో చిత్తములో నీప్రేమ
యీతల నే నెంతన్నా నీఁక వచ్చినా
యేతులేలా రాయి రాఁడే యెంతైనా గుల్ల గుల్లే
కాతరాన నిందుకుఁగా కాఁకఁ బొందవలెనా ॥ అంకె ॥

ఇట్టె నిన్నుఁ గూడితిఁబో యెరవుల నీకాఁగిలి
జట్టినెంతబిగించినా చవి పుట్టీనా
నెట్టన శ్రీవేంకటేశ నీవె నన్నుఁ గలసితి
వెట్టికి యిందుకుఁగా వేగిరించ వలెనా. ॥ అంకె ॥ 207

## ముఖారి

ఎప్పుడూ నీవోజ మానవేరా వోరి
చొప్పుగా నావలె నిన్నుఁ జూచుకోఁ గదవే ॥ పల్లవి ॥

అంగవించి నే నీతోనాడినట్టల్లా నీవు
యెంగిలిమాటలాడేవు యేరా వోరి
సంగతెరఁగ వదేమే సారెసారె నీనోట-
నెంగిలి గాకుండా మాట యెట్లనాడేవే ॥ ఎప్పు ॥

మొదలనే గుట్టుతోడ మొక్కులు మొక్కితే నీవు
యెదురు మొక్కులు మొక్కేవేరా వోరి
పదరి నేనే నీకు పంతమిచ్చి మొక్కితేను
యెదురు మొక్కు మొక్కక యెట్లనుండేవే ॥ ఎప్పు ॥

వంతుకు నందరివలె వద్ద నేఁ గూచుండితేను
యింతలోఁ గాఁగిలించేవు యేరా వోరి
బంతినే శ్రీవేంకటాద్రిపతి నే నండనుండఁగ-
నెంతైనాఁ గాఁగిలీక యెట్లనుండేవే. ॥ ఎప్పు ॥ 208

## శంకరాభరణం

మేరకు మేరై వుండుట మేలుగాదా
కారణములేని వట్టికలఁక లేలా ॥ పల్లవి ॥

పంతము దొలుతనాడి పలుమారు నందుకుఁగా
వంతువాసులెక్కించుక వాదు నీకేల
యింతలోఁ గన్నీరు నించి యెదురు మాటాడుతాను
చింతతోడఁ దలవంచేసిలుగు నాకేల ॥ మేర ॥

వెతెనొక్కతెఁ జూపి వలవనిబొంకు బొంకి
వెనక నానలు వెట్టవెద నీకేల
తనువునఁ గాక రేఁగి తలఁ బట్టు వెట్టుకొని
మనసు రాక యలిగేమంకులు నాకేల ॥ మేర ॥

యేకతాన నన్నుఁ గూడి యెవ్వతెఁ జెనక రాక
మైకొని వుండేటినేమము నీకేల
కైకొని శ్రీవేంకటేశ కలసితి నింతలోనే
రాక వుంటిననేటి నేరము నాకేల. ॥ మేర ॥ 209

రామక్రియ

* తనందు కల్లలేకున్న తానేల రాదుమానిని
మనకొలఁది వచ్చేసామాన్యుఁడా వీఁడు ॥ పల్లవి ॥

సరుస నే నన్న వెల్ల సరిరాఁగా నవ్వీఁగాక
కెరలి యింతక కోపగించఁడా వీఁడు
వొర దుయ్యక తొమ్మిది వూరకే కోపించేవాఁడు
వొరసి నాతిట్లకు వోరిచీనా వీఁడు ॥ తనందు ॥

కడుఁ దనచేఁత మీఁదు గాఁగానే వున్నాఁడు గాక
గడుసైన మాసటీఁడు గాఁడా వీఁడు
అదరి తననీడకే అలిగేటి యట్టివాఁడు
వెడఁగు నాఘాతలకు వెరచీనా వీఁడు ॥ తనందు ॥

యెవ్వతో అప్పణ దనకియ్యఁగా నున్నాఁడుగాక
ఇవ్వల లోనయ్యేవాఁడా ఇంతటవీఁడు
రవ్వగా శ్రీవేంకటాద్రిరాయఁ డిట్టె నన్నుఁగూడె
పవ్వళించి నను నింకఁ బాసీనా వీఁడు. ॥తనందు॥ 210

* ఈ పాటలోని భావము స్పష్టమగుట లేదు.

రేకు-636 లలిత

వట్టివేసాలీడనేల వద్దనరే యమ్మలాల
వొట్టి తానే పిలిచితేనోపనంటినా ॥ పల్లవి ॥

కన్నులఁ దప్పక చూచి కాయము నాపై వేసి
మున్నిటివలపులేల మోపు గట్టీనే
అన్నిటాఁ దన్నుఁ దెలిసి అలసి వుండినదాని
కన్నవారెదుటనేల కాకు సేసీనే ॥ వట్టి ॥

ఆనలు సారెకుఁ బెట్టి అట్టె నాపైనుస్సురని
వూని తనవెదలేల వొప్పగించీనే
పూని తనమాయలలో పుట్టిపెరిగినదాని
తేనెలమాటలనేల తేలించీనే ॥ వట్టి ॥

మంచముపైఁ గూచుండి మన్నన సాకే యిచ్చి
యెంచరాని తన నిజమేల చూపీనే
అంచల శ్రీవేంకటేశుఁ డాదరించి నన్నుఁ గూడె
ముంచి నాతోనిప్పుడేల ముచ్చటలాడీనే. ॥ వట్టి ॥ 211

శ్రీరాగం.

వద్దు వద్దు యిస్సీ నావలపెంత నేనెంత
వొద్దనుండి నే నిన్ను వుడికించేకొరకా ॥ పల్లవి ॥

కావించి నే నేఁడు నీకుఁగలిగిన ఫలమెల్ల
వేవేగనీతోసలిగి వెతఁ బెట్టేదా
చేవదేర నీపొందు చేసినదెల్లా నేను
రావు పోవనుచు నిన్ను రాయిడించే కొరకా ॥ వద్దు ॥

వున్నతి నే జవ్వనినై వున్నదెల్లా సారె నీకు
విన్నపాలు సేయించి వేసరించేదా
మన్ననఁ బొందినదెల్లా మరి నీయిచ్చరాజనై
వున్నవాని నావద్ద వుండుమనేకొరకా ॥ వద్దు ॥

వుమ్మగిలి కాఁకల నే వుండినఫల మిపుడే
అమ్మరో నీకాఁగిట నేనంటించేదా
నెమ్మది శ్రీవేంకటేశ నీవె నన్నుఁ గూడితివి
యిమ్ములఁ నాచేఁతలెల్లానింత సేసేకొరకా ॥ వద్దు ॥ 212

దేసాళం

వేగిర మింతలోనేల విసుగనేల
బాగులెల్లఁ జక్కనయ్యీ పంతమాడనీవే ॥ పల్లవి ॥

కిలకిల నవ్వుకొంటా కేఁగంటఁ జూచుకొంటా
వలపులు పైఁజల్ల వచ్చీ వాఁడే
యెలమి నిందాఁకాఁ దానెక్కడ నుండెనో కాని
తలఁపెల్లఁ గనుకొనే దగ్గరి రానీవే ॥ వేగి ॥

వారి వీరిఁ జూచుకొంటా వసివాడు వాడుకొంటా
నేరుపులు వీధి వీధి నించీ వాఁడే
ఈరీతి చాలోడనిఁక నేమని బొంకెనో కాని
తేరినన్ని పనులు తెల్లవారనీవే ॥ వేగి ॥

యెచ్చుకములాడుకొంటా నెఱఁగమి సేసుకొంటా
వెచ్చని మేను మీఁద వేసీ వాఁడే
యిచ్చట శ్రీవేంకటేశుఁ డింత సేసి నన్నుఁగూడె
ఇచ్చనలోకటొకటే పచరించనీవే. ॥ వేగి ॥ 213

ఆహిరి

వెనకటివలె నేను వెరతు వెరతునిఁక
ననవానివలెనుండి దాయఁ గూడీనా ॥ పల్లవి ॥

కలువపువ్వులబంతి కానుకలేలంపీనే
కలువలు మరునంపగము లోయమ్మా
తలఁచి తననిఁక గానే తాపమున నున్న నన్ను
వెలినుండి యిదికొంటె వెతలు రేఁచీనా ॥ వెనక ॥

యిట్టె యీవనములోనికేల రప్పించినోయమ్మ
కట్టిడి వసంతపుకాలమిది
యిట్టైన తనరాకకు యెదురు చూచే నన్ను
కట్టఁగడ తానుండి కాఁకలఁ బెట్టీనా ॥ వెనక ॥

చిలుకలతెర యేల చేరి కట్టించె నడుమఁ
జిలుకలు వాతరొట్లు(?) చిమ్మిరేఁచును
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలో విచ్చేసి కూడి
పలురతులనే యింక భ్రమలఁ బెట్టీనా ॥ వెనక ॥ 214

## మధ్యమావతి

ఎడమాటలాడకురే యింతులాల
అడియాలములు గల వాతని నాసంది ॥ పల్లవి ॥

మనసులొక్కటైతేను మారాడక వుండవలె
ఘనంతలేనికూటమి తమి రేఁచవలెనా
చనవు గల్గుచోట సాదించఁ బనిలేదు
పెనఁగఁబోతేఁ గడు బెండుపడు గుణము ॥ ఎడ ॥

వలపులే కలిగితే వాసి వంతు మానవలె
పొలసి మీరాతని శోదించవలెనా
అలుకలే తీరితేను ఆయము గరఁగవలె
బలిమి సేయఁగఁబోతే పచ్చిదోఁచు వయసు ॥ ఎడ ॥

చల్లుబడైతేను సేసిన చేఁత దక్కవలె
మలాడఁబోతేను మట్టు మీరుఁ బనులు
ఇల్లిదివో శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
చిల్లరచేఁతలకెల చెప్పరాదు ప్రియము ॥ ఎడ ॥ 215

## కేదారగౌళ

వన్నె చలము విన్నవారి కెంత (?)
కొద్దిమాలినట్టి నీ కోపమెంత ॥ పల్లవి ॥

చెక్కునొక్కి యాతఁడు నీ చెయి వట్టినది యెంత
తెక్కుల నీ వాతనిఁ దిట్టేదెంత
ఇక్కువలంటి యాతఁడు ఇచ్చకమాడేదెంత
వెక్కసాన నీవందుకు విసిగేదెంత ॥ వద్దె ॥

కొంగువట్టెతఁడు నిన్నుఁ గూరిమి గొసరు టెంత
బెంగవలెనే వొట్లు వెట్టెదెంత
సంగతినాతఁడు నీతో చనవు మెరసేదెంత
వెంగలితనాన నీవు వీడనాడేదెంత ॥ వద్దె ॥

కాఁగిలించెతఁడు నీకుఁ గప్పుర మిచ్చేదెంత
మాఁగుచు నీప(వ?)ట్టే యనుమానించేదెంత
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁడు నిన్నిట్టె కూడె
నాఁగువార నీ వప్పటి నవ్వేదెంత ॥ వద్దె ॥ 216

రేకు-637 లలిత

ఇంత నీవు సేసేది యెరఁగనైతి
వింత నీవు గావంటా విట్టువీఁగితిఁగా ॥ పల్లవి ॥

వేడుకతో మాయింటికి విచ్చేసేవంటానే
ఆడుకొంటి నిందరితో నాసలాసల
వీడెము నేనిచ్చేనంటా విందు నీకుఁ బెట్టేనంటా
యేడలేని సంబ్రమాన నెదురు చూచితిఁగా ॥ ఇంత ॥

పంతాన నీవు నన్ను భావించి చూచేవంటా
ఇంత సింగారించుకొంటి నిందరిలోన
మంతనమాడేనంటా మచ్చిక చూపేనంటా
సంతసాన నీకు నే జాగగాన నుంటిఁగా ॥ ఇంత ॥

బడలి వచ్చి నావొద్దఁ బవ్వళించేవంటాను
కడఁగి పానుపువేసి కాచుకుండితి
అడరి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
వుడివోక యిందాఁకా నొంటినే వుండితిఁగా. ॥ఇంత॥ 217

బిలహరి

ఎవ్వరము వద్దనున్నా నేమిసేసెలవు
జవ్వన మాపెవల్లనే చవులు వుట్టించెనా ॥ పల్లవి ॥

వంతులకు నాపె వచ్చి వద్దఁగూచుండినపుడు
అంతట నీ కోరికెల్లా నాయనా నేఁడు
పంతముననే ముట్టి పాదము లిందాఁకానొత్తె
యింతలో నీయనుమాన మిక్కడనే పాసెనా ॥ ఎవ్వ ॥

మనసిచ్చి యాపె నీతో మాటలెల్లా నాడఁగాను
చనవున నీలో ముచ్చట వాసెనా
చెనకి యాపె నిన్నుఁ జెయివట్టి తియ్యఁగాను
తనువుపై వలపుల దాహమెల్లానారెనా ॥ ఎవ్వ ॥

పలుమారు నీకు నాపె బాగాలందియ్యఁగాను
యెలమి నామోము చూడనితవాయనా
నిలిచి శ్రీవేంకటేశ నీవు నన్నే కూడితివి
తొలుత నీవు సేసిన దోసమెల్లాఁ బాసెనా ॥ ఎవ్వ ॥ 218

దేసాళం

రాయిడిఁ బెట్టక యింక రారే మీరు
చాయకు వచ్చినప్పుడు సమ్మతించీఁగాని ॥ పల్లవి ॥

చేయివట్టి తియ్యకురే చిత్తజుబాణాలచేత
ఆయాలు దాఁకినప్పుడే అట్టేవచ్చీని
నాయాలఁ బెట్టేవలపు నాకు నెందాఁకావచ్చీ
కాయముపైఁ గలిగతేఁ గలిగీఁగాని ॥ రాయి ॥

పొంచి యాన వెట్టకురే పొంతనాలు గూడితేను
మంచముపైఁ గూచుండి మరిగీఁగాని
ఇంచుకంత రేఁచేనవ్వు యెక్కడికెక్కఁగఁ బోయీ
అంచు మోచిన వేళల నలయ్యాఁగాని ॥ రాయి ॥

సారెకు మొక్కకురే సరసమే చవులైతే
కోరి వేఁడి తన్నుఁ దానే కూడీఁగాని
యీరీతి శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గలసె
నేరుపులు మీఁదమీఁద నెరపీఁ గాని. ॥ రాయి ॥ 219

## కన్నడగౌళ

అప్పుడు నీవేమనేవు అంతపను లైనమీఁద
రెప్పలెత్తి చూచితేను రేసు వోదు గదరా ॥ పల్లవి ॥

జవ్వనాన వాడలోని సతులు పిలుపకుంటే
యెవ్వతెనైనాఁ దిట్టేవేరా నీవు
అవ్వలనుఁ గోపకత్తె యైనది ఒకతె నిన్ను
దవ్వుల నేమిసేసినా దక్కిపోవు గదరా ॥ అప్పు ॥

సంగడిఁ గూచుండి నీతో సరసములాడరంటా
అంగనల పగచాటేవవురా నీవు
బంగపెట్టి వేరొకతె పగదీర సూడువట్టి
యెంగిలితమ్మ వేసితే నెట్టవునో కదరా ॥ అప్పు ॥

యేకతాన నీసుద్దు లెవ్వరు నెరఁగరంటా
కాకుసేసే వాడువారిఁ గానీరా వోరి
కైకొని శ్రీవేంకటేశ కలిసితివిట్టె నన్ను
లోకులెవ్వరు నవ్వీన(నా?)లోనౌదు గదరా. ॥ అప్పు ॥ 220

## కాంబోది

మెలుఁతలిందరుఁ గూడి మీరేల వచ్చితిరమ్మ
కలివోసినా నుట్టకడ మూడనేటే ॥ పల్లవి ॥

అండకు వచ్చినవేళ నపుడూరకుండి నన్ను
వుండుండి పిలువనంపె నూరకిదేలే
నిండిన యీ ప్రియములు నేరఁడాయనా అపుడు
చండిపెట్టి కూడఁబోతే చౌకే కాదా ॥ మెలు ॥

పైపై మాటలాడేవేళ పరాకు సేసుకవుండి
యీపొద్దు అసుద్దడిగీ ఇంకా నేలే
దాపగు యీ తలపులు దాఁచుకుండెనా అపుడు
మాపుతే రేపులైతే మనసులెనసునా ॥ మెలు ॥

ముచ్చటలాడేటివేళ మొకము వంచుక వుండి
యిచ్చట సరసమాడీ నిదివో యేలే
యిచ్చగించి శ్రీవేంకటేశుఁ డిదె నన్నుఁగూడె
వచ్చివచ్చి రాకున్న వాడిక లేదనరే ॥ మెలు ॥ 221

గుజ్జరి

చక్కనిదానవంటాను సారెఁ బొగడేవు నన్ను
యిక్కడివారి యెదుట నేమి శాఁతి నేను ॥ పల్లవి ॥

మంతానాన నాతోనే మాటలు నీవాడఁగానే
యెంతనెగులుండునో నీయింతులకెల్లా
యింతేసి మమ్ము మన్నించి యేల దూరు గట్టేవు
కొంతైనా నే వారి కాలిగోరఁ బోలుదునా ॥ చక్క ॥

ననుపున నీవే నాతో నవ్వులెల్ల నవ్వఁగాను
వొనర నీ సతులెంత వుస్సురందురో
చనవిచ్చిందరిలోన సడి సాకేల కట్టేవు
పెనచి నే వారికెల్లఁ బిన్నదానఁ గానా ॥ చక్క ॥

గక్కన నన్నిటు గూడి గడె పెట్టుకుండఁగాను
అక్కడి నీ సతు లేమనాడుకొందురో
యిక్కడ శ్రీవేంకటేశ యెక్కుడు సేసితి నన్ను
మిక్కిలి వారికి నే మేరమీరేదాననా. ॥ చక్క ॥ 222

రేకు-638 ధన్నాశి

నాకు నాకే పొగడుకొననుఁ బాడి గాదు గాక
మేకులకిందరిలోన మెప్పించుకో నేరనా ॥ పల్లవి ॥

తీపుల నీమాటలకు తేలితేఁ దేలుదుఁగాక
యేపున జాణతనాన నెక్కుడు గానా
పైపై నీకు మోహించి పరవశమౌదుఁ గాక
కోపగించి నిన్ను నొక్కకొలికికిఁ దెత్తు(దేనిత్తు?)నా ॥ నాకు ॥

వలచి నీయెడకే నే వాసి వంతులెంచఁగాక
చలివాయ నిన్నుఁ గడు సాదించలేనా
కలసి వుండి నీకొక్కనికే వెరతుఁ గాక
తెలిసి నీ దిక్కొకతెఁ దేరిచూడనిత్తునా ॥ నాకు ॥

మనసు నీపైఁ బెట్టి మారాడజాలఁ గాక
పనివడి నిన్ను నిట్టె భ్రమయించనా
ఘనుఁడ శ్రీవేంకటేశ కాఁగిటఁ బాయవు గాక
వెనకటివలె నె తే వెల్లవిరి సేయనా. ॥ నాకు ॥ 223॥

శుద్ధవసంతం

ఏమి సేసితివో నీవే యెరుఁగుదువు
ఆమాటే యింకొకమాటు అడుగఁగ రాదా ॥ పల్లవి ॥

మొగము దప్పక చూచి మోనమునఁ దలవంచె
నగదాయ నేమోకాని నాథుఁడ నిన్ను
తెగ [1] దెంతైనా మాట తెలియరాదెవ్వరికి
జగడముఁ గానరాదు సమ్మతించలేదు ॥ ఏమి ॥

కదిసి వద్దఁ గూచుండి కాంత యె(య?)వ్వలిమోమై
యదన వి డె మీదాయ నదేమోకానీ
వెదకినఁ గానరాదు వేవేగ నీ గుట్టు
చెదరినచి త మో సిగ్గో తెలియదు ॥ ఏమి ॥

నీ మీఁదఁ జెయి వేసి చలఁత గొబ్బునఁ దీసె
యేమి దలఁచెనో కాని ఇంతటిలోన
కామించి శ్రీవేంకటేశ కలసితి వటునీవు
యీమగువ, నీ వలపులెట్టుండెనో కానీ ॥ ఏమి ॥ 224

1. 'తై' అనుదానిలో, రేకులో సంప్రదాయ సిద్ధమైన '-' కావొత్తు లేదు.

## సౌరాష్ట్రం

ఇట్టె విచ్చేసీనతఁడేలే యింత
వొట్టి వూరకున్న వారి నుడికించ నేఁటికే ॥ పల్లవి ॥

కప్పుర మంపెఁగదే కాంతుఁడు తా రాని-
కప్పురము వేఁడిచల్లీఁ గదవే నాకు
దప్పికిఁ బన్నీరంపెఁ దమితో నీకు
నిప్పులను బొరలించి నీరు చల్ల నేఁటికే ॥ ఇట్టె ॥

గంద మంపెఁగదె నీకు ఘనుఁడు తా రాని-
గందమా అది పెద్దగండము గాక
ముందరనే పువ్వులంపె ముడుచుకోవే
విందుగాఁ గాఁకలు చల్లి విసరఁగ నేఁటికే ॥ ఇట్టె ॥

వుంగర మంపెఁగదవే వువిద, తా రాకున్న
వుంగరమా అది నాకు వుంకువగాక
కంగి కూడె శ్రీవేంకటఘనుఁడు కడపలోన
నింగు(?)నెండలోనఁ బెట్టి నీడకుఁ దియ్యనేలే ॥ ఇట్టె ॥ 225

## సామంతం

ఎప్పుడు మానవు కోపమేమే నీవు
రెప్పలెత్తి చూచితేనే రేసు వుట్టీనా ॥ పల్లవి ॥

పుప్పొడి నీమీఁదఁ జల్లె పూవులచెండున వేసె
అప్పటి నాతఁడలిగెననే వదేమే
కప్పిన యీ వేట్లకు కళిదాఁకె నింతెకాక
చిప్పిలు నీమననేమి చిల్లులాయనా ॥ ఎప్పు ॥

పాదము నీపైఁ జాఁచె పట్టెమంచముపైఁ బండె
ఆదరించఁడాయ ననేవదేమే నీవు
సోదించి మేనంటఁగాను సొమ్ములొత్తె నింతెకాక
పాటుగా నీకాతఁడేమి పగ సేసెనా ॥ ఎప్పు ॥

గక్కన నీచెక్కు నొక్కి కాఁగిటను బిగియించె
అక్కర దీరదనేవు అదేమే నీవు
యెక్కువతో శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నుఁ గూడె
తక్కక నీ కింకా నేమి తనివారదా ॥ ఎప్పు ॥ 226

## సామంతం

తానెంత నేనెంత తమకించీ నింతె కాక
పూని తనచేఁతలకే పులకించీ మేను ॥ పల్లవి ॥

తప్పక చూచె(చీ?) వాఁడే తానె యిందు వచ్చె(చ్చీ!) వీఁడే
కొప్పు దువ్వె(వ్వీ?) నిదె వీఁడే కొలువులోన
యెప్పుడు నావంటివారు యెందరు లేరు తనకు
కప్పిన యీమన్ననకే కరఁగీ నామనసు ॥ తానంత ॥

సరిమాటలాడీ వాఁడే సారెఁ జెనకీ వీఁడే
మురిపెపు చన్నులు చేముట్టీ వాఁడే
నిరతి జాణ తానైతే నేనేమి జాఁతి తనకు
యిరవై యిందుకే తలకెక్కీ నావలపు ॥ తానెంత ॥

వెంట వెంట వచ్చీ వాఁడే వేసాలు సేసీ వాఁడే
నంటు మంచానకుఁ దీసి నవ్వీ వీఁడే
వొంటినే శ్రీవేంకటాద్రినుండి వచ్చి నూఁడుకూర
అంటీ కేశవరాయఁడై అరుదైతి నేను ॥ తానెంత ॥ 227

## రామక్రియ

ఏమి వచ్చిపోయ నీకు నింతలోనను
చేముట్టి కూచుండుమని చెక్కు నొక్కరాదా ॥ పల్లవి ॥

గద్దెపీఁటమీఁదనుండి గక్కన లేచి నిలిచె
నిద్దురకన్నులఁ చెలి నీవు రాఁగాను
అద్దో నీపాదాలు గుద్ది అలసి వచ్చెనిందాఁకా
అద్దలించి వుండుమని ఆనవెట్టరాదా ॥ ఏమి ॥

చెలిమిఁద నొరగుండి చేయి దీసుక నిలిచె
నెలఁత వెరపుతోడ నీవు చూడఁగా
కొలువు సేసి సేసి గోడమరఁగుకు వచ్చె
బలిమిఁ బట్టుక పోయి పవ్వళించరాదా ॥ఏమి॥

తూఁగుమంచ మూఁగి యూఁగి దుమికి కయిలాఁగిచ్చె
చేఁగదేర నీవాపెకుఁ జేయి చాఁచఁగా
మాఁగిన మోవి యిచ్చి మగువనిట్టే కూడితి
వీఁగక శ్రీవేంకటేశ వీడెమియ్యరాదా. ॥ఏమి॥ 228

రేకు-639 సామంతం

ఏమి మొగసిరిమందో యెంతనేరుపరో కాని
నామనసు గరఁగించి నవ్వించెనే ॥పల్లవి॥

యెదుటఁ దనకు నా కు నేఁటిపొందులంటానుంటే
పదకము మెడఁ బెట్టి భ్రమయించెనే
మొదలఁ దనకు నే మొక్కనోపనంటానుంటే
పదరి పాదము నాపైఁ జాఁచెనే ॥ఏమి॥

వోపనంటా నోరుమూసుక వూరకే వుండేదాని
పాపట దువ్వి దువ్వి పలికించెనే
రాపుగ నితనితో వెరతునంటా నేనుంటే
మూపున గడ్డము మోపి మొనగోర నూఁదెనే ॥ఏమి॥

నమ్మని తనమాటలు నాలి కాఁడంటా వుంటే
సొమ్ములెల్లా మెడఁ బెట్టి చొక్కించెనే
వుమ్మడి శ్రీవేంకటాద్రినుండి వచ్చి షూఁడుకూరఁ
గమ్మర చెన్నరాయఁడై కాఁగిలించెనే. ॥ఏమి॥ 229

శంకరాభరణం

ఇతవెరఁగవద్దా యిస్సీ నీవు
ఇతిజాణవిన్నిటాను అది నీవెరఁగవా ॥పల్లవి॥

చిమ్మేటి చూపులతోడ చెంగావి మోవితోడ
కొమ్మ నీతో మాటలాడి కొసరీనదే
కుమ్మరింపువలపుతో గుబ్బల మెరుఁగు చూపి
అమ్మె నీకు దేహమెల్లానది చాలదా ॥ ఇత ॥

సారెఁ బన్నసరాలతో చల్లేటి నిట్టూర్పుతోడ
వూరకే నీమాటలెల్లా నూఁకొనీ నదే
ఖారపుతురుముతోడ పయ్యాదజారుతోడ
ఆరని చెమటలూఁది(దె?)నదె చాలదా ॥ ఇత ॥

నామఁ బులకలతోడ నాటినచిత్తముతోడ
వేమారు నీ మీఁద మేను వేసీనిదె
బూమెల శ్రీవేంకటేశ పొలఁతిఁగూడితివి సెట్టె
ఆమగువ నిన్ను మెచ్చెనది చాలదా. ॥ ఇత ॥ 280

రామక్రియ

నిక్కము బొంకులు రెండూ నీవేకావ(వా?)
నిక్క చూచేవప్పటిని నీవే కావా ॥ పల్లవి ॥

నారుకొని యాతఁడు నాతో మాటలాడకుండ
నేరిపితి బుద్ధులు నీవే కావ
దూరితేను నీవాతనిఁ దోడుక పొమ్మనేవు
నీరువంకతుంగవైతి నీవే కావా ॥ నిక్క ॥

కమ్మి యాతనివద్దను కాచుకుండి యరచేతి
నిమ్మపండవైతివి నీవే కావ
వుమ్మడి వాదడిచితే వూరకే మొకమోడి
నెమ్మిచాయకు వచ్చేవు నీవే కావా ॥ నిక్క ॥

కావించి యాతఁడు నేను కాఁగిలించుకుండఁగాను
నీవద్దికి బిలిచేవు నీవే కావ
శ్రీవేంకటేశ్వరుఁడు చేరి యిద్దరిఁ గూడఁగ
నీవే నేననేదానవు నీవే కావా ॥ నిక్క ॥ 281

### శంకరాభరణం

చెల్లుఁ జెల్లు నీచేఁత చెన్నకేశవా
చిల్లరసుద్దులింకేల చెన్నకేశవా ॥ పల్లవి ॥

రమ్మనుచుఁ బిలిచేవు రాజసాన వీఁగేవు
చిమ్ముఁ దెమటలఁ జెక్కులచెన్నకేశవా
కమ్మరఁ గమ్మర నీవు కన్నులనే సొలయఁగ
చిమ్మిరేఁగె మేనెల్లా చెన్నకేశవా ॥ చెల్లు ॥

మొగము చూచి నీవు మొక్కవచ్చి లోఁగేవు
చిగురుఁ బెదవి వాడె చెన్నకేశవా
అగపడి నీవు నాపై నానలెల్లాఁ బెట్టఁగాను
జిగిమించె నివ్వెరగు చెన్నకేశవా ॥ చెల్లు ॥

దగ్గరితివిదె నన్ను తప్పక చూచితేను
సిగ్గుదేరె నీమోమున చెన్నకేశవా
వొగ్గుచు శ్రీవేంకటాద్రినుండి వచ్చి మాఁడుకూర
సెగ్గెముదేరఁ గూడితి చెన్నకేశవా ॥ చెల్లు ॥ 232

### సామంతం

ఇంకాలేదని బొంకే వేలరా నాతో
సుంకుల సోరణగండ్లఁ జూడనా నేను ॥ పల్లవి ॥

వొయ్యారి బాగుననుండి వోరగంట నిన్నుఁ జూచి
తొయ్యలి నవ్వు నవ్వె తొలుతే కాదా
పయ్యెద [1] ముంజేతఁ బట్టి పడఁతిపై నొరఁగుక
అయ్యెడ నెందుంటివని అడుగదా నిన్నును ॥ ఇంకా ॥

బంగారు పాములు మెట్టి పాదముపైఁ బాదమూఁది
అంగన నీతో సొలసెనప్పుడే కాదా
ముంగురులు కొనగోళ్ళ ముట్టి ముట్టి చెరుగుతా
వుంగరము నీకిచ్చె నుంకువ గాదా ॥ ఇంకా ॥

---

1 రేకులో 'ముఁజేత'

వొడివట్టి నిన్నుఁ దీసి వుయ్యాల చేరులు వట్టి
పడఁతి నిన్నానవెట్టి పైకొనేఁగాదా
జడిసె శ్రీవేంకటేశ పారితెంచి మాఁడుకూర
తడవి యింత సేసితి దక్కెఁగా నీపనులు. ॥ ఇంకా ॥ 233

## పాడి

ఈ మాఁటకేమి నాకిందరిలో వెరగయ్యీ
నావూట వినకున్న నాకు సిగ్గుగాదా ॥ పల్లవి ॥
మన్నించి చేపట్టఁగా నే మాటలాడేఁ గాని నీతో
నన్నతోనే మెలఁగితే చక్కనుండనా
వున్నతి యెక్కువ సేసి వూరివారి వలెనే
నన్ను సరిగాఁ జూచితే నాకు సిగ్గుగాదా ॥ ఈమా ॥
కమ్మటి నీవు నవ్వఁగఁ గదియ వచ్చితిఁ గాని
యెమ్మెల నీ వూరకున్న నింటనుండనా
సమ్మతించఁ జేసి నాకె సారెఁ గపటమైతే
నమ్మవని నిన్ను నాడ నాకు సిగ్గుగాదా ॥ ఈమా ॥
కలయ వేఁడుకోఁగానే కానిమ్మంటిఁ గాని నీతో
చలమున నూరకున్న సమ్మతించేనా
మెలఁగి శ్రీవేంకటేశ మించ నన్నుఁ గూడితివి
నలినింతసేకున్న నాకు సిగ్గుగాదా. ॥ ఈమా ॥ 234

రేకు-640

## శ్రీరాగం

కన్నదాఁక విన్నదాఁక కడమే కాదా
నన్నువంటిదానితోడ నాఁటకము వలెనా ॥ పల్లవి ॥
ఇంత నాపై బత్తియైతే యెదమాట లికనేల
పంతుకు మాయింటికే తా నచ్చేఁగాక
వింతవారు తాఁ గాకున్న వేరె యెగ్గుఁదప్పనేల
చెంత నేఁ జేసిన సేవల్లఁ జేయించుకొనుఁగాక ॥ కన్న ॥

తగవరిఁ దానైతే తానె నామగఁడైతే
తెగక నడుమఁ గొంత తెర యేల
జగడమే తీరితేను చనవే నాకిచ్చితేను
అగడు సేయక ముచ్చటాడుఁగాక ॥ కన్న ॥

తానే జాణఁడైతే నాతలఁపు దెలుసుఁగాక
పూని తనఇచ్చలనే పొరలనేల
కానిమ్మని శ్రీవేంకటఘనుఁ డిట్టె నన్నుఁగూడె
మానక నన్నిందరిలో మన్నించుట గాక. ॥ కన్న ॥ 235

వరాళి

ఎఱఁగక కొసరితి నెడ్డనయ్యా
తఱవాత నన్నియును తానే వచ్చీనయ్యా ॥ పల్లవి ॥

తనివి చాలక నిన్నుఁ దగులనాడితిఁ గాక
మనసురానిపనేల మానవయ్యా
చనవు గలిగి నిన్ను సాదించ వచ్చితిఁ గాక
యెనయనిపొందులింకా నేఁటికయ్యా ॥ ఎఱఁగ ॥

నీవే నేనంటాను నేరములెంచితిఁ గాక
వావాత దూరేపనైతే వద్దయ్యా
చేవదేరెఁ బనులంటా చెక్కులు ముట్టితిఁగాక
కైవసము గాకున్న కడమ నాదయ్యా ॥ ఎఱఁగ ॥

మంచివాఁడవంటా నీతో మంతనమాడితిఁ గాక
మంచమెక్కి వాదులేల మానవయ్యా
అంచల శ్రీవేంకటేశ ఆయమంటి కూడితివి
కంచపు మోవిఫలము గంటిమయ్యా. ॥ ఎఱఁగ ॥ 236

దేసాళం

మంచివాఁడవంటేవో మాధవరాయా
మంచుమాయ మాఁడుకూరి మాధవరాయా ॥ పల్లవి ॥

మోనానముండిననన్ను ముట్టి వేఁడుకొనేనంటా
మానమేలంటేవోయి మాధవరాయా
నేనా సారెకు వచ్చి నీతో నెదురాడేదాన
మానవుగా మాఁడుకూరి మాధవరాయా ॥ మంచి ॥

యెగసక్యానకే మాఇల్లుచొచ్చి వచ్చేవు
మగనాలిఁ గదవోయి మాధవరాయా
బగి వాయక కూచుండి పైఁ దొడవేసేవు నీ-
మగువనా మాఁడుకూరి మాధవరాయా ॥ మంచి ॥

వోపననాఁ బోనీవు వొడివట్టి తీసేవు
మాపుదాఁకా నేలోయి మాధవరాయా
కోపుగా శ్రీవేంకటాద్రిఁ గూడి చూపేవా నీయెమ్మె
మాపైనే మాఁడుకూరి మాధవరాయా. ॥ మంచి ॥ 237

దేసాళం

ఎంతైనా నమ్మదు చిత్తమే మోకాని
యింతటి నీమాయలిఁక నేమోకాని ॥ పల్లవి ॥

సరుగన నెంత నాతో సరసములాడినాను
యెరవెరవై తోఁచీ నేమోకాని
వరుస వంతులు నీవు వలపెంత చల్లినాను
యిరవై మరవు ముంచీ నేమోకాని ॥ ఎంతై ॥

నగుతా నీవెంత నాతో నయగారాలు సేసినా
నెగసక్యాలే తోఁచీ నేమోకాని
మొగము చూచి నీవు ముచ్చటలెంతాడినాను
యిగిరించీ ననుమాన మేమోకాని ॥ ఎంతై ॥

కదిసి నీవెంత నన్ను కాఁగిలించుకొనినాను
యిదె నామై పులకించ దేమోకాని
అదన శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యెదుటనే భ్రమసితి నేమోకాని. ॥ ఎంతై ॥ 238

## నాదరామక్రియ

మట్టమవంటా నిన్నుఁ జూచితిఁ గాక యీ-
వెట్టిమోహ మెరిఁగితే వెలుపుతో నుండనా ॥ పల్లవి ॥

పంతమిచ్చేఁ గోరా పదరి నిన్నిందరిలో
అంతలేసిమాటలు నే నాడినందుకు
యింతలోనే నీవిందు నెగ్గుపట్టెదెరిఁగితే
మంతనాన దీవించి మాయింటనే వుండనా ॥ మట్ట ॥

మిక్కిలి మొక్కేలేరా మెరయ నీకాలు దొక్కి
చిక్కించి నిన్నుఁ దుచ్చము సేసినందుకు
వెక్కసమై నీకిది వేసటయ్యీ దెరిఁగితే
తక్కక నాలో నేనే తలవంచుకుండనా ॥ మట్ట ॥

కాఁగిలించే లేరా కమ్మవిరులచెండున
వీఁగకు నీమేను దాఁక వేసినందుకు
చేఁగదేరఁ గూడితివి శ్రీవేంకటేశుఁడ నన్ను
పాఁగి యీతమకమైతే పైపైనే వుందు (డ?)నా ॥మట్ట॥ 289

## సాళంగనాట

శ్రీవేంకటేశ్వరుఁడు శ్రీయలమేల్మంగతోడ
కోవిదుఁడై విహరించీ కోడతిరుణాళ్లు ॥ పల్లవి ॥

వెల్లవిరిగా వీదుల వెన్నెలలు గాయఁగా
చల్లని పూవులవాన జడి మించఁగా
వొల్లనే సతులు దన్ను వుగ్గళించి పొగడఁగా
కొల్లలాడీ వలపులు కోడతిరుణాళ్లు ॥ శ్రీవేం ॥

ఆటల పాటలవాఁడు అండనే వినిపించఁగా
పాటించి యారగింపులు పైపైఁ జేయఁగా
గాఁటముగ వీడెములు గందములు నందుకొంటా
కోటిభోగాలు భోగించీ కోడతిరుణాళ్లు ॥ శ్రీవేం ॥

చేరి పన్నీరు కప్రము శిరమునఁ గులుకఁగా
వూరక యిందరు కొలువులు సేయఁగా
యీరీతి శ్రీవేంకటేశుఁ డిందరుసతులఁ గూడి
కోరికలు వెదచల్లీ కోడతిరుణాళ్లు. ॥ శ్రీవేం ॥ 240

రేకు-641 బౌళి

మగవాఁడవు నీతో మల్లువోరేమా
చిగురువంటిమమ్ము చేఁగ రేఁచేవా ॥ పల్లవి ॥

ఆఁటదానికోపమెంత అదే నెపము సేసి
మాటి మాటికిని నీవు మారలిగేవా
సూటికిఁ బతి రాకున్న సొలతురు మలతురు
తోటకూరవంటినన్ను దూరు సేసేవా ॥ మగ ॥

పిన్నదానిగుంపెనెంత పెద్ద సేసి నీవందుకు
సన్నల చాయలఁ దిద్ది సాదించేవా
మన్ననలెచ్చుకుండైతే మందెమేళాలాడుదురు
వెన్నవంటినన్ను నీవు వెగట్లాడేవా ॥ మగ ॥

లక్కవంటి సతియెంత లావునఁ బెనఁగెనంటా
కక్కసించి రతులలో ఘాత సేసేవు
అక్కున శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
చక్కెరవంటినన్ను చవులడిగేవా. ॥ మగ ॥ 241

ఆహిరి

ఏమీనెఱఁగని నన్నునింత సేసితి
నీమనసుకొలఁదిక నేనేమీనెఱఁగ ॥ పల్లవి ॥

నిన్నుఁ బాసి వుండలేను నీమొగము చూచి చూచి
కన్నురెప్ప మూయలేను కరఁగుతాను
యెన్నికె నీవంతలో నాయెదలోన నెలకొని
మన్నించఁగనట్టె మేను మరచితిఁ గాని ॥ ఏమీ ॥

తలఁచక మానలేను తమకాననప్పటిని
వొలిసి నీతో నవ్వకోరువలేను
వెలయ నీ వంతలోనే వెంట వెంట రాఁగాను
చలివలపులనే నే సమ్మతైతిఁ గాని ॥ ఏమీ ॥

చేయి చాఁచక మానను చేరి నీమోవితీపులు
యేయెడఁ జవిచూడక యిటు మానను
ఆయమై శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
నాయండ నీవు గూడఁగా నమ్మితిఁ గాని. ॥ ఏమీ ॥ 242

రామక్రియ

వట్టి దూరులు దూరీ వద్దన్న మానఁడు నన్ను
యిట్టె తనకు నే యెరవులదాననా ॥ పల్లవి ॥

తగవా తనతో నేను దంటతనాలఁ దిరుగ
నగితే తా నవ్వేఁగాక నా కేఁటికే
మగువ తాఁ బలుకఁగ మాటలాడనైతిననీ
మొగము చూచితేనిట్టే మొక్కనైతినా ॥ వట్టి ॥

అదననిప్పుడే నన్ను నండనే కూచుండుమనీ
యిదివో మగనాలికినింత చెల్లునా
పదరి నేనే చలము పట్టుకున్నదాననని
వొదిగి తాఁ జెనకఁగా నూరకుండనైతినా ॥ వట్టి ॥

కడమా తనమోహము కాఁగిలించీ నన్నింతలో
జడిసేనా నే నేమైనా సమరతికి
జడినే శ్రీవేంకటాద్రిపతి నేనలమేల్మంగఁ
గడఁగిఁ తాఁ గలయఁగ కానిమ్మనైతినా. ॥ వట్టి ॥ 243

కొండమలహరి

ఎప్పుడు నీవొలపజాలేల మానేవు
దప్పివలపుల నేనే తగిలేఁ గాన ॥ పల్లవి ॥

కాయము నీపై వేసి కన్నులు దేలించితేను
ఆయడనే భ్రమసితివా పెకు నీవు
చేయి వట్టుక నేనెంత చెక్కు నిన్ను నొక్కినాను
చాయకు రావెప్పుడు నీసటలే కానీ ॥ ఎప్ప ॥

వేసాలకు మాటలాడి వెడనవ్వు నవ్వితేను
ఆసల వెంటఁ దిరిగేవా పెకు నీవు
వాసికిఁ జన్నులు మోపి వద్దనెంత గూచుండిన
రాసికెక్కదీవలపు రవ్వే కాన ॥ ఎప్ప ॥

యిట్టునట్టు కొంగు వట్టి యింటిలోనికిఁ దీసితేను
అట్టె లోనైతివి ఆ పెకు నీవు
నెట్టన శ్రీవేంకటేశ నిన్ను నేఁ గూడితినిదె
వొట్టి నీతనివి దీరదుడుగులే కానీ. ॥ ఎప్ప ॥ 244

పాడి

పొంచి నాకు నాకే పొగడుకోఁ జాలఁ గాక
యెంచఁబోతే నీ గుణాలు యెవ్వరైనా మెత్తురా ॥ పల్లవి ॥

వోసరించకా పెయింట నుండఁగాఁ జూచి నిన్ను
నేసినట్లాఁ జేయఁ జెల్లదా నాకు
బాసదప్పి నీవలె పదర నే నోపఁ గాక
వీసమంత పొల్లగల్లా విడుతువా నీవు ॥ పొంచి ॥

తగ నేఁ జూడఁగానాకె తమ్ముల మందుకొంటివి
తగవులఁ బెట్టనింకఁ దగదా నాకు
తెగువ నీవలె నాకు దేవరియ్యాఁడాయఁ గాక
పగిడి వెట్టి నవ్వితేఁ బదరవా నీవు ॥ పొంచి ॥

వొద్దనుండి యాకెమీఁదనొరఁగఁగాఁ జూచి నిన్ను
వుద్దండపు మచ్చరములుండవా నాకు
గద్దరి శ్రీవేంకటేశ గక్కనఁ గూడితి నన్ను
వద్దన్నా మానక యింత వలతువా నీవు. ॥ పొంచి ॥ 245

శ్రీరాగం

చెప్పరాదు చూవరాదు చెలికి నీపై యాస
యిప్పుడే మోహము చల్లీ యింకమీఁదనెట్లో ॥ పల్లవి ॥
కన్నులనే నిన్నుఁ జూచి కరఁగుతా సొలసీని
చన్నులపై నునుఁగొంగు జారఁగను
వున్నతి మాటలాడి వుస్సురంటాఁ దమకించీ
యెన్నికలీయింతి మతినెట్టున్నవో కానీ ॥ చెప్ప ॥
యిట్టునట్టు నవ్వుకొంటానెదుట నిలుచున్నది
గుట్టున మనోరథాలు గోరుకొంటాను
తొట్టిన మదము పైపైఁ దొలకఁగాఁ జెమరించీ
యిట్టే కాంత జవ్వనమెంత సేయఁగలదో ॥ చెప్ప ॥
వచ్చి వచ్చి చెయివట్టి వడిలోనికిఁ దీసీని
విచ్చనవిడిఁ దురుము వీడఁగను
మచ్చిక శ్రీవేంకటేశ మగువఁ గూడితివి నెట్టె
యెచ్చినయీపె తనివి యింకానెంత గలదో. ॥ చెప్ప ॥ 246

రేకు-842 సాళంగనాట

అప్పటిమానరుబీరాలంతే కాదా
యిప్పటి మీవొట్లు యెందాఁకా విందుము ॥ పల్లవి ॥
తమ్మిపూవులవాల్లే తప్పించుకోఁ బట్టె మాకు
యిమ్ములనలిగిన మీయిద్దరిచేత
నమ్మరెంతైనా మాట నడుమ చెలులమింతే
యెమ్మెల మీ ముంగోపమెందాఁకాఁ జూతుము ॥ అప్ప ॥
వద్దనుండి మీమాటల వంకలు దిద్దనే వట్టె
యిద్దరుఁ బట్టేటి మీయెగ్గులలోన
గద్దించేరు నేము మీకు కలిమిలో వారమైతే
యిద్దివో మీ పంతాల కెందాఁకా లోనౌదుము ॥ అప్ప ॥

చేతులఁ జేతులు వట్టి చేరఁ దియ్యఁ బట్టె మాకు
యీతల మీరు గలసే రేసులలోన
రాతిరి శ్రీవేంకటేశ రమణిఁ గూడితిరి (వి?) దె
యీ తగవు లీతలఁపు లెందాఁకా మెత్తుము. ॥ అప్ప ॥ 247

## బౌళి

చలి వాసె జగడాలు చాలునే నీకు
కలసినయిందుమీఁదఁ గడమేలే నీకు ॥ పల్లవి ॥

దగ్గర వచ్చి యతఁడు తమకించి వేఁడుకోఁగా
సిగ్గులఁ జింతలు నింకఁ జెల్లదే నీకు
వెగ్గళించి యప్పటిని వేమారు నవ్వఁగాను
యెగ్గులునెమ్మెలుఁ జూపనేఁటికే నీకు ॥ చలి ॥

కన్నులఁ దప్పక చూచి కడుఁ బ్రియము చెప్పఁగా
వన్నెలఁ జలము చూపవద్దే నీకు
సన్నలఁ జాయల నిన్ను సమ్మతిలఁ జేయఁగాను
నిన్నటిపంతములు నేఁడేల నీకు ॥ చలి ॥

కడునానలు వెట్టుచు కాఁగిలించినందుమీఁద
తడఁబాటు గుంపెనలు తగదే నీకు
యెడయక శ్రీవేంకటేశుఁడిట్టె నిన్నుఁ గూడె
వెడఁగు నీకపటపు విసువేలే నీకు. ॥ చలి ॥ 248

## శంకరాభరణం

పడఁతీ నీవూఁ గూడుక బదుకరయ్యా
చిడుముడియాపె లోను సేసుకొనెఁగా ॥ పల్లవి ॥

పగటుకు చాలనొత్తి భావము గరఁగఁ జేసి
చిగురుమోవిపై నాకె చేఁత సేసెఁగా
నగవులు నవ్వి నీతో ననుపులు పచరించి
తగిలి తగిలి నిన్ను దక్కఁగొనెఁగా ॥ పడఁ ॥

పచ్చి వెచ్చి మాటలాడి పలువలపులు రేఁచి
యిచ్చకాన నీకాపె యేలికాయఁగా
మచ్చికలు నటియించి మంతనాలు సారెనాడి
కుచ్చిన కాఁగిట నిన్ను గురిసేసెఁగా ॥పడఁ॥

పాదముపైఁ జెయి వేసి పక్కన మర్మములంటి
సేదదేరఁ గూడి యాపె సేవ సేసెఁగా
యీదెస శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
పోదిసేసి నిన్నిందుకు బోదించెఁగా. ॥పడఁ॥ 249

శంకరాభరణం

పొద్దువోనివారు గాక పోరే మీరు
యిద్దరముఁ గూడినపుడీడకు రాఁగదరే ॥పల్లవి॥

చింతతోడినన్ను మీరు చేతులేల పట్టేరే
అంతేబత్తి గలిగితేనాతఁడే రాఁడా
కాంతలు మీరు మాపుదాఁకా నాతోఁ బెనఁగితే—
నింతలో మా మనసులకింపు వుట్టీనా ॥పొద్దు॥

అలిగివుండిన నన్ను నాడకేల పిలిచేరే
తలఁపు గలిగితేను తానే రాఁడా
చెలు లిందరును గూడి సేసలు మాపైఁ జల్లితే
వలపులు మాలోను వన్నె కెక్కీనా ॥పొద్దు॥

సిగ్గువడి వున్ననన్ను శిరసేల యెత్తేరే
దగ్గరున్నాఁ డంతైయైతే తానే రాఁడా
అగ్గమై శ్రీవేంకటేశుఁడందుకే నన్నుఁ గూడె
వెగ్గళించి యేమన్నా వేరయ్యేమా. ॥పొద్దు॥ 250

దేశాక్షి

ఎంత లేదు నీవేసాలేమన్నా నే నమ్మలేను
అంతగలవాఁడైతే నాతఁడే రాఁడా ॥పల్లవి॥

యీతల నొక్కొక్కమాటే యెందో నేరుచుకవచ్చి
అతఁడాడెనంటా నాతో నాడేవు
పైతరవు వేవేలు పడఁతులు గలవాఁడు
మాతోడి గొడవేల మమ్ముఁ దలఁచీనా ॥ ఎంత ॥

యేడ పనిగలిగో మీరెక్కడో పోతా వచ్చి
యీడకాతఁడంపెనంటా యిచ్చలాడేరు
వాడికెనింతుల నీడ వచ్చేవాఁడతనికి
యీడ నేమేమి జాఁతి యెంత లేదీసుద్దులు ॥ ఎంత ॥

పొరుగుననుండి మీకు పొద్దువోక యిటు వచ్చి
మురిపేన వానిమారు మొక్కేరు నాకు
అరుదై శ్రీవేంకటేశుఁడాతఁడె విచ్చేసి కూడె
ధరలోనిన్నాళ్ళదాఁకా తడవెనా మమ్మును. ॥ ఎంత ॥ 251

శ్రీరాగం

ఏమని చెప్పుదునమ్మా ఇట్టి నాప్రాణవిభుఁడు
నామీఁదఁ జేసేమన్నన నాదేహమెరుఁగును ॥ పల్లవి ॥

తప్పక చూచినచూపు తగులనాడినమాట
యెప్పటికి మరవరాదేమి సేతునే
ముప్పిరి నవ్విన నవ్వు మొక్కలపుఁ జెనకులు
తిప్పరాని మోహమాయ తెగదే యిద్దరికిని ॥ ఏమని ॥

కొనవేలనూఁదినది కొంగువట్టి తీసినది
మనసులోనెన్నటికి మరవరాదే
చనవు నాకిచ్చినది జారుఁగొప్పు దువ్వినది
తనివోనియాసలకు తరవాయఁ గదవే ॥ ఏమని ॥

దగ్గరి వచ్చినరాక తమితోఁ జేసినచేఁత
సిగ్గువెల్లఁ బెడఁ బాపె చెప్పనేఁటికే
అగ్గమై శ్రీవేంకటేశుఁడాయమంటి నన్నుఁ గూడె
తగులేని గతులకు తతులాయ నిదివో. ॥ ఏమని ॥ 252

రేకు-643 సామంతం

ఊరకుండేనెరఁగవు వూరివారియెదుటనే
వీరములే నెరపేవు పెద్దరికమౌరా ॥ పల్లవి ॥

కూరిమి గొసరి నిన్నుఁ గోపగించినంతలోనే
మేరమీరి తిట్టేవు మేలురా నీవు
వారి వీరితోడ నీవాదులు చెప్పఁగఁ బోతే
సారెనొత్తుక వచ్చేవు జాణవు నీవౌదురా ॥ ఊర ॥

సరసమాడేటివేళ చనుమొనలనొత్తితే
అరిది గోరనూఁదేవు అవురా నీవు
సరుగ వద్దివారిని సాకిరి వెట్టఁగఁబోతే
గరిమెఁ బగచాటేవు కానీరా నీవు ॥ ఊర ॥

కానిమ్మని నీచేఁతలు కడుఁ జెల్లఁబెట్టితేను
మేనరికమే పెంచేవు మెత్తిరా నిన్ను
యీనెపాన శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
నానాఁడే నీగుణాలకు నవ్వితిరా నేను. ॥ ఊర ॥ 258

ఆహిరినాట

ఏల నాతోఁ బోరేవు యింత నీకుఁ జలమేల
నీలాగులెల్లఁ జూచి నేనే పిలువనా ॥ పల్లవి ॥

పంతానకే నీవు నన్నుఁ బగ చాటి పిలిచేవు
యెంత లేదు నే నీకునెదురా వోరి
యింతి నేనొకతెనింతె ఇంటిమూలనుండరాదా
కాంతుఁడ రతికి నేనే కడమైతినా ॥ ఏల ॥

మాటలాడనైతినంటా మచ్చరాలకే వచ్చేవు
ఆఁటదాని నాడించేదరుదా నీకు
నీటున నీయాధీనమై నీవద్దనుండేఁ జాలదా
మేటివి నేఁ గూడకున్న మెచ్చరా నిన్నును ॥ ఏల ॥

యెగసక్కెలకే నన్నునిట్టె కాఁగిలించేవు
మగువలపై మరులు మానవా నేఁడు
తగిలి శ్రీవేంకటేశ తరి నన్నుఁ గూడితివి
నగవెల్ల నామీఁదనే నారుగాఁ బోసేవా ॥ఏల॥ 254

మాళవిగౌళ

ఎంత గలదే యింకా నీమోహము
యింతిరో నీకే చెల్లునీమోహము ॥పల్లవి॥
నిక్కి నిక్కి చూచేవు నెయ్యములే తా(దాఁ?)చేవు
చక్కనిరమణునితో సారె సారెకు
చెక్కునఁ జెయి వెట్టేవు చెమటలే నించేవు
యెక్కడ నేరిచితివి యింతమోహము ॥ఎంత॥
కన్నులు దేలించేవు కాఁకలు పైఁజల్లేవు
యిన్నిటాను నీ విభుని యెదురెదుర
చన్నులకొంగు జారేవు జంటలేక పెనఁగేవు
యెన్నికలతుద మీరె యీమోహము ॥ఎంత॥
కడుఁగడు నవ్వేవు కాఁగిట బిగించేవు
యెడయక శ్రీవేంకటేశ్వరుని
తొడిఁబడఁ గూడితివి దొమ్మిరతిఁ దేలితివి
యిడుపునఁ జేర్చితి యీ మోహము ॥ఎంత॥ 255

సాళంగం

ఊరు మెచ్చ బతుకవే వొడ్డారమేల
సారెకును బిగిసితే సరుస మంకందురు ॥పల్లవి॥
పలుకఁ గదవే నీవు పైపై సిగ్గులివేల
చలి వాసె వలపులు సరసాననే
తలయెత్తి చూడఁగదె తగవు గాదెవ్వరైన
చలపాది యిదియెంత సణఁగులాడెందురు ॥ఊరు॥

నగఁ గదవె నాతో వాలిగోలతనమేల
చిగిరించెఁ గోరికలు చేచేతనే
బిగియక రాఁగదవె బిరాన నిన్నిదిచూచి
వెగటున నెవ్వరైన విటుకులాడెందురు ॥ ఊరు ॥

కాఁగిలించఁ గదె నన్ను కమ్మటి నీవెరవేల
రేఁగి వచ్చి కూడితిమి యిందాఁకానే
పాఁగిన శ్రీవేంకటాధిపతి నన్ను నేమన్నాఁ
గాఁగాదు యిదియెంత కరతలాడెందురు. ॥ ఊరు ॥ 256

పడవంజరం

తొలుత నిన్నుఁ దిట్టే దోసకారిని
పలుమారు మాకేల కాఁతి పడేవయ్యా ॥ పల్లవి ॥

నిచ్చ నిచ్చ నీమీఁద నేరములు యెంచి యెంచి
వచ్చిసేసే నేనెంత పాపజాతిని
మచ్చరపువారమింతే మంచివారమా నీకు
యిచ్చగించి మాచెరఁగు యేల పట్టేవయ్యా ॥ తొలు ॥

యెవ్వతెఁ జూచేవో యంటానెంతైన నిన్ను నమ్మక
రవ్వసేసే నేనెంత రాఁపుదాననో
దవ్వుల పంతాలే కాక దయ వుట్టీనా మాకు
నవ్వులు మాతోనేల నటియించేవయ్యా ॥ తొలు ॥

పట్టి నీవే పెనఁగ బలిమిఁ దప్పించుకొనే
నెట్టన నే నెటువంటి నిష్ఠూరినో
దిట్టవై శ్రీవేంకటేశ తేజాన నన్నుఁ గూడితి-
విట్టె కడపలోననేల మొక్కేవయ్యా. ॥ తొలు ॥ 257

అమరసింధు

ఒక్క మనసుతో నన్ను నుండనీయరా
యెక్కువ తక్కువ చేఁత లేమిటికి నాకు ॥ పల్లవి ॥

సంతము నీతోనాడి పంచబాణములకోడి
చింతతో నీమోము చూడ సిగ్గయ్యీ నాకు
కొంతగొంత మొదలనే గుట్టుననుండేదాన-
నింతేసి సందులు దూరనేమిటికి నాకు ॥ ఒక్క ॥

యిప్పటికి నిన్ను మెచ్చి యెడసితేఁ గడుఁ గొచ్చి
చిప్పిల నీతో నవ్వ సిగ్గయ్యీ నాకు
తప్పక బొంకక నేఁ కాలిమితోనుండేదాన
యిప్పుడింతేశనుమానాలేమిటికి నాకు ॥ ఒక్క ॥

నెటి నీపైఁ జెయి వేసి నిద్దరకన్నులు మూసి
చెఱఁగు వట్టి తియ్యఁగ సిగ్గయ్యీ నాకు
నెఱవై శ్రీవేంకటేశ నీవె నన్నుఁ గూడితివి
యెఱుకలు మఱపులు యేమిటికి నాకు. ॥ ఒక్క ॥ 258

రేకు-644 నాగవరాళి

అప్పటనుండి చూచేమూపెనే నీయెదుటను
కుప్పళించె [1] పెంజెమట కుచములవెంటను ॥ పల్లవి ॥

రెప్పలెత్తి నిన్నుఁ జూచు రేసు లేక సిగ్గుతోను
కప్పిన పయ్యెదకొంగు కడు బిగించు
చెప్పనొకమాట నీతో చెలియమాటుకుఁ బోవు
ఇప్పటి యీసతి మోహమేమందుమిఁకను ॥ అప్ప ॥

సెలవులఁ గొంత నవ్వ చెక్కునఁ జెయి చేర్చు
అలివేణి నీమాటే ఆలకించును
తలఁపులో నిన్ను నించు దగ్గరి నీవొద్దఁ బొంచు
వలపు లీపెకునాఁప వశముగాదిప్పుడు ॥ అప్ప ॥

సన్నసేసు నీతోడ చనవులే పచరించు
కన్నె నీకాఁగిటికిఁ బొంకము చూచును
అన్నిటా శ్రీవేంకటేశ అంతలో నీవు గూడితి-
విన్నేసి యీపెరతులకెన్నిక లేదిదివో. ॥ అప్ప ॥ 259

1. రేకులో సాంప్రదాయికమైన 'జ' ద్విత్వము లేదు.

## దేశాక్షి

వదలవు నాకొంగు యెవ్వతెను నేను
యెదుటనే నిలుచుండనెవ్వతెను నేను ॥ పల్లవి ॥

తనువుపైఁ జెయి వేసి దగ్గరఁ బిలిచేవు నీ-
వనితలలోననెవ్వతెను నేను
మనసులరసి వేరేమాటలకుఁ దీసేవు
యెనలేక యింతదానికెవ్వతెను నేను ॥ వద ॥

వచ్చిగా నవ్వేవు నాతోఁ బైపై నీ కొలువుకు
వచ్చిన సతులలోనెవ్వతెను నేను
మచ్చిక నటించి నన్ను మాపుదాఁకాఁ బొగడేవు
హెచ్చిన సవతులలోనెవ్వతెను నేను ॥ వద ॥

చద్దికి వేఁడికి నాతో సరసాలే యాడేవు
వద్దనుండే వారిలోనెవ్వతెను నేను
కొద్దితో శ్రీ వేంకటేశ కూడితివి నన్ను నిట్టే
యిద్దరమే యెక్కుడనే వెవ్వతెరా నేను. ॥ వద ॥ 260

## శుద్ధవసంతం

ఇంతా నే నెరఁగనా యేరా నీవు
వింతలు చూపి నన్ను వెట్టిఁ జేసేకొరకా ॥ పల్లవి ॥

నిండు రాజసముతోడ నీకు నీకే వచ్చి నా-
యండనే కూచుండేవు అవురా నీవు
చండిపెట్టి నీ తొల్లిటి సతులకునిది చూపి
దిండుకట్టి నన్ను నీవు తిట్టించేటికొరకా ॥ ఇంతా ॥

బత్తిగల వానివలె పడఁతులలోననెల్ల
హత్తి నాకుఁ గొప్పువెట్టేవవురా నీవు
కొత్తసతులెల్లఁ జూచి గుట్టులే దీయాఁటది
చితిగుణముదంటా చీయనేటికొరకా ॥ ఇంతా ॥

వెక్కసపుఁదమకాన వేగిరించి కాలు దొక్కి
యిక్కువలంటఁగ వచ్చేవేరా నీవు
మిక్కిలి శ్రీవేంకటేశ మించి నన్నుఁ గూడితివి
తక్కిన సవతులెల్లాఁ దలవంచేకొరకా. ॥ఇంతా॥ 261

## ముఖారి

నావలెనే నీవంటా నమ్మేదుఁ గాక
పూవువంటి నీ గుణాలు పూఁపలయ్యీనా ॥ పల్లవి ॥

యెప్పటి నీవే కావా యెరఁగక మోహించి
చెప్పినట్టెల్లా నేనే సేతుఁ గాక
తప్పులెల్లా నీపాలు తాలిములే నాపాలు
నెప్పున నీవోజ యిఁక నీవు మానేవా ॥ నావలె ॥

నీ మాయలే కావా నిందుకొన్న వింతటాను
యేమిటాఁ దెలియలేక యిట్టైతిఁ గాక
కామించేది నాపాలు కపటాలు నీపాలు
సామాన నీచేఁతలు చక్కనయ్యీనా ॥ నావలె ॥

తక్కరివి నీవు గావా తారుకాణలిటు చూపి
వుక్కు మీరి నవ్వు నవ్వనోపఁ గాక
యెక్కువ శ్రీవేంకటేశ యేకమాయే మనపాలు
నిక్కిన నీయాసలిఁక నేఁడు విడిచీనా ॥ నావలె ॥ 262

## నట్టనారాయణి

విందము దనసుద్దులు వేగిర మేలే
అందికలుఁ బొందికలు అణఁగీనా యిఁకను ॥ పల్లవి ॥

నాననీవే వలపులు నవ్వితేనెందు వొయ్యీని
తానే వచ్చీఁ గాక తరవేఁటికి
కానీలేవే అందుకేమి కడురతులఁ దనిసి
మానుపడి వున్నాఁడేమో మరచీనా నన్నును ॥ విందు ॥

పెంచనీవే గర్వములు బిగిసితేనేమాయ
వంచుకొనేఁ గాక మీరు వద్దననేలే
కొంచక సతులలోనఁ గొలువై వుండినవేళ
మించినపరాకేమో మీమాట వినఁడా (య?) ॥ వింద ॥

సేయనీవే తరితీపు చెనకితేనేమాయ
యీయెడ నేనుండేఁ గాక యీరసాలేలే
వేయిటికి శ్రీవేంకటేశుఁడిదె కూడె
పాయపు వినోదమేమో బాఁతియ్యాననేను ॥ వింద ॥ 263

## సామంతం

నీవునిట్లనై తే నేఁడిఁక జాణలు వేరి
చేవదేరెఁ బనులెల్ల చేచేఁత నిప్పుడు ॥ పల్లవి ॥

నిండుఁబరితాపమున నిన్నుఁ జెలి గొసరితే
అండనే యెగ్గులు వట్టేవయ్యో నీవు
వండ వండనట్లాయ వనితల వలపులు
చండిపెట్టేమగవారి సరవుల చేతను ॥ నీవు ॥

కలయని కాఁతాళాన కలికి నీకలిగితే
అలరి మారలిగేవు అయ్యో నీవు
యిలనెండపసపాయ యింతుల ప్రియములెల్ల
నలువంకఁ బురుషుల నడవడిచేతను ॥ నీవు ॥

మందెమేళమున నిన్ను మానినిచెయి మోపితే
అందరి సాకిరి వెట్టేవయ్యో నీవు
కందువ శ్రీవేంకటేశ కమ్మటిఁ గూడితివిట్టే
కందుదేరె నీవంటి ఘనులచేతను. ॥ నీవు ॥ 264

రేకు-645

## సామంతం

అక్కలాల చూడరే వీనటమటాలు
యెక్కడోవారిచేఁతలే యితవాయనా ॥ పల్లవి ॥

చిన్నఁబోయి వుండఁగాను చెక్కు నొక్కి వేఁడుకొంటే
నన్నుఁ దిట్టి కొనగోరు నాఁటెనంటాను
కన్నవారెల్లా వీఁపు గాఁడిపారఁ దమ తమ
చన్నులనొత్తేయప్పుడు సాదించలేఁడాయనా ॥ అక్క ॥

పవ్వళించి వుండఁగాను పాదములు గుద్దితేను
నొవ్వులఁ బొరలి మేను నొచ్చెనంటాను
మవ్వపుఁ గాంతలు కాలి మర్దనలు సేయఁగాను
నెవ్వగనట్టె మూలుగ నేరఁడాయనా ॥ అక్క ॥

కడుబడలుండఁగాను కాఁగిటనే నించితేను
తడఁబడి రతికళ దాఁకెనంటాను
అదరి శ్రీవేంకటేశుఁ డందరికాఁగిళ్ళలోన
వడఁబడేయప్పుడేమి వాసి నేరఁడాయనా. ॥ అక్క ॥ 265

శుద్ధవసంతం

అప్పుడు నీగుణమెంచనైతిఁ గాక
తప్పని నీచేఁతలెల్ల దక్కెఁగా నీకు ॥ పల్లవి ॥

ముచ్చటగానొకమాట ముందట నేనాడితేను
యెచ్చరించి ఆకెకు నాకీసు రేఁచేవు
తచ్చనకాఁడవు వోరి తలరా ఇంకా నాతో
యిచ్చకాలు సేయ వచ్చేవెరఁగనా ఇఁకను ॥ అప్పు ॥

వలచి నీకేకతాన వడిఁ జేసిన సేవలు
బలిమి ఆకెకుఁ జెప్పి వచ్చిసేసేవు
నిలువరా యెమ్మెకాఁడ నీవు మమ్ముఁ జెనకక
కలసేవు వట్టి పొత్తు కాననా నిన్నును ॥ అప్పు ॥

కదిసి నే నిన్ను రతిఁ గాఁగిలించుకుండఁగాను
యెదిటికాపెఁ బిలిచి యింత నవ్వేవు
మొదల శ్రీవేంకటేశ మొక్కలీఁడవౌదువు
తుదకెక్కెఁ బనులెల్ల దొమ్మి యిఁక నేఁటికి ॥ అప్పు ॥ 266

శంకరాభరణం

కంటివో కానవో కాని కాంతమనసు
దంటతనమంతయును తగులే సుమ్మీ ॥ పల్లవి ॥

దవ్వులనే నిన్నుఁ జూచి తల వంచుకొనెఁ గాని
నివ్వటిల్లీఁ దలపులో నీ రూపే
మవ్వపుటాసలతోడ మరియును నిన్నుఁ జూచి
నవ్వెఁ గాని అదియంతా నను పే సుమ్మీ ॥ కంటి ॥

చెలి నీతో మాటలాడి సిగ్గువడెనింతె కాని
నిలువెల్లాఁ దమకమే నిండి వున్నది
చెలఁగె(గ)ట్టె తనివోక చేరి పాట పాడెఁ గాని
వెలసినదది యెల్లా విరహమే సుమ్మీ ॥ కంటి ॥

కూరిమినొద్దఁగూచుండి గుట్టుసేసుకుంది గాని
పారితెంచె కోరికలు పైపై నదే
యీరీతి శ్రీవేంకటేశ యింతిని నీవు గూడితి—
వీరాని చనవు నీకె యిచ్చినది సుమ్మీ కంటి ॥ 267

ధన్నాశి

ఎదిరిఁ దన్నెరుఁగఁడు యెవ్వఁడే వీఁడు
గుది గుచ్చీ వలపు కూళటవే వీఁడు ॥ పల్లవి ॥

వొళ్ల నొచ్చీననఁగానే వొడి వట్టితీసీని
యెల్లవారుఁ జూడఁగాను యెడ్డఁడా వీఁడు
పల్లదాన నేఁ దిట్టిన పకపక నవ్వీని
వెల్లవిరిగాఁ గడు వెట్టటవే వీఁడు ॥ ఎదిరిఁ ॥

పనిగలదనఁగానే పయ్యెదలోఁ జెయి చాఁచీ
తనుఁదానె చలపాదితనమా వీఁడు
కినిసి యాన వెట్టిన కిందుపడి మొక్కీని
మనిమని పెనుగొల్లమంకటవే వీఁడు ॥ ఎదిరిఁ ॥

వద్దని ములుగఁగానే వచ్చి తాఁ గాఁగిటఁ గూడి
గద్దరి శ్రీవేంకటాద్రి ఘనుఁడే వీఁడు
పొద్దువోయ చాలునన్నఁ బోనీక పెనఁగిని
సుద్దులనే భ్రమయించేజూటటవే వీఁడు ॥ ఎదిరిఁ ॥ 268

## భైరవి

తనవలెనే చూచీ తరుణులను
ఘనులు మానాపతులఁ గాకు సేయవలెనా ॥ పల్లవి ॥

సిగ్గుతో నేనుండఁగాను చింతతోనుండాననంటా
వొగ్గి నన్నేలాడీనే వొక్కటొక్కటే
అగ్గమైన ఆడువారు అణఁకువతోనుండఁగా-
నెగ్గులెంచేమగవాఁడు యేడనైనాఁ గలఁడా ॥ తన ॥

అవ్వలిమోమైన దానినలిగి వుండాననంటా
రవ్వలుగనాడుకొనీ రచ్చలోను
పువ్వువంటి మగనాలు పొంచి గుట్టుననుండఁగ
మవ్వపుఁగోపము చూపేమంకువాఁడు గలఁడా ॥ తన ॥

దండ నే నిలుచుండఁగా తన్ను నేఁ బిలిచేనంటా
బెండుపడ నాతోనేల పెనఁగీనే
వెండియు శ్రీవేంకటాద్రి విభుఁడిట్టె నన్నుఁ గూడె
దండితోడనిటువంటి తత్తరీఁడు గలఁడా. ॥ తన ॥ 269

## శ్రీరాగం

నెలఁతకు నేఁటికంటె నిన్ననే మేలాయ
తలపోసి తలపోసి తన్నుఁ దానె మఱచె ॥ పల్లవి ॥

చింతాజలధి యింకె చెలివిరహాగ్నిచే
చెంతనున్నయట్టి చెక్కుచేయి జారె
వంతల బ్రాసేటి నేల వ్రాఁతలునట్టే నిలిచె
వింతలైనవెల్లిమీఁద వెల్లి దోఁచెనదివో ॥ నెలఁత ॥

పులకలు వాడె నిట్టూర్పుల గాలిచేతను
సొలసి యిప్పటి అపసోపము వాసె
తలఁకక యిందాఁకా దైవము దూరేదిఁ బోయ
వలపులు రేఁగి రేఁగి వడిఁ బడెనదివో ॥ నెలఁత ॥

చొక్కుదేరె కన్నులను చూచేటి ఆసలచేఁత
నిక్కి లేచి కూచుండె నీవు రాఁగాను
యిక్కువ శ్రీవేంకటేశ యిటు నీవు గూడితివి
చిక్కులు సిగ్గులుఁ బాసి చిమ్మిరేఁగెనదివో ॥ నెలఁత ॥ 270

రేకు-646 ముఖారి

సూడుబంటునే బలాలు చూపించ వచ్చితిమిదె
యీడ మనమే కూళల మీతఁడేమి సేసునే ॥ పల్లవి ॥

నగ నేరిచినవాఁడు నాలికాఁడు మనవాఁడు
తెగనీఁడు యెంతైనాఁ దేరనీఁడు
వెగటున మనమే వెట్టివారమై యిందాఁక
జగడించితిమి గాక చాలుఁ జాలుఁ బదవే ॥ సూడు ॥

కడురాజసపువాఁడు గామిడివాఁడు మనల-
నొడఁ బరచఁడు మాటకు త్తరమీఁడు
అడియాసలనూరకే అండనుంటిమింతె కాక
గొడవకాఁడితఁడు కూడనీఁడు పదవే ॥ సూడు ॥

ఇద్దరినడిమివాఁడు ఇచ్చకుఁడు మనమంకు
తిద్దలేఁడు లోపలికి తెగిపోనీఁడు
గద్దరీఁడు శ్రీవేంకటఘనుఁడొకరొకరినే
వొద్దికతోఁ గూడెనింక నొక్కమైతిఁ(మిప?)బదవే ॥ సూడు ॥ 271

గుండక్రియ

మాటలేల మూటలేల మాపుదాఁకా జోలియేల
కూటువ చేకత్తిగోరి గురుతుకు రారా ॥ పల్లవి ॥

వోరి నాపలుకుఁ బంత మొక్కటిగాఁ జేయకున్న
పేరుకొని నీవు వొట్టు పెట్టరా నన్ను
యీరసాననేమనిన యీడ నీతో నాకేల
గారవాన మదనునిగరిడికి రారా ॥ మాట ॥

చలము సాదించి నిన్నే సమ్మతించఁ జేయకున్న
నలువురిలో నన్ను నవ్వరా నీవు
పిలిచి నీకు నాకు పెంటపట్టుబీరమేల
కలతము వలపుల కలి(ల?)నికి రారా ॥ మాట ॥

చేరి నిన్నే యెందుకైనఁ జేయి చాఁపించకవుంటే
ఆరసి నన్నే వెంగేలాడరా నీవు
యీరీతి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
చూరలుగా నాచన్నుల సూటికిఁక రారా. ॥ మాట ॥272

లలిత

అన్నిటా వివేకివని అందురు నిన్ను
కన్నులఁ జూచినప్పుడే కాఁక చల్లఁ దగునా ॥ పల్లవి ॥

అందరు మెచ్చఁగ నే నౌననేఁ గాదనేఁ గాని
అందము నీకయినట్టెల్ల నాడరాదా
ముందుముందే వొట్లేల ముంగోపమిది యాల
నిందలకే నామీఁద నీకింతఁ దగునా ॥ అన్ని ॥

కల్లలు నిజాలు నేనే గక్కనఁ దెలిపేఁ గాని
చెల్లినట్టెల్లా నీవు సేయరాదా
పల్లదపుఁదిట్లేల పగచాటనింత యేల
వెల్లవిరి గాక తొల్లే విరుగఁగఁ దగునా ॥ అన్ని ॥

సరవితో నీమనసు సంతసించఁ జేసేఁ గాని
తరవాతి పనులెల్లఁ దడవ రాదా
గరిమ శ్రీ వేంకటాద్రి ఘనుఁడ నేఁ గూడితిని
తిరముగ గోరమూఁది గొణఁగఁ దగునా. ॥ అన్ని ॥ 273

### శంకరాభరణం

సిగ్గువడనిఁక నేల చెప్పరాదా
వెగ్గళించ(చె?) నీవలపు విభుఁడు నీకెవ్వఁడే ॥ పల్లవి ॥

ప్రేమమున వేగుదాఁకా పిప్పి సేసినట్టిమోవి
కామతంత్రముల చొక్కుకన్నుల కావి
మోములోఁ గళలు దేరెమోనముతో వసివాడు
యేమే నీకెక్కడిదే యెవ్వఁడు భోగించెనే ॥ సిగ్గు ॥

ననల విరులకొప్పు నలఁగిన జోకలు
చనుఁగవమీఁదటిశశిరేకలు
పెనఁగిన రతికేళి పెంజెమటజారులు
పెనగొని యెక్కడివే ప్రియుఁడు నీకెవ్వఁడే ॥ సిగ్గు ॥

మేర మీరె ముక్కునను మిక్కిలి నిటూ(ట్టూ?)రుపులు
తేరెను మేఁదీఁగె కొత్తతీరుపులు
యీరీతి నిన్ను శ్రీవేంకటేశుఁడు గూడెననేవు
కారణమెట్టు గలిగె ఘనుఁడితఁడెవ్వఁడే. ॥ సగ్గు ॥ 274

### తెలుఁగుఁగాంబోది

అంగనభావము చూడవయ్యా నీవు
యింగితాన నిన్నుఁ జూచి యిట్టె పులకించె ॥ పల్లవి ॥

సిగ్గునమూరకె వుండె చెలి; యంతలో నీవు
దగ్గరఁగా నవ్వు నవ్వె తనలోనే
వెగ్గళించి యట్టె నీవు వెసఁ గాఁగిలించుకోఁగా
నిగ్గులఁ గరఁగుకొంటా నిట్టూరుపు నించెను ॥ అంగ ॥

కన్నులు తొలుత మూసె కామినినట్టె నీవు
చన్నులు వినుకఁగాను చలి వాసెను
మన్నించి యిప్పటి నీవు మంచముపైకిఁ దియ్యఁగా
చిన్ని చెమటలఁ బొంగి చిత్తము మరచెను ॥ అంగ ॥

చింతతోడనుండి వుండి చేరి నిన్నుఁ గూడఁగాను
కాంతనెమ్మోమున కళ దేరెను
యింతలో శ్రీవేంకటేశ యింకా నీవు రమ్మనఁగా
సంతసాన విఱ్ఱవీఁగి చనవు మెరసెను. ॥ అంగ ॥ 275

గౌళ

కంటివో కానవో నివు ఘనుఁడవు మీఁదటెత్తు
జంటవలపులు నీపైఁ జల్లువెదలాడును ॥ పల్లవి ॥

వాసులెక్కించి యెక్కించి వాదులాట వెట్టి వెట్టి
యీసుల రేఁచేవు మాయిద్దరిసంది
తాసువలెనున్న నేము తగ్గేటి వారము గాము
నీసముకము మాటలు నిన్నే మోఁచి వచ్చును ॥ కంటి ॥

తగవులు చెప్పి చెప్పి తారుకాణ చూపి చూపి
యెగసక్కేలు సేసేవు యిద్దరిసంది
చిగురువంటి వారము చివికేవారము గాము
పగ నీమీఁదనే వచ్చి పళిహైయి నిలుచును ॥ కంటి ॥

కన్నులు గీటి గీటి గడ్డములు వట్టి పట్టి
యిన్నిటానొక్కటి సేసేవిద్దరిసంది
యెన్నిక శ్రీవేంకటేశ యిట్టె మమ్ముఁ గూడితివి
మున్నిటిసుద్దులు నీకే ముచ్చటలై యుండును. ॥ కంటి ॥ 276

రేకు-647 వసంతవరాళి

ఎంత నేరుచుకొంటివి ఇట్టె రాఁగా రాఁగా
పంతగానివలె పైపై బిగిసేవు ॥ పల్లవి ॥

కాదురా నామాట నీకుఁ గడుచెవులు చొరవా
యేదెసో చూచేవు నన్ను నేమీసనవు
వాదులడిచి నిన్నిట్టె వలసినట్టు తిట్టఁగా
సాదుఁగొయ్యతనముతో సారెకు నవ్వేవు ॥ ఎంత ॥

యేలరా నేనింత నీకు యెగసక్కెపుదాననా
ఓలి దగ్గరఁ బిలిచి వూరకుండేవు
నీలాగు నెఱిఁగియు నిన్నుఁ జేత దొబ్బినాను
గోలవలెనే వుండి కొంగు వట్టేవు ॥ఎంత॥

మేలురా నామాట నీకు మెచ్చుఁ జోటు గలిగెనా
తాలిమితోనూఁ గొంటాఁ దల వంచేవు
ఆలించి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
యేలాటపువానివలెనిట్టె పెనఁగేవు. ॥ ఎంత ॥ 277

## లలిత

ఇంకా నీకుఁ జెల్లదా యెవ్వరినేమి సేసినా
కొంకనేల యిదివో నాకొంగు నీచేనున్నది ॥ పల్లవి ॥

కోరినట్టె చెల్లెఁగా కొమారికములెల్ల
సారెకు రేపల్లెవాడ సందులలోను
ఆరసి నీవుద్దండాలన్నియును జెల్లెఁగా
కూరిమి సేసిన యాగోపికలవద్దను ॥ ఇంకా ॥

సేసినట్టె చెల్లెఁగా చేరి రుకుమిణిఁ దెచ్చి
బేసబెల్లి తనవునీ పెండ్లిలోన
యీసు లేక నీవు మాటలేమాడినాఁ జెల్లెఁగా
బాస సేసి నీవు బాలబమ్మచారినన్నవి ॥ ఇంకా ॥

నంటున నీకుఁ జెల్లెఁగా నరకాసురునిఁ దుంచి
వెంటఁ దెచ్చిన పదారువేలవలపు
యింటనె శ్రీవేంకటేశ యిదె నీకుఁ జెల్లెఁగా
జంటల నారతులలో సామ్రాజ్యము. ॥ ఇంకా ॥ 278

## సామంతం

ఇంతట మన్నించరాదా యేరా నీవు
మంతుకెక్కెనా నీ మగతనమిపుడే ॥ పల్లవి ॥

మౌనానముండినవారి మాటలాడించ వచ్చేవు
కానవు మాలోని చింత కట్టా నీవు
వూని నీకునిప్పుడింత వుల్లాసమెత్తితేను
మానినులకుఁ బండెనా మరియు నీచేతను ॥ ఇంతట ॥

వూరకే వుండినవారినోడలు ముట్ట వచ్చేవు
యేరా నన్నడుగవు యించుకంతాను
భారపు నీజవ్వనము పట్టరాక వుండితేను
యీరీతినింతుల మీఁద నిటు చూపవలెనా ॥ ఇంతట ॥

వొద్దికి వచ్చినవారినొడివట్టి తీసేవు
పొద్దెరఁగవిటు నన్నుఁ గొసరుతాను
అద్దిరా శ్రీవేంకటేశ అంతలోనే కూడితివి
వుద్దండపు నీవలపు వువిదల భాగ్యమా. ॥ ఇంతట ॥ 279

## ముఖారి

అఁటదానిగోడు చూడరయ్యో యీమగవారి-
కేఁటిబుద్ధి పుట్టించె నీసడపుఁ గర్మము ॥ పల్లవి ॥

యిరవెరఁగము మమ్మునింత సేసేవని నీకే
కరఁగుదు నీమోము గన్నదాఁకాను
మరిగినయీకెఁ దెచ్చి మాటలాడింపుచు నాకు
సరిగాఁగఁ జేసితివి సంగతాయఁ బనులు ॥ ఆఁట ॥

యెంచనైతి నీగుణము ఇటువంటిదయ్యీనని
వంచనలేకాడుకొందు వలతువంటా
ఇంచుకంత చలివాపి యెదుటికి దీనిఁ దెచ్చి
మంచమెక్కించుకొంటివి మంచివాయఁ బనులు ॥ ఆఁట ॥

మోసపోయి నమ్మితి నీమోహమిది నిజమంటా
ఆసపడి నవ్వుదు నీవలమేవంటా
వాసికి శ్రీవేంకటేశ వడి నన్నుఁ గూడితివి
వేసాలకా కెనంపితి వేడుకాయఁ బనులు. ॥ ఆఁట ॥ 280

## లలిత

వేడుకకాఁడవౌదువు విట్ఠలేశా నాకు
వీడెమిచ్చేవప్పటిని విట్ఠలేశా ॥ పల్లవి ॥

వాసితో నీవద్దఁ దలవంచుకొంటేనంతలోనే
వేసేవు పూవులఁ గొని విట్ఠలేశా
ఆసపడి నీమీఁద నాకానలేల పెట్టేవు
వీసమంత పనికైన విట్ఠలేశా ॥ వేడు ॥

సన్నల నీవద్ద నేను సమ్మతించకుండఁగానే
వెన్నెలనవ్వు నవ్వేవు విట్ఠలేశా
చన్నులంటి వూగకైనా సరసములాడేవు
విన్న కన్న సుద్దిగాదు విట్ఠలేశా ॥ వేడు ॥

పలుకకుండితే నాతో బందుఁబూతుఁ గెలసేవు
వెలయ శ్రీవేంకటాద్రివిట్ఠలేశా
బలిమి నన్నుఁ గూడఁగాఁ బనులెల్లాఁ జక్కనాయ
వెలుపలే లోనాయ విట్ఠలేశా. ॥ వేడు ॥ 281

## సామంతం

నీవే వేఁడుకొనవయ్యా నీవు సేసినసేఁతకు
మావంటివారిచేతి మాటలేఁటివయ్యా ॥ పల్లవి ॥

సిగ్గులు దేరినో చింతఁ బొరలీనో
దగ్గరి యుండియునింతి తల యెత్తదు
అగ్గలమై నేమేమన్న అట్టె కసరుకొనీ
యెగ్గు నీవేమి సేసితో యెఱఁగమయ్యా ॥ నీవే ॥

చనవు నెరసీనో చలము సాదించీనో
ననిచి నీతోఁ గొంత నవ్వు నవ్వదు
కనుఁగొని మాకు మాకే కానుకిచ్చినవొల్లదు
కొనమాఁట నీవె యెఱఁగుదువయ్యా ॥ నీవే ॥

కోపము మతినున్నదో గుట్టుసేసుకున్నదో
పైపై నివ్వెరగుల భ్రమకున్నది
యేపున శ్రీవేంకటేశ యింతలోనే కూడితివి
తీపుల యీ వెడమాయ తెలియదయ్యా. ॥ నీవే ॥ 282

రేకు-648 మాళవశ్రీ

ఏల నాతోనే నీకు యింతవలెనా
తాలిమితో నాచేఁతలు దక్కించుకోలేనా ॥ పల్లవి ॥

రాకపోకలనే నన్ను రాఁపుసేసి నీవింత
పైకొని నవ్వు నవ్వేవు పంతమా యిది
జోకల నీ సరితలు చూతమని వుంటిఁగాక
చీకాకుపరచి నిన్నుఁ జిక్కించలేనా ॥ ఏల ॥

ఇచ్చకమాడినమాట యెగసక్కెముగఁ జేసి
పచ్చిసేసేవిందరిలోఁ బంతమా యిది
వచ్చిరాక తొల్లే నీతో వాదొల్లకుండానఁ గాక
రచ్చకెక్కించి నిన్ని ట్టె రవ్వ సేయనోపనా ॥ ఏల ॥

చనవిచ్చి కాఁగిలించి సారెసారెఁ గూడేవు
పనులెల్ల చక్కనైన పంతమా యిది
యెనలేక శ్రీవేంకటేశ నన్నేలితివి
వెనకముందెల్ల నీతో విన్నవించకుందునా. ॥ ఏల ॥ 283

లలిత

చేరి నీకుఁ బలుమారుఁ జెప్పేదేమి
వూరకే నిన్నుఁ జూచుక వుండేదే మాకిఁకను ॥ పల్లవి ॥

రవ్వలుగనల్ల నాఁడు రాజసాననుండి నాతో
నవ్వినట్టే సేసితిగా నామాట
నివ్వటిల్ల నీగుణము నేనెరిఁగి తెలిసేనా
దవ్వులనుండి మొక్కేదే తగవు మాకిఁకను ॥ చేరి ॥

వల్లదావ నీవు నాపైఁ బంతములు నెరపుచు
చెల్లినట్టె సేసితిగా చేకొని నన్ను
యెల్లవారుఁ జూడఁగాను యిఁక నిన్న వేదేమి
చల్లఁగానిచ్చలాడుటే సరవి మాకిఁకను ॥ చేరి ॥

గక్కన నీవు విచ్చేసి కాఁగిట బిగించినదే
దక్కెఁగా నాతో నీవు తమకానను
ఇక్కువ శ్రీవెంకటేశ యేఁటి విన్నపములిఁక
వెక్కసపు సంతసాన విఱ్ఱవీఁగుటిఁకను. ॥ చేరి ॥ 284

### ముఖారి

పంతము నెరప వచ్చి పలచనైతివి నీవు
దొంతివలపులలోని దొమ్మిఁ జిక్కవు గదా ॥ పల్లవి ॥
కోపగించి చూడఁ బోయి కొనలు సాగ నవ్వితి-
వేపనికో కాని నేనెరఁగ లేదా
చేపట్టి నేఁ దియ్యఁబోతేఁ జేతిగోరు దాఁకెనింతే
యేపుననాయముచోటు యిదె కాదు గదా ॥ పంత ॥

చలము సాదించ వచ్చి చనవు చేసుకొనేవు
తలఁపిది యేఁటిదో తడవలేరా
చెలఁగి పైనొరగితే చెమట మైసోఁకెనింతె
యెలమి నీవొడలిట్టె యెంగిలిగాదు గదా ॥ పంత ॥

కడు సూడుకుఁ బెనఁగి కన్నులు మూసుకొనేవు
తొడరి నీకరుణకుఁ దుదలేదురా
విడువక యిదివో శ్రీవేంకటేశ కూడితివి
బడిబడినిదె నీకు బలువుగాదు గదా. ॥ పంత ॥ 285

### శంకరాభరణం

ఘనుఁడాతఁడేమన్నాఁ గాదందురా
వెనకటిసుద్దులేల వేవేలైనాను ॥ పల్లవి ॥

సిగ్గుదేరనాతఁడు చెయి నీపై వేసితేను
యెగ్గులుఁ దప్పులువట్టేవేలే యింత
వుగ్గడించి యాతఁడు వొంటి నిన్నుఁ బొగడఁగ
అగ్గలమై వాదడిచేవవునే నీవు ॥ ఘను ॥

చనవిచ్చి యాతఁడు సరసములాడఁగాను
పెనఁగేవు సారెసారెఁ బెద్దరికమా
మనసు గలయ నీతో మాటలిట్టె యాడఁగాను
వినియు వినవు యీవిదమేలే నీకు ॥ ఘను ॥

అదరి శ్రీవేంకటేశుఁడట్టె నిన్నుఁ గూడఁగాను
చిడుముడి పడి నవ్వఁ జెల్లునే నీకు
బడిబడి నీకతఁడు పంతములియ్యఁగాను
జడిసి కన్నుబొమ్మల జంకించనేఁటికే. ॥ ఘను ॥ 286

బౌళి

పడఁతుల బ్రమయించే పంతగాఁడా నిన్ను
విడువఁజాలకే యీవిధమైతిరా ॥ పల్లవి ॥

వన్నెల నీమాటలూ వలవని తేటలూ
విన్నప్పటినుండి నీకు వెట్టిగొంటిరా
కన్నులచూపులూ కడుఁదరితీపులూ
యిన్నిటాఁ దగిలి నేనిట్టయితిరా ॥ పడఁతుల ॥

ముసిముసినవ్వులు ముంగిటిలో దవ్వులు, నీ
పసలకుఁ జిక్కి నేను పాయలేనురా
కొసరేనటనలూ కూరిమినటనలూ
విసువక చూచి యింత వీరిడినైతిరా ॥ పడఁతుల ॥

కలసే నీయాసలూ కమ్మటి నీకాసలూ
తలఁచి తలఁచి యిట్టె తగిలితిరా
యెలమి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కలకాలమునునిదే కైకొంటిరా. ॥ పడఁతుల ॥ 282

బౌళిరామక్రియ

అంతకునోపితేఁ జాలునందుకు నేఁ గాదనేనా
చెంతలనే వూరకున్నఁ జిమ్మిరేఁగుఁ బనులు ॥ పల్లవి ॥

వాడివట్టి తీసేవు వూరకే యానవెట్టేవు
అడరి నీయింటికి రమ్మనుచు నీవు
వడిగానాడనున్న వారు వాదులడిచితే
గొడవ మానుపలేవు కొద్దిమీరుఁ బనులు ॥ అంతకు ॥

చెక్కు గడు నొక్కేవు చేతులెత్తి మొక్కేవు
అక్కరఁ బొత్తు * బోసేతమనుచు నీవు
కక్కసించి నీ సతులు కైదప్పు సేయవచ్చితే
చిక్కక నేనే ముందు చెముంతునపుడు ॥ అంతకు ॥

కన్నులారిచేవు నాకు కాఁగిట బిగించేవు
అన్నిటా నన్ను మన్నించేననుచు నీవు
నన్ను నీవు గూడితివి నగుతా శ్రీవేంకటేశ
మిన్నక నీసతులను మెట్టి యెలఁబడును (?) ॥ అంతకు ॥ 288

రేకు–649 బౌళి

ఏఁటి జాణతనము నీవే (విదే?) మయ్యా
ఆఁటదానిమీఁద నీవదేమయ్యా ॥ పల్లవి ॥

చిత్తరు ప్రతిమవలెఁ జెరి నిలుచుండఁగాను
హత్తి రమ్మని పిలుసవదేమయ్యా
కొత్తకొత్త సిగ్గుతడ కురులు దువ్వకోఁగాను
యిత్తల మాటలాడించేవిదేమయ్యా ॥ ఏఁటి ॥

మూసిన ముత్తెమువలె ముసుగు వెట్టుకుండఁగా–
నాసఁ గూచుండఁ బెట్టుకోవదేమయ్యా
సేసకొప్పు వంచుకొని చింతతోడనుండఁగాను
యీసుదీరఁ జెక్కు నొక్కివిదేమయ్యా ॥ ఏఁటి ॥

* బోఁసేత' అని చెక్కి అరసున్న చెలిచినట్లున్నది. కాని అది పూర్తిగా చెరలేదు

తనియని తమకాన తప్పక నిన్నుఁ జూడఁగా
  అనుగు సరసమాడవదేమయ్యా
  యెనసితి శ్రీవేంకటేశ యింతి నీవిట్టె
  యినుమడించె వలపులిదేమయ్యా- ॥ ఏఁటి ॥ 289

## సామంతం

ఆతనితో నీమాటే అనరే మీరు
  చేతికి లోనైనమీఁదఁ జెప్పేఁగాని ॥ పల్లవి ॥

తప్పక చూచినచూపు తగులనాడినమాట
  యెప్పుడుఁ బాయదు నాయెదలోనను
  కప్పురమే అంపెఁ గాని కటకట యింతసేసి
  యిప్పుడు యీవేళనైన యేల రాఁడే తాను ॥ ఆతని ॥

కన్నుల మొక్కినమొక్కు గక్కనఁ జూపిన సన్న
  యెన్నుకొంటి నాలోనే యిందాఁకాను
  మన్ననలే మించెఁ గాని మాటలాడఁ బొద్దు లేదు
  యిన్నిటాఁ దా నేరుపరి యేమనీనే తాను ॥ అతని ॥

కొంగువట్టి తీసినది కొనగోరు మోసినది
  సంగతాయనిందరిలో సారెసారెకు
  ఇంగితమెరిఁగి కూడెనిదె శ్రీవేంకటేశుఁడు
  వుంగిటి నేనేమన్నా నోరుచుకొమ్మనవే. ॥ ఆతని ॥ 290

## కాంబోది

ఆడఁగల మాటలెల్లానాడితి నేను
  వేడుకలిన్నియుఁ జెల్లె విచారములేఁటికి ॥ పల్లవి ॥

కంటిమి నీగుణములు కన్నులఁ జూచినపుడే
  వింటిమి నీసుద్దులెల్ల వేగుదాఁకాను
  తొంటివలెఁ గాదు నీవు దొరవై తివిఁకనేమి
  అంటేఁ జవులు గావు ఆయనాయఁ బనులు ॥ ఆడఁగల ॥

పట్టితినంగముచ్చెము భావించి చూచినప్పుడె
పెట్టితి నీమీఁదనొక్క పెనునేరమి
దిట్టవై తివిన్నిటాను తెరవలకాఁగిటను
యెట్టునినరాదు నిన్ను నీకనేల కొసర ॥ అడఁగల ॥

చేకొంటి నీచేఁతలు చేయి ముంచినప్పుడే
దాకొంటి నీరతులలో దగ్గరి నేఁడు
యీకడ శ్రీవేంకటేశ యిరవైన మోహములు
నేకమైతిమిద్దరము నీకనేల మరఁగు. ॥ అడఁగల ॥ 291

## మేఁచబౌళి

మాపుదాఁకా రేపకాడ మాయలేల
తీపు చేఁదుఁ గలపితే తినఁ జవులవునా ॥ పల్లవి ॥

నిద్దురకన్నులతోడ నీవు మాటలాడనేల
పొద్దునఁ బవ్వళింతువు పోరా దా
అద్దో దిట్టకూళతనమప్పటిని నెరపేవు
గద్దించి యెంతచూచినఁ గల్ల నిజమౌనా. ॥ మాపు ॥

యెక్కడో పరాకుతోడనీడ నాతో నవ్వనేల
మక్కువగల చోటికే మగుడరాదా
పుక్కటవలపుతోడి పూసగొండి తనమేల
పక్కన మొలఁగితేను పగలు రేయౌనా ॥ మాపు ॥

అసురుసురులతోడ ఆయములంటఁగనేల
కొసరు దీరఁగ నన్నుఁ గూడఁగరాదా
పొసఁగ శ్రీవేంకటేశ భోగించితివిదె నన్ను
యెసఁగ నీళ్లడిచితే నెవ్వుడు రెండౌనా. ॥ మాపు ॥ 292

## మనోహరి

విరహమే కూడైనవెట్టివారము
యిరవై తివింకా మమ్మునేమి సేసేవో ॥ పల్లవి ॥

యెదురు చూపించుకొంటివిందాఁకా నాచేత
వెదకింపించుకొంటివి వేగుదాఁకాను
కొదదీర మాయింటికి కోరి యిట్టె విచ్చేసితి-
విదివో ఇంకా మమ్మునేమిసేసేవో ॥ విర ॥

వలపించుకొంటి విదె వాడలలో మాచేతఁ
బిలిపించుకొంటివి బిట్టె బిగియుచును
తలఁపెరిఁగి యంతలో దగ్గర విచ్చేసితివి
యెలయింపులనె యింకానేమిసేసేవో ॥ విర ॥

మొక్కించుకొంటివి ముందరనే మాచేత
దక్కించుకొంటిమి మాతమకములు
గక్కునఁ గూడితివిదె కమ్మటి శ్రీవేంకటేశ
యిక్కువలంటేవింకా నేమిసేసేవో. ॥ విర ॥ 293

సామంతం

వేడుకకాఁడు గదమ్మ విజనగరములోన
వేడె వెట్టి సతులను వెన్నముద్దకృష్ణుఁడు ॥ పల్లవి ॥

ఇంటిలో నా మొగఁడు నే నిద్దరమునున్న వేళ
వొంటినే తాఁ జొచ్చి వచ్చినోయమ్మలాల
దంట తనమున నేను తనకన్నులు మూసితే
చంటికి చేతులు చాఁచీ జాణఁడే యీకృష్ణుఁడు ॥ వేడు ॥

కమ్మర మాయాతఁడు నేఁ గాఁగిలించుకుండఁగాను
వుమ్మడిఁ దా మోవి యిచ్చినోయమ్మలాల
చిమ్ముచు నే నంతలోన సిగ్గువడితే నాపక్క-
నిమ్ముసేసుకొని పండీనిదివో యీకృష్ణుఁడు ॥ వేడు ॥

పేరుకొని నావిభునిఁ బిలిచితేనూఁకొని
వూరకె తా వచ్చికూడె నోయమ్మలాల
యీరీతి శ్రీవేంకటాద్రినిరవై యీడా నాడ
కూరిములు వెదచల్లీ గోపాలకృష్ణుఁడు. ॥ వేడు ॥ 294

రేకు-650 బౌళిరామక్రియ

ఇంకా నీచలమెందాఁకాను
మంకుఁదనములు మానఁగరాదా ॥ పల్లవి ॥

కాటుక కన్నులఁ గసరీఁ గొసరీ
చాటువ వలపుల జవరాలు
యేఁటికి నీవరాకెందాఁకఁ జేసేవు
కూటపుసరసము గులుకఁగ రాదా ॥ ఇంకా ॥

సురతపుఁగళలటు చూపీ మోపీ
సరికి బేసికి నీపై జవరాలు
పొరలింపుమాటల పొద్దేల జరపేవు
తరుణినింతటనైన దయఁ జూడరాదా ॥ ఇంకా ॥

వెలయనోల నీపై వేసీ మోసీ
చలివాసె యిపుడిట్టే జవరాలు
బలిమి శ్రీవేంకటపతి నీవు గలసితి-
నలివేణి అన్నట్టె అవుననరాదో ॥ ఇంకా ॥ 295

శంకరాభరణం

ఆఁటది కూళయిననూ మరి అడ్డపెట్టరాదు
చీటికి మాటికి విన్నవించనేల చెప్ప సిగ్గయ్యీని ॥ పల్లవి ॥

చలివాసి నిన్నుసారె నాయెదుట
పిలిచీనెవ్వతెరా దీనిబీరమింకేమందును
యిలు చొచ్చి వచ్చి యెంగిలిరతికి
తలకొని చూచేతరుణిఁ గలదా ॥ ఆఁట ॥

మొగము చూచితే ముందుగానే నీతో
నగినదెవ్వతెరా దీనినటనలేమందును
పగలు చాటుచు పాసిన మోహము
మగవానిమీఁద మగుడించఁ దగునా ॥ ఆఁట ॥

ఝుట్టి నన్నుఁగూడి యెనసిననిన్నుఁ
దిట్టినెవ్వతెరా దినిదిమస మేమందును
వెట్టి శ్రీవేంకట వెన్నముద్ద కృష్ణ
గుట్టు విడువఁగ కొమ్మకునేల. ॥ అంట ॥ 296

## శంకరాభరణం

నీవెంత సేసినాను నీకమరును
యీవల మావంటివారికితవౌనా నేఁడు ॥ పల్లవి ॥

విడువక ఆపె నీతో విన్నపాలు సేయఁగాను
నడుమ నే మాటాడితే నవ్వరా నన్ను
యెడమిచ్చి నీవె నన్నుయిట్టె మన్నించఁ జూచేవు
పడఁతులతోనవెల్ల వచ్చిగాదా నాకు ॥ నీవెం ॥

సరినుండి యాపె నీతో సరసమాడేటి వేళ
వరుస వంతడుగంగ వైపా నాకు
తరలక కొంగువట్టి దగ్గర నన్నుఁదీసేవు
తరుణులపై కొసరు తగవా నాకు ॥ నీవెం ॥

వొంటినుండి యాపె నీకునూడిగాలు సేయరాఁగా
జంటలై నేఁ దిరిగేది సరవా నాకు
వెంటనె శ్రీవేంకటాద్రి వెన్నముద్ద క్రిష్ణరాయ
అంటి నన్నుఁగూడితివి అరుదాయ నాకు. ॥ నీవెం ॥ 297

## ముఖారి

వట్టి దూరు మాకేల వద్దయ్యా
చిట్టకాలిట్లా నీవు సేసేటికొరకా ॥ పల్లవి ॥

యెరవై సవతులిఁక నేమందురో మాయింటికి
వరుస దప్పి రానేల వద్దయ్యా
తరువాతవారు నేము దగ్గరి వాదడువఁగా
వొరసి నీవు నవ్వుతానుండేటికొరకా ॥ వట్టి ॥

ఆరసి నీకులిగువైన వుంగరమిచ్చేవు
వారి సొమ్ము నాకేల వద్దయ్యా
గారవాననాపె యిది కని వన్నె దుగ రాఁగా
నారుకొన నీవప్పుడు నవ్వేటికొరకా ॥ వట్టి ॥

ముచ్చటనిందరు మోచి దించవలెనంటా
వచ్చి నాకొంగు వట్టేవు వద్దయ్యా
యిచ్చకుఁడ శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
పచ్చిగా నన్నురమునఁ బాయకుండేకొరకా ॥ వట్టి ॥ 298

రామక్రియ

ఎరపరికపు పొందులిపుడేఁటికే
కరుణ గలప్పుడే కనుపట్టీఁగాక ॥ పల్లవి ॥

రాక వుండినవిభుని రమ్మనిపిలువఁ బోతే
కూకులు వత్తులే తాక కూరిమంటినా
దాకొని తానే వచ్చి తగిలినప్పటివేళ
చౌకలిన్నియును బాసి చవి వుట్టీఁగాక ॥ ఎర ॥

చిత్తము రానివానితో చిట్టకాలు సేయఁబోతే
రిత్తకు రిత్తే కాక రీతి వచ్చీనా
మొత్తమినాతఁడె వచ్చి మోహము సేసినవేళ
బత్తి గలిగి నాతోడఁ బాయకుండీఁగాక ॥ ఎర ॥

వొలసీనొల్లనినాని నొడివట్టి తియ్యఁబోతే
బలవంతములే కాక బాగు వచ్చీనా
అలరి శ్రీవేంకటేశుఁడాతఁడే నన్నుఁగూడె
కలకాలమునునిట్టే కైకొనీఁగాక. ॥ ఎర ॥ 299

ముఖారి

ఇరవు దెలియ లేరు యింతేసిజాణలు మీరు
యిరుగు పొరుగువారు యింకా మిమ్ము నగరా ॥ పల్లవి ॥

సంకె లేక యాపెతోడ సరసములాడఁగాను
యింక నేఁ గొసరుదునా యేడసుద్దులు
వంకలొత్తి మీరు తని వలపు చెల్లఁబెట్టేరు
మంకుల వోచెలులాల మరి మిమ్ము నగరో ॥ ఇర ॥

మోము చూడఁగా నాకెచే మొక్కించ నాకు రాఁగా-
నేమని నే మాటలాడే నేడ సుద్దులు
యీమాటలకే మీరు యిచ్చకములాడేరు
దోమటి మీతగవుకు దూరి మిమ్ము నగరా ॥ ఇర ॥

ఆపె నన్ను సరిచేసి అట్టె కాఁగిలించుకోఁగా-
నేపనులునిఁక నేల యేడ సుద్దులు
చేపట్టి నన్ను వింతతో (శ్రీ)వేంకటేశుఁడు గూడె
యీపనికొడఁబరచేరిట్టె మిమ్ము నగరా. ॥ ఇర ॥ 800

రేకు—651 దేసాళం

ఎవ్వరేమి చెప్పినా నీకిదేమాఁ[1] (మా?)ట
యివ్వల నే నిట్టైతి నిదేమాఁట ॥ పల్లవి ॥

చెప్పఁగానే లోనయితి చెయి నీకు మీఁదాయ
యిప్పటికి నీవాడేదిదేమాఁట
తప్పులేదు నీకయితే తమకము పసలేదు
యెప్పుడు నేమే వెట్టులమిదేమాఁట ॥ ఎవ్వ ॥

కదిసితి మిద్దరము కాదు కూడదనరాదు
యెదురు గుదురుగా నీ కిదేమాఁట
మొదలనే మోసపోతి ముచ్చటకుఁ బనిలేదు
యెద వైట్టుకోవోప నిదేమాఁట ॥ ఎవ్వ ॥

కాంతలిందరు నెరఁగఁ గాలు దొక్కితివి నన్ను
యింతటివాఁడవు నీ కిదేమాఁట
అంతలోనె (శ్రీ)వేంకటేశ ఆదరించి కూడితివి
యెంతైన విడువవు నీ కిదే మాఁట. ॥ ఎవ్వ ॥ 801

1. నీకిదేమి + ఆఁట

## సామంతం

ఇంకా రోయదు నాకు నేఁటిమనసు
కొంకులేని నావంటి కూళలూఁ గలరుగా ॥పల్లవి॥

వంతులకు రావంటా వాదులడచి నీతోను
యింత మనసు నొప్పించే దేఁటిబదుకు
కాంతలు నావంటివారు గలరెందరైనా నీకు-
నింత వలచి తిరిగే యెడ్డ లేదు గాని ॥ఇంకా॥

అప్పటి వొలిసీనొల్లనట్టివలపు నీమీఁద-
నిప్పుడె కొనవేసేది యేఁటిబదుకు
కప్పిన తమకములు కలపు గంపలకొద్ది
విప్పుచు నవ్వేనావంటి వెట్టి లేదు గాని ॥ఇంకా॥

మందలించి నీ వాడినమాట కల్లలాయనంటా
నిందరితోఁ జెప్పేది నాదేఁటిబదుకు
అందుకె శ్రీవేంకటేశ అంతలో నన్నుఁ గూడితి
పొందులేదా నావంటిభోగి లేదు గాని. ॥ఇంకా॥ 302

## ముఖారి

ఎందు వొయ్యేవందుకేమి యేమి దప్పెనింతలోనె
ందువ నీ సరితలు కనుకొనేరా ॥పల్లవి॥

చెక్కు నొక్కినంతలోనె చెల్లఁబో కోపగించేవు
తక్కక నాకొనగోరు తాఁకెనంటాను
కక్కసించి నీమేను గాజున గీరితే నీకు
దిక్కు వచ్చేదెవ్వతో నేఁ దెలిసేరా యిఁకను ॥ఎందు॥

ముద్దు వెట్టినంతలోనె మొక్కలానఁ బగ చాట
అద్దలించేవు నాయెంగిలంటెనంటాను
వుద్దండాన నా తమ్ములమోరి నీ వొరనిడితే
పెద్దరికము చూచేరా తీరపు నిన్నపుడు ॥ఎందు॥

అట్టె కాఁగిలించుకొంటే నానలువెట్ట వచ్చేవు
వొట్టుక నాగుబ్బలు నిన్నొత్తెనంటాను
నెట్ట శ్రీవేంకటేశ నీవె నన్నుఁ గూడితివి
తొట్టిన నీమదమెల్లా తుదకెక్కించేరా. ॥ ఎందు ॥ 303

## సామంతం

వెల్లివిరిసీ వలపు వెంట వెంట రాఁగాను
యిల్లిదివో తలవంచే విఁక నేఁటిచింతలు ॥ పల్లవి ॥

గయ్యాళిమాటలాడి కన్నులు దేలవేయుచు
వొయ్యన నీమీఁదనిట్టె వొళ్లు వేసీని
పయ్యెద జారఁగఁ జెలి పకపక నవ్వఁ జొచ్చె
ఇయ్యెడఁ దేరెఁ బనులు ఇఁక నేఁటిమాటలు ॥ వెల్లి ॥

గద్దించి నిన్నుఁజూచి కాయమెల్లఁ జెమరించి
కొద్దిమీరఁ దొడమీఁదఁ గూచుండి
వుద్దండానఁ జెవిలోన వూరకె యేకతమాడీ
ఇద్దరిబాగులుఁ గంటినిఁక నేఁటి సుద్దులు ॥ వెల్లి ॥

మందెమేళాలు నెరపి మచ్చికతోఁ గాఁగిలించి
చిందేటిమోవితేనెలు చిప్పిలించి
కందువ శ్రీవేంకటేశ కలికి నిన్నుఁ గలిసీ
ఇందరి మోములు చూచి ఇఁక నేల సిగ్గులు. ॥ వెల్లి ॥ 304

## ఆహిరి

వెలఁదిఁ జూతువు గాని విచ్చేయవయ్యా
తలఁచినంతయు నీకుఁ దలకూడె నేఁడు ॥ పల్లవి ॥

పట్టిన విరహామే పడఁతిమేనిమీఁద
ఇట్టునట్టు చందురుఁడే యెండ గాసెను
పుట్టుచు సాదు రేఁగితే పొలమేర నిలువఁడు
వెట్టన ననేటిమాట నిజమాయ నేఁడు. ॥ వెలఁ ॥

వొల్లనే నీతోనలిగివున్న వేళనే యీ-
వల్లదపురమణుఁడు కాదవెట్టెను
చల్లజంపు భువిలోన చాపకింది వెల్లువని
యెల్లవారునాడేది యెన్నికకు వచ్చెను ॥ వెలఁ ॥

కూడిన కాఁగిటివేళ గుంపుగూడి కోవిలలు
పాడి పాడి యింతిరతి పచ్చిసేసెను
వాడిక శ్రీవేంకటేశ వనితఁ గూడితి విట్టె
చాడికాండ్ల బ్రతుకు సతములయ్యీనా ॥ వెలఁ ॥ 805

బౌళి

మేలుమేలు జాణవౌదు మెచ్చితిగా నిన్ను
నాలికాఁడవై నన్ను నవ్వు నవ్వించితివి ॥ పల్లవి ॥

ఘనుఁడ నినుఁ గనుఁగన్నప్పటమంటి(డి?)నాకు
వెనక వేరములెంచ వెరవయ్యీని
మొనసి నీకిదితెమి మొగసిరిముందు గద్దో
వనితలు నన్నూ నవ్వ వాకట్టు గట్టితివి ॥ మేలు ॥

బత్తితో నీవినయాలవిన విన్నప్పటనుండి
చిత్తము చెదరనాడ సిబ్బితయ్యీని
చిత్తజుఁడు నీకిఁక చేతికి వసమైనాఁడో
వత్తివలె వాడించి వలపు రేఁచితివి ॥ మేలు ॥

కాఁగిటికి నీవు నన్నుఁ గదిసినప్పటనుండి
వేఁననాడఁ గొలువడు వేడుకయ్యీని
చేఁగదేరఁ గూడితివి శ్రీవేంకటేశ్వర నన్ను
తూఁగిన మూఁకలో నీకు మొక్కుఁగఁ జేసితివి. ॥ మేలు ॥ 806

రేకు-852 తెలుఁగుఁగాంబోది

అప్పటినేల దూరేరే అతనినోచెలులాల
కుప్పలించె వలపెల్ల గుఱుతిదే కాదా ॥ పల్లవి ॥

కన్నులనే నవ్వినాఁడు కడు బుజ్జగించినాఁడు
అన్నిటానెంచిచూచితే నాతఁడే నేను
మన్నన కడమ లేదు మనసు వెలితిలేదు
ఉన్నదాన రాజువలె నొరులు నాసరియా ॥ అప్ప ॥

చేయిసన్న చేసినాఁడు చెట్టవట్టి తీసినాఁడు
ఆయనాయఁ బనులెల్లనప్పుడే నాకు
వాయములునొక్కసరే భావములుఁ దారుకాణే
యీయెడ నాకోరికాయ నెదురేదే నాకు ॥ అప్ప ॥

కళలెల్ల రేఁచినాఁడు కాఁగిటనే కూడినాఁడు
పలుకుఁ బంతము చెల్లెఁ బైపై నేఁడు
యెలమి శ్రీవేంకటేశుఁడింత నన్నేకున్నాఁడు నేనె
బలువాయ నామాట పట్టరాదు ముదము ॥ అప్ప ॥ 807

సౌరాష్ట్రం

వలసినప్పుడు మేము వచ్చేముగాని
మలసి మమ్మిఁవేళ మన్నించరయ్యా ॥ పల్లవి ॥

తరుణిచిత్తము నీతలఁపు కొలఁదే కాక
యెరవుల మామాట యేఁటికయ్యా
వొరసి బుద్ధులు చెప్పి(ప్పే?) వొకరివాగముగాము
మరిగి వుండేరు మీరే మరి మేమేలయ్యా ॥ వల ॥

అంగన చలము మీ అలుకకొలఁదే కాక
సంగతిగాని మాపొందు చాలునయ్యా
వెంగలిచేఁతల మొక్కి విదిలింపించుకొంటిమి
ముంగిటనుండేము మాతో మొగమోటేలయ్యా ॥ వల ॥

వనితప్రియము నీవలపు కొలఁదే కాక
తనిసితిమి మానీటు దక్కెనయ్యా
చనవున మీకు మీకే చక్కనై కూడితిరిదే
వనిచి శ్రీవేంకటేశ నవ్వు నవ్వేమయ్యా. ॥ వల ॥ 808

## సామంతం

నా మొఁగమోటములే నన్ను నింత సేసీఁ గాక
యేమి సేసినా నీవు యిన్నిటికిఁ దగవా ॥ పల్లవి ॥

అందరునీదెంత కల్లరనేరంటా నాకు నాకే
విందుల నీమాటలెల్లా వింటిఁగాక
మందలించి నీవు నిన్న మాయింటికి రానప్పుడే
సందడి నే నిన్నుఁ బగ సాధించఁ జెల్లదా ॥ నామొ ॥

ఆఁటదానికింత యేల అని నే విచారించి
గాఁటపు నీ వినయాలు కైకొంటిఁగాక
వాఁటపు నీమేని చిందువందులు చూచినపుడే
యీటున నిన్నిన్నిటాను యేఁప నాకుఁ జెల్లదా ॥ నామొ ॥

కూడినచోటనింకేల గోరపెట్టనని నేనే
వోడక నిన్నుఁ గలసి వుంటిఁ గాక
యీడనే శ్రీవేంకటేశ యింత నీవు సేసినందు-
కాడనీడన సుద్దులన్నిఁ జెప్పఁ జెల్లదా. ॥ నామొ ॥ 309

## బౌళి

ఎమ్మెలిన్నియునుఁ జేసి యేల లోఁగేవు
సమ్మతించఁ జేసి యట్టె జట్టి గొనరాదా ॥ పల్లవి ॥

కాటుకకన్నులనాపె కాఁకలఁ గోపించెనంటా
యేఁటికి నీవు వెరచే వీడనుండే
ఆఁటదానికోపమెంత ఆయమెంత నీవు చేరి
నాఁటిన మాఁటలాడి నవ్వు నవ్వరాదా ॥ ఎమ్మె ॥

తప్పు నీపై వేసి యాపె తల వంచుకొనెనంటా
వొప్పుగ నీవు మోనాన నుస్సురనేవు
యిప్పుడాపె చలమెంత యియ్యకొలిపేదెంత
కొప్పు దువ్వి గుబ్బలపై కొనగోరు మోఁపరాదా ॥ ఎమ్మె ॥

మంతనాననా పె నీతో మంకులు నెరపెనంటా
చింతతోడ నీకు నీకే సిగ్గు వడేవు
యింతలోనె శ్రీవేంకటేశ యీపెఁ గూడితివి
పంతములెల్లా నెరపె(పి?) వచ్చి సేయరాదా. ॥ఎమ్మె॥ 810

కుంతలవరాళి

ఇంతకు వచ్చినమీఁదనిఁక నేల మొగమోట
చింతదీర నిన్ను నేమి సేసినానుఁ జెల్లదా ॥పల్లవి॥

యీగతి నిద్దిరించేవు యిట్టె నావద్దికి వచ్చి
వేగుదాఁకా నీ(నా?)పొందు వెగటా నీకు
చేగదేరనిని ఆడఁ జేయ మరచి వచ్చితా
ఆగడపునిన్ను దూరనట్టె నాకుఁ ఖల్లదా ॥ఇంత॥

పన్ని తల నొచ్చీనంటాఁ బైపైనిట్టె మూలిగేవు
విన్నవించే నామాట వేసటా నీకు
యిన్నేసి మాయలు సేయనీడనే నేరిచితివా
కన్నచోట నీగుణాలు కాకుసేయఁ జెల్లదా ॥ఇంత॥

చెల్లినంతాఁ జేసి వచ్చి చేయివట్టి పెనఁగేవు
పల్లదాన నే నేఁడు బాఁతే నీకు
వొల్లనే శ్రీవేంకటేశ వూరడించి కూడితివి
చల్లజంపులను నిన్ను జంకించఁ జెల్లదా ॥ఇంత॥ 811

నాదరామక్రియ

కటకట యిఁకనేల కాఁక రేఁచేవు
అటమటములు చాలునప్పటి నామాఁటలు ॥పల్లవి॥

నేరుపు మెరసి వచ్చి నేఁడు నన్నుఁ బిలిచేవు
వూరివారిముందరనే, వోరి పోరా
యేరా నే నిన్నెరఁగనా యింతబత్తిగలవాఁడ-
వాగసి నన్నేల పట్టేవప్పటి నామాఁటలు ॥కట॥

తోడఁబడ నీకెవ్వతే దొరకకుంటే వచ్చి
వాడిపట్టి తీసేవు వోరి పోరా
తడఁబడ నీవల్ల తనిసితిమన్నిటాను
అడియాలమిదే కంటిమప్పటి నామాఁటలు ॥కట॥

ముక్కుతిక్కులకుఁ దెచ్చి మోము చూచి నవ్వి నాతో
వొక్కచైతివింతలోనే వోరి పోరా
చక్కని శ్రీవేంకటేశ జాణవవుదువిన్నిటాను
అక్కరదీరఁ గూడితివప్పటి నామాఁటలు ॥కట॥ 312

రేకు-653 భైరవి

ఇంత నీకు వేఁగా యిటు నే వలచినది
పంతాన నీసుద్ది వింటే పరులెల్ల మెత్తురా ॥పల్లవి॥

బలిమిలో నే నీకు పట్టపుదేవులనై
చెలులకెల్లఁ బ్రియము చెప్పఁ గలనా
చిలుకలతో కాకుల చెంది మాటలాడించితే
వలవంతఁ జూచినవారెల్ల నగరా ॥ఇంత॥

వొక్కగద్దెమీఁద నీవొద్దనే కూచుండి
మొక్కలపుసతులను మొక్కఁగలనా
గక్కన మాణికము గాజు భరణిఁ బెట్టితే
తక్కువవునా అది నీ తప్పందురు గాక ॥ఇంత॥

యివల శ్రీవేంకటేశ యిటు నీకాఁగిటఁ గూడి
సవతుల సరిదై యెంచఁగఁ గలనా
భువినేనుఁగ. దోమను పూఁచి లంకెఁ బెట్టితేను
వివరించనది నీ వెలితే కాదా. ॥ఇంత॥ 313

ధవళి

ఏమయ్యా ఆఁడుజన్మము యింత పలచనాయనా
నేమము దప్పనివాఁడే నెరజాణ మహిని ॥పల్లవి॥

పొంది నీ కాఁగిటిలోనే పొలయలుకలు సేసి
కందువలంటనీవంటా కాఁక రేఁచేవు
మందలించి వనితల మనసు వచ్చినట్టే
పొంద నేరిచినవాఁడే పురుషుఁడు మహిని ॥ ఏమ ॥

వొయ్యనే నీకాఁగిటిలో వుపరిసురతానకు
ఇయ్యకొననైతినంటా నెగ్గు వట్టేవు
చయ్యన కామినుల చనవులే చెల్లించి
నెయ్యము నలిపేవాఁడే నెరజాణఁడిపుడు ॥ ఏమ ॥

సురతవేళను మేను చొక్కించి పేరఁ బిలిచి
యెరవై వుండాననంటానేల నవ్వేవు
సిరుల శ్రీవేంకటేశ సేసవెట్టి పెండ్లాడితి-
వరుదు నీవంటివాఁడు అరసి చూడఁగను. ॥ ఏమ ॥ 314

శంకరాభరణం

నీవటువంటివాఁడవా నేనే కాక
వేవేలకు నావలని వేగిరము గాక ॥ పల్లవి ॥

పిలిపించినవాఁడవు ప్రియమాడక మానేవా
కలఁగినట్టి నాతమకము గాక
వలచినవాఁడవు వద్దనుండక మానేవా
నిలువుమనేటి నానేరమింతే కాక ॥ నీవ ॥

కనుఁగొన్నవాఁడవు కాఁగిలించక మానేవా
చనవు మెరసిన నాచలము గాక
ననుపైనవాఁడవు నగక నీవు మానేవా
తనివోక కొసరే నాతప్పులింతే కాక ॥ నీవ ॥

సేస వెట్టినవాఁడవు చెనక నీవు మానేవా
గాసి నిన్నుఁ బెట్టిననాకడమే కాక
యీసుదీర శ్రీవేంకటేశ నన్నుఁగూడితివి
రాసికెక్క మెచ్చిన నారాజసము గాక. ॥ నీవ ॥ 315

## శంకరాభరణం

అప్పటి కాఁతాళాన నంటిఁగా నిన్ను
  అప్పగించేవా వలపులంటిఁగా నిన్ను ॥పల్లవి॥

వీడిన నీనాసంది విరహాతాపపు వేళ
  ఆడరాని మాటలెల్లనంటిఁగా నిన్ను
  యీడనే నీవు మన్నించేదించుకానెరఁగ లేక
  ఆడుకోలు మాఁట దప్పైనంటిఁగా నిన్ను ॥అప్ప॥

మంకుల నాకోరికతో మనసు పట్టఁగలేక
  అంకెకు వచ్చినట్టెల్లానంటిఁగా నిన్ను
  పొంకపు నీకృప నేఁ బొసగఁ దెలియలేక
  అంకగానివలెనే అంటిఁగా నిన్ను ॥అప్ప॥

పాయక నీవు నన్నుఁ బైకొంట గెలియలేక
  ఆయాలు సోఁకిన వెంగెమంటిఁగా నిన్ను
  ఈయెడ శ్రీవేంకటేశ యిట్టె నీవు గూడఁగాను
  ఆయఁ బోయ నిఁకనేల అంటిఁగా నిన్ను. ॥అప్ప॥ 316

## సామంతం

నెరజాణ యాఁటదైతే నిన్ను నింత గొసరునా
  నెరవెరఁగక నేనే వేసరించేఁ గాక ॥పల్లవి॥

యేర నీ వూరకుండఁగానింతట విరుగవద్దా
  చేరి వట్టూడిగాలింకాఁ జేసేఁ గాక
  యీరీతి నీవుండఁగానింటికిఁ బోవద్దా నేను
  వేరై యేమో నీకు విన్నవించేఁ గాక ॥నెర॥

పిలువక వుండఁగాను బీరాన నేనుండవద్దా
  వలవనిజాలిఁ బడి వచ్చితిఁ గాక
  చలముతో నీవుండఁగా చనవులు మానవద్దా
  తలఁపులో కాఁతాళాన దగిలేఁ గాక ॥నెర॥

పాసి నీవిప్పుడు రాఁగా బలిమి చూపవలదా
ఆసల నిన్నుఁ గాఁగిటనలమేఁ గాక
యీసుదీర శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
వేసరి యలయవద్దా వేగిరించేఁ గాక ॥ నెర ॥ 317

## హిందోళవసంతం

మీ యిద్దరి విభవాలు మేము చూడవలదా
యీయెడ మమ్ము మన్నించి యింత సేయవయ్యా ॥ పల్లవి ॥

తలమోఁచి యెవ్వరైనఁ దమవారయ్యీన వారిఁ
బిలువక తాము దామే పెండ్లాడేరా
అలరి శ్రీవేంకటేశ ఆడకు మమ్ము రప్పించి
వలసినట్టు గరుడధ్వజమెత్తవయ్యా ॥ మీయి ॥

చెంది ఊడిగపువారు సేవ సేయకెవ్వరైన
అందముగ నేఁగుఁబెండ్లికంగవించేరా
అందపు శ్రీవేంకటేశ ఆడకు మమ్ము రప్పించి
విందులతోనిట్టె తిరువీదులేఁగవయ్యా ॥ మీయి ॥

పేరుకొని తమనద్దఁ బేరటాండ్లు పాడఁగాను
సారెకుఁ బెండ్లాడకున్న సంతసమౌనా
యీరీతి శ్రీవేంకటేశ యిద్దరు మమ్ము రప్పించి
ఆరితేరి బువ్వములు అవధరించవ(ర ?)య్యా. ॥ మీయి ॥ 318

రేకు-654 బౌళి

ఇంత నీమోహము నేనెరఁగనైతిఁ గాక
సంతసము నీకెపుడు సహజమే కాదా ॥ పల్లవి ॥

చెంగటనే నిలుచుండి చెక్కునొక్కేవిదే నన్ను
పొంగుచు నీకెంతదయ పుట్టెనో నేఁడు
కొంగువట్టి తీసి నన్నుఁ గూచుండఁ బెట్టుకొంటివి
పంగెనల నాపైనెంత పారెనో మనసు ॥ ఇంత ॥

ఇందరిలోపల నన్ను నెక్కుడుగా మన్నించితి
కందువ నాతలఁ బెట్టు గంటివో నీవు
పొందుల సరసమాడి బుజ్జగించేవట్టేనన్ను
చందముగ నెటువంటి జాణవో నీవు ॥ ఇంత ॥

శిరసు నాపై మోపి సెలవి నవ్వేవు నీవు
ధర నాపై నీకెంత తగులో నేఁడు
యిరవై శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
తరల కెంత మన్నించి దక్కితివో నీవు. ॥ ఇంత ॥ 319

ముఖారి

ఇద్దరి నెట్టు గూరుత మేమి సేతమమ్మలాల
వద్దనే సణఁగులాడీ వద్దన్న మానదు ॥ పల్లవి ॥

మంతనాన నాతనితో మాటలాడి చూడరమ్మ
యింతిపై కోపమున నేఁడేమనీనో
చెంతఁ దా రానందుకు చెలి మొదలనలిగి
వంతల నాతనిఁ దిట్టీ వద్దన్న మానదు ॥ ఇద్ద ॥

నంటున నాతని మీరు నవ్వించి చూడరమ్మ
కంటకమా పెమీఁదఁ గలదో లేదో
యింటికి వచ్చినవానినీపె దానే వాదుదీసి
వొంటినే సన్నలు సేసీనొద్దన్నా మానదు ॥ ఇద్ద ॥

తారుకాణగా దగ్గరి పోఁగదరమ్మ
కూరిమితోనిపుడాకెఁ గూడఁ బోలును
నేరిచి శ్రీవేంకటాద్రి నిలయుని కాఁగిటిలో—
నూరకే మొక్కులు మొక్కీనొద్దన్నా మానదు. ॥ ఇద్ద ॥ 320

దేవగాంధారి

ఎరఁగని వారికైతే నేదోసమును లేదు
గురుతైన నీకే పో కొలఁతెల్ల విభుఁడా ॥ పల్లవి ॥

మచ్చిక నిన్నుఁ గూడి మఱచిన నామేను
 మెచ్చులనేమిసేతువో యెట్టు దెలుసు
నచ్చులఁ బరులు చూచి నన్ను నవ్వినది యెల్ల
వొచ్చెము నీకే సుమ్మీ వోయి విభుఁడా ॥ ఎర ॥

మొగమోడియున్న నన్ను మొరఁగ యవ్వలనేమి
యెగసక్యము సేతువో యెటు(ట్టు?) దెలుసు
మగవాని కపటాలు మానుపలేవనియేటి
అగడెల్ల నీదే సుమీ అయ్యో విభుఁడ ॥ ఎర ॥

పలు నీరతులలోన భ్రమసి వుండిన నన్ను
యెలయించేమిసేతువో యెట్టు దెలుసు
అలర శ్రీవేంకటేశ అన్నిటా నన్నుఁ గూడితి
తలవంపు నీదే సుమ్మీ తగదంటే విభుఁడా. ॥ ఎర ॥ 321

కాంభోది

ఏమి చెప్పేది నాబ్రదుకిట్టాయఁగా
నామతిలో సిగ్గులేక నవ్వు నవ్వేఁగా ॥ పల్లవి ॥

యెన్నఁడు శాసి యుండనెరఁగని నావలపు
యిన్నిటా నేఁడెంచుకొంటే యిట్టాయఁగా
కన్నులఁ జూడక వుంటే కళవళించే నేను
మన్నన నీచెలులతో మాటలాడేఁగా ॥ ఏమి ॥

చక్కని నీమేనిమీఁదఁ జాఁచేటి నాచేయి
చెక్కుకిందికిటు వచ్చి చింతాయఁగా
అక్కరతో నిన్నుఁ గూడి అలరేటి యీదినాలు
నిక్కి నిక్కి చూపులకు నెలవాయఁగా ॥ ఏమి ॥

మారమైతిన (వ?) నిన్ను దూరేటి నానోరు
వోరి నీమోవి యానఁగ నొద్దికాయఁగా
నేరిచి శ్రీవేంకటేశ నేఁడు నన్ను మన్నించఁగ
కోరిన నాకోరికలు కొనసాగెఁగా. ॥ ఏమి ॥ 322

## శుద్ధదేశి

మీకుఁ గొ తలింతే కాక మించిన వీనిసుదులు
చౌకలై నమీఁద వీని చనవులు గలవా ॥పల్లవి॥

పాటించి నవ్వులలోనే పగలు చాటఁగనిఁక-
నేఁటి మంచితనమే తానెవ్వఁడే వీఁడు
కూటమినూరకే మీరు కొనఁబెట్టేరింతె కాక
నాటకీఁడు వీనిమాట నమ్మనెట్టు వచ్చునే ॥మీకు॥

తోడనే కూచుండి వట్టిదూరులు దూరీ నన్ను -
నేడ చుట్టరికమే తానెవ్వఁడే వీఁడు
జాడలవలపు మీరే చవులు సేసేరుగాక
కోడెకాఁడు వీఁడు చేసేకూరుములూఁ గలవా ॥మీకు॥

చెక్కు నన్ను నొక్కుతానే చేఁతలు సేసీఁదాను
యెక్కడిమేలు చల్లీఁ దానెవ్వఁడే వీఁడు
యిక్కువలంటి శ్రీవేంకటేశుఁడిట్టె నన్నుఁగూడె
తక్కరీఁడు వీనితోడి తగవులూఁ గలవా ॥ఏమి॥ 823

## సామంతం

మాకేఁటికోపములు మగవారితోడ నేఁడు
చేకొని నీవు నాచెక్కు నొక్కఁగను ॥పల్లవి॥

చిత్తము చీఁకటి వాసె సెలవి నీవు నవ్వి
పొత్తుకుఁ బిలిచి బుజ్జగించఁగా
వత్తికి నూనెకు నొక్కవరుసాయ నలుకలు
హత్తి నీవే సేసవెట్టితల్లనాఁడే నాకు ॥మాకే॥

చలములన్నియుఁ దీరె సరసము నీవాడి
పలుకులనాదరించి పంతమీయఁగా
చలుములు బలుములు సరికి బేసికి ముంచె
నిలిచిన నిలువుకే నీవు మన్నించితివి ॥మాకే॥

తనువుపై కాఁకమానె దగ్గరఁ బెట్టుక నీవు
కనుచూపులఁ దేలించి కాఁగిలించఁగా
వినయాలు వేడుకలు పీడుదోల్లాడె నిదె
యెనసితివి శ్రీవేంకటేశ నన్నిపుడు ॥మాకే॥ 324

రేకు-655 సాళంగం

ఇంక నేల తొంటిసుద్దు లిందాఁకా నింతేకాక
వుంకువైన నీగుణాలె వొక్కటిగాఁ జేసెను ॥పల్లవి॥

చిగురునవ్వుల నీ చిరుతమోవిగా
అగడైననాకోప మారఁ జేసెను
పగటున నీవు సేసే పలువినయాలుగా
తగులుగా నీవున్నదండకు రప్పించెను ॥ఇంక॥

కడకన్నుల నీకందువచూపులేకా యీ-
యెడనే వంచిన తల యెత్తించెను
బడి బడి నీవు వచ్చేపాయని మోహామే క
అడఁగిననామతిలో ఆసలెల్లాం రేఁచెను ॥ఇంక॥

కమలపు నీచేతుల కాఁగిలి యిప్పుడేకా
సమరతి నాకాఁకలు చల్లఁ జేసెను
తమితో శ్రీవేంకటేశ దయ నీవు సేయఁగాఁ గా
ప్రమదపునాకూటమి పరిణామ మాయను ॥ఇంక॥ 325

సౌరాష్ట్రం

మావల్ల మంచితనాలు మరి చూడఁగలవా
నీవే నన్నుఁదగులఁగా నేఁ డనేఁ గాక ॥పల్లవి॥

మచ్చరమె కూడైన మానినుల మింతే
యిచ్చకము నేరిచేమా యెన్నటికైనా
ముచ్చటతో నీవే మమ్ము ముందు ముందే బుజ్జగించి
హెచ్చుసేసి మన్నించఁగా నెనసితిఁ గాక ॥మావల్ల॥

చంచలపుఁ జూపుల జవ్వనుల మింతే
ఇంచుకంత తాలిమి నేఁడింక వచ్చీనా
వంచనతో నీవే మమ్ము వాడుదేర నాదరించి
మించఁ జేయఁగా నేఁడు మెరసితిఁ గాక ॥ మావల్ల ॥

రతికి వేగిరపడే రమణులమింతే నీ—
యితవు దెలియుదాఁకా నెడళుండీనా
పతివి శ్రీవేంకటేశ పైపై నన్నుఁ గూడితివి
మతి నీ వియ్యఁగానే మరిగితిఁ గాక ॥ మావల్ల ॥ 326

## దేసాళం

ఆసగా నెవ్వరికైన నడ్డపెట్టరానిది
పోసరించె నావలపు పొంచి పొంచి నిన్నును ॥ పల్లవి ॥

తీపులనీమాటలనే తేలి తేలి చొక్కి చొక్కి
మాపుదాఁకా నీవద్ద మరిగుంటిని
యేపొద్దు గరుణించేవో యింటి కెన్నఁడు వచ్చేవో
మూపులు మూఁడాయ నీమోము చూచి నాకు ॥ ఆస ॥

వేడుక నీపసలకే వెంట వెంటఁ గాచి కాచి
తోడు నీడై నే నీతో దొరసితిని
కూడేటివేళ యెప్పుడో గురి యిందు మోఁచీనో
వాడు దేరితిమి నీవారమైనయపుడే ॥ ఆస ॥

చేత నీవంటినందుకే చిక్కి చిక్కి మొక్కి మొక్కి
కాతరపు నీకాఁగిటఁ గలసితిని
యీతల శ్రీవేంకటేశ యిఁక నీచిత్త మెట్లో
పోతరించి నీరతుల పొందులనే మెచ్చితిని. ॥ ఆస ॥ 327

## లలిత

మక్కువ నామీఁదఁ గల మాయలవాఁడు
వెక్కసాలు మాని యిందే వెదకరే చెలులు ॥ పల్లవి ॥

తనకు నెదురు చూచి తా రాకుండఁగా నంపిన-
పనిత కెదురు చూడ వలసె నేఁడు
మనసు చూడవలసే మరగున నున్నవాఁడో
వెనక నెరఁగరాదు వెదకరే చెలులు ॥ మక్కు ॥

పతిని దూరి దూరి పతి నావద్ది కంపిన-
సతిని దూరవలసె సారెకు నాకు
మతకాలు సేసుక యే మంచముపై నున్నవాఁడో
వెతదీర నాతని వెదకరే చెలులు ॥ మక్కు ॥

ఆతనిఁ జూచి మొక్కి ఆతనిఁ దోడితెచ్చిన-
దూతికకు మొక్కినదే దొడ్డాయ నాకు
కాతరానఁ గూడే శ్రీవేంకటపతిపై భారము
వేత మిప్పు డీడనుండే వెదకరే చెలులు ॥ మక్కు ॥ 328

ముఖారి

పోనిమ్మని వూరకున్నాఁ బొద్దు వొద్దు నన్ను రేఁచీ
తానే నిజమరియైతేఁ దనకేలే వెలుపు ॥ పల్లవి ॥

తప్పనిబొంకనివాఁడు తానేలాన వెట్టుకొనీ
చిప్పిలు పెంజెమటలు చెక్కులఁ గార
యిప్పు డింతేసివాసు లెక్కించుక వచ్చేవాఁడు
తప్పక చూడనేలే దానివంక నపుడు ॥ పోని ॥

తారుకాణించేవాఁడు తానేల తలవంచీని
నారుకొన్న ముసిముసి నవ్వుల తోడ
బీరమున నిప్పుడింత పెనఁగేటి వాఁడైతే
నేరుపుతో దానివద్ద నిలుచుండ నేలే ॥ పోని ॥

తానే కాఁగిలించేవాఁడు తతి నుస్సురన నేలే
ఆనుక లోలోనే తా నలసుకొంటా
యీనయాన శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁగూడె
కానకుండా దానితోడఁ గన్నుసన్న లేలే. ॥ పోని ॥ 329

మంగళకౌశిక

మాపుదాఁకా నేల నీ మనసు వచ్చితేఁ జాలు
చేపట్టినపని నీ చిత్తమే యెఱుఁగును ॥ పల్లవి ॥

మంతనాన నీ వాడినమాటలుగా నామతిలో
యెంతైనా నీపైకోపము పెచ్చునీనివి
పంతము నాకేమి దప్పెఁ బదవయ్యా నీవు నన్ను
యింత వేడుకొనఁగా నే నియ్యకొన కుండీ (డే?)నా ॥మాపు॥

అప్పుడు నీవు చూచిన ఆసల చూపులే కా
దెప్పరమై నీమీఁదఁ దెగనీనివి
యిప్పుడె వేగిరమేల యింత నీవు జాఁతి పడి
చెప్పేటి నీప్రియములు చేకొనకుండేనా ॥ మాపు ॥

పెక్కురతులను నన్నుఁ బెనచే యీ కాఁగిలే కా
తక్కక నీపై వలపు తమి రేఁచేది
యిక్కువలంటి శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
దక్కితి నిఁక నీమేలు తలఁచకుండేనా ॥ మాపు ॥ 330

రేకు-656 బౌళి

నీవే నాఁవాఁడవైతే నిలువునఁ గానరాదా
భావించి అప్పటినాతోఁ బచరించవలెనా ॥ పల్లవి ॥

ప్రియమే నీకుఁ గలిగితే పిలువ నంపకుండే వాఁడవా
దయకుఁ దగినపాటె తగులు గాక
నియతాన నట్టె నాపై నీవేల ఆన వెట్టేవు
క్రియ యెరఁగనా నేను కిందుపడవలెనా ॥ నీవే ॥

నేనే నీకు వలసితే నీవిందాఁకా రాకుందువా
పాని పట్టి యీపాటికాపాటే గాక
నానఁ బెట్టి నీవేల నన్ను నవ్వించ వచ్చేవు
కానరా నీవలపులు గట్టిసేయవలెనా ॥ నీవే ॥

చిత్తమే నాపైనుండితే చేపట్టి తియ్యకుండేవా
యిత్తల నీ నాటకము లేఁటివో కాక
హత్తి శ్రీవేంకటేశ్వర అట్టె నన్నుఁ గూడితివి
పొత్తుకు నే రాకుండేనా పొదుగఁగ వలెనా. ॥ నీవే ॥ 331

## శంకరాభరణం

నీవిన్నిటా జాణవౌత నేనెరఁగనా
వేవేలు నాతమకాన విన్నవించేఁగాక ॥ పల్లవి ॥

ముందు నన్ను మన్నించి మోహించు టెరఁగనా
అందరు నెరఁగవలెనని కాక
కందువ నీవు నాపై నే కన్నులౌ తెరఁగనా
సందడి నున్నదాననై చవిరేఁచేఁగాక ॥ నీవి ॥

చనవు నాకిచ్చినట్టి సరవు లెరఁగనా
ననుపు మెరసి కొంత నవ్వేఁగాక
మనలోన నాడుకొన్నమంతన లెరఁగనా
తనివి చాలక నేనే తత్తరించేఁగాక ॥ నీవి ॥

కొంకు లేక నీవు నన్నుఁగూడేదెరఁగనా
పొంకపు నీదయ నాపైఁబుట్టించేఁ గాక
అంకెల శ్రీవేంకటేశ అట్టె నన్నుఁగూడితివి
లంకెలౌతెరఁగనా నీలాగు చూచేఁ గాక. ॥ నీవి ॥ 332

## మనోహరి

కొల్లున నవ్వేరు నిన్ను గోవిందుఁడా
గొల్లెతల నేమనేవు గోవిందుఁడా ॥ పల్లవి ॥

యేపున నీసుద్దులెల్ల యిట్టె యశోదతోడ
గోపిక లాడుకొనేరు గోవిందుఁడా
తీపుల నీచేఁతలెల్ల తేట తెల్లమాయనిదే
కోపగించఁ జెల్లదిఁక గోవిందుఁడా ॥ కొల్లు ॥

సిసువవై యాడువారి చీరలు దీసినందుకు
కొసరి తిట్టేరు నిన్ను గోవిందుఁడా
పసులఁగాచేచోట భామలు విందు దెచ్చిరి
కుసిగుంపు సేయకుమీ గోవిందుఁడా ॥ కొల్లు ॥

వాడలసతుల నొక్కవావిగానే సేసితివి
కోడెల నావులఁ గాచేగోవిందుఁడా
యీడనే శ్రీవేంకటాద్రి నిరవై శ్రీసతితోడఁ
గూడి లోలుఁడ వైతివి గోవిందుఁడా. ॥ కొల్లు ॥ 333

బౌళిరామక్రియ

అతివ నీ చిత్తము ఆతనిభాగ్యము నేఁడు
తతిఁ బేదవానికి నిధానము చేరుటలు ॥ పల్లవి ॥

నిండురాజసపు నీనివ్వెరగుపాటె పో
కొండవంటిపతిమది కొల్లగొనెను
అండ నిండుమీఁద నేపాటైన నీవు నవ్వితేను
నిండు చెఱకునఁ బండునిలుచుట గాదా ॥ అతివ ॥

కడు నీమురిపెములకడకన్నుల చూపు వో
బడిబడి విభునిఁ దాపము రేఁచెను
యెడయ కిందుపై నీవు యేపాటి మాటలాడిన
వడి వాడినపైరుకు వానవచ్చినట్టు పో ॥ అతివ ॥

దగ్గరి కూచున్ననీతమక మిదియ పో
అగ్గమై శ్రీవేంకటేశు కనువాయను
నిగ్గుల నిండుమీఁద నీవె పైకొని కూడితి
బగ్గన బంగారానఁ బరిమళ మాయను. ॥ అతివ ॥ 334

సామంతం

అప్పుడే నన్నియుఁ జెప్పే నాతనితోడ
వొప్పగు మీమాటలెల్ల నూఁకొనఁగ వలెఁగా ॥ పల్లవి ॥

తేనెలవంటిమాటలు తేటపడెఁగా నేఁడు
తానె యాపె వెంటవెంటఁ దగులఁగాను
కానిలేవే యందుకేమి కంటిని తనగుణాలు
యే నెపాననైనాఁ దానే యీడకు రావలెఁగా ॥ అప్పు ॥

కందువ తననిజాలు కానవచ్చెఁగా నేఁడు
కిందుపడాకెకుఁ గన్ను గిరువఁగాను
సందడించనేలె నాకు చక్కనాయఁ బనులెల్ల
ముందరికిఁ దానె నామోము చూడవలెఁగా ॥ అప్పు ॥

రచ్చలతనవలపు రతికెక్కెఁగా నేఁడు
వొచ్చెము దీరఁ దానే నావొద్దికి రాఁగా
యిచ్చట శ్రీవేంకటేశుఁ డింతసేసి నన్నుఁగూడె
మచ్చరా లిన్నియుఁ దానె మరుగఁగవలెఁగా. ॥ అప్పు ॥ 335

మాళవి

ఎడపులవారము నేమే మెరుఁగుదుము మీ-
తడఁబాట్లేమి గల్లా తనువు లెరుఁగును ॥ పల్లవి ॥

చెలియ నీరాకలెంచి చెక్కులెల్లాఁ జెమరించి
తలఁపు మీరిమీరి తలవంచె
తెలుసుకో నీవునీవే తెగి విన్నవించలేము
వలపులు వలపులే వడిఁ దారుకాణలు ॥ ఎడ ॥

మగువ నిన్నుఁ గూడి మంచముపై వసివాడి
వెగటుగఁ జెలులతో వెంగెమాడె
నగకు నీవంత మాతో నానవు మామనసులు
తగులమిఁ దగులమిఁ దరవు లయ్యీని ॥ ఎడ ॥

యింతి నీవురాఁగాఁ జూచి యెదురెదుర నేలేచి
సంతోసపుఁ బులకల సారెఁ బూచె
యింతలో శ్రీవేంకటేశ యీపె నీవు గూడితివి
మంతనాలూ మంతనాలే మచ్చిక రేఁచీని. ॥ ఎడ ॥ 336

రేకు-657 పడవంజరం

ఎట్టు సేసినను జెల్లు నీకు నేల నిన్ను దూగ
వట్టియారడి నేనె వలచి వుండగను ॥ పల్లవి ॥

జగడించి నేనలిగి చలముతో దలవంచి
వగలతో వసివాడు వాడగాను
నగనేల నను జూచి నయమునసె నీవింత
పగసేయ వచ్చి నను బరచేవు గాక ॥ ఎట్టు ॥

జలసి నీతో నేను సరివొట్టు వెట్టుకొని
పులివేదనలతోడ బొగులగాను
మలపించి నామీద నొలగేవు నీకెంత
చెలదాన నైతినో చెనకేవు గాక ॥ ఎట్టు ॥

కడుమదమున నిన్ను గన్నులనె జంకించి
పొడిబడి పానుపుపై బొరలగాను
యెద మిచ్చి శ్రీవేంకటేశ నన్ను గూడితివి
వడి నాకు నెంతకై వశమైతో కాక. ॥ ఎట్టు ॥ 337

దేవగాంధారి

విరహాన నిన్ను బాసి వేగిరించె నిందాకా
సరుసకు వచ్చి యిక సటవట లేలే ॥ పల్లవి ॥

పచ్చి చిగురుబానుపుపై బొరలేటి పతితో
వెచ్చివేవనిమాటల వెంగెము లేలే
మచ్చిక నీమీదిది మరొకతెపై వేసి
గచ్చులకొడిమెలేల కట్టేవే ఆతనికి ॥ విర ॥

పండువెన్నెల బాయిట బడలేటిరమణుపై
యెండలనీడలచూపు లేల చల్లేవే
అండ నీకేదురుచూచే యవ్వలివారిపై దోసి
చండిసేతాతనికేల జాలి రేచేవే ॥ విర ॥

చిత్తడి చెమటల యీ శ్రీవేంకటేశ్వరుని
మొత్తపుఁ జింతాజలధి ముంచనేఁటికే
యిత్తలను నీవు గూడి యెవ్వతెనో పేరుకొనే-
వెత్తినచలాన నింకనేల నవ్వేవే. ॥ విర ॥ 338

## కొండమలహరి

నీచేయి మీఁదాయ నీ కేమయ్యా
నాచేతిచెక్కుతో నాకే నవ్వునవ్వ వలసె ॥ పల్లవి ॥

నీవల్లఁ గడమేది నిన్ను నమ్మఁజాలని
నావొళ్లి నేరమే నాది గాక
కావరించేనన్ను నీవు గక్కున మన్నించఁగాను
చేవదేరి నాకు నాకే సిగ్గువడ వలసె ॥ నీచే ॥

నీతగవు దప్పునా నిన్నుఁదెలియఁగ లేక
కాతరించినదె నాకల్లగాక
యీతలనటువంటి నన్నిట్టె నీవాదరించఁగా
రాతిఠెనుంటిందుకే కరఁగ నాకు వలసె ॥ నీచే ॥

నీగుణ మటువంటిదా నిన్ను మెచ్చకుండినయీ –
యాగడపు నాకోపమే యాఁఅడి గాక
యీగతి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
భోగపు నీరతులకే పొందు సేయవలసె. ॥ నీచే ॥ 339

## కాంబోది

మోముతో మోములోని కళలవే ముచ్చటలు మించెనవే
కామిని గోరినయట్టే కలుగఁగఁబోలును ॥ పలవి ॥

కన్నుల లేనవ్వులవే గజరుఁబులకలవే
కన్నెకు విభునిపొందు గలుగఁబోలు
సన్నపుఁజెమటలవే సరుల చెదురులవే
చిన్న (న్నె?)లతోడిరతులు చేకొనఁగఁ బోలును ॥ మోము ॥

నిట్టూరుపుగములవే నెరులు జారినవవే
ఇట్టె పతికడకుఁ దానేఁగఁ బోలును
తెట్టలైన సిగ్గులవే తేలింపుఁ గన్నులవే
వొట్టిన మరుముద్రలు వొళ్లనుండఁ బోలును ॥ మోము ॥

బడలికనడపదే పయ్యదజారులవే
పడఁతి శ్రీవేంకటేశుఁ బైకొనఁబోలు
యెడయని సంతసము లిద్దరికి ముంచెనవే
జడిగొన్న కూటములు సతము గాఁబోలును. ॥ మోము ॥ 340

రీతిగౌళ

తలఁచుకొమ్మనవే తానె నన్నునింత సేసె
వలపు దిగవిడువ వసము గాదనరే (వే?) ॥ పల్లవి ॥

కన్నుల మొక్కేటి వారు కానుకలిచ్చేటివారు
యెన్నికసతులు దనకెందరు లేరు
నన్నువలెఁ దనమన్ననఁ బొంది దిక్కులను
వన్నెకెక్కఁ బేరుపడ్డవారు మరికలరా ॥ తల ॥

సేసలు వెట్టేటివారు చేతులు చాఁచేటివారు
యీ సరసములవారు యెందరు లేరు
దాసి యిట్టె నన్నువలెఁ దనపాదములు సోఁకి
రాసికెక్కినట్టివారు రాజ్యములోఁ గలరా ॥ తల ॥

మిక్కిలి సేవలవారు మించి నడచేటివారు
యెక్కడఁ జూచినఁ దనకెందరు లేరు
యెక్కువ శ్రీవేంకటేశుఁడిటు నావంటినీచుఁ
బక్కనఁగాచెను యిట్టి పరులూఁ గలరా. ॥ తల ॥ 341

రామక్రియ

నడుమఁ గాఁకలు చల్ల నాకేఁటికే
వెడ చనవులు సేయ వెట్టిదాననా ॥ పల్లవి ॥

తెగి తా మోహించినట్టి తెరవతో సారె సారె
నగుఁగాక కోపగించ నాకేఁటికే
మొగము చూచి యాపెకే మొక్కుఁగాక కమ్మటిని
వెగటు వెంగెములాడ వెట్టిదాననా ॥ నడు ॥

యెమగువయింటికైన నేఁగుఁగాక యిందుకుఁగా
నామోము చిన్నఁబోను నాకేఁటికే
మేము చూడఁగా నాకెను మెడఁ గట్టుకొనుఁగాక
వేమరుఁగాఁతాళించ వెట్టిదాననా ॥ నడు ॥

ఘనుఁడై పెండ్లాడినట్టికాంతఁ గాఁగిలించుకోఁగా
ననుపు లిప్పుడు సేయ నాకేఁటికే
యెనసి శ్రీవేంకటేశుఁ డింతలో నన్నాదరించీ
వెనకటిసుద్దు లెంచ వెట్టిదాననా. ॥ నడు ॥ 342

రేకు-658 సామంతం

చెలియా ఆమేలుసుద్ది చెప్పవే నాకు
వెలఁకా వేగు(?) నిందాఁక వేగించితినే ॥ పల్లవి ॥

అఁపరానితమకాన నాడకే వచ్చేనంటి
రాఁపుతోడ నే నర్ధమరాతిరికాడ
కాఁపురపువారేమన్నాఁ గసరుకొంటా నుంటి
నీపలుకు విన్నదాఁకా నిలుచుంటినే ॥ చెలి ॥

వలపు నిలుపలేక వాకిటనె కాచుకున్నా
తెలతెలవారేటి తెరువు కాడ
చలపట్టి యీతనికె సగినాలు గోరుకొంటి
వెలయ నాతనియిల్లే వెదకితినే ॥ చెలి ॥

ఆతని నాతోంటి పొందు లన్నియుఁ దలఁచుకొంటి
ఈతిగుండెతోడఁ దనలుబ్బైనచోట
యేతుల శ్రీవేంకటేశుఁ డింటికిఁ బిలిచి కూడె
నాతమకాన మరచి నవ్వులు నవ్వితినే ॥ చెలి ॥ 343

## ఆహిరి

ఉన్నమాట లిఁకనేల వూరకే యెందాఁకనైనా
విన్నపాలు సేసేము వేడుకిదే చాలదా ॥ పల్లవి ॥

సేస వెట్టినప్పుడే చేకొనుటాయ నన్ను
వాసులవరుసవంతు వలెనా నాకు
రాసికెక్కినప్పుడే రమ్మని పిలిచె నన్ను
నాసరివారిలోన నాకుఁ జాలదా ॥ ఉన్న ॥

కన్నులఁ జూచినప్పుడే కైవస మైతిఁ దనకు
పన్నెల నన్నాదరించవలెనా నాకు
యిన్నిటా నాభాగ్యమాయ నింతలో నన్నాదరించె
కన్నెనై పుట్టినందుకు ఘనతిదే చాలదా ॥ ఉన్న ॥

చెక్కునొక్కినప్పుడే సిరులెల్లఁ జేరెనాకు
వక్కణించి సొమ్ములియ్యవలెనా నాకు
యిక్కువంటి శ్రీవేంకటేశుఁడిట్టె నన్నుఁ గూడె
మిక్కిలి నవ్విన యీసమేళమె చాలదా. ॥ ఉన్న ॥ 344

## ముఖారి

ఉమ్మగిలేవారి నేల వుడికించీనే
తమ్మిమోము చూచి నాపైదయ వెట్టఁదగదా ॥ పల్లవి ॥

చెక్కుచేతఁ దనకుఁగా చింతతో నేనుండఁగాను
యెక్కడనుండో వచ్చి యేల నవ్వీనే
ముక్కున నూర్పులతోడ ములుగుచు నుండఁగాను
పొక్కక తానేల నన్ను పువ్వుల వేసీనే ॥ ఉమ్మ ॥

నేరక నే తనుఁ బాసి నేలలు వ్రాయఁగాను
సారెఁ దా వచ్చి అదేమి చదివీనే
వేరులేక వానుపుపై వెతలఁబొరలఁగాను
యీరీతి నింకా సన్నలేమిసేసీనే ॥ ఉమ్మ ॥

దిమ్ము రేఁగి కాఁకలతో దేహమెల్ల వాడఁగాను
యెమ్మెలఁ గాఁగిట నన్ను నేల పట్టినే
కమ్మి శ్రీవేంకటపతి గక్కన నన్నుఁగూడి
చెమ్మఁజెమటలఁ నన్నుఁ జెక్కులేల నొక్కినే. ॥ ఉమ్మ ॥ 345

సాళంగం

ఇందాఁకా నేడనుండె నివి యెల్లాను
యిందుముఖి నేఁడు దైవమిచ్చెఁగా నీకు ॥ పల్లవి ॥

కలకల నవ్వులును కందువలమాటలును
నిలువుననే కలిగె నేఁడుగా నీకు
మొలకల సిగ్గులును మోములోని కళలును
చెలువుఁడు రాఁగానే చెల్లెఁగా నీకు ॥ ఇందా ॥

తేటల తెలిఁగన్నులు తెగుదెంపువీడేలు
నీటుమీఁదనే కలిగె నేఁడుగా నీకు
కూటపు సరసములు కొంకులేని సంతసాలు
తాటించి యాతఁడంటఁగా దక్కెఁగానీకు ॥ ఇందా ॥

చెక్కుల చెమటలును చెదరినకురులును
నిక్కిచూడఁగాఁ గలిగె నేఁడుగా నీకు
గక్కన శ్రీవేంకటాద్రిఘనుఁడు గాఁగిలించఁగా
యెక్కువ నీరతి తుదకెక్కెఁగా నీకు. ॥ ఇందా ॥ 346

శంకరాభరణం

ఇప్పుడుగా మాకెల్ల నేకచిత్తమాయ నేఁడు
తప్పులెల్ల నొప్పులాయఁ దరవాతి పనులు ॥ పల్లవి ॥

మంతనాన నేమంటివో మనసునఁ బెట్టుకొని
చింతతోనుండె నిందాఁకాఁ జెక్కుచేతితో
అంతలో నీవు విచ్చేసి ఆకెఁ గాఁగిలించుకోఁగా
సంతసానఁబొందెఁ జెలి చక్కనాయఁ బనులు ॥ ఇప్ప ॥

నిన్నటిరేతిరిలోనే నీవేమి సేసితివో
పన్నిన ముసుఁగుతోడఁ బవళించెను
మన్నించి నీ వింతలోనే మగువను వేడుకోఁగా
యెన్నికలు సరివచ్చి యీడేరెఁ బనులు ॥ ఇప్పు ॥

యెరపరికపుఁ జూపులెట్లాఁ జూచితో కాని
అరమరపున నుస్సురంటా నుండెను
యిరవుగ శ్రీవేంకటేశ యింతలోఁ గూడితి-
వరుదంది చెలి మెచ్చెననువాయఁ బనులు. ॥ ఇప్పు ॥ 347

సామంతం

నిరతి నాభార మెల్ల నీవు మోఁచుకుండఁగాను
యిరవై యెరఁగనైతి నేమందు నేను ॥ పల్లవి ॥

చెక్కుచేయి నాకేల చిన్నఁబోయి వుండనేల
గక్కన నాలో నీవు గలిగుండఁగా
నిక్కి నిక్కి చూచితివి నీవు రావంటా నిందాఁక-
నిక్కడ నా వెట్టితన మేమందు నేను ॥ నిర ॥

వట్టిజాలి నాకేల వారి వీరి దూరనేల
అట్టె నీవు నాకుఁ బతివై వుండఁగా
నెట్టన నేఁ బదరితి నీవు విచారించవంటా
యిట్టి నా యెడ్డతనాన నేమందు నేను ॥ నిర ॥

చెప్పివంప నాకేల సిగ్గుతోడ బొంకనేల
కప్పి నీవే వచ్చి నన్నుఁగాఁగిలించఁగా
వొప్పుగా శ్రీవేంకటేశ వొత్తితి రతుల నిన్ను
యిప్పటి నా గబ్బితన మేమందు నేను. ॥ నిర ॥ 348

రేకు-659 లలిత

చెలులాల మీ రతఁడు సేసినట్టె సేయనీరె
అలుక లన్నియుఁ బాసె నడ్డమిఁక రాకురే ॥ పల్లవి ॥

చిన్నఁబోయి నే నుండఁగఁ జెయివట్టి తీసెఁ బతి
అన్ని నేరములుఁ బాసె నందువంక నే
యెన్నియైనాఁ జేయనీవే యింత చాలదా నాకు
నున్నఁగా నూఁటికి నొక్కనూలిపోగే కాదా ॥ చెలు ॥

వుప్పతిల్లు మదనాగ్ని నున్న నన్నుఁ గాఁగిలించె
అప్పటి తాపము మానె నందువంక నే
యెప్పటికప్పుడే కాక యిఁక నేలే తొల్లిటివి
తప్పులెల్ల దీరు నొకదండ (డా?) ననే కాదా ॥ చెలు ॥

కడుఁబాసి వున్న నన్నుఁ గరుణించి తాఁ గూడె
అడరి సంతోసించితి నందువంక నే
యెడయఁడు శ్రీవేంకటేశుఁడు నన్ను నేలె
నుదుగులలోనే కాదా నోముల ఫలములు. ॥ చెలు ॥ 349

గౌళ

నీ చిత్తము కొలఁది నే నడచుటింతే కాక
యేచి సిగ్గు విడువఁగ నిల్లాలికి సంగతా ॥ పల్లవి ॥

కొంకక నేనే నీకొంగు వట్టి తీసితేను
అంకెల నిదెంతగయ్యాళి యనకుండేవా
మంకుల నెన్ని సేసినా మగవాని కమరును
జంకించి యాఁటదానికి చలివాయఁ జెల్లునా ॥ నీచి ॥

వొద్దనుండి నిన్నుఁ జూచి వూరకే నే నవ్వితేను
అద్దో యిదెంతగబ్బి యనకుండేవా
కొద్ది మీరి యెట్టుండినాఁ గోడెకాఁడ నీ కమరు
చద్ది బింకము రాణివాసములకుఁ దగునా ॥ నీచి ॥

ముంచి నేనే నీకాఁగిలి మోరఁగకడిగితేను
అంచెల నిదెంతదిట్ట యనకుండేవా
కొంచక శ్రీవేంకటేశ కూడితి వింతలో నీవె
మించిన పట్టపుదేవి మేర మీరఁ జెల్లునా. ॥ నీచి ॥ 350

## శుద్ధవసంతం

ఎంతజాణ వీచేఁతలకేమని నుతింతునయ్యా
వింత నింత వేడుకల వెలసె మీవలపు ॥ పల్లవి ॥

కాఁకలతో వసివాడి గక్కన నిన్నుఁ జూచి
పోఁకముడి వీడి యింతి పొంచి లోలో నవ్వెన
యేఁకట నీవవి చూచి ఇంతలో నీపచ్చడము
తేఁకువగాఁ గప్పితివి తేరె నన్ని పనులు ॥ ఎంత ॥

వెదకి వెదకి నిన్ను వెలఁది కెంగేలు వట్టి
మదనరసము చింది మరి సిగ్గు వడెను
అది యెరిఁగి నీవు ఆకెకన్ను మొరఁగి
పదనుఁ బదనుఁ గూడఁ బన్నీరు చల్లితివి ॥ ఎంత ॥

మక్కువఁ గాఁగిటఁ గూడి మగువ నిన్ను మరిగి
యిక్కువ నందలాన నీయింటి కేఁగెను
అక్కరై శ్రీవేంకటేశ ఆకెఅందలముపై ,
యెక్కక యేఁగుఁబెండ్లి యింతటా నేఁగితిరి ॥ ఎంత ॥ 351

## సామంతం

ఎదురై తి మిద్దరము ఇంకేలయ్యా
కొదవెల్లాఁదీరఁ జేకొనవయ్యా ॥ పల్లవి ॥

వట్టి నేరా లెంచితిని వద్దిఁక మాయింటిదాఁకాఁ
బట్టిన చలము మాని పదవయ్యా
కొట్టిన యానలకెల్లా దోసము లేదనేఁగాని
అట్టె మాతో మాటలాడవయ్యా ॥ ఎదు ॥

సేసినగుంపెనలకు చేతుల మొక్కేఁగాని
ఆసలఁ గప్పురవీడె మందుకోవయ్యా
బాస నిన్నుఁగొన్నందుకు పంతము లిచ్చేఁగాని
వేసాల నీనొప్పులెల్లా వీడవయ్యా ॥ ఎదు ॥

వేనూరు దూరినందుకు వేరేచెక్కు నొక్కఁగాని
నామోము చూచి కొంత నవ్వవయ్యా
కామించి శ్రీవేంకటేశ కైకొని నన్నుఁగూడితి-
వింమాటే చెల్లించి అంకెకు రావయ్యా ॥ ఎదు ॥ 352

## సామంతం

నే నెరఁగనపుడు నా నేరము లెంచఁగ వద్దు
తానే నన్నింత సేయఁదగదో వోయమ్మా ॥ పల్లవి ॥

కన్నుల నిద్దురవచ్చీఁ గాఁకల నే బడలితి
యెన్నికనగవు లింకా నెంతదడవే
పన్నినతనయానలు పలుమారు నేఁ జెవుల
విన్నదానఁ గాను మీరే వినరోయమ్మా ॥ నేనెరఁ ॥

వూరకే నావొళ్ళునొచ్చీ వుమ్మచెమటలునిండె
యీరీతిఁ దనమాట లెంతదడవే
భారమేల తా నన్నుఁబట్టి పెనఁగఁగ లోనై
వోరిచిన దానఁగాను వోగిఁ జూడరమ్మా ॥ నేనెరఁ ॥

నివ్వెరగు లివె ముంచె (చీ?) నిట్టూర్పు నిగుడెను
యివ్వలఁ దనవినయా లెంతదడవే
నవ్వుతా శ్రీవేంకటనాథుఁడిట్టె నన్నుఁగూడె
రవ్వ సేసేదానఁగాను రతికెక్కెనమ్మా ॥ నేనెరఁ ॥ 35.

## తెలుఁగుఁగాంబోది

అందుకే పో వెరగయ్యీ నమ్మలాల
అందరిలో నన్నే మెచ్చినట్టే కాదా ॥ పల్లవి ॥

వేడుకకాఁడు గదవే వీడెము చేతికిచ్చితే
ఆడకు రమ్మని తీసీ నట్టే కాదా
పాడితోడ నిందుకుఁగా పక్కన నే నవ్వితేను
ఆడరానిమాటలాడీ నట్టే కాదా ॥ అందు ॥

మోసలేని జాణగదే మొక్కినంతలోనే నన్ను
ఆసపెట్టి వెళ్లఁదీసె (సీ?) నట్టేకాదా
గాసికోఁక సిగ్గుతోఁగదలితే వెంట వెంట
ఆసుకోనివలె వచ్చీ నట్టేకాదా ॥ అందు ॥

నేరుపరిగదె వీఁడు నేనొక్కమాఁటాడితేను
ఆరసి తాఁ గాఁగిలించీ నట్టే కాదా
వేరులేక యిందుకే శ్రీవేంకటేశుఁ గూడితిని
హారములు నాకు నిచ్చె నట్టే కాదా ॥ అందు ॥ 354

రేకు-660 బౌళి

మొక్కేము నీకు నిదె మొగిఁ బదివేలు వచ్చె
చక్కఁజూచి నీవు నాకుఁ జనవీయరాదా ॥ పల్లవి ॥

కోపగించకుమీ నీవు గొబ్బున నేఁ బోతినంటా
యీపొద్దుదాఁకా నుండి యేమి సేతును
మాపుదాఁకా నిందరితో మాటలాడ నీకుఁబట్టె
చేపట్టి నీవు నన్నుఁ జేకొనుట యెపుడో ॥ మొక్కే ॥

పెనఁగకుమీ నాతో బిగిసివుందాననంటా
యినుమడించెను గాఁక లేమి సేతును
చనవరులతో నీకు సరసమాడనే పట్టె
తనివోనినావొళ్లఁ దప్పులేదు సుమీ ॥ మొక్కే ॥

పిదపఁ జింతించకుమీ బిరానఁ దెగితినంటా
యెదురు చూచలసితి నేమి సేతును
యిదివో శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కదిసిన మీఁద మరి కలదా తాలిములు ॥ మొక్కే ॥ 355

దేశాక్షి

నీకుఁబోదు నాకుఁబోదు నీతోడిదిలోకము
ఆకడనెవ్వరు నిన్ను నాడకున్నఁజాలును ॥ పల్లవి ॥

తొల్లె నీకు వలచితిఁ దుద మీర
యెల్లగా నాఁడే నీకె యెక్కెనీమేను
చెల్లఁబో మరుఁడేమైనాఁ జేయనీ నన్ను
మొల్లమి నాదూరు నిన్ను మోయకున్నఁజాలును ॥ నీకు ॥

వచ్చితి సాహసాన నీ వద్దికి నేను
పచ్చిగా నావయసు నీపాలు సేసితి
యిచ్చెర నెవ్వరేమైనాఁ జేయనీ నన్ను
ముచ్చట దోసము నిన్ను ముట్టకున్నఁ జాలును ॥ నీకు ॥

గక్కనఁ గలసితి నీకాఁగిట నేను
దక్కితి శ్రీవేంకటేశ దయ గంటిని
చిక్కఁ జీరు నింటివారు సేయనీ నన్ను
మొక్కలానఁ గీడు నిన్ను ముట్టకున్నఁజాలును ॥ నీకు ॥ 356

లలిత

అన్నియు వేడుకలై యప్పటికి నుండుఁగాక
యెన్నికలు వెనకముందేకముగాకుండునా ॥ పల్లవి ॥

నిన్ను నేఁ జూచినప్పుడె నివ్వెరగాయ మేను
యెన్నఁగ నీవప్పుడు నన్నేమి సేసితో
పన్ని యెరఁగనివారి బలిమిఁ దడవితేను
మన్నన సాఫలము తమకు రాక మానునా ॥ అన్ని ॥

కదిసి నీవద్దనే కళదాఁకి వున్నవేళ
యెదుట నాచెవిలోన నేమంటివో
నిదిరించే వారిని నీవెంత దిట్టినాను
మదియించి నీచెవుల మగుడక వుండునా ॥ అన్ని ॥

తీరని నీరతివేళ దిమ్మువట్టి వుండఁగాను
యీరీతిని గురుతులేద నించితో
చేరి నన్నుఁగూడితివి శ్రీవేంకటేశ నీవు
కారణము నే నిన్నుఁగలయక పోదునా ॥ అన్ని ॥ 357

## శంకరాభరణం

అంచెల నీతోఁ బెనఁగి యలసితిని
చంచలము లెల్లఁ బాపి చనవీయవయ్యా ॥ పల్లవి ॥

వీడెము నాతురుము వెనకదిక్కునమండి
వీడెము చేతఁ బట్టుక వెంటఁ బారఁగా
వేడుకఁ గాఁగిలించితి వేగమె నిన్నంతలోన
యీడ నావంతము చెల్లె నింటికి రావయ్యా ॥ అంచె ॥

చెదరెఁ గస్తూరిబొట్టు చెమట నుదుట నిండి
వెదకి పువ్వుల నిన్ను వేయఁగాను
పదరి నే నదెల్లా నీపచ్చడానఁ దుడిచితి
కొదువ లిన్నియుఁ బాసెఁ గూచుండవయ్యా ॥ అంచె ॥

నిండె నామైఁ బులకలు నిన్నుఁ గరఁగించేనంటా
నండ నే నొకొక్కక మాటలాడఁగాను
దండిగా శ్రీవేంకటేశ తగ నిన్నుఁ గూడితి
కొండగొంటి నీక నాకుఁ గొప్పువెట్టవయ్యా ॥ అంచె ॥ 358

## రామక్రియ

వెస నిటమీఁదిమాట విచారించవయ్యా నీవే
వునురని తనలోనే వొగిఁ దల వూఁచెను ॥ పల్లవి ॥

అలిగి పోయిపోయి అతివ నీమోము చూచి
బలిమిఁ జల్లగా నిన్ను బతుకు మనె
యెలమిఁ గసరుకొని యేమి విచారించుకొనో
చెలరేఁగి చెలరేఁగి చేతులెత్తి మొక్కెను ॥ వెస ॥

వొట్టు వెట్టుకొని వుండి వువిద తెగువతోని–
న్నుట్టిపడి చెలులకు నొప్పగించెను
పట్టకు నన్నని తిట్టి భావించి చూచుకొని
అట్టె నిన్నిపుడె పెండ్లాడు మనెను ॥ వెస ॥

సారె నిన్ను నేరమెంచి చలము గొబ్బున మాని-
గారవించి నిన్నింతలోఁ గాఁగిలించెను
కూరిమి శ్రీవేంకటేశ కూడి నీపానుపుమీఁద
నేరుపుతోఁ బవళించి నిన్నుఁజూచి మెచ్చెను ॥ వెస ॥ 359

ఆహిరి

నీవంటిగుండె లేదు నిరుమోహి నేఁ గాను
కావరించి చూచియింకాఁ గన్నులకాఁకారదు ॥ పల్లవి ॥

నిన్నుఁబాసి నాకెట్టు నిదుర వచ్చీ నేఁడు.
వెన్నెలబాయిటనే వేగింతుఁగాక
నిన్న మాపటంత నే నీమీఁద సేసవెట్టి
చెన్నలర నింకాను చేతులతడారదు ॥ నీవం ॥

మాట నీతో నాడక మనసెట్టుండీరా నాకు
మూఁటనిలుతునిఁ గొంత దూరుదుఁగాక
మేఁటినై నీతో నేను మేనవావులు దెలిపి
నాఁటినమోవులలోని నవ్వులింకా మానవు ॥ నీవం ॥

మచ్చికనిన్ను మరిగి మరపెట్టుఖ్యార నాకు
అచ్చపు నీతో సరస మాడుదుఁ గాక
యిచ్చలు శ్రీ వేంకటేశ యిద్దరముఁ గూడి మేని-
పచ్చిచెమటలింకవు పైపైనే నాకు ॥ నీవం ॥ 360

రేకు-661 లలిత

ఎక్కడివాదులు నీకు నిద్దరికినేల పోవు
ముక్కుపై వేలిడుకొంటే ముచ్చటలు మానునా ॥ పల్లవి ॥

పలుకకుండఁగ నీతోఁ బలుమారుఁ గొసరుచు
సొలసేటి పతిదిక్కు చూడరాదా
తలయెత్తకుండినా తలఁపులోనాతని
నిలువెల్ల ధ్యానమై నీలోనఁ బాసునా ॥ ఎక్కడి ॥

చెనకి కోపించఁగాను చెరఁగువట్టి తీసేటి-
నను వులపతితోడ నవ్వవద్దా
తనువు ముట్టనీకున్న తగనాతనిసొమ్ములు
పెనగొని నీమేనఁ బెట్టితివి గాదా ॥ ఎక్కడి ॥

చెక్కు చేతనుండఁగానె చెలి కాఁగిలించెనిదె
పక్కన శ్రీవెంకటేశుఁ బైకొనగాదా
అక్కర నీవూరకున్న నాతఁడే నినుఁ గూడె
మక్కువలు దాఁచినాను మర్మములు రేఁచవా॥ ఎక్కడి ॥ 361

ముఖారి

ఏకతాన నీవు నన్ను నేమి సేసినా మేలు
కాకుసేసి కొలువులో కాఁకలఁ బెట్టకురా ॥ పల్లవి ॥

శిరసు ముడువఁగానే చెయివట్టి తీసేవు
దొరవైతే నౌదుగాని తొలరా నీవు
సరివారు నీవాడేసరసమౌతెరఁగరు
నెరులంటెనందురు నేనోపఁ జుమ్మీ ॥ ఏక ॥

సొమ్ములు నించుకోఁగానే సొలయుచుఁ దిట్టేవు
దొమ్మివాఁడవౌదుగాని తొలరా నీవు
నెమ్మది నీవు నాపై నెయ్యమౌతిదెరఁగరు
దిమ్మల వాదులందురు తిద్దరాదు సుమ్మీ ॥ ఏక ॥

వల్లెవాటు వేసుకోఁగా వచ్చివచ్చి పెనఁగేవు
తొల్లేనీకు లోనైతి తొలరా నీవు
చెల్లురా శ్రీవెంకటేశ చెక్కునొక్కి కూడితివి
అల్లదివో గోరంటానందురు వొద్దు సుమ్మీ ॥ ఏక ॥ 362

కురంజి

రాఁగదే యింటిలోనికి రాఁపుసేయక
చేఁగచూపుల మమ్మేల చిమ్మిరేఁచేవే ॥ పల్లవి ॥

కూరిమి నెసరువెట్టి గుజ్జనగూళ్ళు వండి
వేరులేని మాటలనే విందువెట్టేవే
నేరకే కా యింతేసి నీపాలఁ జిక్కితి నేను
యీరీతిచేఁతల మమ్మునేల భ్రమయించేవే ॥ రాఁగదే ॥

నగవుల వలవేసి నయముల ముద్దు చూపి
వెగటుఁగాఁకలనేల వేఁటలాడేవే
మొగమోటలనె కా నేమోసపోతి నీవల్ల
చిగురుఁజింతలనేల చివికించేవే ॥ రాఁగదే ॥

మరుతంత్రములనే మారువెల వెట్టి నన్ను
ధరలోన నింతయేల దక్కఁగొనేవే
యిరవై శ్రీవేంకటేశుఁడ నేఁ గూడితి
పెరరేఁచి యింకానేల పెనఁగించేవే ॥ రాఁగదే ॥ 363

నారాయణి

వట్టి పారుపత్యములు వదలక చేయఁజొచ్చె
యెట్టుండితిమేమి తనకేలే యీపనులు ॥ పల్లవి ॥

కొప్పు ముడువఁగాఁ జూచి గోరునేసి నానెరులు
యిప్పుడెన్ని గలవంటానేఁకరీ వీఁడు
చిప్పలవంటి కన్నులు చేరఁడేసి కలవంటా
వుప్పటించీఁ దనకేమి వుండఁబట్టదా ॥ వట్టి ॥

కోక గట్టుకోఁగాఁ జూచి గొప్పలు నాచన్నులంటా
యీకడఁ జేతులు చాఁచీనేలే వీఁడు
దాకొన్న పలువరస దంతములఁ బోలునంటా
చేకొని పొగడఁజొచ్చె చెల్లునా తనకు ॥ వట్టి ॥

అకు మడుచుకోఁగాను అట్టె గోళ్ళు వాఁడెంటా
సాకిరి నా తన గోళ్ళు సరి వెట్టెనే
శ్రీకాంతనిదె నేను శ్రీవేంకటేశుఁడు దాను
యేకాలము నన్నుఁగూడెనేమందునే ॥ వట్టి ॥ 364

## సాళంగం

అదె శ్రీవేంకటపతి అలిమేలు మంగయును
కదిసివున్నారు తమకమునఁ బెండ్లికిని ॥ పల్లవి ॥

బాసికములు గట్టిరో పైపై దంపతులకు
శేసపాలందియ్యరో చేతులకును
సూసకాల పేరటాండ్లు సోబానఁ బాడరో
మోసపోక యిట్టె ముహూర్తముడుగరో ॥ అదె ॥

గక్కనను మంగళాష్టకములు చదువరో
తక్కక జేఁగట (జేగఁటి?) వేసి తప్పకుండాను
నిక్కినిక్కి చూచేరదే నెరిఁ దెర దియ్యరో
వొక్కటైరి కొంగుముళ్ళు వొనరఁగ వేయరో ॥ అదె ॥

కంకణదారములను కట్టరో యిద్దరికిని
సుంకులఁ బెండ్లిపీఁటఁ గూచుండఁబెట్టరో
లంకె శ్రీవేంకటేశు నలమేల్‌మంగను దీవించి
అంకెలఁ బానుపుమీఁద నమరించరో ॥ అదె ॥ 365

## దేసాళం

ఎట్టు దరించెనో యిందాఁకాను
దట్టమై యిప్పుడే తమకించీని ॥ పల్లవి ॥

కన్నులకలికి కాఁకలు చల్లీ
మన్నన మాపుల మగనిపయి
వెన్నెల నవ్వులు వెదలువెట్టీ
పన్నినమోహానఁ బ్రాణేశుమీఁద ॥ ఎట్టు ॥

చిలుకలకొలికి చేతులు చాఁచీ
వెలయు సిగ్గుల విభునిపై
చలివేఁడివూర్పు సారెకుఁజల్లీ
కలిమి మెరసి కాంతునిమీఁద ॥ ఎట్టు ॥

అలిమేలుమంగ ఆయాలు మోపి
యెలమి శ్రీవేంకటేశునిపై
నిలువున ముద్దు నేఁడే గునిసీ
యిలఁ దనపతి యీతనిఁ గూడి ॥ ఎట్టు ॥ 366

రేకు-662 ఆహిరి

ఆఁకలెరఁగరు అప్పటినుండియు
తేఁకువ బోనాలు దెచ్చితిమిదివో ॥ పల్లవి ॥

మచ్చికచూపులు మంతనాలాడేరు
యిచ్చటనే తామిద్దరును
హెచ్చి నిన్న మొన్న నేమి సేసిరోకో
పొచ్చపుచేతల పొద్దులువోయ ॥ ఆఁక ॥

చనవు మెరసి సన్నలు సేసేరు
యెనసి లోలోనె యిద్దరును
మనసులిందాఁకా మరచి యెట్టుండిరో
వినేసతులకు వేసటలాయ ॥ ఆఁక ॥

నిండుఁగాఁగిటనె నివ్వెరగందేరు
యెండ నీడెరఁగక యిద్దరును
పండి శ్రీవెంకటపతి యలమేల్‌మంగ
వుండనుండ భోగమొద్దికలాయ ॥ ఆఁక ॥

సామంతం

మలఘునినిన్న పెరుమాళ్ళు వీఁడే
వెలయు రాజసమున విట్టువీఁగీ వాఁడే ॥ పల్లవి ॥

నాలినిద్దరు దేవుళ్ళ నడుమ నిలుచుండి
కైలాటాలు చల్లినదె కనుఁగొనల
వేళవేళఁ బొత్తులను విందులారగించుకొంటా
వాలి కొలువుండీఁ దిరువాముడి మంటపాన ॥ మలఘు ॥

ఆటలుఁ బాటలుఁ జూచి అంగరంగవైభవముల
నీటుతోడ సొమ్ములెల్లా నిండాఁ బెట్టుక
గాఁటపు పూదండలతోఁ గస్తూరినామములతో
మేఁటి సింహాసనముపై మించేరు కళల ॥ మలఘు ॥

తామెరకొలనువలెఁ దగఁ దిరుచేల చాతి
కోమలులిద్దరుఁ దాను కుచ్చళ్ళువోసి
ప్రేమఁ గరకజడలు పిరిఁది దిండ్లు దీరిచి
కామించి నవ్వీ వాఁడే కల్యాణవేదికను ॥ మలఘు ॥

ముత్తేల చొల్లెపుచుట్టు ముంగురులపైఁ గప్పి
మెత్తిన గందపుఁబూఁత మేన నిండఁగా
హత్తిన పూవుదండలమర జల్లులలోని—
కొత్తమేలుకట్లలోను గూచున్నాఁడు వీఁడె ॥ మలఘు ॥

కుడియడమకొప్పుల కుళ్ళాయి పాగచుంగుల
బెడిదపు దంపతులు పెండ్లిచవికెలో
అడరి శ్రీవెంకటేశుఁ డలమేలుమంగఁ దాను
పుడమిఁ గూడున్నవారు భోగపురతులను ॥ మలఘు ॥ 368

## దేసాళం

కూడిన మీఁదను కొసరెలే
ఆడకు నిష్టూర మప్పటివలెను ॥ పల్లవి ॥

చెలువుఁడదివో నిన్నుఁ జేరి వేఁడుకొనె
వలవని జోలిఁక వద్దేలే
పలుకవె యిఁక నీపంతము దీరెను
అలుకలు చెల్లవు అప్పటివలెను ॥ కూడి ॥

కాంతుఁడదివో నిన్నుఁ గమ్మరఁ బిలిచీ
వంతులు వాసులు వద్దేలే
చెంతల నిలువవె చేఁతలు దక్కెను
అంత గొణఁగకువె అప్పటివలెను ॥ కూడి ॥

శ్రీవేంకటపతి చేతులు చాఁచి
వావులడుగనిఁక వద్దేలే
అవటించితి (వి) అలమేల్ మంగవు
ఆవెరవేఁటికి అప్పటివలెను ॥ కూడి ॥ 369

## ముఖారి

మొదలనె యెరఁగవా మొగి నీపాటివాఁడు
చెదరి చింతించఁబోతే సిగ్గుగాదా నాకు ॥ పల్లవి ॥

అలిగినవాఁడవు అట్టె వుండక నన్ను
పిలిచేవు చేయివట్టి పెనఁగేవు
యెలమినింతటివాఁడు యెంత దమకించీనంటా
చెలులెల్లనాడుకొంటే సిగ్గుగాదా నీకు ॥ మొదల ॥

వొట్టువెట్టుకొన్నవాఁడవు వున్నతిఁ జెల్లించుకోక
వట్టేవు నాకొంగు వచ్చిదేరను
పట్టలేక నీవాడిన పంతము దప్పినాడంటే
చిట్టకపు కాంతలలో సిగ్గుగాదా నీకు ॥ మొదల ॥

ఆవలి మోహమైనవాఁడ వలమేల్మంగనంటా
శ్రీవెంకటేశ నన్నుఁ జేకొంటివిట్టె
భావమెరఁగక నిన్ను పరులెల్లా నవ్వితేను
సేవసేసేవారివద్ద సిగ్గుగాదా నీకు ॥ మొదల ॥ 370

## లలిత

ఏకతాన నేనింక నేమిసేసినాఁ జెల్లె
సాకిరివెట్టి నన్నిఁక సాధించఁగలదా ॥ పల్లవి ॥

పీఁటమీఁదఁ గూచుండి పెనువేలనే మొ(నొ?)క్కె
ఆఁటదాని గర్వమెంత అదె చూడరే
మాటలు నేనాడిన మగిడి చూడదు తాను
నీటు నాతో నిటువలె నిలుపఁగఁ గలదా ॥ ఏక ॥

మలగుపై నొరగుండి మారుమోముతో లేచె
చెలియ రాజసమెంత చేరిచూడరే
మలసి నే నవ్వినాను మచ్చికకు లోనుగాదు
చలము నాతోనింక సాదించఁగలదా ॥ ఏక ॥

గందము పూయుచునుండి కాఁగిలించుకొనె నన్ను
యిందుముఖితమి యెంత యిదె చూడరే
అంది శ్రీవెంకటేశుఁడ నలమేలుమంగ తాను
పందెమాడి నన్నుఁ గూడె బడి వాయఁగలదా ॥ ఏక ॥ 371

## బౌళిరామక్రియ

ఊరకే మీరేలమ్మ వొద్దనాతని సాదించ
ఆరయ ముందెరఁగ(గనా?) నేనందరిశాంతములు ॥ పల్లవి ॥

అమ్మరో మిమ్మింతమాట ఆడకుండఁగానే కాక
వుమ్మడి మీరోరిచేరం ఓసోసి నేఁడు
యెమ్మెల నాకుఁ గాఁగానే యింతేసి బుద్ధి చెప్పేరు
మిమ్ము సోఁకి వచ్చితేఁగా మీరాతనిసందురు ॥ ఊరకే ॥

చెనకి మిమ్మింత చేఁత సేయకుండఁగానె కాక
పనివడి యాతని వెంబడేరా మీరు
తనిసి నాకుఁ గాఁగానే తగవులు నెరపేరు
కనలి మీవరుసై తేఁగా పతినందురు ॥ ఊరకే ॥

బలిమి మిమ్మింత యెడవాయకుండఁగానే కాక
వలపు చల్లకుండేరా వానిపై మీరు
అలమేలుమంగ నేను అతఁడు శ్రీవేంకటేశుఁ–
డలరి కూడితిమి మిమ్మంటేఁగానం (యం?) దురు ॥ ఊరకే ॥

రేకు-663 ## పాడి

పట్టిన చలమేకాక పంతమిచ్చేనా
తిట్టితేఁ దిట్టుదుఁగాక దీవించేనా ॥ పల్లవి ॥

నన్నుఁ దానట్టే చూడఁగ నవ్వితేనేమాయ
విన్నకన్నచెలులాల వెంగెమా యిది
పిన్నదాననంటానే పిలిచి వాదుకు వచ్చి
యెన్నిచెప్పినాఁ దనకు యింక లోఁగేనా ॥ పట్టిన ॥

వాడివట్టి తియ్యఁగాను వోపనంటేనేమాయ
కడనున్న సతులాల కానిదా యిది
బడలినవేళనే పట్టి పెనఁగవలెనా
వడఁబడుఁగాక తనవద్దకి వచ్చేనా ॥ పట్టిన ॥

తావుకుఁ దా రాఁగాను తలవంచితేనేమాయ
వోవో పొరుగువార వొరటా యిది
శ్రీవేంకటేశ్వరుఁడు చేరి తానె నన్నుఁగూడె
యీవల నలమేల్మంగ నెదురాడేనా ॥ పట్టిన ॥ 373

సాళంగనాట

కడునేము చేతఁ జులుకనివారము
తడవకు మమ్మునిట్టే దయఁజూడవయ్యా ॥ పల్లవి ॥

చెక్కునొక్కినంతలో చేరి వాదుకు వచ్చేవు
యిక్కువ గోరు దాఁకితే నేమందువో
ముక్కుననుండుఁ గోపము ముంచి నీవంటివానికి
నిక్కిమాతో నవ్వరాకు నీవెన్నఁడునయ్యా ॥ కడు ॥

మోము చూచినంతలోనే మొక్కలానఁ గసరేవు
యేమని నిన్నుఁ దిట్టినా నెంతసేతువో
దీమసమింతలేదు తేరి నీవంటివానికి
కామించి మమ్ముఁ బట్టకు కైదప్పులౌనయ్యా ॥ కడు ॥

దగ్గరికి వచ్చినంతలో తమకించి దూరేవు
యెగ్గులు నిన్నెంచితేను యేమందువో
నిగ్గుల శ్రీవేంకటేశ నేఁడే నన్నుఁ గూడితివి
అగ్గపుటలమేల్మంగ నదెంచుకోవయ్యా ॥ కడు ॥ 374

## బౌళి

దొడ్డవాఁడు దొరకొంటే తుదిమొదలెరఁగఁడు
యెడ్డలము మాకోఁటి కిఁక నేఁటిదయ్యా ॥ పల్లవి ॥

చెలులిద్దరిమీఁదను చేతులు చాఁచుకవుండి
యెలమి నాతో సవ్వేవిదేమయ్యా
వేఁపు సిగ్గెరఁగదు వడిననేమాటలు
యెలమి నీయందె కంటిమిఁక నేఁటిదయ్యా ॥ దొడ్డ ॥

మాఁటొక్క సతితోనాడి మనసొక్క కాంతకిచ్చి
యేఁటికి నాకు మోహించే విదేమయ్యా
పాటిలేనిది వయసు పట్టరాదనేటిమాట
యీటునఁ జెల్లబెట్టితి విఁక నేఁటిదయ్యా ॥ దొడ్డ ॥

కాఁగిటనిద్దరిఁ బట్టి కతలు నాకుఁ జెప్పేవు
యేఁగక శ్రీవేంకటేశ యిదేమయ్యా
కాఁగిన యలమేల్‌మంగఁ గనక నన్నుఁ గూడితి-
వేఁగుబెండ్లి నీకుఁ జెల్లె నింక నేఁటిదయ్యా ॥ దొడ్డ ॥ 375

## కాంబోది

సతితోడ సారెసారెకు సరసములాడుకొంటా
తతితోడనారగించీ తగునె యీదేవుఁడు ॥ పల్లవి ॥

ఒక్కమాటె వంటలెల్లా నొద్దనుండి వడ్డించి
మిక్కిలినలసె నలమేలుమంగ
చెక్కులఁ జెమటగారఁ జేరి యీపె వడ్డించఁగా
చొక్కిచొక్కి యారగించీఁ జూడరె యీదేవుఁడు ॥ సతితో ॥

పాఱి పాఱి బంగారుపళ్ళెములు వెట్టించి
మీఱి బుసకొట్టె నలమేలుమంగ
జాఱిన తురుముతోడఁ జవులాకె యడుగఁగ
ఆఱడి గూరలు మెచ్చీనంతలో నీదేవుఁడు ॥ సతితో ॥

వాలిన రాజసముతో వంటసాలలోననే
మేలిమిఁ గూచున్న దలమేలుమంగ
యీలోనె శ్రీవేంకటేశుఁడీపెఁ దానునారగించి
తాలిమిఁ గాఁగిటఁగూడె దక్కక యీదేవుండు ॥ సతితో ॥ 376

గౌళ

ఏమిననఁ జాలము యెట్టైనఁ జేయుము
నీమనసే వచ్చీఁగాక నేఁడే వేగిరమా ॥ పల్లవి ॥

మన్ననగలుగువారి మాటలెల్లాఁ జక్కనే
వున్నవారి మాటలెల్ల నూసివాసులే
పన్ని మగఁడు చేవట్టి పాటించినదె యాఁటది
నన్నలెంత సేసినాను నంతవారు నతమా ॥ ఏమి ॥

చెల్లుబడిగలవారి చేఁతలెల్లా హితవే
చిల్లరవారి చేఁతలు చిరుచేఁదులే
బల్లిదునిచేతనుంటే పచ్చఁబూస మాణికమే
కల్లమాడ దొడ్డముద్ర కతకుఁ గాళ్ళున్నవా ॥ ఏమి ॥

యిచ్చయెఁరిగినచోటి యెమ్మెలెల్ల నమ్మితే
తచ్చనైనచోటిపొందు తడతాఁకులే
అచ్చపు శ్రీవేంకటేశ అలుమేలుమంగను నే-
నిచ్చగించి కూడితిరి(మి?)యిఁక మోసమున్నదా ॥ ఏమి ॥ 377

హిందోళం

ఎందరులేరు నీకు నేనేమి కాఁతెయ్యా
అంది నాపైఁ జెయివేసేవు అట్టెకానీవయ్యా ॥ పల్లవి ॥

అలిగి నేరాఁగానే అట్టె నావెంట విచ్చేసి
యెలమిఁ బైకొనేవు నేనేమి కాఁతెయ్యా
పలుకకుండఁగ నన్నుఁ బచరించి పచరించి
యెలుఁగిచ్చి మాటాడేవెంత సేసేవయ్యా ॥ ఎందరు ॥

ముసుఁగు వెట్టుకుండఁగ ముచ్చటతోఁ గొంగుదీసి
యిసుమంత నవ్వేవు నేనేమి బాఁతెయ్యా
విసుగుచునున్న నన్ను వేఁడుకొని నీవు నాకే
వసమై పాయవు ఇంతవలెనా నాకయ్యా ॥ ఎందరు ॥

అదన నేఁ బండుండఁగ నండ నీవూఁ బవళించి
యిదె కాఁగిలించేవు నేనేమి బాఁతెయ్యా
వుదుటు శ్రీవేంకటేశ వొగినలమేలుమంగ-
నిదివో నన్ను గూడితి వెంతవాఁడవయ్యా ॥ ఎందరు ॥ 378

రేకు-664 భైరవి

ముచ్చటాడేనంటే ముంచేవు పరవశాలు
వచ్చిరాకతొల్లే వలెనా నీమాయలు ॥ పల్లవి ॥

తమకాన నే నిన్ను దగ్గరి కూచుండితేను
కమలాన వేసి నన్నుఁ గరగించేవు
ప్రమదానఁ దొలుతనే బ్రమసినయాఁటదాని
తిమురు వలపుచల్లి దిమ్ము రేఁచవలెనా ॥ ముచ్చ ॥

మాటలాడేనంటా నీతో మనసై వచ్చివుండఁగా
నీటుననిప్పుడే మోవి నీవానేవు
ఆఁటదానియాస వేరే అంతరంగాననుండఁగా
తాఁటలఁ దూఁటలఁ బెట్టి తనియించవలెనా ॥ ముచ్చ ॥

ఆసపడి నీమోము అట్టె నేఁ జూడఁగానే
వేసానఁ గళ దాఁకించి వేగిరించితి
నీసరి సేసవెట్టితి నేనలమేల్మంగనిదె
రాసికి శ్రీవేంకటేశ రతులిన్నివలెనా ॥ ముచ్చ ॥ 379

కన్నడగౌళ

చెప్పఁబోతే నవ్వువచ్చీఁ జెల్లబో నాకు
తప్పులౌనో వొప్పులౌనో తడవఁగనోపనే ॥ పల్లవి ॥

యెన్నిమారులు చెప్పించి నేకతము గలదంటా
నిన్నటి మాటలే కా నేఁడాడేవి
తన్నుఁదానే యాడుకొని (నీ?) తనిసితి నన్నిటాను
విన్న దానఁ దొల్లే తనవిచారములెల్లను ॥ చెప్ప ॥

గొడవ లడువఁగానే కొంగువట్టి తీసిని
వడిఁ దొల్లి తీసినవి వడ్డివారిని
నడుమ నడుమనేల నయములుఁ బ్రియములు
వడిఁబడు నేఁకమీఁద వలపు చల్లినను ॥ చెప్ప ॥

కదిసి కదిసి నన్నుఁ గాఁగిటనె బిగియించి
మది గలిగినంతే కా మంగళమిది
అదన శ్రీవెంకటేశుఁ డలమేలుమంగను న-
న్నుదుటను గూడెఁ దలఁపొక్కటాయనిపుడు ॥ చెప్ప ॥ 880

సామవరాళి

ముందుముందె యింకనైన మోపపోకువయ్యా నీవు
మందయాన వాసికోడి మనసెరంగదా ॥ పల్లవి ॥

సిగ్గుగలయాఁటది చేరఁ బిలువక యుంటే
యెగ్గులెంచక విభునినేల మానునే
దగ్గరి యంతలో వచ్చి తానెంత వేఁడుకొనిన
కగ్గినట్టి తనలోని కపటాలు మానునా ॥ ముందు ॥

ననుపు గలుగుదాని నవ్వుతో మాటాడకున్న
యినుమడి గోపగించకేల మానును
వినయాలిప్పుడు వచ్చి వేవేలు సేసినాను
నినుపుల పెదవిపై నిష్ఠూరాలు మానునా ॥ ముందు ॥

మరిగిన కాంతను మరఁగునెట్టేనంటే
యిరవై పైకొనుఁగాక యేల మానును
అరుదై శ్రీవెంకటేశ అతివఁ గూడితివిట్టె
సిరులంటుఁగాక సేసినమేలు దాఁగునా ॥ ముందు ॥ 881

ఆహిరి

పాముకాటు చీరఁ దోమఁ బాసునా నేఁడు
యీమతక మెరఁగమా యేమయ్య విభుఁడా ॥ పల్లవి ॥

చక్కని యింతి యొకతె సారెసారె నీమీఁద
మక్కళించీ వలపులు మాటలలోనే
చెక్కుచేత నెరఁగమి సేసుక నీవిందరిలో
యెక్కడో చూచి నవ్వేవు యేమయ్య విభుఁడా ॥ పాము ॥

కిమ్ములనుండి యాపె గిరుపులాఁ గన్నులనే
చిమ్ముచు లోనికి సన్న సేయఁగాను
నెమ్మదినిందరిలోన నిన్నుఁగానివానివలె
యెమ్మెతోఁ బరాకు సేసేవేమయ్య విభుఁడా ॥ పాము ॥

చలివాసి యాపె నీతో సరసములాడఁగాను
తలవంచి నీవేల దాఁగఁ జూచేవు
అలమేలు మంగను నేననుచు శ్రీవేంకటేశ
యెలమిఁ గూడితి వింక నేమయ్య విభుఁడా ॥ పాము ॥ 382

కేదార గౌళ

తనకే వేడుకగాక తగునా నాకు
ననుఁ జూచి చెలులెల్ల నవ్వరా యిప్పుడు ॥ పల్లవి ॥

చల్లనిచూపులు నాపైఁ జల్లిచల్లి కప్పురము
వొళ్ళఁ బూసీనిదె వీఁడు వోపనన్నాను
పల్లదానఁ దనచేతిబాదకుఁ జాలక కొంగు
వల్లెవాటు వేసుకొంటే వద్దనీనే తాను ॥ తనకే ॥

చేముట్టి సరసమాడి చిక్కుదీసి కొప్పునను
తామరలు ముడిచీని తలమన్నాను
యేమీననవెరచి నేనింటిలోనికిఁ బోఁబోతే
ఆమేరకుఁ బోకుమంటా నానవెట్టీఁ దాను ॥ తనకే ॥

చెవిలోన మాటాడి చేతికిఁ గిన్నెర యిచ్చి
నివిరి నాచెక్కు నొక్కి నేరవన్నాను
అవునె శ్రీవేంకటేశుఁ డలమేలు మంగను న-
న్నివలఁ గూడి మెచ్చినెంత కెంతే వీఁడు ॥ తనకే ॥ 383

నాదరామక్రియ

ఏమే నీచలము నేఁడెంత కెంతే
దీమసాన మొక్కఁగానే తిట్టుకొనేవు ॥ పల్లవి ॥

పానుపుమీఁదనే వుండి పలికేవు నేఁడు
పేని పట్టాతడు నిన్నుఁ బిలువఁగాను
మోనాన వేసాలకు ములిగేవు యిట్టె
నానఁ బెట్టాతఁడు నీతో నవ్వు నవ్వఁగాను ॥ ఏమే ॥

నిండా ముసుఁగు వెట్టుక నిద్దిరించేవు అతఁ-
డండనే కూచుండి నిన్ను నలమఁగాను
వుండుండి చెలులఁ బిలిచే వొద్దికి నీవు
దండిగా నాతఁడు తానె తలుపు మూయఁగను ॥ఏమే ॥

మరిగి మాటున యాకు మడి చిచ్చేవు
కరఁగి యాతఁడు నీమొగము చూడఁగా
అరసి శ్రీ వేంకటేశుఁ డలమేలుమంగ నిన్నుఁ
గెరలి కూడినమీఁద గెలిసేసేవు ॥ ఏమే ॥ 384

రేకు-665 శ్రీరాగం

ఎవ్వర మేమైతి మేమి యేలే తనకు
నవ్వుతా నుండీఁ దనకు నయ మిదే కాదా ॥ పల్లవి ॥

చింతతో నుందాననంటాఁ జెక్కుచేయిడితినంటా
కొంత గొంత నన్ను నేల గోర సేసీనే
యింతులైనవారిఁ దెచ్చి యింత సేసితి వనేటి-
పంతము చెల్లెఁ దనకు ఫల మిదే చాలదా ॥ ఎవ్వ ॥

వేడెము నేఁ జేయనంటా విచారాలే పెంచ్చెనంటా
యీడ నాడ వారితోడ నేల చెప్పీనే
వూడిగము సేయఁగానే వొద్దఁ గూచుండు మనీని
వాడు దేరి తానుండితే వంతు మాకుఁ జెల్లునా ॥ ఎవ్వ ॥

తలవంచుకొంటినంటా తాపాన నుందానవంటా
పలికించి నన్ను నేల బాద పెట్టీనే
యెలమి శ్రీవేంకటేశుఁ డిట్టె తానె నన్నుఁ గూడె-
నలమేలుమంగను నే నదేమేలు గాదా ॥ ఎవ్వ ॥ 385

## దేసాక్షి

నమ్మినవారిపాలిటి నచ్చిన చింతామణి
నమ్మి వరాలిచ్చే విదే పదవేమి గడమా ॥ పల్లవి ॥

పూచినతంగెడువంటి పొలిఁతి నీవురమున-
నేచినది నీసింగార మేమి చెప్పేది
కాచి పండినకల్పవృక్షమువలె నీమేను
చేచేత దొరకెనిదె సిరులేమి గడమా ॥ నమ్మి ॥

అరచేతిమాణిక్యమై యాపె నీపొత్తున
యెరుక సేకారగించీ నేమి చెప్పేది
గురుతైన నీలాల కొండవలె నీవు నీవు (?)
జరగుచు నున్నారు జయమేమి గడమా ॥ నమ్మి ॥

ముంగిట నిధానమైన మోహపుటలమేల్మంగ
అంగమందే కొలువున్న దదివో నీకు
సంగతి శ్రీవేంకటేశ సరిఁ బరుసవేదివై
సంగడి నున్నారు మాకు చనమే(వే?)మి గడమా ॥నమ్మి॥ 386

## కన్నడగౌళ

తన్నుఁ బాసి వుండలేను తా నన్ను విడువలేఁడు
యిన్నియు నిందులో నున్న వెడ తాఁకనేలే ॥ పల్లవి ॥

మాయలు నేఁ జేయనేర మతకాలు నేనేర
చేయిచేత నూడిగాలు సేయనేరుతు
చాయల నాడవలదు సణఁగు లంత వలదు
సాయము దనకిచ్చితి పలుకు లింకేలే ॥ తన్ను ॥

చలము సాదించఁ జాల జంకించ నేఁ జాల
పిలిచితే దగ్గరేటి ప్రియమే కాని
ములుగుచు నుండనోప ముంగోపాన కంత వోప
తలఁపెల్లఁ దనసొమ్మే తారుకాణ లేలే ॥ తన్ను ॥

నమ్మికడుగ వెరతు నాటకాలకు వెరతు
యిమ్ములఁ దనకు నే మోహించితి నిదే
అమ్మరో శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
సమ్మతించి నన్నుఁ గూడె సారెఁ జెప్పనేలే ॥ తన్ను ॥ 387

నాగవరాళి

ఇంచుకంత నే నేమన్నా నింతసేసేవు
వుంచవుకోవెల కూఁత కోరి చెట్టుంటివిరా ॥ పల్లవి ॥

చెక్కు నొక్క రాఁగాను జీరవారెనో యేమో
యెక్కువ నొచ్చె ననేవు యేమాయరా
కక్కసించి మరుఁ డేసేగంటిలేనిపోట్లకు
తక్కక ఇందాఁక నెట్టు ధరియించితివిరా ॥ ఇంచు ॥

తమ్మరస ముమియఁగ తప్పి నీపైఁబడె నేమో
యెమ్మెలకో కోపగించే వేమాయరా
యిమ్ముల నాచెలులాడే యెంగిలిమాటలకెల్ల
అమ్మరో నీవెట్లను అలుగ వైతివిరా ॥ ఇంచు ॥

కొప్పు నీకుఁ బెట్టఁగాను కుచములు సోఁకె నేమో
ఇప్పుడే మైమరచే వేమాయరా
అప్పణ శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
దప్పికి నీమో వానితి తాలిమి నెట్టుంటివో ॥ ఇంచు ॥ 388

## పాడి

ఇద్దరి నడిమిబాస లెవ్వరిఁ దాఁకునో యంటా
అద్ది చెక్కుచేయిడితి నందుకే వోయమ్మ ॥ పల్లవి ॥

కంటే నొకమాటయుఁ గానకుంటే నొకమాటా-
నింటివాఁడై యాడేవాని కేది వాటో
నంటున నే నెంతైన నాకుఁగా వగవ నీ-
గొంటు చందమునకే గొదిలే నమ్మా ॥ ఇద్ద ॥

మంచముపై నొకకాలు మరినేల నొకకాలు
యెంచుకొంటా మోపేవాని కేది వాటో
అంచెల నావిరహాన కందుకేమీ ననఁ గాని
కొంచించేను వానిలోని కుచ్చితాన కమ్మా ॥ ఇద్ద ॥

కనుచూపులనే కొంత కాఁగిటి లోపలఁ గొంత
యెనసి చొక్కేవాని కేది వాటో
అనుఁగు శ్రీవేంకటేశుఁ డంతలోనే నన్నుఁ గూడె
పనివడి యిందుకే కా భ్రమసితి నమ్మా ॥ ఇద్ద ॥ 389

## లలిత

ఆపె నీకుఁ దగు నీవు నాపెకే తగుదు వయ్యా
చేపట్టి మీ యిద్దరికిఁ జెప్పరాదు మోహము ॥ పల్లవి ॥

తామెరరేకులవంటి తగునీకన్ను లనుచుఁ
దామెరలే చేతఁబట్టెఁ దరుణి
కామించి పాలజలధికడఁ బవ్వళింతు వని
కోమలి పాలజలధి కూతురాయ నదివో ॥ ఆపె ॥

బంగారు పచ్చడము నీపైఁ గప్పితి వంచు
బంగారుపతిమాయఁ బడఁతి
అంగవించె నీపాద మాకాశ మంటాను
అంగన తననడుము ఆకసముఁ బోలెను ॥ ఆపె ॥

కొండపై శ్రీవేంకటేశ కోరి నీ వెక్కితి వని
కొండవంటి నీవురము కొమ్మ యెక్కెను
అండ నలమేలుమంగ ఆపె నీకుఁ గలుగఁగా-
నండ నీదాసులకు నీ వాపె యూ గలిగితివి ॥ ఆపె ॥ 390

రేకు-666 శుద్ధవసంతం

మెల్లనె మెల్లనె వచ్చి మేర మీరేవు
చెల్లునంటా గొల్లెతలఁ జేకొంటిగా వోరి ॥ పల్లవి ॥

తొలుతనే నీవు నన్ను తొంగలిచూపులఁ జూచి
పలికిం చెప్పటిఁ జేయి పయి వేసేవు
బలువుఁడవు గనక పాయపువారి నిందరి
చెలఁగి కన్నెరికాలు చేకొంటిగా వోరి ॥ మెల్ల ॥

వచ్చి వచ్చి నవ్వు నవ్వి వలపులు నాకు రేఁచి
పచ్చిగాఁగ నాకొంగు పట్టఁ జూచేవు
హెచ్చి వువ్నాఁడవుగన యెఱఁగని వారిని
చెచ్చెర లోనుసేయక చేకొంటిగా వోరి ॥ మెల్ల ॥

పెరరేఁచి నామీఁదఁ బ్రియములు చల్లి చల్లి
కరఁగించి నన్నుఁగూడి కాఁగిలించితి
అరిది శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
సిరుల నందరి నిట్టె చేకొంటిగా వోరి ॥ మెల్ల ॥ 391

మాళవిగౌళ

చొల్లెపుఁజుట్లతోడి చుంగులరాజసముతో
వెల్లవిరిగా నేఁగేరు వీడెపుమోవులను ॥ పల్లవి ॥

అంగనకుఁ దనపాదా లంకవన్నెలు సేసుక
రంగుగాఁ దొడఁదొడయు రాయఁగాను
సింగారపు సొమ్ములతో చెంగావి ముసుఁగుతోడ-
నంగవించీ యూపె దన కాసలు రేఁచఁగను ॥ చొల్లె ॥

కదలు కదలుకును కాంత వాలారుగోళ్ళ
నదిమి యదిమి తన్ను నంటఁబట్టఁగ
ముదిత యాకు మడిచి మోవిసె అందియఁగాను
మదనపరవశాన మలసీని వీఁడిదివో ॥ చొల్లె ॥

కలకలనవ్వులతోడ కస్తూరి నామముతోడ
అలమేలుమంగ దన్ను నట్టే మెచ్చఁగా
యెలమి శ్రీవేంకటేశుఁ డేతులు నెరపుతాను
బలిమి నంకుశమునఁ బట్టి వొత్తీనదివో ॥ చొల్లె ॥ 392

నాట

నీవెంత దాఁచిన నవి నేఁడు దాఁగీనా
చేవదేరిఁ దొల్లిటట్టే సేయరాదా పనులు ॥ పల్లవి ॥

వనిత నిన్నుఁ బిలిచి వలపులు చల్లఁగాను
నినుఁ గానివానివలె నిలుచున్నాఁడవు యీడ
యెనసి నే నెరిఁగితే నిఁక నేల నీకుఁ గొంక
చెనకి వెల్లవిరిగాఁ జేయరాదా పనులు ॥ నీవెంత ॥

తమకించు యాకె నిన్ను దగ్గరి చే వట్టఁగాను
బ్రమసిన వానివలెఁ బరాకు సేసుకొనేవు
అమరఁగ నేనా కంటి నడ్డము లేదిఁక మేను
చెమరించ నేల మీరి సేయరాదా పనులు ॥ నీవెంత ॥

ఇంతి నీవు లోనఁ గూడి యిట్టె నన్నుఁ గనివచ్చి
వంతుకు నాకాఁగిటిలో వాడుదేరేవు
అంతటి శ్రీవేంకటేశ యలమేలుమంగ నేను
చింతదీరఁ గూడితిమి సేయరాదా పనులు ॥ నీవెంత ॥ 393

గుండక్రియ

ఎప్పుడు నీవోజ లివి యేల మానేవు
ముప్పిరి నీచేఁత లిట్టే మూసి దాఁచవలెనా ॥ పల్లవి ॥

చేయి మూటు సేసుక యాచెలి దిక్కే చూచేవు
యీ యెడఁ గొలువుకాంత లిందరిలోన
ఆయాలు దాఁక సందడి నాకెపాదాలే తొక్కేవు
మాయకాఁడ ఇంతేసి నీమతక మెరఁగమా ॥ ఎప్పు ॥

అద్దలించేవానివలె నాపెతోనే పలికేవు
వొద్దికై నసతులెల్ల వొద్ద నుండఁగా
బద్దుల బడలికతోఁ బట్టే వాపెకై దండ
కద్దులేరా నీవొళ్ళికపటా లెరఁగనా ॥ ఎప్పు ॥

యెగసక్కెనివలెనే యీపెతోనే నవ్వేవు
సొగసి తోడిసతులు చూడఁగానే
అగపడి కూడితివి అలమేలుమంగ నేను
తగు శ్రీవేంకటేశ నీతమక మెరఁగనా ॥ ఎప్పు ॥ 394

ముఖారి

ఉండనీరా యీపాటి వూరకే నన్ను
కొండెగోడి(?) తనాలకుఁ గోపమెల్లా వచ్చును ॥ పల్లవి ॥

చుట్టమవౌతా నెరఁగ సూడు బంటవో యెరఁగ
అట్టె నాతో నాపెసుద్దు లాడుకొనేవు
ముట్టి ముట్టి నేము నీతో ముచ్చటలు చెప్పుకోఁగా
యెట్టు వచ్చునో యెరఁగ మేమీ ననవొల్లము ॥ ఉండ ॥

నగవౌతా నెరఁగము నాటకమో యెరఁగము
తగవు నన్నడిగే వాతరుణిమాట
నిగిడి పోపో చాలు నిన్ను నెవ్వఁ డెరుఁగును
యెగసక్కెఁడవు తొల్లే యేమీ ననవోపము ॥ ఉండ ॥

నెపమౌతా నెరఁగము నెయ్యమౌతా నెరఁగము
ఇపుడు వచ్చితిరి మాయింటికి మీరు
అపుడె శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
చపలతఁ గూడితి సాదించ నే నోపను ॥ ఉండ ॥ 395

* ఈ పదమందలి లింగవచన సంకరముచే, సందర్భము దుర్గ్రహముగా నున్నది.

సామంతం

పువ్వుఁబోణులకొలువే పుష్పయాగము
పువ్వక పూచె నీకిట్టే పుష్పయాగము ॥ పల్లవి ॥

కలువరేకులవంటి ఘనమైన కన్నుల
పొలఁతులచూపులే నీ పుష్పయాగము
తలఁచి తలఁచి నిన్నుఁ దమమేనులఁ బొడమే
పులకజొంపములే నీ పుష్పయాగము ॥ పువ్వు ॥

కరకమలములను కందువ గోపికలెల్లా
పొరసి నిన్నుఁ జూపులే పుష్పయాగము
సరసపుమాటలే సారె నాడి తమ నవ్వు
పొరి నీపైఁ జల్లులే పుష్పయాగము ॥ పువ్వు ॥

గాఁటపుఁగొలనిదండఁ గాంతలు సిగ్గున నిన్ను
బూటకానకుఁ దిట్టులే పుష్పయాగము
యీటువ శ్రీవేంకటేశ యిట్టె యలమేలుమంగ
పూఁట పూఁట రతు లివి పుష్పయాగము ॥ పువ్వు ॥ 396

రేకు-667 ధన్నాశి

చెప్పరా నీకు నాతోడు సిగ్గు లింకేల
రెప్పల తుదల నేఁడు రిచ్చవడి వున్నది ॥ పల్లవి ॥

యెవ్వతికో మేలువాడ విటు నీవు గాఁబోలు
అవ్వల నీచేయి వెచ్చనై వున్నది
దవ్వుల నున్నయాకెఁ (కె?) దలఁపునఁ జారఁబోలు
పువ్వువంటిమోవు చిన్నఁబోయి వున్నది ॥ చెప్ప ॥

యిక్కువ చెప్పించి యాకె యీసుద్దికి రాఁబోలు
చెక్కుచేతితో నీకు చింత వున్నది
దక్కి యాపెవలపు నీ తలకెక్కి వుండఁబోలు
పిక్కటిల్లి మాటల తబ్బిబ్బులై వున్నది ॥ చెప్ప ॥

తొయ్యలి గొన్నాళ్లాసలు తోయరాకుండఁగఁ బోలు
కొయ్యతనాఁకు మతిఁ (తి?) గొంకి వున్నది
నెయ్యపు శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
యియ్యెడ నన్నుఁగూడితి వెందు నాపె వున్నది ॥ చెప్ప ॥ 397

## మాళవశ్రీ

నీతలఁ పెట్టున్నదో నే నెరఁగఁము
రాతిరెల్ల నేము జాగరముతే సేసితిమి ॥ పల్లవి ॥

చింతదీర నీతోడ చేరి మాటాడిన దాఁకాఁ
కాంతకుఁ దనలోనికాఁక మానదు
మంతనాన తానే నీ మనసు దెలియుదాఁకా
యింతట నంతటినుండి యెదురు చూచీని ॥ నీతలఁ ॥

దగ్గరి కూచుండి నీతోఁ దగిలి నవ్వినదాఁకా
అగ్గమైన తన ఆస దీరదు
సిగ్గుదీర నీకుఁ దానే సేవసేసేనంటే (టా?)
వొగ్గి నీవొద్దికిఁ దనవువిదల నంపెను (పీని?) ॥ నీతలఁ ॥

గక్కన నీమోముఁ దనకన్నులఁ జూచినదాఁకా
మొక్కలపుఁ దనలోని ముచ్చట వోదు
యిక్కు వెరిఁగి శ్రీవేంకటేశ యింతిఁ గూడితివి
వెక్కసపుసంతసాల విట్టువీఁగీ నిదివో ॥ నీతలఁ ॥ 398

## కన్నడగౌళ

ఎట్టుసేసినా నీకు నెదురాడేనా
మట్టునఁ జెప్ప సేటమాట కింతేకాక ॥ పల్లవి ॥

చెప్పవలశొకమాట చెప్పితి నింతెకాక
నెప్పున నా ఆయమెంత నే నెంత
యిప్పుడు నీసతినై యిట్టుండఁగఁ జూచినవా-
రుప్పటించే రనేమాఁట కొక్కటికె కాక ॥ ఎట్టు ॥

సోరిది నామేనికాఁక చూపితి నింతేకాక
నిరతి నాయలుకెంత నే నెంత
దొరవు నీవు చేపట్టి తుదఁ జింతించి ననేటి-
పరులమాటలకు నేఁ బడఁ జాలఁ గాక ॥ ఎట్టు ॥

చెలఁగి నీమనసు రాఁజేరి నేఁ గూడితిఁ గాక
నిలువు నావలపెంత నే నెంత
నెలవై శ్రీవేంకటేశ నీవు మన్నించిన నేను
బలవంతురాల ననే పంతానకె కాక ॥ ఎట్టు ॥ 399

రామక్రియ

తతిఁ దానె దొరయైతే తనంత బదుకుఁగాక
సతులము మమ్మునేల జంకించీనే తాను ॥ పల్లవి ॥

పాయపువిభుఁడు కొంగు వట్టితే రానైతినంటా
చాయః సన్నలఁ దిట్టీ సారెసారెకు
మాయంతనే అప్పటిని మాటలాడ మైతిమంటా
రాయడించీ నూరకైనా రాజసమా తాను ॥ తతి ॥

ననిచి తా దగ్గరితే నవ్వనైతి నంటాను
కనుఁగొనల గోపించీఁ గడకూఁ దాను
మునుపనే తనకు నే మొక్కనైతి నంటాను
యెనలేక పగ చాటీ నేతులా తాను ॥ తతి ॥

చెక్కు నొక్కి కూడఁగాను సిగ్గుతో నే నుంటినంటా
మిక్కిలి బుజ్జగించీని మీఁద మీఁదను
యిక్కడ శ్రీవేంకటేశుఁ డిచ్చేరిఁగి నన్నుఁ గూడె
దక్కితి నంటాఁ. బొగడీ తగవా తాను ॥ తతి ॥ 400

మంగళకౌశిక

ఎందాఁకా నీ సరసాలు యింత గలదా
కందువ నలపుదీరఁ గరుణించరాదా ॥ పల్లవి ॥

చెక్కులెల్లఁ జెమరించె చేరి నీవు నవ్వించఁగా
వొక్కమాటే యింతైతే వోపునా చెలి
కక్కసించే వెంత నీవు కఠినచిత్తుఁడవో
నిక్కి మాఁకై తేఁ జూచి నీరాయ మనసు ॥ ఎందాఁకా ॥

ఆరగించ నెరఁగదు అట్టె కతలు చెప్పఁగా—
నీరీతి దినమునై తే యింతి వోపునా
దూరినా మానవు యెంత దోసానకు వెరవవో
సారె మాఁకై తేఁ జూచి జడిసీనిఁ[1] దనువు ॥ ఎందాఁకా ॥

[?]దుదప్పి గొనె నిదె కాగిఁట నీవు గూడఁగ
కడగి పాయపుసతి కాఁక కోపునా
అడరి శ్రీవేంకటేశ ఆడికె కెంతోపుదువో
బడినున్న మాఁకై తేఁ బచ్చి దోఁచెఁ బనులు ॥ఎందాఁకా॥ 401

గుండక్రియ

ఏల నన్ను వేడుకొనే వేమి బాఁతి నేను
ఆలి మగని వరుసలంత నాకుఁ జాలదా ॥ పల్లవి ॥

సారె సారె నీమీఁద సణఁగులే చల్లితిని
మేరలు మీరి నవ్వితి మేనవావిని
యీరీతి నా యీఁడుజన్మ మింత దూరు గట్టె నాకు
చేరి నీమొగము చూడ సిగ్గు గాదా నాకు ॥ ఏల ॥

కన్నులనే తిట్టితిని కాఁకలనే జంకించితి
మిన్నక కొసరితిని మేనవావిని
నన్ను నింతేసి సేసెను నా జవ్వనమదము
అన్నిటా నీతో నాఁగ నప్పటి నామాఁటలు ॥ ఏల ॥

కలసినరతివేళఁ గాలు చేయి దాకించితి
మెలఁగి మోవెంగిలంటె మేనవావిని
యెలమి శ్రీవేంకటేశ యింత సేసె నాపొందు
పిలిచి మొక్కుట గాక బిగియఁ జోటేది ॥ ఏల ॥ 402

---

1. ఈ యరసున్న అనావశ్యకము.

రేకు-668 గుజ్జరి

దేవుఁడవు గా ఆపె దేవులు నీకైనాఁ గాని
చేవదేరినబుద్ధులు చెప్పితి మోయయ్యా ॥ పల్లవి ॥

కాంత గోపించి చూచితే కాముని యమ్ములై తాఁకు
సంతసించి చూచితేనే చకోరాలౌను
కాంతుఁడవు నీవెట్టు సాము సేసే వీపెతోడ
పంతము లాడక కిందుపడి వుండవయ్యా ॥ దేవు ॥

చెలి నిన్నుఁ దిట్టితేనే చిరు చెండులై తోఁచు-
నిల నిన్నుఁ బొగడితే నివె తేనెలా
చలపట్టి నీవెట్టు సరిదూఁగే వాపెతోడ
యెలమి యెప్పొద్దు నీవు ఇచ్చలాడవయ్యా ॥ దేవు ॥

వనితకాఁగిలి నీకు వలపులవలలౌను
తనిసి చేపట్టితేనే తమ్మి పూజలా
యెనసి శ్రీవేంకటేశ యీపెతో నెట్టు మీరేవు
మొనసి కూడితి విట్టె మొక్కు మొక్కవయ్యా ॥ దేవు ॥ 408

లలిత

మొక్కే నిదివో నీకు ముందు ముందే వట్టి-
లెక్కలెల్లా నెంచుకోక లేవరాదా ॥ పల్లవి ॥

పలుకులెల్లా వింటి భావములెల్లాఁ గంటి
చలము నాలోఁ దీరదు సటలేలా
నిలుచున్నాఁడ విదివో నీవు వచ్చి తడవాయ
పొలసి యెందు వోయేవో పోయి రారాదా ॥ మొక్కే ॥

మనసెల్లాఁ దెలిసితి మంతనాలఁ దనిసితి
నిను నేమీ ననఁజాల నెగు లేలా
పనులు నీకుఁ గలవు పడఁతులు విలిచేరు
నను పెక్కడ నున్నదో నవ్వి రారాదా ॥ మొక్కే ॥

కాయమల్లా నొరసితి కాఁగిటను గలసితి
పాయపు శ్రీవేంకటేశ బాస లింకేల
నాయము నీవెరుఁగుదు నాకు సరి గలరేమో
ఆయెడ నెవ్వరినైనా నడిగి రారాదా ॥ మొక్క ॥ 404

## బౌళి

వేళ రానీ మీకు నిట్టె వేగిర మేలే
కూళఁ గాను మీరింతలోఁ గొండెము చెప్పకురే ॥ పల్లవి ॥

ఆత డెంత సేసినాను అట్టె వోరుచుక వుంటే
నాతోడి చెలులే నన్ను నవ్వేరే
చేతఁగానిదానఁ గాను చెలువుని సరితలు
చూతమంటా నున్నదాన సుద్దులు చెప్పకురే ॥ వేళ ॥

వివరించి రమణుని వేసాలు దెలుసుకొంటే
సవతులు మీలో నేల సన్న సేసేరే
తివిరేటిదానఁ గాను దిట్టతన మితనిది
జవకట్టె నింతే మీకు జాణతనా లేలే ॥ వేళ ॥

కొచ్చి శ్రీవేంకటేశుఁడు కూడఁగా నేఁ బైకొంటే
ముచ్చటగా సతులేల మోము చూచేరే
పచ్చి సేసేదానఁ గాను బలువుఁ డాతని మేలు
కచ్చు పెట్టు కున్నదాన కాఁక రేఁచ నేలే ॥ వేళ ॥ 405

## కురంజి

నీవల్లనే వచ్చెఁ గాక నేఁ డింతేసిపనులు
పూవువలె నూరకుంటే పోరువెట్ట వచ్చేనా ॥ పల్లవి ॥

యియ్యరాని మాట నాకు నిచ్చితివి గనక నీ-
వెయ్యెడ నుంటివనంటి నిందాఁకాను
అయ్యయ్యో నీయిచ్చ నీవు అట్టే వుండితేఁ గనక
కయ్యా మడువఁగ నీతోఁ గారణము గలదా ॥ నీవ ॥

అక్కడ నెవ్వతె నొల్ల ననుకొందువు గనక
చెక్కురేక లేడవని చెప్పితి నింతే
చక్కని కొయ్యతనాల సహజాన నీవుండే
కక్కసించి రట్టు సేయఁ గారణము గలదా ॥ నీవ ॥

ముందే నాపై మోహము మోపు గట్టుదువు గాన
చెంది వేరొకతె పొందు సేయనీనైతి
కందువ శ్రీవేంకటేశ కాఁగిటఁ గూడితి నన్ను
కందు గుందు నీఁకనేల కారణము గలదా ॥ నీవ ॥ 406

## భైరవి

ఇన్నిటికి నిన్నడిగే దిదే యయ్యా
యెన్నికలు మాకు దాఁచ నీఁక నేఁటికయ్యా ॥ పల్లవి ॥

వనితల నంపఁగాను వత్తువో రావో యంటా
నినుఁ బిలువఁగ నేఁడు నేనే వచ్చితి
కనుసన్నలనే కాని కడుఁ దమకించరాదు
మనసులోపలిమాట మాకుఁ జెప్పవయ్యా ॥ ఇన్ని ॥

ఆకులు వా (వ్రా?) శంపఁగాను అనుమానింతువో యంటా
చేకొని నేనే విన్నవించితి నింతాను
వాకు ప్రియమే కాని వడిఁ గోపించఁగ రాదు
యేకొలఁది నీమోహ మెఱిఁగించవయ్యా ॥ ఇన్ని ॥

కానుక లిచ్చి యంపగా కందువో కానవో యంటా
ఆనుక నే నిలుచుంటి నాయాలు సోక
నేను సేసినభాగ్యాన నీవె నన్నుఁ గూడితివి
కానిలే శ్రీవేంకటేశ కరుణించవయ్యా ॥ ఇన్ని ॥ 407

## రామక్రియ

తలచిన పనులెల్లఁ దలకూడెను
తలిరుఁ బోడికి నీకుఁ దగునయ్యా ॥ పల్లవి ॥

వింతగా చెలనవ్వులే వెన్నెల ఛాయలు నీకు
పొంత నధరామృతమే పులుఁగాలు
దొంతివెట్టి వలపులు తోడఁ దోడ నీకెదురు
చింతతోఁ జూడఁ దొడఁగె చేకొనవయ్యా ॥ తల ॥

చిక్కని జవ్వన మిదె సింగారపుఁదోఁట నీకు
పుక్కిటివీడేలు వనభోజనాలు
మక్కువఁ బానుపుమీఁది మాటలప్రియాలతోనే
యెక్కువ విందులు చెప్పి నియ్యకొనవయ్యా ॥ తల ॥

యాపెకాఁగిలే నీకు నెసఁగఁ బెండ్లిచవికె
పూవఁబలుకుఁ దేనెలే బువ్వాలు
యేపొద్దు శ్రీవేంకటేశ యెనసి రతుల నిన్ను
తీపులు పుట్టించె నన్నీఁ దెలుసుకోవయ్యా ॥ తల ॥ 408

రేకు-669 ముఖారి

నీవే యెరుఁగుదువు నీగుణము కొలఁదులు
చేవదేర నెందరినిఁ జేసితివో యిట్లా ॥ పల్లవి ॥

కప్పురపు మాటలనే కరఁగించి యుందాఁకా నీ-
నొప్పి దీరిచితివౌరా నొడలఁ (?) బెట్టి
రెప్పలచూపుల రేసు రేఁచి యేఁచే నంటా వుంటి
యిప్పుడేమీ ననఁజాల యేఁటిదో నీమాయ ॥ నీవే ॥

ఆసలచూపులు చూచి అట్టె నన్ను భ్రమయించి
సేసిన నీచేఁతలెల్లాఁ జెల్లించు కొంటి
యీసుల నిందాఁక నుంటి యింతలోనే నిన్నుఁగని
మూసినముత్యమనై తి ముందరేదో కానీ ॥ నీవే ॥

కనుమాయ రతి సేసి కాఁగిటనె నన్నుఁ గూడి
మొనసి నీమేలు నాపై మూఁట గట్టితి
ఘనుఁడ శ్రీవేంకటేశ కడుఁ దమకించి వుంటి
తనిసితి నన్నిటాను దట్టమాయ వలపు ॥ నీవే ॥ 409

### వేళావళి

ఏమయ్య నీసతినంట యింత వలెనా నాకు
నేమము దప్పకు నేడు నీకు నే వెగ్గళమా ॥ పల్లవి ॥

చెప్పినట్టి నీమాట చెవియొగ్గి వింటినిదె
యిప్పుడె నన్నుఁ దీయకు మింటిలోనికి
ముప్పిరిఁ గస్తూరిబొట్టు ముంజేతుల నంటుదాఁకా
అప్పటి మొక్కకు నీకు నడ్డము లాడేనా ॥ ఏమ ॥

సొరిది నీవిచ్చినట్టి సొమ్ములెల్లాఁ బెట్టుకొంటి
పొరిఁ జెంపల గందాలు పుయ్యకు నాకు
శిరసు విడినదాఁకా చెక్కుచెమరించుదాఁకా
సరి వెనఁగకు నీతో చేఁము సేసేనా ॥ ఏమ ॥

వలపులు రేఁచఁ గాని వద్దనే కూచున్నదాన
పిలుపు మియ్యకు రతితమకానను
యెలమి శ్రీవేంకటేశ యిట్టె కూడితి విందాఁకఁ
కొలదిఁ మీరితివి నాగుణము మానేనా ॥ ఏమ ॥ 410

### రామక్రియ

ఏఁటికి నాతని దూరే రేమమ్మ
మాఁటలాడి నప్పుడే సమ్మతి గదవమ్మా ॥ పల్లవి ॥

యెనసి ఆతఁడు నేఁ డెందుండి వచ్చినాను నీ–
కనుచూపులకు లోను గదవమ్మ
వెనక కాతఁడు యేవేఁదింట నుండినా నీ–
మనసునకు నడ్డమా మరి యాతఁడన్మా ॥ ఏఁటి ॥

యేమగువతో సరసమెంతాడి వచ్చినాను
కామించిన నీమగఁడు గదవమ్మ
వేమరు నెవ్వరియింట విందారగించినాను
వోముచు నిద్దరిమేమ లొక్కటే కదవమ్మా ॥ ఏఁటి ॥

చేఁగదేర నాతఁడెంతచేఁత సేసి వచ్చినాను
కాఁగిట నాతఁడు గూడెఁ గదవమ్మా
వీఁగక శ్రీవేంకటాద్రివిభుఁ డిట్టె వున్నవాఁడు
దాఁగక నిన్నురమున ధరించెఁ గదవమ్మా ॥ ఏఁటి ॥ 411

## బౌళి

రాజసమే ఘనమాయ రాఁగా రాఁగా
వోజ దప్పవచ్చునా నీ వువిదల యెడకు ॥ పల్లవి ॥

చెక్కుల చెమట గారె సేసకొప్పు వెడ జారె
వెక్కసాన యింతిని నవ్వించఁగాను
లక్కవలెఁ గరగె యీలాగు చూచి నామనసు
కక్కసీఁడ వయితివిగా కాంతల యెడకు- ॥ రాజ ॥

కాయమెల్లాఁ బులకించె గడు నివ్వెరగు ముంచె
చేయి చేయిఁ బట్టి చెలి చెనకఁగాను
యీ యతివఁ జూచి నీపై నెంతైనాఁ గోపము వచ్చె
మాయదారి వై తివిగా మగువల యెడకు ॥ రాజ ॥

కన్నులకుఁ గెంపులెక్కె కాంత నీపాలిటఁ జిక్కె
వున్నతిఁ గాఁగిటఁ గూడి వుండఁగాను
మన్నన శ్రీవేంకటేశ మాకు నొక్క మనసాయ
అన్నిట జాణవై తిగా అతివల యెడకు ॥ రాజ ॥ 412

## సామంతం

మలసి వాదు లడువ మాకేఁటికే
యిలయెల్లాఁ దా నేలితే నింకా బతుకనీవే ॥ పల్లవి ॥

పంతమాడ నోపము బలువుని తోడను మా-
యంతనుండఁగా నైనపాటదె చాలదా
యెంత లేదు తనవీరా లెవ్వరు నెరఁగరా
అంతటి వాఁడౌఁగాక అట్టె బతుకనీవే ॥ మలసి ॥

చలపట్టు నోపము సారెకు దొరలతోడ
కలపాటి రాజసము గైకొనుండేము
వలవనిపటులేల వారి వీరి తోడను
నెలకొన్న జాణ(డైతే నిక్కి బతకనీవే ॥ మలసి ॥

చేరి నవ్వ నోపము శ్రీవేంకటేశ్వరుతోడ
కూరిమితో( దా( గూడినకూటమే చాలు
యీరీతి వినయములు యెవ్వరి ముందర( జేసీ
వేరు లేదు తా నేను వెస బతుక నీవే ॥ మలసి ॥ 418

శంకరాభరణం

మించి నాచే(తకు నన్నే మెచ్చుట గాక
కొంచెపడి చెలు(ను గొసర నేల ॥ పల్లవి ॥

యీకడ నీవలపే యింత యారడి( బెట్ట(గ
చేకొని వుండుట గాక చింతలేలా
నీకపటాలతోడనే నీవు వద్దనుండ(గాను
చీకాకుగా( బరు(కు( జెప్ప నేలా ॥ మించి ॥

మనసులో కా(తాళమే మమ్మునింత సేయ(గాను
అనుభవించుట గాక అడ్డమేలా
చెనకినవా(డవే చెక్కు నొక్కి వే(డుకొ(గా
యెనయుట గాక మాటలింకా నేలా ॥ మించి

వేడుక నారతులే నీవెంట వెంట( దిప్ప(గాను
యీడుతో నవ్వుట గాక ఇంతేసి యేలా
కూడితివి నన్ను( నే(డు గొబ్బున శ్రీవేంకటేశ
జోడయితి మిద్దరము సొలయనేలా ॥ మించి ॥ 414

రేకు-670 పాడి

నిన్ను( జూచి నవ్వ(గానే నిష్ఠూర మేలే
వన్నెల నతని మెచ్చవద్దా నీవు ॥ పల్లవి ॥

కూడిన మీఁదట నేలే గొణఁగు అతఁ -
డీడనే వున్నాఁడు యింకా నేలే సణఁగు
వీడెము ని న్నడిగీని వెస నీపేరు నుడిగీ-
వాడుదేరిచి కలయవద్దా నీవు ॥ నిన్ను ॥

ఇద్దరుఁ గూచుండి యేలె యెరవు - నేఁడు
బద్దులేనివాని కేలే పయి తరవు
బుద్ది చెప్పి చెక్కు నొక్కి పూఁచి నీకుఁ జేత మొక్కి
వద్దు వద్దని పలుకవద్దా నీవు ॥ నిన్ను ॥

పరుపుమీఁదనే యాలే పగటు - నీ
విరవై శ్రీవేంకటేశు కేలే వెగటు
అరుదై యలమేల్మంగ వటు నీవు గూడితివి
వరుస లిట్టే నెరపవద్దా నీవు ॥ నిన్ను ॥ 415

నాదరామక్రియ

కపటా లూరకే మాతో కప్పేవు నే మెరఁగమా
యిపు డాకె నీవొద్ద నిట్టె వుండదా ॥ పల్లవి ॥

ముంగిట నాతోడ నీవు మొరగులాడేవు గాక
అంగన నీవును గూడి అడ నుండరా
సంగతి నాతోనే ఆచారములు నెరపేవు
యెంగిలి నీమోవి అంట కిట్టే వుండేనా ॥ కప ॥

చలపట్టి నేఁడే నాకు చన విచ్చితివి గాక
నలిరేఁగి యిందాఁకా నవ్వు చుండరా
అలిగె నంటా నన్ను నానలు వెట్టేవు గాక
తలుపు మాటు చెలి తానే కాదా ॥ కప ॥

కాయము నాపై వేసి కాఁగిటఁ గూడితి గాక
పాయక యీపెయు నీవుఁ బవ్వళించరా
యీయెడ శ్రీవేంకటేశ యిటు నాకె దక్కితివి
చాయల నాపెయు నీకు సతమే కాదా ॥ కప ॥ 416

శంకరాభరణం

మంచి తనాలకే లోను మరి సటలకుఁ గాము
వుంచవు నీ జంకెనల వొరయకు మమ్మును ॥ పల్లవి ॥

చిగురువంటివారు చెలులు – యింత
వొగరు వలపులకు నోపుదురా
మగవాఁడు రాతివంటి మనసువాఁడు – యీ
తగవు నీ వెరఁగవా తడవకు మమ్మును ॥ మంచి ॥

నిండి తొలఁకని వారు నెలఁతలు – యింత
చండి సరసములకుఁ జాలుదురా
రండు నాడేటి వారు రమణులు
అండ నీవే కనుకొనే వడుగకు మమ్మును ॥ మంచి ॥

కప్పురము వంటివారలు కాంతలు – వట్టి
దప్పి విరహములకుఁ దగుదురా
తెప్పల శ్రీవేంకటేశ దేవుఁడవు – నేఁడు
కప్పుకొని కూడితివి కరుణించు మమ్మును ॥ మంచి ॥ 417

లలిత

చూపు చూపు నీమేలు పక్కన నన్నంటుకొనె
కై వగుపుణుఁగు పువ్వు గట్టినట్టే అయను ॥ పల్లవి ॥

పనిలేని పనికైనఁ బదరి కోపగింతు
వెనకనే నీవు నన్ను వేడుకొందువు
తలవోని నీమంచితనమె నావీరిడి–
తనమెల్లఁ జాపి లోలో నమి నాకు రేఁచెను ॥ చూపు ॥

యెప్పుడు నే నాడేవి యీసడవు పలుకుతే
కప్పురపు నవ్వు నీవే కలపుదువు
యిప్పటి నానేరమికే యింతేసి నీ నేరుపులు
చొప్పు మాపి నిన్ను నన్ను చుట్టాలఁగా జేసెను ॥ చూపు ॥

చీటికి మాటికి నీతో సిగ్గులు నేఁ బచరింతు
కూటపుఁ గాఁగిట నీవే కూడుదువు
యీటున శ్రీవేంకటేశ యిప్పటి నీరతులే
వోటమి దీర నన్ను నీ వుర మెక్కఁజేసెను ॥ బాపు ॥ 418

## ముఖారి

చేసినవారికి సేఁత చేతనఁ బెట్టుగాదా
యీసున నిన్నుఁ జూచేను యెందు వొయ్యే వికను ॥ పల్లవి ॥

చెలఁగి నామోము చూచి సెలవినే నవ్వేవు నే
వలచి నీవెంట వెంట వచ్చే నంటానా
యిల నాకొలఁదివాగా యేమి సేయ వచ్చు నీకుఁ (?)
గలిగీలే యీఫలము కడచెనా వయసు ॥ చేసి ॥

కూరిమి నూరకుండఁగా గోరికొన నూఁదేవు
చేరి నినుఁ జూచి బ్రమసితి నంటానా
యీరీతివారిలోన నెవ్వరిఁ బోలుదు నేను
చేరిలే నీకిపుణ్యము చిత్తగించే వికను ॥ చేసి ॥

మిక్కిలి కాఁగిట నన్ను మితిమీరఁ గూడితివి
తెక్కుల నాతని వెందుఁ దీరదంటానా
ఇక్కడ శ్రీవేంకటేశ యిటు లోనైతివి నాకు
యెక్కలే తనకు వల పేమిసేసే వికను ॥ చేసి ॥ 419

## నాగవరాళి

అంతటికి నితవరి ఆపె గలిగితేఁ జాలు
సంతసాన నే నుండే చాలు మమ్ము నంపరా ॥ పల్లవి ॥

మచ్చిక నాతో నీవు మాట లాడఁగాఁ గదా
కొచ్చి కొచ్చి యాపె నిన్నుఁ గోపగించెను
రచ్చల నేను నీతో రాయడించ దొరకొంటే
వొచ్చము నీపై వుండ వొద్దు మమ్ము నంపరా ॥ అంత ॥

యిన్నేసి నీవు నాకు నిచ్చకాలు సేయఁగాఁ గా
సన్నల చాయల నాపె జంకించెను
యిన్నిటా నేను నీతో వొగసక్కెాలు పేసి
యెన్నినట్టే రాదు మమ్ము నింటిలోని కంపరా ॥ అంత ॥

కందువ నాకు మోహించి కాఁగిటఁ గూడఁగఁ గదా
అందాలు సేసుక నిన్ను నాపె మెచ్చెను
యిందుకే శ్రీవేంకటేశ యిద్దర మొక్కటైతిమి
విందు చెప్పితి నాపెను విడిదికి నంపరా ॥ అంత ॥ 420

రేకు-671 గౌళ

వద్దు నీకు వగవఁగ వడి నలసితి వని
చద్దికి వేఁడికి నీకుఁ జలి వాసెఁగా ॥ పల్లవి ॥

చిత్తడి చెమటలు నీచెక్కులనే వెడ జారె
యెత్తలఁ గొండలు నీవెంద్కెకి వచ్చితో
హత్తి నీకు నవులే తొల్లి ఆవులఁ గాచిననాఁడే
చిత్తగించి అలవాటు సేసుకొంటిగా ॥ వద్దు ॥

ముక్కున నూరుపు లవే ముంచి బుసకొట్టేవు
సెక్కుమారు లెవ్వరితోఁ బెనఁగితివో
గుక్కక నీ కవులే తొల్లి గొల్లెతలతోఁ బెనఁగి
చిక్కించుక అలవాటు సేసుకొంటిగా ॥ వద్దు ॥

కాయమున నీకు నిదే కడు బడలిక దేరి
సేయరానిపను లేమి సేసి వచ్చితో
యీయెడ శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితి
చేయార నీయలవాటు సేసుకొంటిగా ॥ వద్దు ॥ 421

సామంతం

ఏమి సేతునే నేను యేదౌతాఁ దా నెరఁగఁడు
దీమసము లేదు నాకు తెగి మీర లేను ॥ పల్లవి ॥

దప్పితో నావిరహపుతలఁపులో తెగువలు
చెప్పుమంటా నాన వెట్టీఁ జెల్లఁబో వీఁడు
అప్పటి నేఁడేమి సేతు నవె వెళ్లనాడఁబోతే
కుప్పళించీఁ బెంజెమట గుండె వక్కలాయను ॥ ఏమి ॥

కలలోనఁ దాను నేనుఁ గలసిన చేఁతలు
పలుకు మనుచుఁ గొంగు వట్టీ వీఁడు
యెలమి నే నేమి సేతు నేపాటి వాకుచ్చినాను
సెలవుల నవ్వు వచ్చి సిగ్గు ముంచీ నాకు ॥ ఏమి ॥

వడి నా కాఁగిట నెటువలెఁ గూడుదు ననుచు
నడువు మనుచు నన్ను నాదరించీని
కడు శ్రీవేంకటేశుఁడు కాఁగిటఁ గూడిన సుద్ది
వెడల నాడఁగ లేక వెరగయ్యీ నాకు ॥ ఏమి ॥ 422

శంకరాభరణం

మొగమోటదానవు మొదలనే నీవు
వగలెల్ల నుడుపంగ వచ్చె నాతఁ డదివో ॥ పల్లవి ॥

పట్టినదే పంతమా పడఁతి నీ వాతనితో
అట్టు సేయనంటే మెఱయించ రాదా
గుట్టు నీతోఁ జెప్పనా కోరి పైపై నున్నాఁడని
వట్టి కోపా లిఁక నేల వచ్చె నాతఁ డదివో ॥ మొగ ॥

చెల్లునంటాఁ జేతురా చెలులు విభునితోడ
కల్లగా దాతనిమాఁట కైకొనరాదా
అల్లప్పుడె మొక్కనా ఆతనిమారు నేనని
వలెవాటుతో దగ్గరి వచ్చె నాతఁ డదివో ॥ మొగ ॥

ఇంత నీకుఁ దగునా యిట్టి శ్రీవేంకటేశుతో
చెంత నానలు పెట్టఁగాఁ జేకొనరాదా
వింతలుగఁ గూడి నేఁడు విడెము దా నిచ్చేనంటా
వంతుకు నీయంకె కెల్ల వచ్చె నాతఁ డదివో ॥ మొగ ॥ 423

## రామక్రియ

చెనకకువయ్యా సుమ్ము సిగ్గుతోడివారము
కొన కెక్కించి దించకు కుసిగుంపు లోపము ॥ పల్లవి ॥

చేరి తిట్టనోపము చేచేత మొక్కనోపము
వోరి నీకే యలవాటై యుండుఁ గాని
గారవాన మేలుమీఁదికాంతల మింతే నేము
కూర వండి కస వేరఁ గూడదు మాచేతను ॥ చెన ॥

బాస సేయనోపము పాడిదప్ప నోపము
ఆసకాఁడ నీకే తగు నన్నియుఁ గాని
వాసికి నోడిగట్టినవనితల మింతే నేము
సేస వెట్టి కుల మెంచఁ జెల్లదు మా కిఁకను ॥ చెన ॥

కాకు సేయనోపము గారవించ నోపము
ఆకడ నీకడ నీకే యమరుఁ గాని
ఏకమై కూడితి నన్ను నిట్టె శ్రీవేంకటేశ
కైకొని పండినపండు కాయసేయ నోపము ॥ చెన ॥ 424

## భైరవి

అవ్వలివారికే నీ వన్నియు నేరుపవయ్యీ
రవ్వగానివారి నేల రచ్చనఁ బెట్టేవు ॥ పల్లవి ॥

కాటుక కన్నుల నిన్నుఁ గసరఁగఁ జాలఁ గాని
నాటఁ జూచి కొంత గొంత నవ్వు నవ్వేరా
తేటలుగాఁ బేరు గుచ్చి తిట్టుమనే వప్పటిని
గాఁటపుసిగ్గయ్యీ నాకు కమ్మటి నేనోపరా ॥ అవ్వలి ॥

అంకెకు రావని నీతో నలుగఁగ నోపఁ గాని
వుంకువగాఁ గుచముల నొత్తఁగలరా
సంకె లేక నీమీఁదఁ జాఁచుమనేవు పాదాలు
అంకెల సిగ్గయ్యీ నాకు నందుకు నేనోపరా ॥ అవ్వలి ॥

కాఁగిట నీవు గూడఁగ గయ్యాళించఁజాలఁ గాని
మూఁగిననామోని గొంత మచ్చు వేసేరా
చేఁగదేర నప్పటిని శ్రీవేంకటేశ యేలితి
దాఁగితే సిగ్గయ్యా నాకు తలఁగ నేనోపరా ॥ అవ్వలి ॥ 425

వరాళి

ఎంతకు వచ్చెఁ బనులు యేమి సేసుకొంటి నేను
వింతగా నీతోడిపొందు వెక్కసము లాయరా ॥ పల్లవి ॥

తనివోక నీమోము తప్పకిట్టే చూచి చూచి
కనురెప్ప వేయఁబోతే కాఁక రేఁగీరా
మనసిచ్చి నీతోడ మాటలాడి మాటలాడి
కొన నూరకుండఁబోతే గుబ్బతిలీ వలపు ॥ ఎంత ॥

వద్ద నిట్టె కూచుండి వాకిటికి లేచి పోతే
చద్దికి వేఁడికి గుండె జల్లురనీరా
యిద్దర మెదురై వుండి యివ్వలి మోమైతేను
వొద్దనినా మానదు నిట్టూరుపు రేఁగీరా ॥ ఎంత ॥

మచ్చికతో నిన్నుఁగూడి మంచము దిగేనంటే
చెచ్చెర నాకోరికలు చిమ్మి రేఁచీరా
యిచ్చకుఁడ శ్రీవేంకటేశ నన్ను నేలితివి
వచ్చిగా నీమేలు చూచి భ్రమసితిరా ॥ ఎంత ॥ 426

రేకు-672 ధన్నాసి

ఏల మమ్ముఁ బరచీనే యెవ్వఁడే తాను
నాలిచేఁత చేసుకొంటా నవ్వ నవ్వీ మమ్మును ॥ పల్లవి ॥

చన్నుల నొరసుకొంటా సంగడి నిలుచుకొంటా
సన్నలు సేసి పిలిచీ సారెకుఁ దాను
కిన్నెర మీటుకొంటాఁ గేలు మీఁదఁ జాఁచుకొంటా
వున్నవారి నెరఁగఁడు వుడికించీఁ దాను ॥ ఏల ॥

అంగములు ముట్టుకొంటా నడ్డాలు నడచుకొంటా
వుంగిటి వానలు వెట్టీ నూరకే తాను
తొంగలించి చూచుకొంటా దూరుచు గొణఁగుకొంటా
చెంగట సిగ్గు విడచి చిమ్మిరేఁచీ మమ్మును ॥ ఏల ॥

చనవులు సేసికొంటా సరసము లాడుకొంటా-
నెనసి కాఁగిట నించీ నిప్పుడే తాను
వెనుకొని కలసె శ్రీవేంకటేశుఁ డిదె నన్ను
తనివోని కూటముల తతిగొనీ మమ్మును ॥ ఏల ॥ 427

ఆహిరి

చెప్పరమ్మ సతులాల చెలులకోపములకు
తప్పు లెంచేవాఁడు మరి తనకేఁటి మాఁటే ॥పల్లవి ॥

సిగ్గు వడ్డ ఆఁటదానిఁ దేకొని పచ్చి సేసేటి-
నిగ్గులమగవాఁడెపో నిందుఁ గూళ
దగ్గర రాకుండితే తరుణుల నెల్ల నంపె (పి?)
బగ్గనఁ బదరేవాఁడు పాటిగలవాఁడా ॥ చెప్ప ॥

గుట్టుతోడి ఆఁటదాని గుణ మెరఁగక సారె
ఒట్టు పెట్టే వానికంటే ఊయి మేలు
దిట్టనై మారాడకుంటే తిట్టి తిట్టించుకొనేటి-
వట్టిసటకానితోడ వసమా గెలువను ॥ చెప్ప ॥

దయదలఁచి కలయఁ దానే వచ్చినదాని-
ప్రియ మెరఁగనివాఁడే పెనుమంకు
నయ మిచ్చి శ్రీవేంకటనాథుఁ డిట్టె నన్నుఁ గూడె
జయమాయ నీఁకమీఁద సరసుఁడే కాఁడా ॥ చెప్ప ॥ 428

బౌళి

ఊరకున్న వారికేల వుడుకులు గట్టేవు
నేరుపు లాడనే చూపు నే వెరతు నిందుకు ॥ పల్లవి ॥

సేయవయ్యా నీవు నీచేతికి లోనైనట్లెల్ల
ఆయములు సోఁకగ నీ వాపె వొద్దనే
మాయవల పొకచోట మన్నన నీకొకచోట
వోయయ్యా పచరించేవు వోప నోప నేను ॥ ఊర ॥

నగవయ్యా నీవు వోయి నాఁటిన ప్రియముతోడ
అగపడి నీతో నవ్వేఆపెతోడనే
జిగి నుప్పమ్మఁ గొందరు చిల్లు మోయఁ గొందురు—
నగునీతో సరస మరగదు మాకును ॥ ఊర ॥

చెప్పవయ్యా నీవు నేనుఁ జేకొని కూడిన సుద్ది
అప్పసము యెమ్మెలకు నాపెతోడను
యిప్పుడె శ్రీవేంకటేశ యీడఁ గొంత నాడఁ గొంత-
నప్పటిఁ దిరగాడితే నది నేను మెచ్చను ॥ ఊర ॥ 429

## మేఁచబౌళి

ఏమయ్యా చిత్తగించ వింకా నీవు
దామెనకాఁకలు నీపైఁ దగిలించీ నిదివో ॥ పల్లవి ॥

మలయు మదిలోఁ గొంత మాటలలోపలఁ గొంత
చెలి నీపైఁ గుమ్మరించీఁ జేరి చేరి
అలిగినదియుఁ గాదు అట్టె కూడినదీఁ గాదు
తలుపుమాటున నుండి తడఁబడీ నదివో ॥ ఏమ ॥

ముంచి విరహపుతేట మొక్కలపుఁ గన్నీట
యించుకించుకే చిమ్మీ నింత నీమీఁద
మంచము మీఁదికి రాదు మరఁగుకైనాఁ బోదు
అంచెల మొకమెదుట నానుకున్న దదివో ॥ ఏమ ॥

జవ్వనములోనిపచ్చి చనవులనే కొచ్చి
రవ్వగా నీ కొప్పగించీ రమణి నేఁడు
యివ్వల శ్రీవేంకటేశ యింతి నిట్టె కూడితివి
కువ్వని పేరై నీకు గురుతాయ నదివో ॥ ఏమ ॥ 430

## ఆహిరి

ఇంతయును నామేలే యెందు వీఁడుక వచ్చిన
పంతము నెరపఁబోతే బయలే పందిలిరా ॥ పల్లవి ॥

నేనే నీతో నలిగిన నీవు నాతోఁ గోపించిన
నానిన విరహమెల్లా నాదే కాదా
యీనెపాన నే నిట్టే యీకె నెంత గొసరిన
కానీరా అదియును నొక్కటికి రెండవురా ॥ ఇంత ॥

వొట్టు నేనే పెట్టుకొన్న వొల్లక నీవుండినాను
నట్టుకున్న జాగరాలు నాసొమ్మే కాదా
అట్టుగ నిందుకు నిన్నా నడి యెంత సేసినాను
కట్టినముడియ నాకు కలకాల మిదిగా ॥ ఇంత ॥

నిచ్చ నే సిగ్గువడినా నీవు నన్ను మరచినా
నచ్చుల తమకమెల్లా నాపాలిదే
యిచ్చల శ్రీవేంకటేశ యింతలో నన్నుఁ గూడితి
తచ్చి వేసిదియె నాకు దాచిన ధనమురా ॥ ఇంత ॥ 431

## రామక్రియ

ఆఁడువారి గోర సేసి అందురా నీవు
నేఁడు నీ మేలుకుఁ జొక్కి నెమ్మది నుండితిని ॥ పల్లవి ॥

యిన్నిటా జాణఁడ వని యిచ్చకుఁడ వౌదు వని
మొన్న నే చూచి నీకు మొక్కనా నేను
నన్ను నేల దూరేవు నగి నిన్ను మెచ్చనంటా
పన్నిన నీరతిచేతఁ బరవశ మైతిని ॥ ఆఁడు ॥

తప్పవు నీమాఁట లని తగు మంచివాఁడ వని
అప్పుడె నీచెక్కు గోర నంటనా నేను
తప్పులేల యెంచేవు తగిలి పొగడనంటా
నెప్పున నీ ప్రియానకు నివ్వెర గందితిని ॥ ఆఁడు ॥

కత కరచితి వని కాఁగిటఁ గూడితి వని
యితవుతో నీవుర మెక్కనా నేను
గతియై శ్రీవేంకటేశ కాఁగిటఁ గూడితి నన్ను
తతి నీ గుణాలఁ జిక్కి తమక మందితిని ॥ అఁడు ॥ 482

రేకు-673 నాగగాంధారి

ఇల్లాలి కేఁటికే యిటువంటి పనులు
పల్లదాన నాతఁడే బతుక నీరే ॥ పల్లవి ॥

పంత మాడేదానఁగాను పతితోడ సారె సారె
యెంతైనా నిచ్చకురాల నింతే కానీ
వంతుఁకుఁ జెలు లేల వాసులు రేఁచేరే నాకు
కాంతుఁ డేపున్యామైనఁ గట్టుకోనీరే ॥ ఇల్లా ॥

వేసరించేదానఁగాను వెతసేసి యాతనికి
ఆసల నాతఁడే నేనై వుందుఁ గాని
సేస వెట్టించినమీరే చెప్పకురే కొండేలు
బాస దప్పి యాతఁడే అఫల మందనీరే ॥ ఇల్లా ॥

చెనకేటిదానఁగాను శ్రీవేంకటేశ్వరుని
తనుఁ దానె కూడితేనే దక్కుదుఁ గాని
మనసిచ్చె నాకు నేఁడు మన్నించె నాతఁ డెందు
వెనకటిచేఁత తానే విచారించుకోనీరే ॥ ఇల్లా ॥ 483

కొండమలహరి

ఎడమాటలాడించ నిఁక నేలా
వడఁతి నీరమణుని భావము లోనాయను ॥ పల్లవి ॥

చన్నులనే వొరసేది సంగడి నిలుచుండేది
కన్నులనే సొలసేది గలిగె నీకు
మన్ననలఁ గరఁగేది మలఁగుపై నొరగేది
అన్నిటా నీరమణుని కలవాట్లాయను ॥ ఎడ ॥

సారె సారె నవ్వేది జంకెనల గొణఁగేది
ఆరీతి నాసలు సేసే దమరె నీకు
కోరికల మొరసేది గురుతులే అరసేది
యీరీతి నీపతి కిదేప నాయను ॥ ఎడ ॥

వట్టిమాఁటలాడేది వలపులే చల్లేది
చుట్టమవై పొందేది సూటాయ నీకు
యిట్టి శ్రీవేంకటేశుఁ డిటు నిన్నుఁ గలసెను
పట్టపగ లాతనికి పరిణామ మాయను ॥ ఎడ ॥ 434

నాదరామక్రియ

ఇంతేసివారిలోన యెవ్వతె నేను
పంతె(త?) గత్తె లుండఁగాను పైకొనరా నేను ॥ పల్లవి ॥

నిన్ను మెచ్చకుందునా నీవు సేసేచేఁతలకు
విన్నవారు నవ్వేరంటా వెఱచి కాక
మన్నించిన నీసతులు మాకంటె ముందరను
సన్నుతించి పొగడేరు చాలదా నీకయ్యా ॥ ఇంతే ॥

దగ్గరక నే నుందునా తగిలేటి న(ని?)న్నుఁజూచి
సిగ్గువడ్డదాననై చింతించేఁ గాక
వొగ్గి నీ పొరుగువారు వూరికంటె ముందరను
అగ్గమై కదిసినారు అప్పటినాసతులు ॥ ఇంతే ॥

కొంకు వాపకుందునా కూరిమి నీకాఁగిటను
వంక నీమనసు చూడవలసి కాక
బింకపు శ్రీవేంకటేశ పెనఁగి నన్నుఁ గూడితి -
వింకఁ దొల్లిటి సత్తు(తు?)ల కెట్టు బొంకేవయ్యా ॥ ఇంతే ॥ 435

సామంతం

వాఁడె బీర మాడఁగా వలదు మాను మనదు
ఆఁడు వారిబతుకు లివే అన్నియు వినరమ్మా ॥ పల్లవి ॥

తానే నను( దొలుత తగుల నాడినాఁడు
నే నావెనక నలిగితే నేర మిందు గలదా
కానీ చెలులాల కల్లలాడ వలదే
పూని తగదన్న వారికి బుద్ధి చెప్పరమ్మ ॥ వాఁడే ॥

చేరి నను నిపుడే చీరవారఁ దీసెఁ దాను
మేర నే నందుకుఁ దా మీకుఁ జెప్పరాదా
సారె మిము నేను సాకి రడుగఁ గాను
దూరు మీకుఁ గట్టుకో దోస మేఁటికమ్మ ॥ వాఁడే ॥

కూడి నామోము కొసరి చూడఁగాను
యీడు వెట్టుక నాకును యింత నవ్వరాదా
తోడి వేంకటపతి దొమ్మిసేసి కలసె
పాడిగలసతు లిందరు వంత మడుగరమ్మా ॥ వాఁడే ॥ 486

## ఆహిరి

ఏమి సేసేవో చూత మిఁక మీఁదను
వేమరు నీమాయలనే వేగుఁబొద్దులాయను ॥ పల్లవి ॥

యెదురు చూచేను మాయింటికి విచ్చేసేవంటా
అదన వేరొక తదే అట్టె యెదురు చూచీ
పొదిగిన మా యిద్దరికిఁ బొత్తుల నీ వాడ నుంచే
యిదివో వలపు చల్లే వెరఁగనా నేను ॥ ఏమి ॥

పిలువ నంపితి నిన్నుఁ బెడరేఁచి చెలిచేత
నిలిచి ఆపెయు నొక్కనెలఁత నీకడ కంపె
చెలు లిద్దరిపై రెండుచేతులు వేసుక నీవు
యెలమి నవ్వులు నవ్వే వెఱఁగనా నేను ॥ ఏమి ॥

రమ్మని పిలువఁగాను రతికి నే దగ్గరితి
పిమ్మట నాపెయుఁ దన్నుఁ బిలిచే రనుచు వచ్చె
యిమ్ముల శ్రీవేంకటేశ యిద్దరిఁ గాఁగిటఁ గూడి
యెమ్మెలే నీ వింత సేసే వెరఁగనా నేను ॥ ఏమి ॥ 487

## దేశాక్షి

ఇందుమీఁద మనమాట లింపు లయ్యీనా
డిందుపడఁ బతిఁ దోడితెత్తము రారే ॥ పల్లవి ॥

మాఁటలెంత వేసటో మగువ చెలులతోడ
గాఁటపుఁ బెదవులే కదలించీని
నీటున విభుఁడు దానినెగులెల్లా నొకమాఁటే
కూటువగాఁ జెమటలు గుమ్మరించీని ॥ ఇందు ॥

నవ్వు లెంతబరువో నాతోడసైతమును
జవ్వని సెలవులనే జారఁ దోసీని
యివ్వల మరునిమీఁది యీసులెల్లాఁ దనకొప్పు-
పువ్వులమీఁదటఁ జూపి పూఁచి దులిపీని ॥ ఇందు ॥

చూపు లెంతవేసటో సొరిది నద్దము చూడ
నోపనంటాఁ దలవంచి వూరకున్నది
యీపొద్దు శ్రీవేంకటేశుఁ డింతలోఁ గూడినందుకు
తీవుల పెదవుగనే ద్రిష్టము చూపీని ॥ ఇందు ॥ 488

రేకు-674 శ్రీరాగం

ఇంకా నప్పటి నీతో నెదురాడేనా
మంకుదానఁ గాను నిన్నే మరిగితి నేను ॥ పల్లవి ॥

చింతలెల్లఁ బెడఁ బాసె చెక్కు నీవు నొక్కఁగాను
యింత ప్రియము చెప్ప నే నేమి బాఁతి
యింతులచే మొక్కించి యేల దోసాలు గట్టేవు
చెంతల నేమి చెప్పిన నేసేనయ్యా నీకు ॥ ఇంకా ॥

కోపమెల్లాఁ జల్లనాయ కొప్పు నీవు ముడువఁగా
యేపనులు సేసేవు నే నేమి బాఁతి
యీపొద్దు యింటికి వచ్చి యేల రవ్వలు సేసేవు
కోపుల నీమాట లియ్యకొంటినయ్య యిపుడే ॥ ఇంకా ॥

కాయమెల్లాఁ బులకించెఁ గాఁగిట నీవు గూడఁగ-
నీయెడ నిందరిలో నే నేమి శాఁతి
యీయఁగానిశాస లిచ్చి యేఁ మోపు గట్టేవు
నాయువు శ్రీవేంకటేశ నమ్మేనయ్యా నిన్ను ॥ ఇంకా ॥ 439

## రీతిగౌళ

ఏల నాతో నాన వెట్టే వెవ్వ రేమనిరి నిన్ను
నీలో నే నొకతెనై నిండుకుండనై తినా ॥ పల్లవి ॥

యింతితో నవ్వితి వేమి యీడ నూరకుంటి వేమి
యింత నీతో వాదడువ నేల నాకు
చెంతల నాఁడే నీకు సేస వెట్టి నీలోని-
కాంతలలో నొకతెనై కాఁపురము సేయనో ॥ ఏల ॥

యిందాఁకా నెందుంటి వేమి ఇందు నిద్దురించి తేమి
ఇందుకుఁగాఁ గోపగించ నేల నాకు
చెంది నీకొలువు సేసేచెలియనై నీవద్ద
సందడించు కొంటా నుండి సరసము లాడనా ॥ ఏల ॥

ఆపెనే మెచ్చితి వేమి అట్టె వొరగితి వేమి
యీపొద్దు నిన్ను సాదించ నేల నాకు
కాపాడి శ్రీవేంకటేశ కలసితి విదె నన్ను
చేపట్టి యిన్నిటికిఁగా చేత మొక్కనైతినా ॥ ఏల ॥ 440

## కాంబోది

అంటే నిన్ననరాదు ఆడకున్నఁ బోదు నేఁడు
యింటి కేఁగినవాఁడ వింత చేసి వత్తురా ॥ పల్లవి ॥

వాసులకు నోరు మూసీ వలపులఁ జలి గాసీ
యీసులకు మాటాడ వె(దె?)వ్వరి తోడి
కాసు పేయనిపనికి కాంత నే మంటివో గాని
దోసానకు రోయవు నీ తోడి దేఁటిమాటలు ॥ అంటే ॥

గుట్టుతోడఁ దల వంచి కోపములఁ జిగిరించి
కట్టిడితనాలు చల్లీ కాంతలమీఁద
చిట్టకా లాపెతో నేమి చేసితివో చలాలకు
ముట్టి వచ్చె నీకు దూరు ముందర నెరఁగవు ॥ అంతే ॥

పంతానకుఁ గాలు మెట్టి పాయముల మీఁదుకట్టి
బంతి నండవారి నెల్లఁ బంగించీని
యింతలోనె శ్రీవేంకటేశ నీ వింతిఁ గూడితి-
వంతరంగమున మేలు అది నీ కింకెట్టిదో ॥ అంతే ॥ 441

అమరసింధు

ఇందరిలో నిన్ను రవ్వ లిఁకఁ జేసేనా
నిందల మాటలకుఁగా నీకేల వెఱవ ॥ పల్లవి ॥

ఉద్దండాన నే నిన్ను వుప్పటించ వచ్చేనా నా-
పెద్దరికేనకే నేఁ బెనఁగేఁ గాక
చద్దికి వేఁడికి నిన్ను సాదించ వచ్చేనా
అద్దుకొన్న నాలోని మోహము చూపేఁ గాక ॥ ఇంద ॥

పైకొని నే నీమీఁద బలిమి చూప వచ్చేనా
చేకొని నీ వన్నమాట చెప్పేఁ గాక
రాకపోకలను నిన్ను రవ్వ సేసేదాననా
దీకొని నామేనవావి దెలిపేఁ గాక ॥ ఇంద ॥

కన్నుల జంకించి నిన్నుఁ గాఁగిలించే దాననా
తిన్నని నీనాసిగ్గు తీరిచేఁ గాక
యిన్నిటా శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
కన్నుల నవ్వేదాననా కని మొక్కేఁ గాక ॥ ఇంద ॥ 442

బౌళిరామక్రియ

ఎవ్వరి మొగము చూచి యేమనేను నాలోనే
నవ్వుతా నే మోనమున నన్ను మెచ్చేఁ గాక ॥ పల్లవి ॥

సిగ్గువడ్డ చిత్తమిది చెలువుని దూరీనా
దగ్గరి గుబ్బతిలుచు దాఁగుఁ గాక
బెగ్గిలాన చెలులైనాఁ బిలుచుక రాఁబోయేరా
అగ్గమై వాని కిచ్చలు ఆడు చుండేరు గాక ॥ ఎవ్వ ॥

కాఁకఁ బొందినమే నిదే కాంతునితోఁ బెనఁగీనా
ఆఁకదీర వుస్సు రస్సు రనుఁ గాక
యేఁకట మరుఁడై నాను ఇద్దరినిఁ గూరిచీనా
వూఁకొనక దుర్బలుల కోపు నింతే కాక ॥ ఎవ్వ ॥

ఆసలఁ బొందినచూపు ఆతనిఁ గోపగించీనా
వేసరక మొకవోడి వీఁగుఁ గాక
యీసరినె శ్రీవేంకటేశుఁ డిట్టే నన్నుఁగూడె
రాసి కెక్క నాతఁడే రతిఁచుఁ గాక ॥ ఎవ్వ ॥ 443

## నాట

మేలు గలచోటఁ గాని మెత్తఁ బడవు మా-
కాలు దాఁకి నంతలోనే కసరేవు నీవు ॥ పల్లవి ॥

మంచముపై నుండేఆపె మాటలాడఁగా నీవు
అంచెల దిగువ నుంటి వప్పుడే కాదా
యెంచఁగ మాతోనైతే యెమ్మెలెల్లఁ జేసి మా-
కంచముకూ డిఁదమంటే గబ్బితనా లాడేవు ॥ మేలు ॥

జలక మాడుచు నాపె సారెఁ బనులు చెప్పఁగ
అలరి యాపెకుఁ జీర లందియ్యవా
పలుకుల నేనైతేఁ బచ్చితిట్టు దిట్టితేను
వలసినట్ల నాతో వాదు లడిచేవు ॥ మేలు

దవ్వులనుండి యాపె తమ్ములముమియఁ బోతే
చివ్వన నీవు దగ్గరి చేయి చాఁచేవు
రవ్వగా శ్రీవేంకటేశ రతి నన్నుఁ గూడితివి
నివ్వటిల్లి మొక్కుమంటే నే నోప ననేవు ॥ మేలు ॥ 444

రేకు-875 సాళంగనాట

మేలయ్యా నీనేరుపు మెచ్చితిమి నేము
యీలీల నెందరిఁ బెండ్లి యిటు నీవాడితివో ॥ పల్లవి ॥

వేడుకకు వొకమాట వెలఁది నీతో నవ్వితే
వాడిక సేసుక కూడి వచ్చేవు నీవు
వీడెము చేతికిచ్చి వినయాన మొక్కితేను
ఆడనె కాఁగిటఁ జేర్చే వదే సందుగాను ॥ మేల ॥

తెరలోనే వేగించి తియ్యని మోవితేనె
గురిసీ సారె సారెఁ గొమ్మ నీపైని
సురతపుఁగాంతు లెంతో చూపి చెప్పరానిమాట-
లరుదుగా గుబ్బతిల్లీ నదివో లోలోనను ॥ మేల ॥

పానుపుపైఁ బవ్వళించి పచ్చిచేఁతలఁ జన్నులు
కానుకిచ్చి బత్తిసేసీఁ గాంత నీపైని
పూని శ్రీవెంకటేశ నేర్పులెట్టో తరితీపు
నాని పెక్కుభావములు ననిచీ లోలోనను ॥ మేల ॥ 445

కన్నడగౌళ

చేరి నన్నేల నోపితే చెనకవోయి
ఆరీతిఁ బెనఁగవచ్చు నౌఁగా దనరాదు ॥ పల్లవి ॥

తలఁచవచ్చు నీరూపు తమక మాఁపఁగరాదు
వలవఁగవచ్చు మరి వదలరాదు
కొలువు సేయఁగవచ్చు కూటమి మఱవరాదు
కలయఁగవచ్చు వేడుకలు పట్టరాదు ॥ చేరి ॥

చిప్పిల మాటాడవచ్చు సిగ్గులు వడఁగరాదు
తప్పక చూడగవచ్చు తనియరాదు
కప్పురాన వేయవచ్చు కాఁకల కోరువరాదు
వొప్పుగాఁ గాడఁగవచ్చు వోరుచుకోరాదు ॥ చేరి ॥

పంతముతో నవ్వవచ్చు భావము చెప్పఁగరాదు
మంతన మాడుగవచ్చు మానరాదు
యింతలో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వింతరతి చూపవచ్చు విసుగరాదు ॥ చేరి ॥ 446

## పాడి

పఁటికిఁ బరాకు సేసే వెక్కడ చూచెవు నీవు
ఆఁటదాని నంతేసి అలయించకువయ్యా ॥ పల్లవి ॥

మోవితేనె గారఁగాను ముందరనే నిలుచుండి
వావులు దెలుపుకొనీ వనిత నీతో
దేవులా యిది నీకు తెలియ కొన్నఁడు నేము
వోవరిలో సంగతిఁ గూచుండఁ బెట్టుకోవయ్యా ॥ పఁటికి ॥

సెలవి నవ్వులు చింద చేత నీకు విడెమిచ్చి
చెలుములు సేసీని చెలియ నీతో
నెలకొన్న ప్రియురాలా నేఁడు నేము చూచితిమి
కలతువు గాని ఇట్టె కౌఁగిలించుకోవయ్యా ॥ పఁటికి ॥

ఘనకుచములకాంతి కడు నీపైఁ దొలఁకఁగా
వినయానఁ బెనఁగీని వెలఁది నీతో
యెనసితి విటు నన్ను యీకె నీకొకతె గద్దా
వొనర శ్రీవెంకటేశ వొప్పకొనవయ్యా ॥ పఁటికి ॥ 447

## ద్రావిళభైరవి

ఇంతట లాలించవయ్యా ఇంతిఁ గాఁగిలించుకొని
చింతతోడి వేడుకలఁ జెలఁగీ లోలోనను ॥ పల్లవి ॥

సముకాన నిలుచుండి చాయాలా సన్నలాఁ జూచి
చెమట గోరఁ జిమ్మి చెలి నీపైని
తమక మెటువంటిదో తలపోఁతవలపులు
వుమురుకూటముతై వున్నవి లోలోనను ॥ ఇంత ॥

* తెరలోనే వేగించి తియ్యనిమోవి తేనె
గురిసీ సారె సారెఁ గొమ్మ నీపైని
సురతపుఁగాంతు లెంతో చూపి చెప్పరానిమాట
లరుదుగా గుబ్బతిల్లీ నదివో లోలోనను ॥ ఇంత ॥

పానుపుపైఁ బవ్వళించి పచ్చిచేఁతలఁ జన్నులు
కానుకిచ్చి బత్తిసేసీఁ గాంత నీపైని
పూని శ్రీవేంకటేశ నేర్పులెట్టో తరితీపు
నాని పెక్కుభావములు ననిచీ లోలోనను ॥ ఇంత ॥ 448

శ్రీరాగం

ఇప్పుడే విచారించుక ఇంతిఁ గరుణించవయ్యా
వుప్పతించితే నెట్లుండునో నీమనసు ॥ పల్లవి ॥

అంగన నిన్నేమైనా నాఁగా దనఁగలదా
చెంగట నేమి సేసినాఁ జేతువు గాక
కొంగు వట్టి తీసి మరి కొసరగఁ జూచితేను
యెంగిలి పెదవి సోఁకి యేరీతానో మనసు ॥ ఇప్ప ॥

మగువ నీగుణములు మానుపఁగఁ గలదా
జిగి నాకెభాగ్యము నీచేతిదిగాక
పగటున నిందుకుఁగా పట్టి పెనఁగఁబోతే
చిగురుఁబాదాలు దాఁకి సిగ్గానో మనసు ॥ ఇప్ప ॥

వెలఁది నిన్నిటు గూడి వేసరించఁ గలదా
వలపు గలిగినంతే వాడికెగాక
అల కడపరాయఁడవై శ్రీవెంకటేశ్వర
బలిమి మన్నించితి వేభావమౌనో మనసు ॥ ఇప్ప ॥ 449

కాంబోది

మాపుదాఁకా జోలి యేల మనసొక్కటాయ నేఁడు
యేపొద్దుదాఁకాఁ జెప్పే వియ్యకొంటి రావయ్యా ॥ పల్లవి ॥

* 445 పాటలోనివే యీ రెండు చరణములు.

చెలరేఁగి రమణుఁడు చెక్కు నొక్కి వేఁడుకోఁగా
చలపాదితన మేల సకియకును
అలుకలెల్లాఁ దీరి ఆసతోడఁ బెనఁగఁగ
కలిగినపాటే మేలు కైకొంటి రావయ్యా ॥ మాపు ॥

సేనలు వెట్టినవాఁడు చేరి వొడఁబరచఁగ
వాసితోఁ గొసరనేల వనితకును
వేసరక వూడిగాలు వెస నేపొద్దుఁ జేయఁగా
యేసేఁతలైనా మేలు యెదురాడవయ్యా ॥ మాపు ॥

శ్రీవెంకటేశ్వర చిత్తగించి నీవేలఁగా
వావు లడుగనేల నావంటిదానికి
భావములోపల నమ్మి పైకొని భోగించఁగాను
దేవులనౌటే మేలు తెలిసితి రావయ్యా ॥ మాపు ॥ 450

రేకు-676 దేవగాంధారి

ఏమి గావలెనో కాని యీయింతి నీకు
చేముంచి నీయెడలఁ జేసీ నిదె మేకు ॥ పల్లవి ॥

కానుకలు నీకిచ్చి కామిని నీలోను చొచ్చి
కౌను నిక్కించి నిన్నుఁ గాఁగిటఁ గుచ్చి
అనుకొని చనుఁగవ నాయములు గొచ్చి
యీనేరుపు చూడవయ్యా యీకె నిన్ను మెచ్చి ॥ ఏమి ॥

వీడెము చేతఁ బట్టి వింతగా నాకులు చుట్టి
వాడిక నీముంగొంగు వంచి పట్టి
వేడుకమాటలఁ దిట్టి వెసఁ బాదమున మెట్టి
వాడికెలు చూపీ నీపై వలపులఁ దొట్టి ॥ ఏమి ॥

కూరిమి నీపై ముంచి గుట్టుతోడ సిగ్గు నించి
చేరి చిరినవ్వు నవ్వు శిరసు వంచి
యీరీతి శ్రీవేంకటేశ యెనసీ నలమేల్మంగ
గారవించవయ్య యీకెగతులెల్లా నెంచి ॥ ఏమి ॥ 451

నారాయణి

ఇన్నాళ్ళుఁ జిన్నదాన వెరఁగవంటా నుంటిమి
నిన్నా మొన్నాఁ గతలెల్లా నేరుచుకొంటివే ॥ పల్లవి ॥

సరసము లాడుతానే చనవులు మెరసేవు
శిరసు వంచి నవ్వుతాఁ జేయి చాఁచేవు
తెర వేసుకొంటానే తీగె సాగ మాటాడేవు
అరుదుగ మాలో నీవు నైతివే జాణవు ॥ ఇన్నా ॥

సన్నలలోనే మోవిచవులెల్లాఁ జూపేవు
కన్ను లార్చుకొంటానే బింకము చూపేవు
విన్నపాలు చేసి చేసి వేడుకలు రేఁచేవు
అన్నిటాఁ బరగి నేఁడే అయితివే జాణవు ॥ ఇన్నా ॥

పాదాలు గుద్దుతానే పానుపుపైఁ గూచుండేవు
సాదువలె నుండుతా సేసలు చల్లేవు
యీదెస శ్రీవేంకటేశుఁ డితఁడె నన్నిటు గూడె
ఆదిగొని నీవు మచ్చే వౌదువే జాణవు ॥ ఇన్నా ॥ 452

సాళంగనాట

సతులాల చూడరే శ్రావణబహుళాష్టమిఁ
గతలాయ నడురేయిఁ గలిగె శ్రీకృష్ణుఁడు ॥ పల్లవి ॥

పుట్టేయపుడే చతుర్భుజాలు శంఖుచక్రాలు
యెట్టు ధరియించెనే యీ కృష్ణుఁడు
అట్టె కిరీటము నాభరణాలు ధరించి
యెట్ట నెదుట నున్నాఁడు యీ కృష్ణుఁడు ॥ సతు ॥

వచ్చి బ్రహ్మయు రుద్రుఁడు వాకిట నుతించఁగాను
యిచ్చగించి వినుచున్నాఁ డీకృష్ణుఁడు
ముచ్చటాడీ దేవకితో ముంచి వసుదేవునితో
హెచ్చినమహిమలతో యీ కృష్ణుఁడు ॥ సతు ॥

కొద దీర మరి నందగోపునకు యశోదకు
ఇదిగో తా బిడ్డఁడాయ నీకృష్ణుఁడు
అదన శ్రీవేంకటేశుఁడై యలమేల్మంగఁగూడి
యెదుటనే నిలుచున్నాఁ డీకృష్ణుఁడు ॥ సతు ॥ 453

## శంకరాభరణము

మే మేమి సేతుము మాకు మీరే దిక్కు-
చేముట్టరా దితనిఁ జిత్తగించవమ్మా ॥ పల్లవి ॥

వోయశోద నీకొడుకు వూరిపడుచులుఁ దాను
ఖోయని వుల్లు గొట్టేఁ గోలలఁ గొని
చాయల జోరునఁ గారీ చమరుఁ బాలుఁ బెరుగు
సోయగపు నీకన్నులఁ జూతువు రావమ్మా ॥ మే మే ॥

కొత్తజవ్వను లైనకొమ్మలచన్నులు తేనె-
దుత్తలంటా పొందించ దొరకొనీని
మొత్తములై యున్నారు ముంగిళ్ళనెల్లాఁ దామే
గుత్తముగ నీవే కనుఁగొందువు రావమ్మా ॥ మే మే ॥

చేరలమేల్మంగఁ గూడి శ్రీవేంకటాద్రిమీఁద
వీరుఁడె వాఁడె యేఁగీని వీది వీధుల
కూరిమి మేము నవ్వితే గుట్టున సన్నలు సేసీ
తేరకొన యిది నీవే తిలకించవమ్మా ॥ మే మే ॥ 454

## దేసాక్షి

ఎలయించి బిడ్డవోజ యింత సేసితిరె మీరే
సొలసి మమ్ము దూరఁగఁ జోటేది మీకును ॥ పల్లవి ॥

వూరఁ గలపాలెల్లా నుట్లఁ బెట్టు కుండఁగాను
చేరువ నూరకుండునా శ్రీకృష్ణుఁడు
సారె సారె జవ్వనాన జడియుచు నుండఁగాను
కోరక వూరకుండునా గొల్లెతలను ॥ ఎల ॥

కడలేనిదూడలను గాడి గట్టు కుండఁ గాను
విడిచి తోలకుండునా వీదుల వెంట
అడుకులుఁ జక్కిలాలు అట్టుకలు నిండుండఁగా
తోడికి కొల్లలాడ దొరకొన కుండునా ॥ ఎల ॥

దరిఁ జీరలు వెట్టి చిత్తలే నీళ్ళాడఁగాను
సరస మాడకుండునా చంకఁ బెట్టుక
పరగ నలమేల్మంగపతి శ్రీవేంకటేశుఁడు
బెరసి మిమ్ము మరిగిఁ బెరచోట నుండునా ॥ ఎల ॥ 455

దేసాళం

భామలు చూడరే తిరుపతి గోవిందుఁడు వాఁడే
ప్రేమతోఁ జన్నులఁ బాలు పిండీ నవ్వులకు ॥ పల్లవి ॥

అట్టులెల్లాఁ దిని తిని అదివో యెవ్వరివాఁడే
వుట్టులపైఁ బిల్లఁగోవు లూదుచున్నాఁడు
పట్టపగలే కొందరు పడుచులఁ గూడుకొని
అట్టుగపైఁ బిల్లగో ట్లాడుచున్నాఁడు ॥ భామ ॥

కతలుగా పన్నారుకాఁగులలో బియ్యాలు
సతులపై సేసలు చల్లీ వాఁడే
తతి వారింటివెన్నే తాఁదిని యుల్లాండ్లనోళ (ళ్ల?)
చతురత బువ్వమంటాఁ జమరీ వాఁడే ॥ భామ ॥

గక్కన నావుఁ బిదికేకాంత మెడ నెక్కుకొని
యెక్కిరింత ఆటలాడీ వాఁడే
అక్కజపు శ్రీవేంకటాద్రిమీఁద నిలుచుండి
చక్కఁగా వినోదాలు సలిపీ వాఁడే ॥ భామ ॥ 456

రేకు-677 మంగళకౌశిక

పెనగొన్నకాఁగిళ్ళ పెండ్లాడవయ్యా
అనిశముఁ బాయలేనిఅలమేలు మంగను ॥ పల్లవి ॥

అంకెల మంచిగుణము లనేటినూలున నీకు
కంకణదారాలు గట్టెఁ గలికి
లంకెలుగా నీపై వలపు లనేబంగారుతో
కొంకులేనిమనసుల కొంగుముళ్లు వేసెను ॥ పెన ॥

ఆసలఁ నిండుఁజూపు లనేటిమేటిమొగ్గల
బాసికము గట్టె నీకుఁ బడఁతి
వాసితో నవ్వు లనేవలువముత్యాలనే
సేసపాలు సిగ్గున దోసిట నీపై నించెను ॥ పెన ॥

బెరసి మనోరథము పెండ్లిపీఁటమీఁద
మరిగి నిన్నుఁగూడె మగువ
అరుదై శ్రీవేంకటేశ అధరామృత బువ్వ -
మెరవు లేనిరతులయింట విందు వెట్టెను ॥ పెన ॥ 457

శంకరాభరణము

ఈలాగుసతి గలిగె నేమి చెప్పేది
యేలితివి నీభాగ్య మేమి చెప్పేది ॥ పల్లవి ॥

అచ్చలపు నీచేఁతకు నలుగక జవరాలు
యిచ్చకము లాడీని యేమి చెప్పేది
పచ్చిదేరేనీమోవి యప్పటిఁ గని పదరక
యెచ్చరించీ రతులకు నేమి చెప్పేది ॥ ఈలా ॥

సుదతితో మాఁటాడఁగాఁ జూచి నిన్నుఁ గసరక
యెదుటనే నవ్వు నవ్వీ నేమి చెప్పేది
అదన నీవేళ్ల నాపెవుంగరా లుండఁగా
యిది నీకుఁ గైలాగిచ్చీ నేమి చెప్పేది ॥ ఈలా ॥

వోనర నిందాకా నెందో వున్ననిన్ను దూరక
యెనసె నలమేల్మంగ నేమి చెప్పేది
మనికై శ్రీవేంకటేశ మన్నించఁగా బిగియక
యెనలేనిమెచ్చు మెచ్చీ నేమి చెప్పేది ॥ ఈలా ॥ 458

### ఆహిరినాట

ఏఁటికి వేడుకొనేవు యిప్పుడే యిన్నిఁ దెలిసె
నేఁటి కేమి రావయ్యా నీవే యెరుఁగుదువు ॥ పల్లవి ॥

కొనగోరిచెనకులు గురుతై మైనుండుఁ గాని
మనసులో నాటేది మాటలే కావా
పెనగొన్న తేనెలు పెదవిపై నుండుఁ గాని
కనుఁగొంటే తరితీపు కాంతలెల్లాఁ దీర్పదా ॥ ఏఁటి ॥

చెంతల నవ్వేనవ్వు సెలవుల నుండుఁ గాని
చింతఁ దల వంపించేది సిగ్గే కాదా
మంతనపుటలుకలు మరఁగునఁ బెట్టుఁ గాని
అంతరంగపుతమక మండకు రప్పించదా ॥ ఏఁటి ॥

విందులరతిభేదాలు వేరులైతే నాయఁ గాని
కందువలు గరఁచేది కాఁగిలే కాదా
అంది శ్రీవేంకటేశ్వర అలమేల్మంగపతివి
పొందిన నీనేస్తము భువి నన్ని దేర్పదా ॥ ఏఁటి ॥ 459

### కాంబోది

నన్ను నింతగా మనిపె నాకేల వేగిరించ
యిన్నిటా నావల పాతఁ డీడేర్చీఁ గాక ॥ పల్లవి ॥

చిత్తగించి పిలిచితే సేవలు సేయుట గాక
వొత్తి పతిఁ గొంగు వట్టు టుచితమౌనా
బత్తి గలవారు వొకపరి మరచి వుంటేను
హత్తి మరొకపరైనా నట్టే మన్నించీఁ గాక ॥ నన్ను ॥

నెట్టుకొని చూచితేను నిలిచి మొక్కుట గాక
వొట్టుక తనుఁ గొసర నుచితమౌనా
యెట్టూ నన్ను నేలినాఁడు యీవేళ నవ్వకుండినా
అట్టె వేరొకవేళ ఆదరించీఁ గాక ॥ నన్ను ॥

సరుసఁ గూచుండితేను సరస మాడుట గాక
వోరయ శ్రీవేంకటేశు నుచితమౌనా
అరుదైన దేవినైతి నలమేల్మంగను నేను
నిరతి నాఁ డట్లుండే నేఁడు గూడీఁ గాక ॥ నన్ను ॥ 460

## హిందోళవసంతం

తగవు నీవెరఁగవా తరుణి నేల దూరేవు
నగుతా నాటకములు నడపేవు గాక ॥ పల్లవి ॥

మాఁటాడించి రమణుఁడు మరిగించుకొనుఁ గాక
అఁటది సిగ్గువడదా అందరిలోన
పంటించి లోనికి వచ్చి పవ్వళింతువు గాక
పీఁట వెట్టి రమ్మని పిలుతురా రతికి ॥ తగ ॥

కొద్దితోఁ బ్రియుఁడు మతికొంకు దేర్చవలెఁ గాక
ముద్దరా లెరుఁగునా మునుపె నవ్వ
వొద్దఁ బెట్టుకొని నీవె వోడి వట్టుదువు గాక
సుద్దు లడిగి చన్నులు చూపుదురా చెలులు ॥ తగ ॥

మన్నించి కాఁగిటఁ జేర్చి మగఁ డన్ని నేర్పుఁ గాక
కన్నియ పైకొనునా కాఁతాళానను
యెన్నిక శ్రీవేంకటేశ యేలి మోవి యడిగేవు
సన్నల నలమేల్మంగ చాఁచునా సారెకును ॥ తగ ॥ 461

## లలిత

బలవంతుఁడవు తొల్లే పతి వందుమీఁదట
చలపట్టి నిన్నుఁ గడు జరయంగఁ గలనా ॥ పల్లవి ॥

పంతములు నావంటిపడఁతులతోఁ గాక
కాంతుడవు నీతో నాడఁగలనా నేను
పొంతనుండి నీవెవ్వరిఁ బోలించినా నందుకెల్లా
సంతోసించుకొందుఁ గాక సాదించఁ గలనా ॥ బల ॥

యెగసక్కె లెల్లాను నాయీడువారితోఁగాక
మగఁడవు నీతోఁ జేయ మందెమేళమా
నగ వెరఁగ కెవ్వతెదండ నీవు వెట్టినాను
నగుచుండుదుఁ గాక మిన్నక దూరఁ గలనా ॥ బల ॥

లావులెల్లా నాసవతిలలనల తోనే కాక
శ్రీవేంకటేశ నీపైఁ జేయ వచ్చునా
ఆవటించి నీదేవిని అలమేల్మంగనే నేను
వావి దెలుపుదుఁ గాక వదలఁగఁ గలనా ॥ బల ॥ 462

రేకు-678 మధ్యమావతి

కొసరి కొసరి నీవే కొంచేవు గాక
పసలు మీరఁగ నోడఁ బరచేవు నన్నును ॥ పల్లవి ॥

సారె మోవేమి చూపేవు చవులేల చెప్పేవు
గారవించి నీవియ్యఁగాఁ గాదంటినా
కేరి నవ్వుతా నాచన్నుగిరు లెంత పొగడేవు
యేరీతులా నీకవి మీఁదెత్తినవే కావా ॥ కొస ॥

సన్నలేమి సేసేవు చనవెంత యిచ్చేవు
వన్నెతో నన్నుఁ గూడగా వలదంటినా
మన్నించి వద్దఁ గూచుండి మచ్చికలు నెరపేవు
అన్నిటా తొల్లే నీకిల్లాల నౌ నెరఁగవా ॥ కొస ॥

సాములేల చేసేవు సందు లేల వెదకేవు
ప్రేమతో నీ వేలితివి బిగిసితినా
ఆముక శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
నే మొక్కితే మెచ్చేవు నేఁడు నీకుఁ గొత్తలా ॥ కొస ॥ 465

శుద్ధవసంతం

పతిసేల సాదించేవు పలుమారును
అతిరాజసపువాఁడు అవుఁగాము లెరుఁగునా ॥ పల్లవి ॥

మగవానిసాజము మానినులఁ గంటేను
నగఁ జూచుఁ గాని యెంతైనాఁ దనియఁడు
నిగిడి తొంటిపొందుల నేస్తగత్తె చెనకితే
మొగమోటఁ గూడుఁగాక ముందువెన కెంచునా ॥ పతి ॥

పాయపువానివోజ పడఁతులు పైకొంటే
చేయి చాఁచుఁ గాని మరి సిగ్గు వడఁడు
రాయడించి వదినె మరదలైన దంటితేను
ఆయాలు గరఁగుఁ గాని అందుకుఁ గాదనఁడు ॥ పతి ॥

విటుఁడైనవానివిద్య వెలఁదులు వద్దనుంటే
తటుకునఁ గూడుఁ గాని తడ వోర్వఁడు
యిటువలె శ్రీవేంకటేశుఁడు నిన్నూ నేలె
ఘటనతోఁ జనవిచ్చుఁ గాని బడి వాయఁడు ॥ పతి ॥ 464

భైరవి

ఆకెకు నీకుఁ దెలుసు నాముకొన్నతగవులు
దాకొన్నసిగ్గును మతి దలఁచ దేమియును ॥ పల్లవి ॥

ఇంతి కెంతచనవు నీ విచ్చితివో కాని నీతో
మంతనానఁ దానొక్కతే మాటలాడీని
వంతుల సవతులెల్లా వాకిటనే వుండఁగాను
వింతలుగాఁ దమి రేఁచి పీడె మిచ్చీని ॥ ఆకె ॥

మగువ నెట్ల నీవు మరిగించుకొంటివో
బగి వాయ దెపుడు నీపానుపుమీఁద
నగుతా నూడిగానకు నాతులు గాచుకుండఁగా
పగటుఁ జప్పుడుతోడ పాదము లొత్తీని ॥ ఆకె ॥

మానినికి నెటువంటి మాట పట్టు సేసితివో
తానకమై నిన్ను లోన దాఁచుకున్నది
వూని దయతోడ నిన్ను నొనఁగూర్చె నందరిని
ఆనుక శ్రీవేంకటేశ అట్టె తానూఁ గూడీని ॥ ఆకె ॥ 465

## మాళవి

తారుమారు వలపుల దాయగాఁడా
యీరీతి నూరకున్నాఁడ వెంతదూరినాను ॥ పల్లవి ॥

కాంత నీకు నొసఁగిన కానికె పువ్వులబంతి
చెంత నీపొరుగాపెచేత నున్నది
వంతుకు నాపెచేతి వైడూర్యపుంగరము
యింతి కిచ్చితివి నిన్ను నేమనేది యిఁకను ॥ తారు ॥

మగువ నీకు నంపిన మంచివాసనజవ్వాది
జిగి నీకొలువలేమచెవి నున్నది
తగునంటా నాపెపాదముల నున్న పెండెము
పగటున నీపె కిచ్చి పచ్చిగా నవ్వేవు ॥ తారు ॥

చెలి నీయింటఁ బెట్టినచిత్తరు వా(వ్రాఁ?)తపటము
కొలఁదితో నాపెమునిగోడ నున్నది
కలికి కాఁగిట నీకుఁ గప్పినపయ్యదకొంగు
కలయ శ్రీవేంకటేశ కప్పితివి సతికి ॥ తారు ॥ 466

## సామవరాళి

ఇంతేసి నిన్నుఁగొసర నెంతదానను
అంతా నీవద్దిచెలుల నడుగరాదా ॥ పల్లవి ॥

యెన్న నీతో మాటాడేది యెంతటిది గావలె
నిన్ను నొడఁబరచఁగ నే నేర్తునా
యెన్నికతో నీవు తొల్లి యిచ్చిననమ్మిక లివి
అన్నియుఁ జెలుల నీవే అడుగఁగరాదా ॥ ఇంతే ॥

యెదిరించి దీకొనగ నెంత గుండెది గావలె
వదలక మట్టుపెట్ట వసమా నిన్ను
మొదలఁ బెండ్లాడేనాటి మోహపు చేఁత లివి
అదె సాకిరిచెలుల నడుగఁగరాదా ॥ ఇంతే ॥

యిచ్చకములాడ నీకు నెటువంటిది గావలె
పచ్చిసేసి తడవఁగఁ బంతకత్తెనా
యిచ్చలు శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవు
అచ్చపుచెలులఁ దగ నడుగఁగరాదా ॥ ఇంతే ॥ 467

తెలుఁగుఁగాంబోది

ఎంత పొగడేవు నన్ను యేమిటికి బాఁతి నేను
కాంతల నింత సేసితే గర్వము పెరుగదా ॥ పల్లవి ॥

నడుమే సన్నముగాని నాకు నీతోఁ బొందుసేసే -
యెడలేని యాసోద మెంతైనాఁ గద్దు
జడిగొన్న నాసిగ్గే చలియించకుండుఁగాని
వుడివోనితమకము లుబ్బూఁత లూఁగును ॥ ఎంత ॥

మనసే మెత్తనగాని మరిగిన నీపైబత్తి
అనిశము సోదించితే నన్నిటా గట్టి
నినుఁ జూచేచూపులు నీలవర్ణములు గాని
నన్నుపైన సెలవుల నవ్వులు తెలుపులు ॥ ఎంత ॥

చెలరేఁగి నామోవిచిగురే వొగరు గాని
పలుకులు నీకైతే పచ్చితేనెలు
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మొలకలు నాచన్నులు ముదురు వలపులు ॥ ఎంత ॥ 468

రేకు-679 భూపాలం

ఆపె నాదరించరాదా అందుకు నీవు
యేపునఁ బొందులు దక్కె నిఁకనేల మరఁగు ॥ పల్లవి ॥

కన్నుల నీకాపె మొక్కె కంటివో లేదో నీవు
సన్నలనే తెలిసి వంచన సేసేవో
పన్నుకొన్న సిగ్గుతోడ పరాకులు చూపేవో
యిన్నియు నేనెరిఁగితి నిఁకనేల మరఁగు ॥ ఆపె ॥

పిసి పిసి మాటలాడెఁ బ్రేమతో వింటివో లేదో
వెస నందుకుఁ జొక్కి నివ్వెరగైతివో
కొసరి దొరతనాన గుట్టుసేసు కున్నాఁడవో
యెసఁగె నీకోరికలు యిఁకనేల మరఁగు ॥ ఆపె ॥

ఇంచుకంత నవ్వు నవ్వె యెఱిఁగితివో లేదో
పొంచి యిప్పుడే కూడి పొద్దు వుచ్చేవో
మంచితనములు సేసి మరియు నన్నేలితివి
యెంచఁగ శ్రీవేంకటేశ యిఁకనేల మరఁగు ॥ ఆపె ॥ 469

## దేసాక్షి

ఇంతా నీపై మోహమే యెరఁగ విన్నవించితి
పంతముతో నెగ్గుగాను పట్టవద్దు సుమ్మీ ॥ పల్లవి ॥

నెలకొని నీమీఁద నేరము లేకుండినాను
వెలఁదిఁ గనక నిన్ను వెంగె మాడుదు
యెలమి నీవు నాకు యెంత చనవిచ్చినాను
కొలఁది మీర నప్పటిఁ గొసరుదును ॥ ఇంతా ॥

బడి వాయ కెప్పుడును పక్క నీవు వుండినాను
వొడలెల్లా సోదింతు నూరకె నిన్ను
జడియక నీవెంత సారెఁ గూడినాను
తడయక చెయి చాఁతుఁ దనియక నేను ॥ ఇంతా ॥

యెనసినసరసము లెంత నీవు నెరపినా
చెనకుదు నీమేను చిరునవ్వుతో
ఘనుఁడ శ్రీవేంకటేశ కాఁగిట నన్నేలితివి
వినయములే సేతు వేమారు నీకు ॥ ఇంత ॥ 470

## దేవగాంధారి

ఇన్నిగుణాలవాఁడ వేమని నుతింతు నిన్ను
వన్నెకెక్క నేలితివి వలచితి నీకును ॥ పల్లవి ॥

మారుసవతులు రానిమను వొకటే మంచిది
గోరు దాఁకకుండాఁ గూడేకూటమి మేలు
తీరాలు పచరించని ప్రియముల మాట లెస్స
యీరీతి నేలేరమణుఁ డిన్నిటాను జాణ ॥ ఇన్ని ॥

సొలసి యెగ్గుపట్టని చుట్టరిక మెక్కుడు
అలుగని సంగాత మది యరుదు
చలము సాదించని సరసమే యబ్బురము
కలసి యిట్టున్నయట్టి కాంతుఁడే జాణ ॥ ఇన్ని ॥

మాట మీరకుండేటి మచ్చిక చెప్పరానిది
యీటు వెట్టని కొండాట మిన్నిటా మెచ్చు
గాఁటాన శ్రీవేంకటేశ గక్కన నన్నేలితివి
వాఁటముగ నెప్పుడూ నీవంటివాఁడే జాణ ॥ ఇన్ని ॥ 471

## కేదారగౌళ

ఈడా నింతు లున్నారు యెవ్వరై రేమి తనకు
ఆడరే యీమాట నే నంటినని చెలులు ॥ పల్లవి ॥

అప్పటనుండీఁ గొలువై వున్నాఁడు రమణుఁడు
అప్పసమై కాంతలెల్లా నండ నుండఁగా
కప్పి బోసగత్తెలెల్లాఁ గాచుకున్నా రిక్కడ
చెప్పరే యాఁకలిగొనే చెలులాల పతికి ॥ ఈడా ॥

యెంత వొద్దా (ద్దా?) తాఁ జూడఁడు యేకతము లాడీఁ దాను
జంత సతులెల్లా సరసము లాడఁగా
కాంతలెల్లా నిట్టే జలకము వట్టుకున్నారు
చెంతల నెచ్చరించరే చెలులాల పతిని ॥ ఈడా ॥

చొక్కి చొక్కి తా నిట్టే చూచీ నాటకసాలలు
యెక్కడలేని జవ్వను లెలయించఁగా
యిక్కడ నన్నేలినాఁడు యింకా దేవు ళ్లున్నవారు
చిక్కించుక చూపరే శ్రీవేంకటపతికి ॥ ఈడా ॥ 472

## వరాళి

తానే నాకు మాట యిచ్చెఁ దనచిత్తము
మోనముతో నలిగేనా ముద్దరాల నేను ॥ పల్లవి ॥

మనసు వచ్చినాపెను మన్నించుమనవే
తనను వొద్దనేనా పంతమున నేను
ననిచి యెవ్వతెతోనైనా నవ్వేమనవె
పెనఁగి కోపగించేనా ప్రియురాల నేను ॥ తానే ॥

యేకాంతకైనాను యిచ్చక మాడుమనవే
కాకు సేసేనా తన్నుఁ గడవారితో
మేకుల కండసతిని మెచ్చు మెచ్చుమనవే
దీకొని వాదించేనా దేవులను నేను ॥ తానే ॥

వలసినవారిని వలపించుకొమ్మనవే
చలమునఁ గాదనేనా సారెకు నేను
అలమి శ్రీవేంకటేశుఁ డాదరించి నన్నుఁగూడె
గొలమి నిఁక దూరేనా ఇల్లాల నేను ॥ తానే ॥ 478

## మంగళకౌశిక

ఎంతసిగ్గులు వడేవు ఇందుకు నీవు
వంతఁ బొరల కెప్పటివలె నుండవయ్యా ॥ పల్లవి ॥

యింటికి వచ్చి యాపె నీయెదుట నిలుచుండఁగా
అంటెఁ గాక మోహము నీ వాసపడేవా
వొంటినుండి సారె నీకు వూడిగాలు సేయఁగాను
నంటు సేసెఁ గాక నీమనసూ నటువంటిదా ॥ ఎంత ॥

మలయుచు నీతో నాపె మాటలెల్లాఁ నాడఁగాను
కలసెఁ గాక పొత్తు గలదా తొల్లి
చలపట్టి పైకొని సరసము నెరపఁగా
పులకించెఁ గాక వట్టి పొందు సేసేవాఁడవా ॥ ఎంత ॥

పానుపుపై నిన్ను నాపె వచ్చిగాఁ గాఁగిలించఁగా
మేను చెమరించెఁగాక మించి కూడేవా
ఆనుక శ్రీవేంకటేశ అంతలో నన్నేలితివి
కానుకాపె యియ్యఁగానేకాక చేత నంటేవా ॥ ఇంత ॥ 474

రేకు-680 ధన్నాసి

తనకొద్దివారా నిన్నుఁ దగిలి యుండినవారు
చనవున యీపె నిన్ను సాదించీఁ గాక ॥ పల్లవి ॥

వలనని జోలియేల వాసులఁ బెనఁగనేల
పిలిచితే రావద్దా ప్రియముతోడ
తలవంచుకొననేల తరితీపు సేయనేల
పలికితే నీతో మారువలుకఁగ వలదా ॥ తన ॥

యెడమాటాడించనేల యెమ్మెలు నెరపనేల
వొడివట్టితే లోఁగావద్దా తాను
కడు నడియాసలేల కాఁతాళించఁగనేల
విడెమడిగితే నిచ్చి వెసఁ గూడవలదా ॥ తన ॥

చిఱునవ్వు నవ్వనేల సిగ్గులు వడఁగనేల
తఱితోఁ గాఁగిటఁ దానే తగులవలదా
యెఱుకతో శ్రీవెంకటేశ నన్ను నేలితివి
మఱి తానిది యెఱిఁగి మరుఁగంగవలదా ॥ తన ॥ 475

మలహరి

పతితోడఁ జెలియా పంతమాడే దాననా
ఇతవుతో నేమనినా నియ్యకొనేననవే ॥ పల్లవి ॥

తెగరానివానితోడ యెగసక్కెమాడనేల
మొగమిచ్చలే నెరపి మొక్కుట గాక
నగి తానూరకే యెంతనమ్మికలు సేసినాను
వెగటు లేకూరకుండే వింతసేయ ననవే ॥ పతి ॥

యేలినవానితోడ యెగసక్కె మాడనేల
నోలిగాను తప్పక చూచుట గాక
వాలాయించి తానెంత వద్దఁ గూచుండవచ్చినా
మేలుదాననై తన్ను మెచ్చు మెచ్చేననవే ॥ పతి ॥

పాయరానివానితోడ పగటులు చూపనేల
ఆయము లెరిఁగి విడె మందుట గాక
యీయెడ శ్రీవేంకటేశుఁ డితఁ డిట్టె నన్ను నేలె
చేయి చాఁచి పాదాలసేవ సేసేననవే ॥ పతి ॥ 476

నట్టనారాయణి

ఎప్పుడూ నావాఁడవే యెంత వొడఁబరచేవు
తప్పు లేదు నీవల్ల తగవు నీచేతిది ॥ పల్లవి ॥

వాసి గలుగఁగ నావద్దనే వుండేననుచు
ఆసలేల చూపేవు అందుకేమయ్యా
బాస నీవెవ్వతెకై నాఁ బరగనిచ్చితేఁ బాయ
దోసము నీవెఱఁగవా తోయరాదు కాంతల ॥ ఎప్పు ॥

నంటున నెంతైనా నీవు నామాట దోయనని
అంటి నన్ను బుజ్జగించే వందుకేమయ్యా
జంటతోడఁ బెండ్లాడినసతు లింట నుండఁగా
వొంటి వేగించరాదు వూరడించువారిని ॥ ఎప్పు ॥

దిట్టవై శ్రీవెంకటేశ దేవుళ్ళలోనెల్లా నీడ
అట్టె నన్నుఁగూడితివి అందుకేమయ్యా
కట్టుకొన్న కాఁపురపుకామినుల నేలవలె
గుట్టునఁ దొలఁగరాదు కూడితే నేమాయను ॥ ఎప్పు ॥ 477

శ్రీరాగం

ఏల తలవంచుకొనీ నేఁటికి సిగ్గువడీని
వాలాయమైనప్పుడు నావద్ద నుండనీవే ॥ పల్లవి ॥

వినయమే నేఁజేసే వెంగెము లేమీ నాడ
మనసు వచ్చినపుడు మన్నించనీవే
ననుపున నవ్వేను నమ్మిక లేమీ నడుగ
పని గలప్పుడు నన్నుఁ బాలించనీవే ॥ పల ॥

నలపులే పైఁజల్లే వాసివంతు లేమీ నెంచ
తలఁపు లోఁగలితేను తానే రానీవే
కొలువులు సేసేను కోపగించ నెంత నను
మలసి తా వచ్చిననాఁడు మాటలాడనీవే ॥ పల ॥

జంపైన గుబ్బలనొత్తే సాదించి నేఁ దను దూర-
నింటికాడ ననుఁ గూడె నిట్టె కానీవే
నంటున మొక్కేను నేను నాటించఁ గొనగోరు
దంట శ్రీవేంకటేశుఁడు తగులనీవే ॥ పల ॥ 478

## శుద్ధవసంతం

చూడరే యీతనిమాట సుదతులాల
పాడి పాడి నాతోనెంత పతిజ్ఞ లాడీని ॥ పల్లవి ॥

మగవాఁడు తానైనది మగువలకే కాక
తగుల నెందూనంటాఁ దా నేలనీనే
చిగురుఁబెదవితేనె చెలువలకే కాక
యెగసక్కేలకు నది యెందు వోసీనే ॥ చూడ ॥

జవ్వనముగలదెల్లా సతులఁ బొందనే కాక
యెవ్వతేఁ గూడనంటా నే లిచ్చ లాడీనే
నవ్వులు సరసములు నాతులతోనే కాక
మువ్వంకాఁ దానెటువలె మూటగట్టీనే ॥ చూడ ॥

కోరి తా జాణఁడైనది గొల్లెతల నంటఁ గాక
వూరకే యాచారలెల్లా నొడిగట్టీనే
యీరీతి శ్రీవెంకటేశుఁ డింతసేసి నన్నుఁ గూడె
సారె నావాఁడనే యంటా సమ్మతిసేసీనే ॥ చూడ ॥ 479

కన్నడగౌళ

ఇట్టే నాయానోదము యేమని చెప్పుదునే
నెట్టన విన్నవించరే నేఁడు మీరాతనికి ॥ పల్లవి ॥

కాంతునిఁ జూచినచూపు గక్కన మనసు చొచ్చి
మంతనాన నిదే నామర్మము రేఁచీనే
వింతగా నాతనిమాట వీనుల విన్నవినికి
బంతినే నారోమకూపములఁ జొచ్చీనే ॥ ఇట్టే ॥

పతితోఁ జేసినపొందు పరగ మేనెల్లా నిండి
సతతము నుప్పతిల్లీఁ జనుఁగవల
అతనిమోవిచవి అట్టె నాలిక మరిగి
రతికెక్కి గుక్కిళ్ళై రసము లుబ్బీనే ॥ ఇట్టే ॥

శ్రీవేంకటేశుకూటమి సిగ్గులెల్లాఁ దొప్పఁదోఁగి
వేవేలు కోరికలై వినోదించీనే
భావించి యాతని తలఁబాలు శిరసుననుండి
తావులపానుపుమీఁద దయిలువారినే ॥ ఇట్టే ॥ 480

రేకు-681 ఛాయానాట

మీరెంత భ్రమయించేరే మీతోఁ బొందు సేసె (సీ?) నంటా
వూరివారితోనెల్లా వొకఁ డోపఁగలఁడా ॥ పల్లవి ॥

పందెమాడుతానున్నాఁడు పతివీఁపునఁ జన్నులు
సందడి నేల వొత్తేరే సతులెల్లా
మందలించి పరాకైతే మనసెందుపైఁ బారునో
ముందువెనకల రెంటా మోసపుచ్చ నేఁటికి ॥ మీరెంత ॥

సారె చేతఁ బట్టినాఁడు సారెఁ గానుక గొమ్మంటా
గోరులేల తాఁకించేరే కొమ్మలెల్లాను
యీరీతి దొమ్మిసేసితే నెందుఁ దగులాయమౌనో
వేరడి నింతేసి పిరువీకు సేయనేఁటికి ॥ మీరెంత ॥

తడవుగా నాడినాఁడు తగిలి శ్రీవెంకటేశు-
 వొడిపై నేల కూచుండే రువిదలెల్లా
అడరి పైకొంచేను ఆస యెందుఁ బుట్టునో
 తడఁబాటు సేసి ఇంత తమకించనేఁటికి ॥ మీరెంత ॥ 481

## సౌరాష్ట్రం

అవిగో నావిన్నపము లన్నియు నందె వున్నవి
 తివిరి యేలడిగేరు తెలుసుకోరే ॥ పల్లవి ॥

పూనుక ఆతనికిఁగా బుద్ధి నాకెంత చెప్పేరు
 వీనుల నన్నిసుద్దులు వింటినే నేను
కానుక యిచ్చితి నని కాంతునికి పూవుదండ
 మోనతోఁ జేతి కిచ్చి మొక్కరే నామారు ॥ అవి ॥

యీరీతి నిందరు నన్ను నేల వొడఁబరచేరు
 కూరిమి నివెల్లా నెరుఁగుదునే నేను
వూరకే నాకుంచెను నావూడిగముగ విసరి
 గారవించి మేలని పొగడరే నామారు ॥ అవి ॥

తలపోసి నాకేమి తారుకాణించ వచ్చేరు
 కలదెల్లా నాకన్నులఁ గంటి (నే?) నేను
యెలమి శ్రీవేంకటేశుఁ డీడ వచ్చి నన్ను నేలె
 నిలువున సేసలు నించరే నామారు ॥ అవి ॥ 482

## సాళంగనాట

వొద్దనేమా నిన్ను నేము వూరకే యేల లోఁగేవు
 బుద్దులెల్లా నేరిపి బుజ్జగించరాదా ॥ పల్లవి ॥

నీమొగము చూచి చెలి నిలువెల్లాఁ జెమరించె
 వేమరు సురటిఁ గొని విసరరాదా
చేముట్టి నీకు మొక్కి చిత్తమెల్లాఁ గరఁగెను
 ఆమని నీమోవి యిచ్చి అలపార్పరాదా ॥ వొద్ద ॥

సన్నలనే మాటలాడి సతి పరవశ మందె
చన్నులపైఁ బన్నీరు చల్లఁగరాదా
నిన్నుఁ గొల్చి తానుండి నిట్టూరూపులు నించె
వున్నతిఁ గాఁగిటఁ గూడి వూరడించరాదా ॥ వొద్ద ॥

సెలవుల యింతి నవ్వి సిగ్గులలో నోలలాడీ
పిలిచి నీతొడమీఁదఁ బెట్టుకోరాదా
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
లలి రతులెల్లా నేర్పి లాలించరాదా ॥ వొద్ద ॥ 483

## శ్రీరాగం

సేవ లెప్పుడూఁ జేసి నే చెప్పితిఁగాక
వేవేలై నా నిద్దరికి వింత కానలే ॥ పల్లవి ॥

ననుపు గలిగితేనే నవ్వులింపు లౌఁగాక
మన సొకచోటనుంటే మరి యేఁటికే
కనుఁగొని చే చాఁచితే కానుకియ్య వచ్చుఁ గాక
పెనఁగులాడితేను ప్రియ మౌనలే ॥ సేవ ॥

మక్కువతో వింటేను మాట లాడ వచ్చుఁ గాక
యెక్కడో పరాకైతే యెనయునలే
చక్క వద్దనుంటే మోవిచవి చూపవచ్చుఁగాక
అక్కడా నిక్కడానుంటే నను వౌనలే ॥ సేవ ॥

వొట్టి కాఁగిలించుకొంటే నొద్దిక దనివౌఁగాక
గుట్టున నుండితేను కూడుట యెట్టే
అట్టె శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
దిట్టయై నన్ను నేలె తెలిపితిఁగాక ॥ సేవ ॥ 484

## శంకరాభరణం

చేపట్టి నన్నేలి చేకొంటి వీకాంతను
మీపొందులు చూచి చూచి మెచ్చేరు యీచెలులు ॥ పల్లవి ॥

వారక వేరొకయింతివద్దికి నీ వేగఁగాను
కూరిమితోఁ జారి తెచ్చి కొంగువట్టి
గోరు చెక్కిటిపైఁ దీసి గుబ్బలు వీఁపున నూఁది
చేరఁదీసె పాన్పునకు చెప్పరాదు మోహము ॥ చేప ॥

పొరుగు మేడపై సతిఁ బొంచి నీవు చూడఁగాను
తెరవేసి నీమోవితీపు లాని
నిరతిఁ దనపాదము నీపాదముతోఁ గీలించి
సిరుల నిన్నుఁ జొక్కించె చెప్పరాదు మోహము ॥ చేప ॥

సంగడి నున్నచెలితో సన్న నీవు సేయఁగాను
రంగుగఁ బయ్యద గప్పి రతి సేసి
చెంగట నలమేల్మంగ శ్రీవేంకటేశ్వర కూడి
సింగారాన మెరసీ చెప్పర దు మోహము ॥ చేప ॥ 485

రామక్రియ

ఎందాఁకాఁ గొలువు సేసే రెన్ని లేవు పనులు
అంది ముచ్చటలు మీలో నాడరయ్యా ఇఁకను ॥ పల్లవి ॥

కప్పురవిడెము నదే కస్తూరి వూసుకో నదే
దప్పికిఁ బన్నీ రదే దండ నున్నది
చెప్పినవూడిగాలకు చెంతనె కాచుకుండేము
వొప్పుగ నేకతమున నుండరయ్యా యిఁకను ॥ ఎందా ॥

విరులదండ లివిగో విసరుకో సుర టిదే
పరగఁ బరచితిమి పానుపూ నిదే
అరసి యేమైనా మీ రానతిచ్చితేఁ జేసేము
వొరిమెతోఁ బవ్వళించి వుండరయ్యా యిఁకను ॥ ఎందా ॥

ఆరగించఁ గజ్జాయము అదిగో పానకము
కోరి యలమేల్మంగతోఁ గూడిననీకు
ఈరీతి శ్రీవేంకటేశ యిక్కడనే వున్నారము
కూరిమి మీయలపార్చుకొనరయ్యా యిఁకను ॥ ఎందా ॥ 486

రేకు-882 ముఖారి

మందెమేళ మైనమీఁద మరి చెప్ప నేఁటికి
అందెవ్వతెతో నవ్వినా అదలించీ నిన్నును ॥ పల్లవి ॥

చెనకి నీవు నవ్వఁగా సిగ్గువడెఁ గాక చెలి
మునుపటివలె నుండే మొక్కదా నీకు
చనవు నీవియ్యఁగానె సంగడిఁ గూచుండెఁ గాక
పనులు సేయించుకొంటే బత్తితోడఁ జేయదా ॥ మందె ॥

మట్టులేక వలవఁగా మంచముపై నుండెఁ గాక
గుట్టున నుండితే నీకుఁ గొలువు సేయదా
నెట్టన నొడి వట్టఁగా నిన్నింత జంకించెఁ గాక
అట్టె వోరచుకుంటేఁ బ్రియము నీకుఁ జెప్పదా ॥ మందె ॥

పైపైఁ గూడఁగా నీమై పచ్చిసేసెఁ గాక తరి-
తీపు సేసితే వడఁదేర్చదా నిన్ను
యేపున శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
చేపట్టి నన్నేలి తాపె చేరి బుద్ది చెప్పదా ॥ మందె ॥ 487

భైరవి

సేయఁగల వూడిగాలు సేసేము గాక
యీయెడ నిన్ను నేము ఇట్టిట్టన వచ్చునా ॥ పల్లవి ॥

పొంతనుండి యాకె నీకు బుద్ధులెల్లా నేరుపఁగా
సంతతము మాతో మాట చవుల లయ్యీనా
పంతమాడేయాపె నీపై బత్తి లిట్టె చూపఁగాను
కాంతుఁడ నీ వినయాలు కాన వచ్చీనా ॥ సేయ ॥

నంటు సేసుకొని నీతో నవ్వు లాపె నవ్వఁగాను
ఇంటికిరమ్మనఁగా నీ కితవయ్యీనా
జంటై నీ ముందరఁ దాఁ జనవులు మెరయఁగా-
నంటి సరసము లిడ నాడఁ గొలిపీనా ॥ సేయ ॥

సరుస వెట్టుక యీపె వలపులు చల్లఁగాను
సరస నాకుఁ గూచుండ సంగతయ్యీనా
నిరతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
ధర నన్నేలితి విది దలఁచుకొనేవా ॥ సేయ ॥ 488

## సామంతం

ఏఁటికి సిగ్గులు పడే వెవ్వరున్నా రిడను
పాటించి నీభాగ్యమాయఁ బైకొనవయ్యా ॥ పల్లవి ॥

మొగమునఁ జిరునవ్వు మొలచె నింతికిని
తెగని వలపులనుఁ దీగెలు సాగె
చిగిరించి కోరికలఁ జెలఁగి గుత్తులు గట్టె
జిగి జవ్వనవనానఁ జిత్తగించవయ్యా ॥ ఏఁటి ॥

ముంచినపులక లనుమొగ్గలెల్లా నిండుకొనె
మంచికాపు వట్టెను చెమటముత్యాల
దించరాని మోవిపంటి తీపు లనేఫలమందె
పొంచి జవ్వవవనాన భోగించవయ్యా ॥ ఏఁటి ॥

సమరతి పుర్పులచల్లగాలి విసరెను
కొమరె గుబ్బలమేలు కుప్పలాయను
అమరె శ్రీవేంకటేశ అలమేలుమంగగూడె (డి?)
తమి జవ్వనవనానఁ దని వొందవయ్యా ॥ ఏఁటి ॥ 489

## దేవగాంధారి

ఎన్నిటికైనా వచ్చు నిచ్చకపు నీచేఁతలు
మన్నన నాకిచ్చితివో మహిమ చూపేవో ॥ పల్లవి ॥

మనసు చూడవలసి మచ్చిక నాకుఁ జేసేవో
యెనయ నిజాలకును యింపు గలదో
పని గలిగి నాతోను పలుమారు బలికేవో
అనిశము నూరకే ఆసలు చూపేవో ॥ ఎన్ని ॥

ప్రియము గలిగి నాతోఁ బెనఁగాడ వచ్చేవో
బయకారములు నాతోఁ బచారించేవో
నయాన బత్తి గలిగి నవ్వులు నవ్వేవో
క్రియ దెలిసినదాఁకా గేలిసేసేవో ॥ ఎన్ని ॥

కరుణ గలిగి ననుఁ గాఁగిలించి కూడితివో
తరుణుల కిది చూపి తమి రేఁచేవో
నిరతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
యిరవై నన్నేలితివో యిది నీ వినోదమో ॥ ఎన్ని ॥ 490

## నారాయణి

ఆపె నాచెల్లెలు గాదా అందుకేమి
నాపొందు విడువ నని నమ్మించేవు నీవు ॥ పల్లవి ॥

ప్రేమము గలిగినాపె ప్రియపడి మాటాడఁగా
నామోము చూచి యేమి నవ్వేవు నీవు
వేమరు గడ్డము వట్టి వేడుకొని పిలువఁగా
ఆముకొని నన్నేలప్పుణడిగేవు నీవు ॥ ఆపె ॥

పావి గలసినయాపె వలపులు చల్లఁగాను
సోవలుగా నా కేఁటికిఁ జూపేవు నీవు
కావరించి యిక్కువకు గనుసన్న సేయఁగా
భావించి నన్నెంత వొడఁబరచేవు నీవు ॥ ఆపె ॥

పొరుగున నున్నయాపె భుజముపైఁ జెయి వేయఁగా
అరసి నన్నిట్టుగూడే వప్పటి నీవు
నిరతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
సిరుల నిచ్చకా లెన్ని సేసేవు నీవు ॥ ఆపె ॥ 491

## రీతిగౌళ

వాకిటఁ గాచుకున్నది వచ్చినదాఁకా నీవు
జోకతోడుత నెదురు చూచీ రావయ్యా ॥ పల్లవి ॥

పండుగాఁ దనయింటికి విచ్చేయు మనె నిన్ను
అందుకోవయ్యా కానికె అంపె నీకాపె
చెంది నిన్నుఁ దోడుకొని చేరి కొల్చి రమ్మనె
అందలము వుత్తెంచె నదిగో రావయ్యా ॥ వాకి ॥

దండిగా నొసల నక్షంతలు నీకుఁ బెట్టుమనె
దండము వెట్టుమనెను తనమారుగా
యెండ గాకుండా గొడుగు యిదే పట్టుక రమ్మనె
అండనే ముద్దుటుంగర మంపెను రావయ్యా ॥ వాకి ॥

కోరి పైడి పీఁటమీఁదఁ గూచుండఁ బెట్టుమనె
చేరె నీసంగడికిఁ దాఁ జేకొను మిఁక
యీరీతి శ్రీవేంకటేశ యీకె యలమేల్మంగ
కూరిమితోఁ గూడితివి గుట్టున రావయ్యా ॥ వాకి ॥ 492

రేకు-683 వరాళి

కోపగించుకొనకు మీకొమ్మ బత్తిసేసె నింతే
వోపికగలదొరకు వోర్వఁగ వలెను ॥ పల్లవి ॥

తరుణి నీమేన గందము వూసేపరాకున
నిరతి గట్టిచన్నులు నిన్నుఁ దాఁకెను
సరస నీకుఁ గొప్పు చక్కఁబెట్టేపరాకున
అరుదుగా నీచెక్కున నటు గోరంటెను ॥ కోప ॥

యింతి నీకు వీడెము లిచ్చేపరాకున-
నంతలోఁ జెమట నీపై నటు చిందెను
చెంతనుండి వూడిగాలు సేసేపరాకున
బంతినే నిట్టూర్పులు నీపై విసరఁ జొచ్చెను ॥ కోప ॥

అలమేలు మంగ నిన్ను నలమేపరాకున
నెలవై యాపెపాదము నిన్ను సోఁకెను
నలి శ్రీవేంకటేశ్వర నవ్వేపరాకున
కలికి తమ్ములము నీకాయమెల్లా నిండెను ॥ కోప ॥ 493

## గుండక్రియ

నిచిత్త మెట్టున్నదో నే నెఱఁగను
చూచి నాకై తేఁ గడునోద్యము లయ్యీని ॥ పల్లవి ॥

చనవు గల దంటాను సరసము నీతో నాడీ
వనిత కొలువులో నీవద్దఁ గూచుండి
యెనసి నీదొరతన మెంచవద్దా యిందుకుఁగా
విని సవతులెల్లా నివ్వెరగుతో నున్నారు ॥ నీచి ॥

అత్తి పెండ్లాడితినంటా నట్టె ముందే కడియెత్తీ
పొత్తులవా రుండఁగాను పొలిఁతి
తత్తరించీఁ దన నీ యంతరము భావించవద్దా
చిత్తగించి నీదేవుల్లు సిగ్గులు వడేరు ॥ నీచి ॥

అలమేలుమంగ నేఁడట్టే నీవుర మెక్కిని
చెలులెల్లా వూడిగాలు సేయఁగాను
నిలిచి శ్రీవేంకటేశ నీగుట్టు దలఁచవద్దా
అల నీచుట్టపుఁగాంత లందరూ నవ్వేరు ॥ నీచి ॥ 494

## సాళంగనాట

కూడేవేళ లేనిసిగ్గు కొలులో వచ్చెనా
వేడుక వలపు వెల్లవిరి సేయరాదా ॥ పల్లవి ॥

యెదట నున్నది చెలి యెక్కడ పరాకు నీకు
అదివో వద్దఁ గూచుండు మనఁగరాదా
పెదవులు గదలించీ ప్రియము చెప్పీనేమో
అదనుగా వీను లొగ్గి ఆలకించరాదా ॥ కూడే

చేతికి వీడె మియ్యఁగా శిరసేల వంచేవు
కాతరాన నందుకొని కలయరాదా
యీతల నిన్నే చూచీ యెంతపని గలిగెనో
ఆతలవేఁటిదో నీ వడుగఁగరాదా ॥ కూడే

మొక్కి నీకు సారె సారె పెమోహాన మేల దాఁచేవు
చిక్కి శ్రీవేంకటేశ్వర చేకొనరాదా
అక్కున నలమేల్మంగనైన నన్నుఁ గూడితివి
దక్కితివి నీవు నాకు తన్నుఁ బిలువరాదా ॥ కూడే ॥ 495

## ముఖారి

అంతె కాదా వుప్పు వేసి ఒట్టె పొత్తు గలసేవు
వింతలాయ నీవు నొక వినోదకత్తెవు ॥ పల్లవి ॥

వారక నాయిల్లు చొచ్చి వచ్చి రమణునితోడ
సారెకు నవ్వే వౌనే జాణకత్తెవు
కూరిమి నామంచముపైఁ గూచుండఁగా విడెము
తారి తారి యిచ్చేవేమే తాలిమికత్తెవు ॥ అంతె ॥

మగని నే దూరితేను మరి పూసుక వచ్చేవు
జిగి నీవు గలితిగా చెలికత్తెవు
పగటున నాకాఁగిటిపతిపాదాలు గుద్దేవు
వెగటులే కిపుడై తివే వూడిగకత్తెవు ॥ అంతె ॥

అలమేలుమంగ నేను అతఁడు శ్రీవేంకటేశుఁ-
డెలమి నవ్వులు నవ్వే వెమ్మెకత్తెవు
కలసె నాతఁడు నన్ను కాంతుని నీవూఁ గూడేవు
తెలిసితి నీగుణము తేరకత్తెవు ॥ అంతె ॥ 496

## దేసాళం

ఏకాంతము గద్దు మన కిద్దరికిని
ధాకొని యామేలు నీవు తలఁచుకోవయ్యా ॥ పల్లవి ॥

కోమలి పెట్టి పంపిన గురుతు కానిక నీకు
యీమరఁగున నిచ్చే నిటు రావయ్యా
నీమేనఁ గస్తూరి యిది నిండా నన్నె పూయి మనె
దీమసము నెరపక తెర వేయించవయ్యా ॥ ఏకాం ॥

వొట్టి తనమారు పాదా లొత్తుతా నన్నుండుమనె
పట్టె మంచము మీఁదఁ బండుండవయ్యా
జట్టిగా నీమోవిపండు చవి చూచి రమ్మనె
యెట్టిదో చూతము మొగ మెత్తఁ గదవయ్యా ॥ ఏకాం ॥

యెలయించె శ్రీవేంకటేశ నాచే నీదేవులు
అలమేల్మంగ మతక మంతా నయ్యా
అలరి కాఁగిలించితి మందుకేమి మెచ్చాయ
చెలపట్ట కేలికసానిఁ గూడవయ్యా ॥ ఏకాం ॥ 497

లలిత

ఇటువలె నున్నవి మీ యేలాటాలు
తటుకునఁ జెప్పితేను తగ సంతోసించేము ॥ పల్లవి ॥

పొలిఁతి నవ్వితే నీవు బొమ్మల జంకించేవు
మలసి యేమైనా నాపె మర్మ మెత్తెనో
చెలరేఁగి మాటాడితే సిగ్గులు వడేవు నీవు
కలదో అందేమైనాను కారణములు ॥ ఇటు ॥

తప్పక చూచితేను తలవంచుకొంటివి
చెప్పరానిచేఁత లాడఁ జేసితివో
కప్పురాన వేసితేను గక్కన సన్న సేసేవు
చొప్పు లెత్తి గుఱుతులు చూపెనో నీమేనను ॥ ఇటు ॥

వేళ యెఱిఁగి మెచ్చితే వేడుక వడేవు నీవు
కొలువుం దైరతు లియ్యకో లాయెనో
అలరి శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
తాలిమి నన్నేలితివి తగనాపె చెప్పెనో ॥ ఇటు ॥ 498

రేకు-684 ఆహిరి

నీవె నన్నుఁ జూచి కరుణించేవు గాక
కావరించి వేసరించఁ గలనా నేను ॥ పల్లవి ॥

నెయ్యమున నెవ్వతెతో నీవు పొందుసేసినాను
గయ్యాళిమాటలాడే కాంతనా నేను
చయ్యన విటుఁడవై యేజాడఁ దిరిగినాను
కొయ్యవు నీవని దూరేగుణమా నాది ॥ నీవె ॥

వింతపెండ్లికొడుకవై వేడుకతో వచ్చితేను
పంతాన సాదించ నీతో బలిమా నేను
ఇంతలో వేరొకతె నీవింటికిఁ దెచ్చుకొంటేను
సంతల నీసుద్దులెల్లా చాటఁగ నోపుదునా ॥ నీవె ॥

వలచి నీ వెవ్వరివాకిటఁ గాచుకుండినా
కొలఁదిమీరి నిన్నాడుకొనేనా నేను
అలమేల్మంగను నేను అట్టె శ్రీవెంకటేశ్వర
కలసితి విటు నన్ను కరకరించేనా ॥ నీవె ॥ 499

దేసాళం

ఎంతలేదు మీమాటలు యేమి చెప్పేరే చెలులు
కాంతుఁ డిడకు వచ్చితేఁ గాదు గూడదనేనా ॥ పల్లవి ॥

వలపే నిజమైతే వనితలతోడుత
చలము లెవ్వరైనాను సాదింతురా
వెలలేనిరాత్రుల వెన్నెల గాయునట
యెలమి నక్కడ వచ్చి యెండలుండునా ॥ ఎంత ॥

పొందు సేయవలసితే పొలఁతుల యడాటాన
యిందుముఖులను జూపి యెలయింతురా
కందువైన వసంతకాలమునందును
పొందుగానిజాజిపొదఁ బువ్వులుండునా ॥ ఎంత ॥

అట్టె శ్రీవెంకటేశుఁ డలమేల్ మంగను నేను
గుట్టున నన్నేలె నిఁక గురుతున్నదా
పట్టైకొలనిలో హంస పరగఁ జూపట్టినట్టు
యెట్టి పతులుండినాను యెన్నిక కెక్కీనా ॥ ఎంత ॥ 500

## వరాళి

అటువంటిసతికిఁ గాకయ్యో నీవు లోనయ్యేవా
ఘటన నే నీకు నిచ్చకము లాడేదానను ॥ పల్లవి ॥

చెంతల నందరిలోన సిగ్గువడి నూఁకితేను
కాంతునిఁ జెనకవచ్చు గబ్బియైనది
యెంత వోరుచుకుండినా నెరఁగదు మోహించి
పంతములాడఁ జూచు భయము మాలినది ॥ అటు ॥

తక్కక యంతేసిదొరతనాన విభుఁడుండినా
మిక్కిలి నవ్వు మందెమేళమైనది
వొక్కటై పొన్నున నెట్టు వొనగూడి వుండినాను
కక్కసించు రతులకు గయ్యాళియైనది ॥ అటు ॥

గారవించి మగవాఁడు కాతరానఁ బెనఁగితే
మారుకొనుఁ గడుఁ జలమరియైనది
చేరి యలమేల్మంగను శ్రీవెంకటేశ కూడితి–
వీరితిఁ బ్రియము చెప్పు నిచ్చకమైనది ॥ అటు ॥ 501

## సామంతం

చూచి చూచి మాకిందుకు సోద్యమయ్యీని
చేచేత నిన్నింత నేను సేయఁజాలఁగా ॥ పల్లవి ॥

నెలఁత గూచుండఁగాను నిలుచుండి మాటాడేవు
యెలమి నీ దొరతన మేమి చెప్పేది
కలువల వేయఁగాను కడు నొడ్డించుకొనేవు
వలపు నిన్నింత సేసి వంచుకొనెఁగా ॥ చూచి ॥

అడపములోనివీడె మాపెకు నీవందిచ్చేవు
కడలేసి నీ పంతము కానవచ్చెను
అడరి చెయి చాఁచితేను అంది కైలాగిచ్చేవు
వెడయాస నీసిగ్గు విడిపించెఁగా ॥ చూచి ॥

చెమరించె నంటాను చెక్కు చేతఁ దుడిచేవు
తమితోఁ బెద్దరిక మింతకు వచ్చెను
అమర శ్రీవెంకటేశ ఆలమేల్మంగఁ గూడిత
జమళి నన్నేలితి వాసతి చెప్పేఁగా ॥ చూచి ॥ 502

## సౌరాష్ట్రం

తాఁ గలదు నాకు యేమీఁ దడవలెను
చేఁగదేరె మనసెల్లా చెప్పి చూపనేఁటికి ॥ పల్లవి ॥

యెలయించవద్దుగాని యెట్టైనా నుండుమనవే
వలతుఁ గనక యిఁక వద్దన నేను
తొలుతనే యెరుఁగుదు మారితె వెరవఁడు
చలివాసి తిరిగిని చండిపార నోపను ॥ తాఁగల ॥

యీడు వెట్ట వద్దుగాని యెవ్వతెనైనాఁ దేనీవే
ఆడుకోఁగాఁ దనవోజ లట్టె మానీనా
ఆడనే గడుసు వడె నలయించఁగా నేమి
కూడి వుండినచోటను కోపగించఁ దగదు ॥ తాఁగల ॥

యెడయఁగ వద్దుగాని యెప్పుడైనాఁ గూడనీతే
విడువరాని యెడకు విసువేఁటికి
అడరి శ్రీవెంకటేశుఁ డలమేల్మంగను నేను
కడలేక నన్ను నేలె కన్నుల మొక్కేను ॥ తాఁగల ॥ 503

## మంగళకౌశిక

దరలో నాకుఁ గొత్తలా తనచేఁతలు
సిరులతోఁ గాఁపురము సేయుమని యనవే ॥ పల్లవి ॥

కొత్తపెండ్లికూఁతురంటా కోరి నాకేమి చూపినే
హత్తి యింటఁ బెట్టుకొనుమనవే తాను
యెత్తి యాపెచక్కఁదనా లీడనేల పొగడీనే
బత్తితోఁ దానె సంతోసపడి వుండుమనవే ॥ ద

బువ్వమంటా నాపెంగిలిపొత్తుకేల పిలచీనే
రవ్వగాఁ దానారగించి రమ్మనవే
యివ్వల నాపెకులము యింతయేల చెప్పీనే
పవ్వళించి తానే యెంచి పాటముగొమ్మనవే ॥ ధర ॥

చెల్లెలంటా నాకునేల చెప్పి యప్పగించీనే
బల్లిదుఁడు తనాలాయ* బదుకు గాక
చెల్లు నలమేల్‌మంగను శ్రీవెంకటేశుఁడు తాను
కొల్లగాఁ దన్ను నేలెఁ గూడి వుండుమనవే ॥ ధర ॥ 504

రేకు-685 మాళవిశ్రీ

ఎందుండి తెచ్చుకొంటివి యీపెను నీవు
అందమాయఁ జేఁతలు నేఁడాపె నీకుఁ దగును ॥ పల్లవి ॥

శిరసు వంచుకొంటా సిగ్గులు వడుకొంటా
సరసము లేమాడీ సతి నీతోను
సరులు దిద్దుకొంటా సారె నిన్నుఁ జూచుకొంటా
విరుల నేల వేసీ వేమరు నీపైని ॥ ఎందు ॥

పాటలు వాడుకొంటా పాపట దువ్వుకొంటా
నీటులేమి చూపీని నెలఁత నీకు
మాటల సొలసుకొంటా మర్మము లంటుకొంటా
చీటికి మాటికినేల చెక్కులు నొక్కీని ॥ ఎందు ॥

చేతులెత్తి మొక్కుకొంటా చేరి కాఁగిలించుకొంటా
కాతరించి యెట్టుగూడీఁ గాంత నిన్ను
నీతితో శ్రీవెంకటేశ నేనలమేలుమంగను
యీతల నన్నేలి తీపె యిపుడె మెచ్చీని ॥ఎందు ॥ 505

సామంతం

నీవంక దోసము లేదు నేఁడాపెవంకనే కాక
రావయ్య నీవేల ఆవలిమో మయ్యేవు ॥ పల్లవి ॥

* 'తన ఆలాయె' యని విరుపు.

నెలఁత నితో నవ్వితే నీవూ నవ్వితివి గాక
తలకొని నీవంకఁ దప్పులున్నవా
వలపు లాపె చల్లగా వలచితి నిం (విం?) తె గాక
బలిమి నంతక తొల్లి పైకొంటివా ॥ నీవంక ॥

ఆకె విడె మియ్యఁగాను అందుకొంటి వింతె కాక
కాకుసేయ నీవంకఁ గడమున్నదా
నీకు మొక్కఁగాఁ గాఁగిట నించుకొంటివి గాక
దాకొని రతికి నీవు తమకించితివా ॥ నీవంక ॥

సంగతిఁ బండుండఁగాను సతిఁ గూడితివి కాక
చెంగట నిన్ను దూరి చెప్పనున్నదా
రంగుగ నేనలమేలుమంగను శ్రీవేంకటేశ
సంగతిగాఁ గూడితివి జాగులు సేసితివా ॥ నీవంక ॥ 506

## కాంబోది

నివ్వెరగుతోడుత నీదిక్కు చూతుఁగాక
అవ్వలివారి దూర నరువామూ నాకు ॥ పల్లవి ॥

గరిమ నీవెవ్వతె నక్కడఁ బొందు సేసుకొన్నా
సరివెట్టు కాపెతో జగడించేనా
నిరతి నేఁ జూడఁగానె నీవు నాపె నవ్వినాను
యెరవులు సేసుకొని యెగసక్కె మాడేనా ॥ నివ్వె ॥

యెలమి నెవ్వతె నాకు నెదురుగాఁ బెట్టినాను
మలసి సరకుసేసి మాటలాడేనా
నలిరేఁగి మీలో సన్నలు సేసుకొన్నాను
చలపట్టి నేనది సడ్డసేసేనా ॥ నివ్వె ॥

కందువ నెవ్వతెచేతికానుక నీవందుకొన్నా
చెందియది గురిసేసి చెప్పవచ్చేనా
అంది శ్రీవెంకటేశ్వర అలమేలుమంగను నేను
అందముగా నన్నేలితి వాపె నిఁక మెచ్చేనా ॥ నివ్వె ॥ 507

## హిందోళ వసంతం

మగవారితోడుత మగువకును
నిగిడి యెంతైనా మేలే నెరపుట గాక ॥ పల్లవి ॥

మొగము చూచితేను మొక్కి వుండుట దగు
నగితేను కలసి పెనఁగఁ దగును
తగులు గలిగితేను దండనె కూచుండఁ దగు
యెగసక్కెమైతేను యేమి సేయవచ్చునే ॥ మగ ॥

మనసొగ్గి వింటేను మాటలాడఁగఁ దగు
ననుపు నడపితేను నవ్వఁగఁ దగు
చనవు లొసఁగితేను సరసము చూపఁదగు
ఘనంతఁ దానుంటే తమి గొట్టు రేఁచేదే ॥ మగ ॥

తడయక కూడితేను తరితీపు సేయఁదగు
జడియని పొందైతే సాధించఁదగు
అదరి శ్రీవెంకటేశుఁ డలమేల్మంగను నేను
కడఁగి నన్నేలె నికఁ గాదనే దేఁటికే ॥ మగ ॥ 508

## దేసాక్షి

ఏల సిగ్గులు వడేవు యెవ్వరు నిన్ను నవ్వేరు
యీలీల నేఁ దెలికత్తె నెవ్వరితోఁ జెప్పినే ॥ పల్లవి ॥

పొంతనె యప్పటనుండి పొత్తునఁ గూచుండుమనీ
ఇంతిరో విభునిమాట యియ్యకొనవే
యెంత వేడుకో కాని యిట్టె కడి చేతికిచ్చి
సంతోసానఁ గైకొని చవిగొనవే ॥ ఏల ॥

మించి తననోరిపాలమీఁగడ నీకొసగిని
అంచెల నీ మోవితేనె అందుకొనవే
నించిన రసాయనము నీకు పుక్కిటినె చూపీ
పొంచి పావురమువలెఁ బూని యారగించవే ॥ ఏల ॥

వేడుక బువ్వాలలోనె వేవేలు రతులు సేసీ
వీడక నీవూ నెదురు విందు వెట్టవే
యీడనె శ్రీవెంకటేశుఁ డితఁ డలమేల్మంగవు
కూడితివి తనిసి చుక్కువ నుండఁగదవే ॥ఏల॥ 509

రామక్రియ

నంటున నాతనిచేఁతో నావోజ ఇట్లాయ
కంటిరా వోచెలులాల కూరుకమ్మి వలపు ॥పల్లవి॥

సిగ్గుల మాటలాడితే చిరునవ్వు వచ్చుఁగాక
కగ్గి మతిఁ గోపముకా గారణవేమే
అగ్గలమై చెనకితే నాస వుట్టవలెఁ గాక
యెగ్గుపట్టి బొమముడి యేల పొంచీనే ॥నంటు॥

చేరి పెనఁగులాడితే చెమటలు రేఁగుఁగాక
పోరచి మెయికాఁకలు పొడమనేలే
సారెఁ దప్పక చూచితే సంతోసించవలెఁ గాక
మారుకొన్న పంతములు మలయఁగ నేఁటికే ॥నంటు॥

తతిఁ గూడితే రతిఁ దనివందవలెఁ గాక
మితిలేని తమకము మెరయనేలే
అతఁడు శ్రీవెంకటేశుఁ డలమేల్మంగను నేను
చతురతఁ గూడితిమి చల మిఁక నేఁటికే ॥నంటు॥ 510

రేకు-686 కన్నడబంగాళం

మెచ్చితి నే నిన్నిందుకు మేలు నీవుపాయములు
వొచ్చెము మానఁగ సొమ్ము లొసఁగేవు నాకును ॥పల్లవి॥

ఇక్కడ నే దూరేనంటా నిందాఁకా నీవాపె-
పక్కనుండి వచ్చి నాపై బత్తిసేసేవు
నిక్కి మోవి యెంగిలైన నేర మెంచకుండాను
మక్కువలు చల్ల నాతో మాటలాడేవు ॥మెచ్చి॥

ఆకెయింట నారగించి అందు కేమీ ననకుండా
చేకొని వీడె లిక్కడఁ దేయవచ్చేవు
కోకతో మేని మచ్చము చూచి నేఁ గోపించకుండా
కైకొని గక్కన నన్నుఁ గాఁగిలించుకొనెవు ॥ మెచ్చి ॥

కలసి యాపె యిచ్చిన కప్పురము నాకిచ్చి
చలపట్టి నాకాఁక చల్లార్చేవు
నిలిచి శ్రీవెంకటేశ నేనలమేలుమంగను
యెలమితో ననుఁ గూడి యింపులు రేఁచేవు ॥ మెచ్చి ॥ 511

## రామక్రియ

నీవాపెపై బత్తియాత నేనెరఁగను
చేవమీరఁ దొల్లే బుద్ధి చెప్పవద్దా నాకు ॥ పల్లవి ॥

నలువంకా నీతోనే నవ్విన నవ్వులెల్లా
యెలమి నాపెతో నీవు యేల చెప్పేవు
కలవరించి నీసతిఁ గాఁతాళించి నేఁ దిట్టితే
చెలరేఁగి నీవేల చిన్నఁబోయేవు ॥ నీవా ॥

పెనఁగఁగా నాగోరు బెరసి నిన్ను సోఁకితే
యెనసి యాపెకు నీవేమి చూపేవు
కని తా నీవద్ద నుండఁగా మరచి నే దొబ్బితే
తనివి లేక నీవెంత తలవంచేవు ॥ నీవా ॥

తమకించి నాచన్నులఁ దగ నిన్ను నొత్తితేను
సముకాన నాపెకేల సన్న సేసేవు
అమర శ్రీవెంకటేశ అలమేల్మంగనే నేను
సమరతి నిద్దరికిఁ జనవు లిచ్చేవు ॥ నీవా ॥ 512

## నాదరామక్రియ

కతలేల చెప్పేవు కడు నిజమరినంటా
పతివి నీచేఁతలెల్లాఁ బచారించవలెనా ॥ పల్లవి ॥

చూచితేనే తెలియదా చొక్కమైన మోహము
చేచేత నంతేసి గరిసించవలెనా
కాచుక వేగించేయందే కానరాదా నీసుద్దులు
యీచాయ నింద నీపైనింకా మోపవలెనా ॥ కత ॥

మాటాడితేఁ దెలియదా మనసులోపలిచింత
గాఁటాన వేరే నిన్నడుగఁగవలెనా
తేటగా నూరకే నవ్వితేనే కానరాదా కీలు
పాటించి నేరమి నీపై వేయవలెనా ॥ కత ॥

నిలిచితేఁ దెలియదా నీలోనివుద్యోగము
చెలరేఁగి నిన్ను రట్టుసేయవలెనా
అలమేలుమంగను నేను అట్టె శ్రీవేంకటేశ
కలసితివి నన్ను నీగతు లెంచవలెనా ॥ కత ॥ 513

ఆహిరినాట

రమ్మనరే చెలులాల రమణుని నీడకు
తమ్మివాట్లకు నేలే తనివోని సిగ్గులు ॥ పల్లవి ॥

చేయిమీఁదుగా లోలోఁ జేసినదే చేఁతగాక
పాయపువారికి నేలే పాడిపంతాలు
ఆయములు సోఁక నాడినదే దక్కెఁగాక
కాయజతంత్రాన కేలే కడునొఁబాటులు ॥ రమ్మ ॥

కొలుముందుగా రతిఁ గొన్నదే కొలుగాక
ఆలిమగని కేలే అవుఁగాములు
కేలుగేలు మోవఁ బెనఁగినదే మంచిదిగాక
మేలు గలచోటు నలే మెదకతనములు ॥ రమ్మ ॥

మనసునఁ గలట్టెల్లా మచ్చికఁ గూడుతగాక
తనకు నాకూ నేలే తలపోఁతలు
యెనసె శ్రీవెంకటేశుఁ డే నలమేలు మంగను
ననుపైతే మరియేలే నానావిచారాలు ॥ రమ్మ ॥ 514

శంకరాభరణం

ఎగ్గుపట్టరాదు మరి యెరిఁగిన జాణఁడవు
సిగ్గరిది నీదేవులు చిత్తగించవయ్యా ॥ పల్లవి ॥

కాంతలకు నొయ్యారపుగర్వమే బంగారము
వింతలైన మాటలవెంగేలు చవి
సంతోసపుఁజూపులసళుపులే మోహనము
మంతనాననుండి చల్లేమచ్చికలే యింపులు ॥ ఎగ్గు ॥

తగుఁ బయ్యెదచన్నులదాఁపరాలే తరితీపు
మొగములో చిరునవ్వుమొలకే ఆస
సొగసైన కరములసోఁకులే ఆనందాలు
పగటు బొమ్మజంకెలే భావజునిసిరులు ॥ ఎగ్గు ॥

సందడిచెనకులు సంసారఫలములు
కందువమోవిసన్నలు కడుఁ బండుగ
అందపు శ్రీవెంకటేశ అలమేల్మంగకు నీకు
మందెమేళాలు రతులమర్మపు ముచ్చటలు ॥ ఎగ్గు ॥ 515

గౌళ

సవతులైనవారు సడ్డసేతురా
రవళితో నీవేల రాఁపుసేసేవే ॥ పల్లవి ॥

మాట లెన్ని యాడినాను మరి సేసినట్టుగాదు
నీటు లెంత చూపినాను నేర్పుగాదు
యేఁటికిఁ బంతాలాడేవే యీతఁడు నాకు వలచు
కాటుకకన్నుల నెంత కాఁడఁ జూచేవే ॥ సవతు ॥

గయ్యాళితనాలవంకఁ గట్టుకొనే దేమున్నది
సయ్యాటలఁ బెనఁగితే సాదించేదేమి
కొయ్యతనాలు నీకేల కోరి నామగఁ డితఁడు
చేయి (చెయ్యె?) త్తిచూపియేల చెలులకుఁ జెప్పేవే ॥ సవతు ॥

పంతాలకు బిగిసేవు ఫలమేమి గంటివే
వంతులకుఁ దగిలితే వాసి వచ్చునా
చెంత నలమేల్మంగను (శ్రీ)వేంకటేశుఁ డితఁడు
బంతినే నన్నేలినాఁడు బయలేల యీఁదేవే ॥ పవతు ॥ 516

రేకు-687 భూపాళం

అతఁడు నీమోము చూచీ నప్పటినుండి
చేతులెత్తి మొక్కి యిట్టె సేవ సేయఁగదవే ॥ పల్లవి ॥

పంతములాడఁ దగదు పతితోడ నింతులకు
యెంతైనా నిచ్చలాడుటే యెన్నికగాని
చింతలోనిది వలపు చేకొన్నది జవ్వనము
వింత సేయ కాతనికి విడె మియ్యఁగదవే ॥ అతఁడు ॥

పొరపొచ్చె మేఁటికి పొందైనచో నెవ్వరికి
వరుసతో నవ్వు నవ్వవలెఁ గాని
పొరిఁ బువ్వులే యమ్ములు బొమ్మలే మరుని విండ్లు
విరసము లేఁటికి విడె మియ్యఁగదవే ॥ అతఁడు ॥

సిగ్గువడ నీఁకేల (శ్రీ) వేంకటేశుతోడ
వొగ్గిరతిఁ గూడినదె వొద్దికగాని
అగ్గమై వురమెక్కితి వలమేల్ మంగవు నీవు
వెగ్గళించె నీ నేరుపు విడెమియ్యఁగదవే ॥ అతఁడు ॥ 517

దేవగాంధారి

ఒక్క మనసునఁ గూడి వుండరాదా
యిక్కడ దొల్లిటిసుద్దు లెంచనేల మీకు ॥ పల్లవి ॥

పడతిఁకి నీకును పాయకుండా బుద్ధిచెప్పే
యెడమాటలాడితిమి యిందాఁకా నేము
తడఁబాటు గాకుండా తారుకాణాలుగాను
అడియాలాలు దెచ్చితి మిప్పుడే మీకు ॥ ఒక్క ॥

దట్టపు వినయాలతోఁ దప్పులన్నీఁ దేరిచి
ఇట్టే కాఁగిలింపించితి మిద్దరి నేము
వొట్టుక సమ్మతిచేసి వొండొరులచే విడేలు
పెట్టించితి మిందరము ప్రియముతోడ మీకు ॥ ఒక్క ॥

నగవులు నగింపించి నమ్మికలు సమకూర్చి
తగవులు సేసితిమి దండనే నేము
నిగిడి శ్రీ వేంకటేశ నిన్ను నలమేల్‌మంగను
మిగులా మెప్పించితిమి మేలేకద మీకు ॥ ఒక్క ॥ 518

## కురంజి

నిన్నటి సుద్దులకుఁగా నేఁడేల తడవేవు
కన్నుల నాతనిఁ జూచి కడు నవ్వఁగదవే ॥ పల్లవి ॥

సారెకు నాడేనంటే జాణతనా లెన్నిలేవు
మేర మీర నెంతలేదు మేటిగర్వము
నేరములు వేసేనంటే నెపము లెన్నిలేవు
చేరి నీవిభుఁడు నీఁడె సేవ సేయఁ గదవే ॥ నిన్న ॥

వాసులే పెంచేనంటే వైపు లెన్నేసి లేవు
యీసు రేగేనంటే బింక మెంతలేదు
వేసాల సొలసేనంటే వేడుక లెంతలేదు
ఆసపడీ నిదే పతి అట్టె కూడఁగదవే ॥ నిన్న ॥

ఆతల సాదించేనంటే అట్టె చల మెంతలేదు
చేతుల నొడ్డించుకొంటే సిగ్గెంత లేదు
అతఁడు శ్రీవెంకటేశుఁ డలమేల్‌మంగవు నీవు
యేతుల నిన్నిదె కూడె నీఁక మెచ్చఁగదవే ॥ నిన్న ॥ 519

## రామక్రియ

ఔనయ్య ఆఁటదానిఅంతర మెరఁగవు
మానాపతి యాతనీమనసే యెరఁగదా ॥ పల్లవి ॥

సిగ్గువడి వున్నపతి చిత్తమెరఁగక నీవు
అగ్గలంపు గర్వియంటా ఆడుకొనేవు
యెగ్గెరఁగనిముద్దరా లెదిటికి రాకుండితే
కగ్గి యలిగినదంటాఁ గాఁతాలించేవు ॥ఔన॥

గుట్టుతోడ నున్నదానిగుణము విచారించక
నెట్టనఁ జలపాదంటా నేరమెంచేవు
వొట్టి కొలువులోపల నోజతోఁ దలవంచితే
యెట్టివగాయలాఁడి యంటా నెంచుకొనేవు ॥ఔన॥

నడుమ సారెకు నీతో నవ్వ లోఁగి వుండితేను
కడు రాజసము దంటాఁ గమ్మి తిట్టేవు
అడరి శ్రీవెంకటేశ అలమేలుమంగ ఆకె
కడఁకతో నిన్నుఁ గూడఁగాఁ దమకించేవు ॥ఔన॥ 520

సామంతం

చెప్పవయ్యా ఆసుద్దులు వెవులపండుగగాను
యిప్పుడివి యాడుకొనే రిందరూ నిజమా ॥పల్లవి॥

కప్పురము నీకాకె కానికగా నిచ్చెనా
దప్పి దేరెనా నేఁడు దానివంకను
కప్పెనా తనపయ్యెద గక్కన నీమీఁదను
అప్పుడు చలివాసెనా అందువల్ల నీకు ॥చెప్ప॥

నీ సిరసుకెత్తుగా నెలఁత తొడ చాఁచెనా
ఆసలు ఫలించెనా అందువంకను
లాసి పాందాలొత్తెనా లలి నీతొడలు సోఁక
రాసికెక్కి నీవపుడు రతిఁ గరఁగితివా ॥చెప్ప॥

చనుఁగవ దాఁక నీతోఁ సరసానఁ బెనఁగెనా
వినయపుమాటల వేడుఁకొంటివా
తనర శ్రీవెంకటేశ దక్కె నీకలమేల్మంగ
నను నేలితివి దఁ [illegible]ాపై నీకుఁ బుట్టెనా ॥చెప్ప॥ 521

హిజ్జిజి

నాకుఁ దెలుసుఁగా నీనాటకాలెల్లా
నూకడ నేమి సేసేవు యింటికి రావయ్యా ॥ పల్లవి ॥

తలపోఁత లోకతైపైఁ దగిలి నీకుండఁగాను
పిలిచితేఁ బలికేవా ప్రియముతోను
యెలమి నీమాయలు యెరఁగని సతులెల్లా
అలిగి వున్నాఁడవంటా నటు వేఁడుకొందురు ॥ నాకు ॥

యెడయ కెవ్వతో యింటికేఁగఁ గాచుకుండఁగాను
వొడి వట్టితే వచ్చేవా వూరకే నీవు
అడరి నీవోజ దెలియనివనితలెల్లాను
కడుఁ బంతగాఁడవంటా కాళ్ళకు మొక్కుదురు ॥ నాకు ॥

అక్కున నలమేల్మంగ అతై నీకునుండఁగాను
దక్కేవా శ్రీవెంకటేశ తరుణులకు
యిక్కడ నన్నేలతివి యేడనైనా వింతవారు
చొక్కి తగవరివంటా సుద్దులు చెప్పుదురు ॥ నాకు ॥ 522

రేకు-688 సామవరాళి

చెలికత్తెలము నేము చెలికి నీవు పతివి
యెలయింపులేమిటికి నింటికి రావయ్యా ॥ పల్లవి ॥

యేమని విన్నవింతుము యెందాఁకా గోలతనము
కామిని నీ రాకకుఁ గాచుకున్నది
చేముట్టి పిలువరాదు సిగ్గువడితేఁ బోదు
కాముఁ డెడ నున్నవాఁడు గతియేది మాకు ॥ చెలి ॥

వచ్చినపని యేఁటిది వైపులెటువలె వచ్చు
పచ్చిదేర నాపె యాసపడి వున్నది
రచ్చ కెక్కెను వలపు రవ్వ నినుఁ జేయరాదు
ముచ్చటేమిటను బాసు ముందర యేలాగు ॥ చెలి ॥

తలఁపించ నిఁక నేల తమకము నీసొమ్ము
అలమేల్మంగ నీవుంమందె వున్నది
కలసితివి కాఁగిట ఘనుఁడ శ్రీవేంకటేశ
ఫలియించె మాతపము పంతమేమి చెప్పేము ॥ చెలి ॥ 523

ఆరిబి

పొలఁతులు పుట్టఁగానే వుట్టినవాదు లివి
నెలకొని కలఁగదు నేరుపరి హైనది ॥ పల్లవి ॥

మగవాఁ డొకసతిని మన్నించితే సవతులు
యెగసక్కే లాడుదురు యీసడింతురు
మొగమొగాలు చూతురు ముసగిస లాడుదురు
పగటున నవ్వుదురు పంతము లాడుదురు ॥ పొల ॥

వలచినాతఁ డొకతెవద్దనుంటేఁ దోడివారు
కెలతురు వెంగేలకుఁ గేఁకరింతురు
చెలఁగి వుప్పతింతురు చేతులు పైఁ జూఁతురు
తలకొని దూరుదురు తప్పక చూతురు ॥ పొల ॥

యేలిన వాఁడొకతెపాలిండ్లు ముట్టితే నందరు
తాలిమితోఁ బొందఁగ తమకింతురు
ఆ లీల శ్రీవేంకటేశుఁ డలమేల్మంగ నీవు
వాలాయించి కూడితిరి వద్దివారు మెత్తురు ॥ పొ ॥ 524

పాడి

ఐనట్టాయఁ గాని ఆలనైన నీ (నా?)కుఁ బోదు
దానకేమి నన్నుఁజూచి దయపుట్టీ నీకును ॥ పల్లవి ॥

వేడుకై వున్నదా నీకు విన్నవించేనామాట
వీడనాడఁ జాలక వినేవు గాక
యీడనే పాదాలు గుద్దే దితివా నీకేమైనా
వోడక యేటిఁకో వోర్చుకున్నాఁడవు గాక ॥ ఐన ॥

నీటున నేఁ జెనకఁగా నీ చిత్తము వచ్చున్నదా
నాటకాలకు నూరికే నవ్వేవుగాక
పాటలు నేఁ బాడఁగాను భావించి నీవు చొక్కేవా
మేటివై కార్యవశాన మెచ్చేవుగాక ॥ ఐన ॥

అట్టే నా కాఁగిటిపై నాస నీకున్నదా
గుట్టు మానఁజాలక కూడేవుగాక
నెట్టన శ్రీవేంకటేశ నే నలమేల్మంగను
చుట్టమవై మన్నించ జూచితివిగాక ॥ ఐన ॥ 525

## కౌండమలహరి

చిన్నతనమో యిది సిగ్గరితనమందమో
కన్నులఁ జూచి యెంత కాతరించీఁ దాను ॥ పల్లవి ॥

చనవున నే నీతో జాణతనా లాడఁగాను
విని విని యీకె యేల వేసరీఁ దాను
పని వూని నే నీకు పాదములు పిసుకఁగా
మొనసి యెందుకు నేల మోము వంచీఁ దాను ॥ చిన్న ॥

పెచ్చురేఁగి నీవు నేనుఁ బెనఁగులాడఁగాను
వచ్చి వచ్చి యీపె యేల వద్దనీఁ దాను
మెచ్చులుగాఁ గస్తూరి మేన నేనె పూయఁగాను
అచ్చపుఁ జన్నుల నిన్ను నద్దుకొనీఁ దాను ॥ చిన్న ॥

వూడిగాలు నేను నీకు వొద్దనుండి సేయఁగాను
కూడి కూడి యీకె యేల కొసరీఁ దాను
యీడ నే నలమేల్మంగ నిదె శ్రీవేంకటేశ్వర
వేడుక నన్నేలితివి విందుచెప్పీఁ దాను ॥ చిన్న ॥ 526

## ఆహిరి

నన్ను మఱచి వుండుసా నా విభుఁడు
యిన్నిటా నో చెలులాల మన్నించీఁగాక ॥ పల్లవి ॥

చలపట్టి పిలుతురా జాణఁడైన రమణుని
వలపు దెలిసి తానే వచ్చీఁగాక
యెలమిఁ గొసరుదురా యెదుట నిలుచుండగా
అలరి యాతఁడె మాటలాడీఁ గాక ॥ నన్ను ॥

సంగతిఁ గక్కసింతురా సరిగానుఁ జిక్కితేను
యింగితాకారము తానే యెరిఁగీఁ గాక
చెంగటఁ బెనఁగుదురా చేతులెత్తి మొక్కితేను
కంగుదేర నన్నుఁ జూచి కరుణించీఁ గాక ॥ నన్ను ॥

సారెకు వేసరింతురా జంట వాయకుండఁగాను
గారవించి కాఁగిటఁ గలసీఁ గాక
ఆ రీతి శ్రీ వెంకటేశుఁ డలమేల్‌మంగను నేను
చేరి నన్ను నేలే నింకాఁ జిత్తగించీఁగాక ॥ నన్ను ॥ 527

కేదారగౌళ

సుదతి భావము నేఁడు చూడవయ్యా
యెదుట నీకె నేర్పున నిన్నిటా గెలిచేను ॥ పల్లవి ॥

అలసి విరహవేళ నటు చంద్రోదయమైతే
కలువలు ముడిచెను కలికి
తలఁపులోపలఁ బరితాప సూర్యుఁ డెసఁగితే
జలజాలు చేతఁబట్టె జవరాలు ॥ సుదతి ॥

సరి నొంటి నుండఁగాను చల్లగాలి విసరితే
గరిమ గందము పూసెఁ గామిని
వరుస నంతటిలోన వసంతుఁడు వొడమితే
పొరిఁబొరిఁ జిగురుఁబాన్పునఁ బండెఁ జెలియ ॥ సుదతి ॥

నినుకలిఁ జొక్కఁగాను వెస మరుఁ డేఁచితేను
ఘనమకరాలచీర గట్టె నతివ
యెనసి శ్రీ వెంకటేశ యీకె యలమేలుమంగ
నినుఁ గాఁగిటను నించి నెలకొనెఁ దరుణి ॥ సుదతి ॥ 528

రేకు-689 సాళంగనాట

ఎంత తపము చేసితో యీకెకుఁ గాను
మంతుకెక్క నీకుఁ గల్గె మంచిపెండ్లికూఁతురు ॥ పల్లవి ॥

చన్నులే చిన్నలుగాని సతిమోహము ఘనము
కన్నులు గొప్పలు నవ్వు కడుఁగొంచెము
కన్నెపడు చింతెకాని కడలేని చేఁతలు
అన్నిటా నీకు గలిగె నిదె పెండ్లికూఁతుర ॥ ఎంత ॥

చేరఁడే మొగముగాని సిగ్గయితేఁ జేటఁడు
బారెడేసి నెరులు చెప్పరాదు గుట్టు
యీరీతి ముగుదగాని యెమ్మెలు కోటానఁగోటి
కోరినట్టే కలిగె నీకునుఁ బెండ్లికూఁతురు ॥ ఎంత ॥

పాదాలే చిగురుగాని భావమెల్లా నిండుఁజేగ
భేదాలు మోవులు మాటప్రియ మొక్కలే
యీ దెస శ్రీవెంకటేశ యీకె యలమేల్మంగ
నీ దేవులై నినుఁ గూడె నిచ్చఁ బెండ్లికూఁతురు ॥ ఎంత ॥ 529

ఆహిరి

తామేల వెంగే లాడేరు దవ్వులనుండి
నాముంజేత నీవు గట్టినకంకణమున్నది ॥ పల్లవి ॥

నివ్వటిల్ల నాఁమీద నీ మోహము గలిగితే
యెవ్వతె యీసడించినా నేమౌను
నవ్వుతాఁ గైదండతోడ నన్ను నీవు చేపట్టితే
వువ్విళ్ళూరి సవతులు వొద్దనఁగఁ గలరా ॥ తామే ॥

సేసవెట్టి నీవు నాకిచ్చిన చనవు గలిగితే
యేసతి పంతమాడినా నేమౌను
బాస యిచ్చి నీవు నాపైఁ బాదాలు చాఁచుకుండితే
వేసాల చెలు లీపొందు విడిపించఁ గలరా ॥ తామే ॥

కాతరాన నీవు నన్నుఁ గాఁగిలించుకుండఁగాను
యేతుల మాట్లాడుకొంటే నేమౌను
నీతితో శ్రీవెంకటేశ నే నలమేలుమంగను
ఆతలీతలివార లౌఁగాదనఁ గలరా ॥ తామే ॥ 530

## శ్రీరాగం

ఇంకనేల యేలవయ్య యింతిని నీవు
సంకె లేక పెనఁగఁగా సంతోసము లాయను ॥ పల్లవి ॥

పలుమారు నాడిగాలు బత్తితోడఁ జేయఁగాను
చెలియకు వలపులు చిమ్మిరేఁగెను
కలసి మెలసి నీకు గతులెల్లఁ జెప్పగాను
అలవోకచుట్టరిక మంటుకొనెను ॥ ఇంక ॥

సరికి బేసికి నీతోఁ జదురంగా లాడఁగాను
తరుణిమనసు నీకుఁ దగులాయను
తరితీపుతో నిన్నుఁ దప్పక చూడఁగాను
పరగ జవ్వనము నీపాలాయను ॥ ఇంక ॥

మితిమీరి నీతోను మేలము లాడఁగాను
సతిమోవి నీకు విందై చవులాయను
యితవై శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
సతతము కాఁగిట జంటయై నిలిచెను ॥ ఇంక ॥ 531

## మాళవిగౌళ

ప (ఎ) డలేని తగవులు నెంత పెంచేవు
పీ (వి) డెమియ్యఁగా నీతో వేసరీనా చెలియ ॥ పల్లవి ॥

ఆకె నీవు నేకతాన నాడుకొన్న మాటలు
యీకడఁ దారుకాణించ నెట్టువచ్చును
దాకొని యిచ్చినబాస తప్పని దొక్క లేకాక
కాకు సేసేనంటే నిన్నుఁ గాదనీనా చెలియ ॥ ఏడ ॥

రతిలోన మీలోన రహస్యపుచెనకులు
యితరు లెరిఁగి చూప నెట్టువచ్చును
మతిలో దయదలఁచి మన్నించే దొక్కటే కాక
తతి సిగ్గువరచితే దండించీనా చెలియ ॥ పడ ॥

అలమేల్మంగకు నీకు నాఁలు శ్రీవెంకటేశ
యెలమి లెక్కించి చెప్ప నెట్టువచ్చును
వెలయ నీవు గూడిన వేడుక వొక్కటే కాక
వల పారడిఁ బెట్టితే వద్దనీనా చెలియ ॥ పడ ॥ 532

శంకరాభరణం

అటుగాన పతితోడ నలుగకు నీవు
కుటిలుఁడుగాఁ డతినిగుణ మెరుఁగుదును ॥ పల్లవి ॥

వలచినకాంత తనవల్లభుఁడు రాకుండితే
తలపోయుచుండుఁ గాని తప్పు లెంచదు
పలుమారు నాతఁ డెంతపరాకై వుండినాను
కొలువులు సేసుఁ గాని కోపగించదు ॥ అటు ॥

అతిరాజసాన మాటలాడ వెరచి వుండితే
తతి గాచుకుండుఁ గాని తత్తరించదు
మతిఁ దనవారని మందెమేళాన నుండినా
యితవే నెరపుఁ గాని యీసడించదు ॥ అటు ॥

తరితీపు సిగ్గుతోడఁ దప్పక చూడకుండినా
సరసము లాడుఁ గాని సాదించదు
సిరులలమేల్మంగవు శ్రీవేంకటేశుఁ డతఁడు
సరి నీవంటిది గూడీ చలము సేయదు ॥ అటు ॥ 533

దేసాళం

బావంటాఁ జూడ వచ్చినఫల మాకెకుఁ గలిగె
యీవలఁ జెలికత్తెల మే మనేము నిన్నును ॥ పల్లవి ॥

తొడల సందికిఁ దీసి తొయ్యలిఁ బెనచుకొని
జడియఁ బయ్యదకొంగు జారఁ దీసి
వొడిసి కుచగిరుల నురమున నప్పళించి
కడు నలయించితివి కటకటా చెలిని ॥ బావ ॥

కుమ్మడి వట్టి వెనకకూను వంచి మొగమెత్తి
చిమ్ముచును నొకచేతఁ జెక్కు నొక్కి
తమ్ములము నోరిలోన తమకముతోఁ బెట్టి
చిమ్మి రేఁచితి వింతేసి చెల్లఁబో చెలిని ॥ బావ ॥

వువిద కాఁగిట నించి వొత్తికిల పానుపుపై
జవళిఁ గూడితివి పచ్చడము గప్పి
యివల శ్రీవెంకటేశ యీకె యలమేలుమంగ
తవిలి పెండ్లాడితివి తగునయ్యా చెలిని ॥ బావ ॥ 584

రేకు-690 భైరవి

అటుగాన నీకు మొక్కే మంగనఁ జేకొనవయ్యా
ఇటునటు మాపుదాఁకా నేమి చెప్పే మిఁకను ॥ పల్లవి ॥

తరుణి యెంత విరహతాపమునఁ బొరలినా
మరుసంకల్పానఁ గాని మట్టుపడదు
మరుని నేమిందరము మరి వేఁడుకొనేమంటే
సరుసకు నీవు రాక చందము గాదు ॥ అటు ॥

[illegible]మ నిన్నెంత పెండ్లాడే నని తలఁచినా
కోరి బ్రహ్మప్రాంతఁ గాని కూటమి లేదు
పేరుకొని బ్రహ్మకుఁ బ్రియము చెప్పేమంటే
నీరాక గలిగెఁగాని నెరవేర నేరదు ॥ అటు ॥

అలమేలుమంగ యెంత అట్టె కాఁగిలించేనన్నా
జలధి ధారవోయక సంగతి గాదు
జలధిని వేఁడుకొంటే పారె నూ[illegible]టాలకించి
యేమి శ్రీవేంకటేశ యేలుకొంటి వీకెను ॥ అటు ॥ 585

## ఆహిరి

ఇంతట వరమీవయ్యా ఇంతిపాలి దేవరవు
మంతనాన నీకుఁగా నేమరునోము నోమెను ॥ పల్లవి ॥

తలపోఁతవలపులు తనకు ఫలించుదాఁకా
మెలుఁత చన్నులు నీకు మీఁదుగట్టెను
తొలుతనే విరహానఁ దురుము వీడెఁ గనక
తలకిందుగా నెరులఁ దపము సేయించెను ॥ ఇంత ॥

వెలయఁగ వలరాచవిద్యలు నేరుపుమని
పలుకుఁదేనియ నీకు వార మిచ్చెను
పలుచెమటలేరులు పైపై నుబ్బెఁ గనక
నలిఁ దనువల్లి పుణ్యానదుల నోలార్చెను ॥ ఇంత ॥

కాతరాన నీకాఁగిట గరిడిసాము చేసి
చేతులెత్తి నీకు మొక్కు చెల్లించెను
యీతల శ్రీవేంకటేశ యీ కెలమేల్మంగ గన
ఆతుమానా నీయధరామృతము గొనెను ॥ ఇంత ॥ 536

## దేసాళం

ఇంత యిచ్చకము లేని దేఁటియాఁటది
అంతటికిఁ దగుదువు అవునే యీతనికి ॥ పల్లవి ॥

దవ్వులనుండి విభుఁడు తమలము చూపితేను
అవ్వల నోరొగ్గితివి అవునే నీవు
చివ్వన వచ్చి యతఁడు చేవట్టి నిమ్మఁ దీసితే
పువ్వువలె సులభానఁ బోతి వౌనే వెంటను ॥ ఇంత ॥

నెప్పునఁ దామరఁ గొని నిన్ను వేసితేఁ గొప్పున-
నప్పుడే ముడుచుకొంటి వౌనే నీవు
చొప్పులుగాఁ గొనగోరు చూపితే నీచన్నులపైఁ
గప్పిన పయ్యద దీసి కడు నొడ్డేవే ॥ ఇంత ॥

శ్రీవేంకటేశుఁడు నీకుచ్చెలపైఁ జేయి వేసితే
ఆవేళఁ గాఁగిట నించేవానే నీవు
మోవి గంటి సేయఁగాను ముదమునఁ జెలఁగేవు
ఆవేళ నలమేల్‌మంగ వమరునే నీకును ॥ ఇంత ॥ 587

రామక్రియ

నాపాలిటిదేవులవా నడుమ నీవు
యేపున నలమేల్మంగ నెరుఁగవా నన్నును ॥ పల్లవి ॥

కాంతుఁడు మోహించెనంటా క్రపము నీకు నంపెనంటా
ఎంత యెమ్మెలు చెప్పేవే యిందరితోను
బంతి నేలేవాఁడు వోలపతము సేయఁగ రాక
వంతు వరుస లిచ్చితే వచ్చెనటే పగటు ॥ నాపా ॥

సారె నిన్నుఁ జూచెనంటా చన్నులంటె నంటాను
యీరీతి నెంత నవ్వేవె యిందరిలోన
వూరకే పొత్తులమగఁ డొద్దనుండఁగా బోరుగు -
పోరచి నిన్నారసితే పొందెనటే సిరులు ॥ నాపా ॥

వూడిగము గొనెనంటా వొగిఁ గాఁగిలించెనంటా
వేడుక నెంత చూపేవే వెస మాతోను
యీడనె శ్రీవేంకటేశుఁడేవె నన్ను నిన్నూ నేలీ
తోడఁ బెండ్లికూఁతురంటే తొల్లెనటే వావులు ॥ నాపా ॥ 588

బౌళి

అంతర మెరఁగనివా రంటే నంగు కేమాయ
యింతి సింగారాన కివియీడు వచ్చీనా ॥ పల్లవి ॥

కలువలవంటి వంటా కన్నులఁ బోల్తురు గాక
కలికి చూపులవలె గాడి పారీనా
తలకొన్నకొప్పు తుమ్మిదల యీడందురు గాక
చెలఁగి విభునిమతి జీఁకకైకప్పీనా ॥ అంత ॥

జక్కవ లివెుచన్నులచంద మనెంతురు గాక
చొక్కపుఁ గొండలవలెఁ జూపట్టినా
చక్కఁగాఁ బిరుదు మరుచక్రమునరెంట గాక
యిక్కువ గడచి పతి కింపు వుట్టించీనా ॥ అంత ॥

పాదాలు తామరలంటా భావించుకొంట గాక
ఆదెస శ్రీవేంకటేశు ధ్యానింపించీనా
మేదిని నలమేల్మంగ మెరుఁగో యనుట గాక
పోదితో యీతనిఁ గూడి పొత్తుకు వచ్చీనా ॥ 539

సాళంగం

ప్రియములు చెప్పి నిన్నుఁ బిలిచీ నీకె
రయమున నూఁకొని రావయ్యా లోనికి ॥ పల్లవి ॥

చనవె కలిగితేను సాదించితే నేమౌను
మన సెరిఁగినయింతి మగవానిని
యెనసి వుండితేఁ జాలు నెంత చెనకినాఁ జెల్లు
ఘనుఁడవు రావయ్యా గక్కన లోనికి ॥ ప్రియ ॥

చుట్టరిక మైనచోట సొలసితే నేమౌను
పట్టపుదేవి తనప్రాణేశ్వరుని
నెట్టుకొని వుండేచోట నెపము వేయఁగ వద్దు
అట్టె రట్టు సేయక రావయ్యా లోనికిని ॥ ప్రియ ॥

ఇచ్చక మైతే మేలు యెంతనవ్వినా నేమౌను
కచ్చు వుట్టి పెండ్లాడినకాంతునిని
అచ్చపుశ్రీవేంకటేశ అలమేల్మంగ యీకె
రచ్చ కెక్కఁ గూడితివి రావయ్యా లోనికి ॥ ప్రియ ॥ 540

రేకు-691 పూర్వగౌళ

సారె నెట్టు మెచ్చేము నీజాణతనాలు
ఆరితుఁ నవ్వుతానే ఆస రేఁచేవు ॥ పల్లవి ॥

వొద్ద నిలుచుండఁగానే వూరకే ఆపెతోడి
సుద్దులు చెప్పుతానే సోఁక నాడేవు
అద్దో నిమ్మపండు కాను కందుకొంటాఁ జెయి చాఁచి
పెద్దరికములు చూపి పెనఁగులాడేవు ॥ సారె ॥

తివిరి వడ్డించఁగానే తేరకొన నాకెఁ జూచి
చవుల డుగుతాఁ గడు సన్న సేసేవు
అవునయ్యా చేతికి నీళ్ళందిచ్చితే మీఁదఁ జల్లి
చివురుమోవి యడిగి సిగ్గు రేఁచేవు ॥ సారె ॥

కొలువు సేయఁగానే కుచ్చి కాఁగిలించుకొని
బలుములు చూపుతానే పచ్చి సేసేవు
అలరి శ్రీవేంకటేశ అలమేలుమంగ యీకె
చెలరేఁగి మొక్కఁగానే చెక్కులు నొక్కేవు ॥ సారె ॥ 541

ధన్నాశి

నీ కితవై వుండఁగాను నేను నవ్వేదుఁగాక
కాకు సేసి యిందరిలోఁ గాదనఁగ నేలా ॥ పల్లవి ॥

చనవుగలాపె నీతో సరసము లాడఁగాను
నినుఁ జూచి మాకేల నేర మెంచను
వినయముతో నప్పటి వెస నీకొప్పు దువ్వఁగా
చెనకి యడ్డాలు వచ్చి చేరి పూన్పనేలా ॥ నీకిత ॥

కడుఁ బనిగలయాపె కదిపి పాదా లొత్తఁగా
విడిపించి మాకేల వెంగెములాడ
తొడఁ దొడా మోవ సందునఁ దానుఁ గూచుండఁగా
వడిసీఁ జెమటలంటా వద్దన నాకేలా ॥ నీకిత ॥

బత్తిగలయాపె నీకు బాగా లొసఁగఁగాను
యెత్తి యందులో నొఁగాము లెంచ మాకేల
హత్తితి శ్రీ వేంకటేశ అలమేల్మంగను నేను
చిత్తగించి కూడితి వాచెలి నాడ నేలా ॥ నీకిత ॥ 542

## సామంతం

ఇందుకొరకే షుమ్మీ యింటిలో నున్నది సతి
కందువకు వచ్చి నీవే కాంత నేలవయ్యా ॥ పల్లవి ॥

నోరికిఁ దోఁచినట్టెల్లా నుడుగఁగఁ బోతేను
నేరుపుతోడ గుట్టు మానిసి యనరు
కారు కమ్మి చూపులను కన్నదెల్లాఁ జూచితేను
యీ రీతి మిక్కిలి ప్రౌఢ యీకె యనరు ॥ ఇందు ॥

మోము చూచినపుడెల్లా మునుకొని నవ్వితేను
కామించి మిక్కిలి సిగ్గు గల దనరు
వేమారు నెదుటను వేడుకఁ బొలసితేను
అనుకొని కడు జాణయైన దీకె యనరు ॥ ఇందు ॥

చలివాసి కొలువులో సంగడిఁ గూచుండితేను
ఉలి వినయపుగుణాలది యనరు
యెలిమి శ్రీ వేంకటేశ యీకె యలమేలుమంగ
కలసితి వింతటిది గాకున్న నౌ ననరు ॥ ఇందు ॥ 543

## మాళవిగౌళ

మేలురా నీ వుపాయాలు మెచ్చితి నేను
సోలినాపెను వా (వాసి) సినసురటిఁ దెమ్మనేవు ॥ పల్లవి ॥

యేరా నీ వూడిగము సేయించుకొనేయందులోనే
ఆరమణి యద్దము న న్నందిమ్మనేవు
సారె నన్ను నీవు వుపచరించేవానివలెనే
కోరి యాపెచే వీడేము కొమ్మని యిచ్చేవు ॥ మేలు ॥

కైకొని నీ కెంతో పనిగలవానివలెనే
ఆకెపేరిటాపెఁ బిలువు మనేవు నన్ను
జోక నన్ను సింగారించిఁ జూచేవానివలెనే
ఆకాంతపెట్టెలో మెట్టె లంటి తెమ్మనేవు ॥ మేలు ॥

సొలసి చుట్టరికము చూపేవానివలెనే
అలమేల్మంగకు మ్రొక్కు మనేవు నన్ను
యెలమి శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
అలరి యాపె చెల్లెలవై వుండు మనే ॥ మేలు ॥ 544

కన్నడగౌళ

మిగులాఁ గామినులెల్లా మేలిలోనివారు గాక
పగపాడే యేమైనా పంతము నెరపను ॥ పల్లవి ॥

వలచినకాంతను వడదేర్చవలెఁగాని
మలసి పరాకు సేయ మరి తగదు
సొలసి యాసపడితేఁ జోటియ్యవలెఁ గాని
అలరి గుట్టుతో నుండు టది నీతి గాదు ॥ మిగు ॥

చుట్టమై వచ్చినదానిఁ జూచి కూడవలెఁ గాని
వట్టి జాగులు సేసేది వైపుగాదు
నెట్టుకొన్న మాటాడితే నిలిచి వినవలెఁ గాని
బట్టబయ లిదించితే బనికిరాదు ॥ మిగు ॥

లలిఁ గాఁగిలించేదాని లాలించవలెఁ గాని
పలుసుద్దు లడుగను జాడిగాదు
అలరి శ్రీ వేంకటేశ అలమేలుమంగ యీకె
యెలమి నేలితి వింక నెంచఁ బనిలేదు ॥ మిగు ॥ 545

శంకరాభరణం

భావించ రహస్యమైనపనులు లేవా బూమిలో
యీవేళ నాతని కోర్కి యీడేర్చఁగదవే ॥ పల్లవి ॥

చివ్వన నాతఁడు నిన్నుఁ జెయివట్టి తీసితేను
రవ్వగానేల చెప్పేవే రమణులతో
నివ్వటిల్ల నేక తాన నిన్నుఁ గోర నూఁదితేను
వువ్విళ్లూరఁ జూపుదురా వూరివారి కల్లాను ॥ భావిం ॥

తమకింటి నీకతఁడు తమ్ములము వెట్టితేను
తిమురుచుఁ గోపింతురా దేవుళ్లవొద్ద
అమర నీరతి కాతఁడాసపడి నవ్వితేను
సముకపువారినల్లా సాకిరి వెట్టుదురా ॥ ఖాదిం ॥

మొగి శ్రీవేంకటేశుఁడు ముంచి నిన్నుఁ గూడితేను
తగవు లడుగుదురా దండివారిని
మగటిమి నలమేలుమంగవిభుఁ డీతఁడు
అగడు సేయవచ్చునా అప్పటి నాతోను ॥ ఖాదిం ॥ 546

రేకు-692 వరాళి

ఏల వూరకుందానవే యెదుట నున్నాఁడతఁడు
వాలాయించి నవ్వితేఁ గై వసమౌను పనులు ॥ పల్లవి ॥

తరుణికిఁ బతికిని తతి మాటలాడేటి
తరితీపు గలితేనే తమి రేఁగును
వొరసి అడియాసల నొకరొకరి మొగాలు
తిరిగి తిరిగి చూచితే వలపు నాటును ॥ ఏల ॥

రవళి మగవానితో రారాపులఁ బొందుసేసే-
సవతి గలిగితేనే చలివుట్టును
జవళిఁ గూచుండఁగాను సందుసుడి వేరొకతె
అవలఁ బయ్యాడితే నటు చల మెక్కును ॥ ఏల ॥

యెనసి వొండురులకు నిచ్చగించి రతులపై
మనసులు గలిగితేను మర్మాలంటును
చెనకి యలమేల్మంగ శ్రీవేంకటేశుఁ డితఁడు
వినయానఁ గొసరితే వేడుకలు వుట్టును ॥ ఏల ॥ 547

ఆహిరి

ఏమి చెప్పుదుఁ గాఁతాళమిట్లాయ నావలపు
కామించినదాన నీకు కరుణించు మిఁకను ॥ పల్లవి ॥

కుప్పళించి నిన్నరానికోపమే చూపితిఁగాని
చొప్పుగా నెదుట నిన్నుఁ జూడనైతిని
చెప్పకు బుద్ధులనుచు చెలికి మొక్కితిఁ గాని
ముప్పిరిఁ జేతులెత్తి మొక్కనైతి నీకును ॥ ఏమి ॥

తత్తరించి నీవు సేసే తప్పులే పట్టితిఁ గాని
బత్తి నీవిచ్చేబాగాలు పట్టనైతిని
యితల సవతులతో నెమ్మెలు చెప్పితిఁగాని
హత్తి నీతో నవ్వుచుఁ బ్రియములు చెప్పనైతి ॥ ఏమి ॥

వెక్కసపుమాటాడఁగా వీఁగ నొత్తితిఁ గాని
తక్కక చాఁచిన నీపాదా లొత్తనైతి
నిక్కి శ్రీవేంకటేశుఁడ నే నలమేలు మంగను
మక్కువ నేర్చితిఁగాని మంకు నేరనైతిని ॥ ఏమి ॥ 548

## ముఖారి

ఎంతలేదు తనసుద్దు లెరఁగమా నేమెల్లా
ఇంతులాల చూడరమ్మ యిటువంటి కొత్తలు ॥ పల్లవి ॥

వాసిగల సతియైతే వలపు చెప్పుకొనునా
వేసా లింతేకాక విభునితోను
పాసి వుండలేనిదైతే పంతములు నెరపునా
ఆసతో వేళ గాచుక అట్టె వుండుఁగాక ॥ ఎంత ॥

ఇంతబత్తి గలిగితే నెడమాట లాడించునా
వంతుల నింటికిఁ దానే వచ్చుఁగాక
చెంతఁ దొల్లిటి పొందైతే సిగ్గులూఁ దాఁ బడునా
బంతినున్న సవతుల భ్రమయించీఁ గాక ॥ ఎంత ॥

యితవరి యైతేను యెగ్గులు దాఁ బట్టునా
మతకమేమో కాక మాఁటి మాటికి
అతఁడు శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
పతమై నన్నుఁ గూడఁగా సమ్మతించితిఁగాక ॥ ఎంత ॥ 549

### సామంతం

సిగ్గువడ కింకానేల చెలువునిఁ దడవీని
దగ్గరి పైకొ నీ బేలుఁదనము గాదా ॥ పల్లవి ॥

చేసుకొన్న రమణుఁడు చేతికి లోఁగాకుండితే
వేసరించి కొసరేది వీరిడి గాదా
ఆసలు చూపినవాఁడు అవ్వలి పరాకైతే
యీసడించక నవ్వేది యెడ్డతనము గాదా ॥ సిగ్గు ॥

కోరి తెచ్చుకొన్నవాఁడే కుళిగుంపు సేసితేను
కూరిమికిఁ బెనఁగేది కూళగాదా
మేరతో నవ్వనివాఁడే మించి పొందు సేసితేను
మోరతోపున దూరేది మొక్కలముగాదా ॥ సిగ్గు ॥

శ్రీవేంకటేశుఁడే చెనకక వుండితేను
కావిరిఁ గాఁగి లించేది గయ్యాళిగాదా
ఆవిభుఁడె నన్ను నేలె నలమేల్మంగను నేను
భావించెప్పటిఁ జూచేది బయకారముగాదా ॥ సిగ్గు ॥ 550

### రామక్రియ

నీతో బలిమి చూప నేరుతుమా యేమైనా
యేతులూ నెమ్మెలూ మరియేమి చెప్పేమిఁకను ॥ పల్లవి ॥

వలపు మదిలో నుండు వాకున సొలపులుండు
కలిగిన కాంతులెల్లా కన్నులనుండు
చలము గుణాలనుండు చవులు రతులనుండు
యెలమి మావిన్నపము లేమిచెప్పే మిఁకను ॥ నీతో ॥

నవ్వులు సెలవినుండు నయాలు చేతల నుండు
జవ్వనము నిలువెల్లా సతమై వుండు
రవ[illegible] కాఁకలనుండు రాజసమిచ్చలనుండు
[illegible]రమూఁ దమకించి యేమి చెప్పేమిఁకను ॥ నీతో ॥

పంతాలు వాసులనుండు భావము గర్వానమండు
చింతలెల్లా లోలోని సిగ్గులనుండు
అంతటా శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
ఇంతలో నన్నేలితివి యేమి చెప్పేదింకను ॥ నీతో ॥ 551

నాట

మదించిన యేనిగెకు మావటీఁడువంటి దాపె
సదరాన నిన్నిటు వసము చేసుకొనెను ॥పల్లవి॥

కప్పురానఁ గొనివేసి కామిని నిన్నిపు డిట్టే
చిప్పిలఁ దనమొకము చేసుకొనెను
ముప్పిరి నంతటిమీఁద ముంచి చేతులెత్తి మొక్కి
అప్పనము చుట్టముగా నటు సేసుకొనెను ॥ మదిం ॥

తొడమీఁదఁ గూచుండి తొయ్యలి చన్నుల నొత్తి
చిడుముడితోఁ గిందు సేసుకొనెను
జడిగొన మోవితేనె చవిచూపి నిన్నింతలో
కడలేక తనసొమ్ముగాఁ జేసుకొనెను ॥ మదిం ॥

సేస వెట్టి పెండ్లాడి చేరి నిన్నలమేల్మంగ
చేసూటి మగనిగాఁ జేసుకొనెను
ఆసల శ్రీవేంకటేశ అన్నిటా నిన్నుఁగూడి
పోసరించి పాయరాని పొందు సేసుకొనెను ॥ మదిం ॥ 552

ఏ-693 దేసాక్షి

సిగ్గులువడ నేఁటికి చెంది నా మొగము చూచి
వొగ్గి నీవు లాలించఁగా నొద్దనేనా నేను ॥ పల్లవి ॥

సరిఁ జెమటలుగార సతి నీకడకు వచ్చె
సురటి విసరరాదా చోటియ్యరాదా
దురదురఁ జారితేఁగా తురుమెల్లాసిదె జారె
గరిమల నిట్టే కీలుగంటు వేయరాదా ॥ సిగ్గు ॥

కదుదగ దొట్టుకొంటా కానుక చేతి కిచ్చీని
వెడ దప్పి దేర్పరాదా వీడె మీరాదా
జడిసి నీకు మొక్కఁగా చన్నులు బయటఁ బడె
కడగి నీపచ్చడము గప్పి పెట్టరాదా ॥సిగ్గు॥

అలపులు దేరఁగాను అట్టె ప్రియములు చెప్పె
లలి నూఁకొనఁగరాదా లాలించరాదా
అలరి శ్రీ వేంకటేశ అలమేల్మంగను నేను
కలసితి వాపె నింకాఁ గైకొనరాదా ॥సిగ్గు॥ 553

లలిత

నేఁడుకొనవయ్యా యీపె వెల్లవిరి సేయకుండా
ఆఁడుదాని కెంత పంతమైనా నియ్యవచ్చును ॥పల్లవి॥

కొలువులోఁ దప్పక యేకొమ్మనో చూచితివంటా
కలకల నవ్వి యీకె కాకు సేసీని
మలసి యందుకు నేము మాట మరపించితే
చలపాదితనాన సాదించీని ॥వేఁడు॥

సంగడి రాఁగా నెవ్వతచన్నులో తాఁకితివంటా
పంగించి యాపె నిన్నుఁ బచ్చిసేసీని
సంగతి గాదని నేము చాయ సేసుకుండితేను
అంగడి వేసి తానే ఆన వెట్టుకొనీని ॥వేఁడు॥

గందమిచ్చేయాపెనేమో కాఁగిలించుకొంటివంటా
నిందవేసి యాపె నిన్ను నేరమెంచీని
యిందుకే శ్రీ వేంకటేశ యేచే నలమేలుమంగను
అంది నన్ను నేలితివి అప్పటిఁ దావచ్చీని ॥వేఁడు॥ 554

ధన్నాశి

ఆపె నెంతయలయించే వయ్యా నన్నిపనులు
యీపొద్దుకాడ మరి యిఁక నేలమాటలు ॥పల్లవి॥

పయ్యెద నిండాఁ గప్పుక పవ్వళించి వున్న చెలి-
నియ్యెడకు వచ్చి నీవదేల లేపేవు
చయ్యన నర్ధమురేయి చనుదెంచినవాఁడవు
వొయ్యనె పవ్వళించు మొకవంక నీవును ॥ ఆపె ॥

కన్నులు మూసుక నీకేకాఁ గలలు గనఁగాను
చన్నులేల పట్టేవు సటలంటాను
వున్నతి వరుసపద్య మొప్పగించ వచ్చితిని
మిన్నక కూచుండుము మేలుకొనీ నిపుడు ॥ ఆపె ॥

అండ నీవున్నాఁడవంటా అటు గాఁగిలించుకొంటే
వుండితివి నిజాలకు నొద్దికై నీవు
దండిగా శ్రీవేంకటేశ దక్కె నలమేలుమంగ
నిండుకొనఁ గూడితి నిన్నుఁ జూచి నవ్వెను ॥ ఆపె ॥ 555

అమరసింధు

చుట్టరికము సేయఁగా సూడువట్ట నీకనేల
గట్టిగాను ప్రియమెల్లాఁ గైకొందుఁగాక ॥ పల్లవి ॥

మొగము చూచి చూచి ముంచి యిందరిలోనాను
యెగసక్కెపుమాటలు యెట్టాడే నిన్ను
నగుతా నీవుండఁగాను నావొద్దికి రావనుచు
తెగువతో దూరి దూరి తిట్ట నెట్టువచ్చును ॥ చుట్ట ॥

నీవద్దనే కూచుండి నేరమిసేసితివంటా
కావరించి యెటువలెఁగసరే నిన్ను
చేవమీర నీవు నాపై సేసలు చల్లఁగానే
యీవలఁ దప్పించుకొంటా యేఁగనెట్టువచ్చును ॥ చుట్ట ॥

చెప్పినట్టు సేయఁగాను చిత్తములోఁ గరఁగక
చొప్పలెత్తి యెటువలె సొలతు నిన్ను
అప్పుడె శ్రీవేంకటేశ అలమేల్మంగ నాకుఁ
జెప్పి కూడితివి రట్టుసేయ నెట్టువచ్చును ॥ చుట్ట ॥ 556

సింధురామక్రియ

అట్టు సేయక రావె యిట్టె నీవు
గట్టిగా వచ్చేవంటాఁ గాచుకున్నవాఁడు ॥ పల్లవి ॥

చెలిమి సేసినవారు చేతికిలోను గావలె
చలములు సాదించ సంగతిగాదు
వలచిన వారలు వద్దఁ బాయకుండవలె
పొలయలుకలు చూపఁ బొసఁగ దెప్పుడును ॥ అట్టు ॥

సరస మాడేటివారు సమ్మతించి వుండవలె
నెరసులు పట్టేది నేరుపుగాదు
మరుతంత్రములవారు మంతనాన నుండవలె
విరసాన రచ్చలుంటే వేడుక గాదు ॥ అట్టు ॥

పొడఁబాటు గలవారు పొద్దికతో నుండవలె
అడియాసలఁ బొరలే దందము గాదు
అడరి శ్రీ వేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
తడయక కూడితివి తగులాయ మోహము ॥ అట్టు ॥ 557

శ్రీరాగం

నీకుఁ జూడ వేడుకలై నేటి కున్నవి గాక
దాకొని వెనకకు మరి తలపోఁత గాదా ॥ పల్లవి ॥

బాసలు సేసిసేసి బయలు యీదించితివి
ఆసల నోరూరించితి వప్పటి నీవు
వాసులెక్కించి మెప్పించి వలలఁ జిక్కించితివి
దోసముగాదా యిట్టె తొయ్యలుల తోడను ॥ నీకు ॥

బెట్టుగా నవ్వి నవ్వి బేరి జోకొట్టితివి
గుట్టున బయకారాలే కుమ్మరించితి
గట్టువాయతనమున గాలి ముడె (డి?) గట్టితివి
వట్టి యపకీర్తి గద్దా వనితల తోడను ॥ నీకు ॥

నన్నేలి పైడికి వాసనలు పుట్టించితివి
సన్నలనే కొండలు సాదించితివి
అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
మన్నించుటే మేలుగాదా మగువల తోడను ॥ నీకు ॥ 558

రేకు-694 భూపాళం

మగనితో నేమిటికి మచ్చరములు
జిగిమించ నిచ్చకము సేయవలెఁ గాక ॥ పల్లవి ॥

సమ్మతించఁ జెప్పితేను సరి నియ్యకొనవద్దా
కమ్మటిని సాదింతురా కాంతుని నీవు
తమ్మివిరుల వేసితే తాఁకి నొచ్చినందురా
దొమ్మిసేఁతలనుచు సంతోసింతురు గాక ॥ మగ ॥

వినయము చూపితేను వేడుక పడవద్దా
పెనఁగులాడుదురా బిగిసి నీవు
కొనగోరనూఁదితేను గురుతాయ నందురా
ఘనత మర్మాలు కరఁగఁగవలెఁ గాక ॥ మగ ॥

జెరసిసేస చల్లితే పెండ్లియాడవద్దా
సరసమున నేపొద్దు జరపుదురా
అరిది శ్రీవేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
నిరతి నిన్నేలెఁ బ్రేమనించ వలెఁ గాక ॥ మగ ॥ 559

ధన్నాశి

నేనేమిటిదానను నేరుపరి విన్నిటాను
కానీవయ్యా నీమాటకుఁ గాదంటినా నేను ॥ పల్లవి ॥

సారె సారె నవ్వితేనే చవుకలవును వలపు
కూరిమి గొసరితేనే గుట్టు గందురు
చేరి చెనకఁ జూచితే సిగ్గులు బయటఁబడు
యీరీతి నీవెగరఁవా ఇందవయ్య కానికె ॥ నేనేమి ॥

అసలు వుట్టించితేనే అంగడిఁబడుఁ బంతాలు
వేసాలఁ బొరలితేనే వెగటౌఁ దమి
బాసలు సేసితేనే పరిసిపోవు నిజము
మూసు నీపై నాకు లేదు ఇందవయ్య కానికె ॥ నేనేమి ॥

మంతనాన వేగించితే మర్మములు సటిదాఁకు
సంతోసాలు రేఁచితేను చవి వుట్టును
అంతట శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
ఇంతలోనే కూడితివి ఇందవయ్య కానికె ॥ నేనేమి ॥ 560

పాడి

నిన్నడిగితినటవే నీకేమి గారణము
పన్ని యాతనికి నీకుఁ బనియేమే చెలియా ॥ పల్లవి ॥

చెంది యాతఁడు చేసినసేఁతలు నేఁ దడవితే
అందాలు సేసి చెప్పే వవునే నీవు
యిందాఁకా నెందుంటివని ఇతని నే నడిగితే
అందే నిద్రించెనంటా నానలు వెట్టేవు ॥ నిన్న ॥

వొద్దుకోఁగా మేనిమచ్చా లొరసి నేఁ జూచితేను
అడ్డాలు వచ్చేవు పతి కవునే నీవు
వొడ్డి యెవ్వతెపై వలపున్నది మతి నంటేను
యెద్దవై నాకొప్పగించే వేమవుదువే నీవు ॥ నిన్న ॥

నిండుఁ గాఁగిటఁ గలసి నేఁ జెమట రేఁచితేను
అండ నీవు విసరేవు అవునే నీవు
దండి యలమేల్మంగను తాను శ్రీవేంకటేశుఁడు
పండే పీమగనివొద్ద బాఁతైతివే నీవు ॥ నిన్న ॥ 561

గుండక్రియ

వినుకలిమాటలకు విభుని వేల మూరేవే
యెనసి యాతనితోడ నిచ్చకమే యాడవే ॥ పల్లవి ॥

జాము వోయి వచ్చెనంటా చప్పనాయ మోవియంటా
యేమిటి కాతని నేరాలెంచేవే నీవు
నీ మొగమే చూచీని నీతోనే మాటలాడీని
ప్రేమపు సతిని వోడిఁ బెట్టుకొని వచ్చెనా ॥ విను ॥

వుద్దండిఁడై వున్నాఁడంటా వొగలాయ వళవంటా
గద్దించి పతినేల కాఁతాళించేవే
వద్దనే కానున్న వాఁడు వడి నీతో నవ్వు నవ్వీ
కొద్దిలేని సతులను కుచ్చి కట్టుకొనెనా ॥ విను ॥

తచ్చనలు సేసీనంటా తరితీపాయఁ జొందంటా
హెచ్చి శ్రీవేంకటేశ్వరు నెంత లోఁచేవే
అచ్చపుటలమేల్మంగ పతఁడు నిన్నుఁ గూడె
బచ్చెన సతుల వేరే బండిఁ బెట్టుకున్నాఁడా ॥ విను ॥ 562

శంకరాభరణం

మీకే తెలుసును మీమీసన్నలు
వాకుచ్చి యడుగఁగ వసమా మాకు ॥ పల్లవి ॥

చీటికి మాటికి సిగ్గులు వడఁగా
నాఁటఁగఁ జెలి నిను నవ్వీని
గాఁటాన రెంటెము గప్పుకొనఁగా
సూటిగా నీదిక్కు చూచీ నదివో ॥ మీకే ॥

సరికి బేసికిని బె(జ?)డిసి యలయఁగా
విరుల నింతి నిను వేసీని
పరిమళములు నీపైఁ బూసుకొనఁగ
వెరవెంచి ముక్కుపై వేలిడుకొనెను ॥ మీకే ॥

కలసియు మలసియు కాఁగిలడుగఁగా
మెలుపున సతి నిను మెచ్చీని
అలమేల్మంగ నేనని శ్రీవేంకట-
నిలయ కూడితివి నెలకొనెఁ దాను ॥ మీకే ॥ 563

## దేసాళం

చిత్తములోనివలపు చిగురుఁ జేఁగ
యిత్తల వట్టిజాగు లిఁక నేఁటికయ్యా ॥ పల్లవి ॥

శిరసు వంపులలోనే సిగ్గులు గానిపించె
తరితీపులఁ బొడమె తమకములు
సరిఁ బులకలతోడ సంతోసము లుప్పతిల్లె
తరుణి కాఁగిటికి దగ్గర రావయ్యా ॥ చిత్త ॥

అల్లార్చి చూచేచూపుల నాసలెల్లాఁ జిమ్మిరేఁగె
పల్లదపు సరసానఁ బైకొనె నవ్వు
వెల్లవిరి సొలపుల వేడుకలు దైవారె
కొల్లలుగా రతులను గూడుదువు రావయ్యా ॥ చిత్త ॥

తలపోఁతలవల్లఁ దగిలెను మర్మములు
పిలుపులఁ జవులు ముప్పిరిగొనెను
అలరి శ్రీవేంకటేశ అలమేల్మంగకు నీకుఁ
గలిగె కూటములిట్టె గక్కన రావయ్యా ॥ చిత్త ॥ 564

రేకు-695 వరాళి

ఏల రట్టుసేసేవు యిదేలా నీవు
కాలు దొక్కినదానితోఁ గాఁతాళించ నేఁటికి ॥ పల్లవి ॥

వెలుచమాటల నొట్టు వెట్టుకొన్న దానితోడ
చలములు సాధించ సంగతిగాదు
చలివాసి సారె సారె జంకించే దానితోడ
బలిమితోఁ బెనఁగఁగఁ బనిలేదు ॥ ఏల ॥

బాసలు దప్పితివంటా పంతమాడే దానితోడ
రాసికెక్కఁ జేఁత సేయ నాసగాదు
ఆసల నెదురు చూచి అలసినదానితోను
గాసిఁ బెట్టి నవ్వ నెక్కడా నీతిగాదు ॥ ఏల ॥

చెమటలు మేననిండాఁ జిమ్మిరేఁగిన దానితో
తమకించి కాఁకరేఁచఁ దగవుగాదు
సమరతిఁ గూడితి విచ్చట శ్రీవేంకటేశ్వర
సముకపుదాన నాతో జాగుసేయరాదు ॥ ఏల ॥ 565

## సామంతం

కాదంటిఁ బో నిన్నుఁ గాయఁగలనా నేను
ఆది గొని సారె దూరే దది యెడ్డతనము ॥ పల్లవి ॥

నగుతూ విచ్చేసి నీవు నన్ను నేఁడు చెనకఁగా
బిగియుచు నుండే దేమి పెద్దరికము
తగవరివైన నీవు తమ్ములము వెట్ట రాఁగా
మొగమీయ కుండేది మొక్కలపుగుణము ॥ కాదం ॥

పరగ నొద్దనుండి నాపైఁ జేయివేయఁగాను
యెరవు చేసుకవుండే దేఁటి నేరుపు
సరసమాడి నాదిక్కు చక్క నీవు చూడఁగాను
అరుదంది సిగ్గువడే దదియేఁటి చెలిమి ॥ కాదం ॥

కందువల నన్ను నీవు కాగిలించుకొనఁగాను
పొందుసేయకుండే దేఁటిబుద్దిలోనిది
అంది శ్రీవేంకటేశ్వర అలమితి విటు నన్ను
యిందుకే నే మెచ్చితి నిదే జాణతనము ॥ కాదం ॥ 566

## ఆహిరి

చెలులాల వినరె యీచెలువునిసుద్ది నేఁడు
తిలకించి తానే అన్నీఁ దెలుసుకొనుఁ గాక ॥ పల్లవి ॥

మగువలకుఁ దనకు మరి సాటి సన్నడిగీ
తగవులు చెప్పేగా తమకు నేను
మగఁడు తాను వారికి మచ్చిక దేవుళ్లు వారు
నొగిసి వలసినట్టు చూచుకొనుఁ గాక ॥ చెలు ॥

చేరి తమతమలోనిచేఁతలు నాకుఁ జూపి
గారవానఁ దమకెల్లా కర్తనా నేను
మేరతో వొసిచ్చెఁ దాను మెలుఁతలు నమ్మినారు
నేరుపుతో నిజములు నిలుపుఁ గాక ॥ చెలు ॥

గట్టిగాఁ దమవద్దన్నే కాఁచుక వుండుమనీ
దట్టమైన అడ్డికపుదానినా నేను
అట్టె శ్రీవేంకటేశుఁడు అలమేలుమంగ నేను
రట్టుగ నన్నేలెఁ దానే చుట్టము గాక ॥ చెలు ॥ 567

మంగళకౌశిక

చేరి నీకు వినయాలు సేతుఁ గాక
మేరతో మేలమాడఁగా మితిమీర వచ్చునా ॥ పల్లవి ॥

వరుసతో నిన్నెంత వెఁపించ నేర్చినాను
అరసి పంతాలు నే నాడవచ్చునా
దొరఁ జేసి నీవెంత దొడ్డగా మన్నించినాను
పరగ గర్వము నీతోఁ బచారించ వచ్చునా ॥ చేరి ॥

నెమ్మి నూడిగాలు సేసి నిన్నెంత మెప్పించినాను
చిమ్ములు మందెమేళాలు సేయవచ్చునా
కమ్ముకొని నీవెంత కాఁగిటఁ బెనఁగినాను
యెమ్మెలకు నిన్ను నెలయించ వచ్చునా ॥ చేరి ॥

కలికినై నిన్నెంత కైవసము చేసుకొన్నా
కెలయుచు నిన్ను జంకించవచ్చునా
అలరి శ్రీవేంకటేశ అలమేల్మంగనే నేను
పలుమారు నీమేను పచ్చిసేయవచ్చునా ॥ చేరి ॥ 568

ధన్నాశి

నీవు సేసినమేలుకు నేను దూరరాదు
యీవల నాతమకము యేమని చెప్పుదుము ॥ పల్లవి ॥

మొగము చూచి నీవు మోహములు వెదచల్లి
    జిగిమించ వలపించి చేకొంటివి
    పగటున నీవెక్కడో పరాకై వుండఁగాను
    యెగసక్కెలాడితి యెట్టున్నదో మనసు ॥ నీవు ॥

చనుఁగవ గోరనంటి చనవులెల్లా నొసఁగి
    యెనలేని వేడుక నన్నేలితివి
    నను పున నెవ్వతెతో నవ్వితివంటా నేను
    పెనఁగితి నీలోనిప్రియము లెట్టున్నవో ॥ నీవు ॥

కందువకు నీవు వచ్చి కాఁగిట నన్నుఁ బొదిగి
    పొంది శ్రీవేంకటేశ్వర భోగించితివి
    మందెమేళమై అలమేల్మంగని నే నీవేళను
    అందితి నీమోవి నీకు ఆస యెట్లున్నదో ॥ నీవు ॥ 569

దేసాళం

ఏమయ్యా నా మనసు నీ వెరఁగనిదా
    కామించితి వలపులఁ గడమేమీ లేదు ॥ పల్లవి ॥

మచ్చిక గలుగుసతి మాటలెన్ని యాడినాను
    యిచ్చకమే కాని మరి యెగ్గు దోఁచదు
    అచ్చముగాను సరస మాడితేను తనలోన
    విచ్చనవిడముగాని వెగటు దోఁచదు ॥ ఏమ ॥

చుట్టరికమైనవారు సొరిది నెంత చూచినా
    దట్టపు వేడుకే కాని తప్పులెంచరు
    అట్టడితనాలఁ దాను ఆయివలె నుండినా
    అట్టె మేనులుబ్బుఁ గాని అలయికగాదు ॥ ఏమ ॥

చనవుగలిగినాపె జంకించి కూడితేను
    మనసు రంజిల్లుఁ గాని మరపుగాదు
    యెనసితివి శ్రీవేంకటేశ నన్ను నింతలోనే
    యినుమడాఁగాని తమి యిఁకఁ గొంకులేదు ॥ ఏమ ॥ 570

రేకు-696 తెలుఁగు కాంబోది

చిత్తగించఁ గదరె వోచెలులాల
కొత్త కొత్త వినోదాలు గూడినట్టు మెరసె ॥ పల్లవి ॥

మోమున కెగరేటి మొనవాఁడిగుబ్బలు
కామినికి నమరెను కంటి రటవె
ఆమని చనుజక్కవ లట్టె వదనచంద్రుని
వేమరుఁ బొంచినయట్ట వేడుకలై మెరసె ॥ చిత్త ॥

సారెఁ జెంపలమీఁద జారి వుండిన తురుము
యీ రమణికి నమరె నిటు చూడరే
ఆఁ దుమ్మిదగమి అధరామృతమునకు
బోరునఁ బొంచుకుండిన పోలికై మెరసెను ॥ చిత్త ॥

తనుపై మెరుఁగులు తరుణికి నమరికై
గొనకొనె నిదే కనుఁగొంటి రఁటవే
యెనసె శ్రీ వేంకటేశుఁ డీకె యలమేల్మంగ
కనకము వన్నెలూ నొక్కటైనట్టు మెరసె ॥ చిత్త ॥ 571

శుద్ధదేశి

ఎగ్గు పట్టేవు గనక యెగసెక్కెము లాడ నీతో
వెగ్గళించి పంతాలాడ వేడుకా నీతోను ॥ పల్లవి ॥

గోరు దాఁకి మేనిమీఁద కుమ్మెలు గాఁగాఁ గాక
సారె సారె జంకించఁ జలమూ నీతోను
మారుకొని నీసుద్దులు మనసు నాటఁగాఁ గాక
కూరుములు గొసరఁగ కోపమా నీతోను ॥ ఎగ్గు ॥

తెగడఁగా మోవి దాఁకి తేనె చిందఁగాఁ గాక
పగలు సాదించ నాకుఁ బగటా నీతో
నిగిడి నా పయ్యెద నీచేచుట్టుకోఁగాఁ గాక
అగడు చేసి మొరయ నదేపనే నీతోను ॥ ఎగు ॥

దొమ్మి నీవు చేసితే నాతురుము జారఁగాఁ గాక
నిమ్మపంట వేయఁగ నేరుపా నీతో
ఇమ్ముల శ్రీ వేంకటేశ యేలితివి నీవు నన్ను
కమ్మరఁ గమ్మర నవ్వ గర్వమా నీతో ము ॥ఎగ్గు॥ 572

లలిత

ఊరకున్న సతి నీక నొరసి అడుగవద్దు
వూరడించి సంతోసాన నొలలార్చవలెను ॥ పల్లవి ॥

వుప్పతించరాక మొగమోట గలవారికి
తప్పులెంచఁ బనిలేదు తమ పతిని
చిప్పిలఁగఁ బ్రియములు చెప్పేటివారికి
యెప్పుడూ నలుగరాదు యేమి చేసినాను ॥ ఊర ॥

గట్టిగాఁ జుట్టరికము గలిగినవారికి
అట్టు సేయఁగఁ దగదు అట్టె పతిని
యిట్టె మనసు మర్మము లెరిఁగినవారికి
వట్టినేరా లెంచవద్దు వసము గాకున్నాను ॥ ఊర ॥

యిచ్చకము నెరపేటి యితవైనవారికి
పచ్చిసేసి దూరరాదు ప్రాణనాథుని
యిచ్చల శ్రీ వేంకటేశ యేలితి వీకాంతను
కొచ్చి కొసరఁగవద్దు గుట్టుతోనున్నాను ॥ ఊర ॥ 578

ముఖారి

మమ్మునేల తడవేవు మాటి మాటికి
పమ్మి రతులకు నీకు పాఁలైతి నిపుడు ॥ పల్లవి ॥

చనవు గలిగినాపె జాణతనా లాడితేను
వినవింపులై యుండు విభునికిని
ననుపున సారె సారె నవ్వులు నవ్వితేను
మనసున నిండుకొని మర్మములు గరఁగు ॥ మమ్ము ॥

జాసలు గొనినయాపె పంతాన( గొసరితేను
ఆసలు రేగు మగడైన వానికి
సేసలు చల్లి చల్లి చెక్కులు నొక్కితేను
పోసరించినవలపు లుప్పొంగగ( దొడ(గును ॥మమ్ము॥

పట్టపుదేవులై నాపె పైకొని కూడితేను
గుట్టుతో రమణునికి కొంకు దేరును
యిట్టె శ్రీవేంకటేశ్వర యేలితివి నన్ను నేడు
రట్టడి కాంతల పొందు యిట్టె రచ్చకెక్కును ॥మమ్ము॥ 574

## హిందోళవసంత

నీ కెంత యితవో నెల(త స్నేసే చే(త
కాకు సేసేవారి నెర(గదు సిగ్గువడదు ॥పల్లవి॥

వనిత లిందరు( దలవంచు కుండ(గా నీకె
చనవరితనమున సాదించీ నిన్ను
గొనకొని యప్పటివి కొలువులోపల నెల్లా
ననుపుల సంగాతాన నవ్వీ నీతోను ॥నీకెం॥

వెల్లవిరై గద్దెమీ(ద వెస నీవుండ(గా నాపె
చెల్లుబడితనమున( జెనకీ నిన్ను
పల్లదపురాజసాన( బంతముతో నీవుండ(గా
మెల్లనె మందెమేళాలు మెరసీ నీయెదుట ॥నీకెం॥

కూరిమి( గాగిట నీవు కూడేటి వేళ యాపె
గారాపుతనమున( గలసీ నిన్ను
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె
నేరుపరియై కడునిక్కి చూచీ నిదివో ॥నీకెం॥ 575॥

## మధ్యమావతి

ఇంతటాంతే నే మరి యేమి సేతును
వింతవై వుండ(గాను వే(డుకొంటి నేను ॥పల్లవి॥

కామించి పెంకెమటలు గారఁగా నీవు వచ్చి
నామొగము చూడఁగాను నవ్వితి నేను
చేముంచి బెంట్లు రాలేచిట్లుగందాలతోడ
ప్రేమమున నన్నంటఁగాఁ బెనఁగితి నేను ॥ ఇంత ॥

అందుఁ జేయరాని చేఁత లన్నియునుఁ జేసి వచ్చి
ముందే మాటాడఁగాను మొక్కితి నేను
సందడించి దప్పిగొని సారె నామోవి యానఁగా
గొంది సిగ్గునఁ దప్పించుకొని వుంటి నేను ॥ ఇంత ॥

తగ నీ పుక్కిళ్ల రెంటఁ దమ్ములము నిండుండఁగా
మిగులా నాకియ్యరాఁగా మెచ్చితి నేను
పగటున శ్రీవేంకటపతివి నన్నేలితివి
మగఁడవు నీకాఁగిలి మరిగితి నేను ॥ ఇంత ॥ 576

రేకు-697 భైరవి

ఎటువంటివాడవయ్యా యేమి చెప్పేది
కటకటా వలపు లంగడిఁ బెట్టఁదగునా ॥ పల్లవి ॥

పేసతోఁ బెండ్లాడినాపె చేతులు చాఁచఁగవద్దా
ఆసలఁ బొరవినాపె అలయవద్దా
నీసుద్దులు వినినాపె నివ్వెరగు నొందవద్దా
యీ సతినేల సాదించే విందుకుఁగా నీవు ॥ ఎటు ॥

విన్నపాలు సేసేయాపె వేమారుఁ గొసరవద్దా
కన్నులారఁ గనినాపె కసరవద్దా
చన్నులు దాఁకినయాపె సరసము లాడవద్దా
కన్నెనేల జంకించేవు కాఁతాళాన నీవు ॥ ఎటు ॥

కూటమికి వచ్చినాపె గోర నెచ్చరించవద్దా
చోటు చేకొన్నాపె కూడి చొక్కవద్దా
నీటున శ్రీవేంకటేశ నీయాలట మొక్కవద్దా
మేటి కాంతనేల కదిమేవు పైపై నీవు ॥ ఎటు ॥ 577

## సౌరాష్ట్రం

ఎటువలె మన్నించినా నియ్యకొందుఁగాక నేను
తటుకున నిన్ను మరి తగవులఁ బెట్టేనా ॥ పల్లవి ॥

వలపు నీవు చల్లగా వద్దని నే వారించి
చలములు సాదించేనా సారెసారెకు
కలువల నీవు వేసి కన్నులను నవ్వఁగాను
మలసి సొలపి నీతో మారుమలసేనా ॥ ఎటు ॥

చేతులు చాఁచి నీవు చెనకి మన్నించఁగాను
గాతల జంకించేనా కాదంటాను
రాతిరిఁ బగలు మోవిరసాలు నాకియ్యఁగాను
యేతులకు నే నిన్ను యెగసెక్కెలాడేనా ॥ ఎటు ॥

పచ్చడము గప్పి నాగుబ్బలు నీవు ముట్టుఁగాను
పెచ్చువెరుగుచు నేఁ దప్పించుకొనేనా
యిచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
యిచ్చగించి వుందుఁగాక యిఁక నే లోఁగేనా(?) ॥ ఎటు ॥ 578

## బౌళి

ఎఱఁగవా నీవేమైనా యిన్నిటా నేరుపరివి
జఱయుచు నవ్వఁగాను సాదింతు రటవే ॥ పల్లవి ॥

సముకాన నాతఁడు సన్నలు సేయఁగానే
తమకించి మాటాడఁ దగవౌ నటే
చెమరించు కొంటాను చేరి ప్రియాలు చెప్పఁగా
బొమముడి జంకెనలు పొందౌనటే ॥ ఎఱ ॥

యియ్యకోలుగా నీకు నిచ్చకము సేయఁగానే
సయ్యాటానఁ బెనఁగఁగ సంగతౌనటే
నెయ్యముతో గాసిపడి నీదిక్కు చూడ గాను
కొయ్యతనానఁ గొసరు గూడునటవే ॥ ఎఱ ॥

మంతనాల నాతఁడు మర్మములు ముట్టఁగాను
పంతములు నెరఁపగ బాగౌనటే
యింతలోనె శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ గూడె
చెంతనుండి సిగ్గువడఁ జెల్లునటవే ॥ఎఱ॥ 579

మాళవిగౌళ

ఇంటివారిచేఁతలు యింపు వుట్టినా
గొంటుతనమున నేల కొసరేవు నీవు ॥పల్లవి॥

పన్ని నీవు వలచినపడఁతి నీకు నేమాట
విన్నపము సేసినాను వింధువు గాక
మన్నన గలిగినాపె మరియెంత జంకించి
సన్నలు చేసినానుఁ జవువౌఁ గాక ॥ఇంటి॥

బాస చేయించుకొన్నాపె పనులెంత చెప్పినాను
చేసూటికి లోనై చేతువుగాక
ఆసకొలిపి రప్పించినాపె యేమిసేసినాను
వోసరించి అన్నిటికి నోర్తువుగాక ॥ఇంటి॥

నీవుగాఁగిలించినాపె నీటులెంత చూపినాను
కైవసమై మెచ్చి మెచ్చి కందువుగాక
యీవల శ్రీ వేంకటేశ యేలితివి నన్ను నేఁడు
సేవ చేసి నే నెట్టున్నాఁ జేకొందువు గాక ॥ఇంటి॥ 580

ముఖారి

నీవేల కొంకేవు నిన్ను నేవద్దనేనా
భావించి నీ మేనెల్లా నాపాలిదే కాదా ॥పల్లవి॥

చెక్కులఁ జెమటగారఁ జెప్పే సుద్దులు నీతో
అక్కరఁ జెలియమాట లాలించరాదా
ముక్కున నూర్పులు రేఁగ ముందరఁ బనులు చేసీ
చక్కఁగా నాపెను నీవు సంతోసించరాదా ॥నీవే॥

పాలిండ్లు గదలఁగాను పాదాలు నీకొత్తుతాను
   తాలిమితో నవ్వీఁ జిత్తగించరాదా
వాలుకచూపులఁ గొంచ్చి వాటముగా నిన్నుఁజూచి
   చేలకొంగు వట్టి తీసీఁ జెనకఁగరాదా ॥ నీవే ॥

కప్పురము నోరికిచ్చి కాఁగిట నిన్నునించి
   కప్పుకొనీఁ బద్పడము కలయరాదా
యిప్పుడె శ్రీవేంకటేశ యీపె నిన్నుఁ బెండ్లాడె
   వొప్పుగా నన్నేలితివి వొద్దనుండరాదా ॥ నీవే ॥ 581

వరాళి

నీమగఁ డాతఁడె వచ్చి నిలుచున్నాఁ డెదుటను
   గోమున నిద్దరు మీరే కూడివుండఁ గదరే ॥ పల్లవి ॥

మొగమెత్తి చూచితేను మోహము దెలియవచ్చు
   నగితేను మాటలాడి నమ్మించవచ్చు
తగవులు నడపితేఁ దప్పులు దేరుచవచ్చు
   యెగసక్కెల నుండఁగా నెట్టు బుద్ది చెప్పేమే ॥ నీమ ॥

చుట్టరికమే చూపితే సుద్దులడుగఁగవచ్చు
   నెట్టనఁ బైకొంటేఁ బ్రేమ నెరపవచ్చు
గుట్టెరఁగ మెలఁగితే గుణము దెలియవచ్చు
   వొట్టు వెట్టుకోఁగా నెట్టు వొడఁబరచేదే ॥ నీమ ॥

తలపుకోలు గలితే కానుక లియ్యఁగవచ్చు
   మెలుపున నియ్యకొంటే మెచ్చఁగవచ్చు
యేలమి శ్రీవేంకటేశ (కు?) యి(డి?) దివో నిన్నుఁగూడె
   చలపట్టితే నెట్టు చవులు వుట్టించేమే ॥ నీమ ॥ 582

రేకు-698 రీతిగౌళ

చెలిమరఁగున నేమి చేసితివి చెప్పవయ్యా
   పలుమారు లోఁగఁగఁ బనియేమి నీకు ॥ పల్లవి ॥

నాతిమోముఁ జందురుఁడు నవ్వువెన్నెల గాసీ
  నీతెరిఁగి సిగ్గువడ నీకేఁటికి
  చేతిమీఁద మెరిచీ నీ చెక్కుటద్ద మిదె నేఁడు
  యీతలఁ దలవంచే విది యేమి నీవు ॥ చెలి ॥

సుదతి నేత్రపుమీలు చూపుఁదుమ్మిదల రేఁచీ
  కదిసి నీవేల మేను గప్పుకొనేవు
  కదలీ నీయధరపు కమ్మనిమోవిపండు
  పదపడి చిన్నఁబోవఁ బనియేమి నీకు ॥ చెలి ॥

కొమ్మకరపల్లవాలు గోరిపై వాండ్లు చూపీ
  పిమ్మటికి వీఁగి తప్పించుకొనేల
  యిమ్ముల శ్రీవేంకటేశ యిన్నిటా నిన్నికె గూడె
  సమ్మతించితివి ఇఁక జయమే యిన్నిటాను ॥ చెలి ॥ 583

బౌళి

ఈతని నేల సొలసే వెందాఁకా నీవు
  యేతులు నెమ్మెలుఁ జూప నిఁక నేలే చెలియా ॥ పల్లవి ॥

పనిలేని మాటలు బయలీఁతలు
  నసుపులేని పొందులు నగుఁబాటులు
  యెనయని జాగరాలు యెదురాఁకలు
  కనుఁగొంటిని నీవిఁక రాఁగదవె వోచెలియా ॥ ఈత ॥

యేడ లేనియాసలు యెండమావులు
  వేడుకలేని సొమ్ములు వెట్టిమోపులు
  మేడమీఁది సరసాలు మేకతాఁకులు
  జాడ లెరుఁగుదు దూరఁ జవిగాదె చెలియా ॥ ఈత ॥

అమరని సింగారాలు అదవదలు
  తమిలేని కాఁగిళ్లు తలపోఁతలు
  సమరతి శ్రీవేంకటేశ్వరుఁ డిదె నన్నుఁగూడె
  సముకాన నున్నదానఁ జలమేలె చెలియా ॥ ఈత ॥ 584

## సామంతం

పొద్దువోక నేను నీతో పూఁచి పెనఁగేఁగాక
 తిద్దుకొంచే నేఁడు నీవు తీరుకు వచ్చేవా ॥ పల్లవి ॥

పున్నమవెన్నెల నెట్టు పోగులు వోయఁగవచ్చు
 సన్నలఁ గొండల నెట్టు జరప వచ్చు
 కిన్నరకాయల నెట్టు గిలిగింత సేయవచ్చు
 నిన్నెంత కరఁగించినా నీవు గరఁగేవా ॥ పొద్దు ॥

తెలించి బయలఁ బందిలి యెట్టు వెట్ట వచ్చు
 గాలి ముడియఁగా నెట్టు గట్ట వచ్చును
 లోలత సముద్రము లోఁతెట్టు గానఁగవచ్చు
 చాలాబుద్ధి నే చెప్పితే చాయకు వచ్చేవా ॥ పొద్దు ॥

యిలలోని చింతాకు లెట్టు లెక్కవెట్ట వచ్చు
 వలపు గంపలఁ బట్టవచ్చుట యెట్టు
 అలమేలుమంగ నేను అన్నిటా శ్రీవేంకటేశ
 కలసితి విఁక నీవు కడమ లెంచేవా ॥ పొద్దు ॥ 585

## గౌళ

ఇచ్చకము నేర దీకె నేమి సేయవచ్చు నిఁక
 మచ్చిక దలఁచి నీవు మన్నించు సతిని ॥ పల్లవి ॥

చెంతల నేమి సేసినా చెలుల దూరుట గాక-
 పంతము లాడుదురా పతితోను
 వింతదానితో నవ్వితే వెంగెము లాడుట గాక
 అంతలోనే ముంగురులు అంటఁ దరమౌనా ॥ ఇచ్చ ॥

నగుతాఁ దెనకితేను ననిచి వోర్చుట గాక
 పగలు చాటుదురా పతితోను
 చిగురుమోవి గంటి సేసితే మెచ్చుటగాక
 తగవులఁ బెట్టి నీపైఁ దప్పుమోపవచ్చునా ॥ ఇచ్చ ॥

అదనఁ జన్నులంటితే నాన చెల్లింతురు గాక
వదరి పెనఁగుదురా పతితోను
యిదివో శ్రీవేంకటేశ యీకె నిన్నెట్టె యేలితివి
పదిమారులు నిన్నుఁ బంగించఁ దగునా ॥ ఇచ్చ ॥ 586

దేవగాంధారి

ఇంత రట్టు సేసేమా యిప్పుడు నే మెల్లాను
పంతగత్తెయై నీతోఁ బలిమిఁ బెనఁగీని ॥ పల్లవి ॥

పలుమారు నవ్వుకొంటాఁ బగటులు చూపుకొంటా
చెలుములు సేసీని చెలి నీతోను
కొలువులు సేయుచును కూరిమి గొసరుచు
వలపులు చల్లి నీవద్దఁ గాచుకున్నది ॥ ఇంత ॥

తప్పక చూచుకొంటా తరితీపు చేసుకొంటా
అప్పటి మేకులు సేసీ నంగన నీతో
కప్పురాన వేయుచును కానుక లొసఁగుచును
ముప్పిరి నాసాసల మోవి చూపి నీకును ॥ ఇంత ॥

శిర సూచి మెచ్చుకొంటా చేతులు పైఁ జాచుకొంటా
మురిపెము వచరించీ ముదిత నీతో
ఇరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
సరుగ నీరతులలో సాసు సేసీఁ దాను ॥ ఇంత ॥ 587

దేసాళం

చెప్పవయ్యా నేము గొంత చెవుల వినేముగాని
చొప్పుల నీ సంతోసము చూడ వేడుకయ్యీని ॥ పల్లవి ॥

తలఁపులో నెవ్వతెను తలఁచుకొంటివో కాని
చెలరేఁగి నీమోవి చెంగలించెను
పలుమారు నేమేమి భావించుకొంటివో
సెలవుల నీకు నిట్టె చిరునవ్వు వచ్చెను ॥ చెప్ప ॥

సొకకాన నెవ్వతె నిన్నే నేఁత చేసెనో కాని
దాకొని సిగ్గులు నీకు తరచాయను
మైకొని యప్పటి నీమన సెందెందుఁ జారెనో
ఆకుమడిచి పట్టుక అట్టె వున్నాఁడవు ॥ చెప్ప ॥

అవ్వల నెవ్వతెమీఁది ఆస వున్నదో కాని
నివ్వటిల్లుఁదమకము నిండుకొనెను
రవ్వల శ్రీవేంకటేశ రతి నలమేల్మంగను
చివ్వల నన్నేలితివి చెమటలు మించెను ॥ చెప్ప ॥ 588

రేకు-699 సాళంగనాట

ఎంత గట్టువాయవాఁడ వేమి చెప్పేది
కాంతసేవలల్లా నీవు కనుఁగొనరాదా ॥ పల్లవి ॥

పొలఁతి నీకిందాఁకాను బోనము వడ్డించెను
పిలిచి యాకెఁ బొత్తునఁ బెట్టుకోరాదా
పలుమారు నిందాఁకాఁ బాదాలు విసికెను
అలసి పక్కఁ బండంగ నప్పణీయరాదా ॥ ఎంత ॥

అప్పటనుండిఁ దాను ఆకుమడిచి యిచ్చెను
వొప్పుగఁ దమ్ములమాకె కొసఁగరాదా
చొప్పులెత్తి వూరిలోనిసుద్దులెల్లా నీకుఁ జెప్పె
కప్పి పచ్చడములోనఁ గాగిలించరాదా ॥ ఎంత ॥

సరుసఁ గూచుండి నీతో జాగరాలు సేసెను
నిరతితో రతులెల్లా నేరుపరాదా
యిరవై శ్రీవేంకటేశ యీకె యలమేల్మంగ
సరవి నేలితి విట్టె చనవియ్యరాదా ॥ ఎంత ॥ 589

రామక్రియ

వేడుకకాఁ డితఁడు విట్ఠలేశుఁడు
వీడని పొందులు సేసీ విట్ఠలేశుఁడు ॥ పల్లవి ॥

వెష్టదిన్న మదమున వెలఁదులుఁ దామును
వెన్నెలలో నాడీ నిదె విట్ఠలేశుఁడు
పన్ని రతుల కింతులఁ బాంచజన్యరవమున
సన్న సేసి పిలిచీని సారె విట్ఠలేశుఁడు ॥ వేడు ॥

ఆసపడి కొలువులో నాడువారి మీఁదట
వేసీ విరుఁ గొని విట్ఠలేశుఁడు
వేసరక పదారువేలు సతులయిండ్లా
నేసవెట్టి పెండ్లాడీఁ జేరి విట్ఠలేశుఁడు ॥ వేడు ॥

మెల్లనె గందమిచ్చేటి మెలుతను గాఁగిలించి
వెల్లవిరిగాఁ గూడె విట్ఠలేశుఁడు
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డితఁడె తానై వుండి
యెల్లగాఁ గోనేట వరా లిచ్చె విట్ఠలేశుఁడు ॥ వేడు ॥ 590

## భైరవి

ఏమి సేతునే చెలియా యింత నీకు వలచిత ॥
ఆముకొన్న నీచేఁతలు ఆసలు వుట్టించీనే ॥ పల్లవి

తియ్యని నీమాటలఁ దేనెలు గారీఁగాని
గయ్యాళి జంకెనలఁ గాఁక రేఁగీనే
పయ్యదజారులవల్ల భావము గరఁగీఁగాని
చెయ్యాని చెనకుల సిగ్గులు ముంచీనే ॥ ఏమి ॥

ననుపు నీచూపులు నమ్మికలు సేసీఁగాని
కనుచూపులై తేను కాఁడిపారీనే
వినయపు నీగుణాలు వేడుకలు చూపీఁగాని
కనకపుమైసోఁకులు కళలు దాఁకించీనె ॥ ఏమి ॥

యిచ్చకపు నీకాఁగిలి యింపు గెరలించీఁగాని
హెచ్చిన రతులెల్లాను యెలయించీనే
నిచ్చ శ్రీవేంకటేశుఁడ నేను నాకుదక్కితివి
తచ్చి చన్నులు మతఁగ(తంగ?) పర్వతమై మించీనే ॥ ఏమి ॥ 591

## ముఖారి

నగుఁబాట్లాయఁగా నలుగురిలోననెల్లా
తగవులు నీలోనే తలఁచుకో యిఁకను ॥ పల్లవి ॥

యేకతాన నీవొక్కడ వింటిలోఁ బవ్వళించితే
ఆకడ కెవ్వతో రాఁగా నలమితివి
చేకొని యెంతలో నాకె చెరఁగు మాసి వుండితే
సైకముగా శిరసు మజ్జనము సేసితివి ॥ నగు ॥

సింగారించుకొనేవేళ చెలి యటు పొలసితే
అంగవించి కూడి మోవి యానితివి
చెంగట నాపె యెంగిలిచేతితో నుండుట గని
సంగతిగాఁ గేళాకూళి జలక మాడితివి ॥ నగు ॥

తెరలో నుండినపుడు తెరవ తొంగి చూచితే
సరిఁ గూడితివి భూపతిచెరువుకాడ
అరసి శ్రీవేంకటేశ ఆపె చెమటలఁ దోఁగి
వొరసి నారతులలో నోలలాడితివి ॥ నగు ॥ 592

## ఆహిరి

ఎట్టు వలపించితివో యేమని చెప్పేది నిన్ను
చుట్టమ వన్నిటా నీవు సుదతికి నైతివి ॥ పల్లవి ॥

చెలువపు నీయెలుఁగు చెవుల విన్నప్పుడే
జల జలఁ జెమరించె సకియ
పెలయ నీపంజులవెలుఁగు చూచి అంతలో
పులకాంకురాలచేతఁ బొదలుచు నున్నది ॥ ఎట్టు ॥

ఇప్పుడు నీవు విచ్చేసి యెదుట నుండఁగానే
వుప్పతిల్లు సంతోసాన నోల లాడీని
నెప్పున మంచముమీఁద నీవు గూచుండితేనే
చిప్పిలుఁ గళలతోడ చిమ్మిరేఁగీని ॥ ఎట్టు ॥

గక్కనను దన్ను నీవు కాఁగిలించుకొనఁగానే
చొక్కుచుఁ దురువు పీడి సోఁకీఁ దాను
యిక్కడ శ్రీవేంకటేశ యేలితి పీపెను నేఁడు
పిక్కటిల్లఁ జన్నులను పెనచీ నీమేన ॥ఎట్టు॥ 593

## శ్రీరాగం

ఓయమ్మ నిన్ను గెలువ నోపునటే యీతఁడు
నాయముచేతఁ జెప్పితే నాఁటెఁ గోరనేనే ॥పల్లవి॥

నవ్వుతా నాడెను మాట నాయకుఁడు నీతో
రవ్వలు సేసి యెంత రచ్చ వేసేవే
నివ్వటిల్ల సరసము నీతో సలుపుతాను
పువ్వుల వేసిన నిట్టె పొక్కనేవే ॥ఓయ॥

వేడుకకుఁ బెనఁగెను వెస నితఁ డిందాఁకా
వూడెఁ గుచ్చెలంటా నెల వుప్పతించేవే
జాడతోడఁ దేనెలు చవులు చూచె నింతే
వాడె మోవియంటా మాకు వచ్చి యేమి చూపేవే ॥ఓయ॥

చెలరేఁగి కూడెను శ్రీవేంకటేశుఁడు నిన్ను
చలపాది యంటా నేల సాదించేవే
వలపులు రేఁచె నిదే వాడికైన రతులను
అలయించెనంటా నేఁటి కప్పటిఁ జెనకేవే ॥ఓయ॥ 594

రేకు-700

## శుద్ధవసంతం

ఊరకే గడించుకొని వొద్దు వెట్టే వాపెను
చేరి నీవు గూడఁగాను చెట్ట వట్టి తీసెనా ॥పల్లవి॥

మనసారా నీవే నేఁడు మాయింటికి వచ్చేవంటే
వొనర నొద్దని యాకె వొట్టు పెట్టెనా
చన విచ్చి నీవు నాకు సరవి నడపేనంటే
ననచకుండా నపుడు నడుమఁ దాఁ దుమ్మెనా ॥ఊర॥

పచ్చిగా నీవె నాతో పకపక నవ్వఁగాను
రచ్చల నాపై మరఁగు వచ్చెనా నీకు
పిచ్చనవిడై నీవు విడెము చేతి కియ్యఁగా
తచ్చి నిన్నాకె యేమైనాఁ దగవుకుఁ దీసెనా ॥ ఊర ॥

గక్కన నీవు నన్నుఁ గాఁగిలించుకొనఁగాను
చక్కఁగా ఁంకె నడుమ సందు చొచ్చెనా
యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిదె
వెక్కసాన నాపై మరి వింత సేసెనా ॥ ఊర ॥ 595

## సామంతం

ఎక్కడి కెక్కడ మేకు లేమి చెప్పేది
చక్కఁదనములు వెదఁజల్లీ నీయెదుట ॥ పల్లవి ॥

సెలవి నున్నది నవ్వు చేతిపై నున్నది చెక్కు
కలికితనాలు చూపీఁ గాంత నీకు
పిలుపు పెదవిపై ప్రియము మనసులోన
సొలసి వలపు పొజు చూపీ నీయెదుట ॥ ఎక్క ॥

చెమటలు చెంపలను సిగ్గులు నిలువునను
తమకమె కుప్పళించీ తరుణి నీకు
జమళిచూపు కన్నుల జంకెనలు బొమ్మల
తిమురుఁ గోరికలెల్లాఁ దెలిపీ నీయెదుట ॥ ఎక్క ॥

అసురుసురు కాఁగిట నడియాస రతులను
పొసఁగ నప్పణ సేసీఁ బొలఁతి నీకు
యెసఁగ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కొసరి తానూ ముద్దు గురిసీ నీయెదుట ॥ ఎక్క ॥

లలిత

* లేవయ్య యేమి చెప్పేవు లెక్కలేని సుద్దులెల్లా
కాలు దొక్కఁగా నేఁ గసరేనా నీతోను ॥ పల్లవి ॥

చేరి చేరి నీకు నేను సేవ సేయఁగలఁ గాక
ఆరి తేరి కడుదూరే అందుకోపేనా
కోరి నేఁ బ్రియము చెప్పి కొసర నోపుదు గాక
బీరాన నెనకఁగా నేఁ బెనఁగేనా నీతోను ॥ లేవ ॥

కాయము నీపై మోపి కళలు రేఁతుఁగాక
చాయల సన్నల నిన్ను సాదింతునా
పాయక నీవొద్దనుండి పాదము లొత్తుదుఁ గాక
వేయిటికైనాఁ గడు వేసరింతునా ॥ లేవ ॥

చెక్కులు నీకు నొక్కి సేసలు చల్లుట(దుఁ)గాక
కక్కసించి గోరగీరి కాఁతాళింతునా
యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వొక్కటె నిన్ను రతుల నోడించ వచ్చునా ॥ లేవ ॥ 597

దేశాక్షి

మెచ్చవద్దా నీపిందుకు మెలుఁత వోజ
కొచ్చి నిన్నుఁ గొసరదు గుట్టుతోడను ॥ పల్లవి ॥

వెలఁదులచేత నే విన్నవింపించీఁ గాని
చెలి నీతో మాటాడదు సిగ్గుతోడను
కలువపూవులు నీకుఁ గానుక యిచ్చీఁ గాని
తలయెత్తదు నీవొద్దఁ దన యణఁకువను ॥ మెచ్చ ॥

---

* ఈపల్లవిలో ప్రాసభంగము. మొదటిపాదము 'రే లేవయ్యా' అని యుండవచ్చును.

వుల్లములో దయవుట్ట నూడిగాలు సేసేఁగాని
వెల్లవిరిఁ దమకము వెదచల్లదు
వొల్లనే నీపదములు వొద్దికఁ బాడీఁ గాని
పెల్లున నిన్నుఁ బేరుకొని పిలువఁగఁ జాలదు ॥ మెచ్చ ॥

గక్కన నదరిపాటు కాఁగిలించుకొనీఁ గాని
తక్క వోరువఁగ లేదు తమితోడను
యిక్కడ శ్రీవేంకటేశ యీకెను నీవేలితివి
వెక్కసాన నలయదు వేవేలరతులను ॥ మెచ్చ ॥ 598

నాగవరాళి

ఎఱఁగ మెన్నఁడు నేము ఇటువంటివి
జరపునివెల్లాఁ జూచి సంతోసము లాయను ॥ పల్లవి ॥

చెనకి యొకతె నిన్నుఁ జెయి వట్టి తియ్యఁగాను
ననచి యొకతెకు సన్నలు సేసేవు
వనిత జాణతనమో వడి నీజాణతనమో
అనుమానమెల్లాఁ దీర నానతీవయ్యా ॥ ఎఱ ॥

యిచ్చలఁ దొల్లిటియాపె యిట్టు నీతో మాటాడఁగా
మచ్చిక నవ్వనియాపె మర్మాలంటేవు
నెచ్చెలివలపుజాడో నీవలపుజాడో యిది
అచ్చలాన నాతో నీవు ఆనతీవయ్యా ॥ ఎఱ ॥

చేరి పెండ్లికూఁతురు సేసలు వెట్టఁగాను
సారెఁ జేతు లిద్దరిపైఁ జాచ వచ్చేవు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
ఆరసి నేఁ జేసేపను లానతీవయ్యా ॥ ఎఱ ॥ 599

## కాంబోది

నడుమ నే మిమ్ముఁ జూచి నవ్వుదుఁ గాని
పడఁతి సవతి నీవు పతివి నాకు ॥పల్లవి॥

సారె మీకిద్దరికి సంగాతాలు చేసేనా
చేరి యాపెకు బుద్దులు చెప్పుమనేవు
తారుకాణగా మీకుఁ దగవులు దేర్చేనా
మేరతో వినుమనేవు మీ మాఁటలు ॥నడుమ॥

కొద్దనుండి మీకు నేను వూడిగాలు సేసేనా
కొద్దిమీర విడే లిచ్చి కూర్చుమనేవు
పెద్దగా నే వొజ్జలనై పెండ్లి మీకుఁ జేసేనా
పొద్దులు వేళలు నన్నే వూఁచి యడిగేవు ॥నడుమ॥

విందువలె నే మిమ్ము వియ్యాము లందించేనా
కందువఁ జుట్టరికాలు కడుఁ జెప్పేవు
అందపు శ్రీవేంకటేశ అట్టె నన్ను నేలితివి
సందడి గిలిగించేనా సారెకూ నవ్వేవు ॥నడుమ॥ ౨౦౦



# అనుబంధము

* * *

## సందిగ్ధపదసమీక్ష

1. అచ్ఛలాన–(599 పాట) వదలక, దాఁచక అని అర్థము. 'అచ్ఛల' శబ్దభవము. 'స్ఖలితం ఛలమ్' అని అమరము.

2. అడ్డికపుదానవా–(572) ఎల్లపుడు సమీపము నందుండు పరిచారికయా? అని యిక్కడ తోఁచెడిని వివరము తెలియలేదు.

3. అరనసము–85. అర + వశము, అరవసము = సగములోఁగుట. లోఁగిలోఁగ కుండుట అని భావము.

4. ఆడనుంచే–(437) అక్కడనుండియే. 'నుంచి, నుంటి, నుండి, నించి, మంటి'–అనికూడ 'ఉండి' వ్యవహారమునఁ గలదు.

5. ఇడుపు–(255) ఇడుపు = నడుము అని తమిళము. 'ఇడుపునఁ జేర్చుట'=ఎత్తుకొనుట.

6. ఈటు మీరు–(106) కొలఁది మీరు. కన్నడమున 'ఈటు= ఇంత' అని కలదు.

7. ఉమురు కూటములు–(448) 'ఉమరి, ఉమిరి' = నత్త అని తమిళము. ఇక్కడ నత్తగుల్లల గుంపుకావచ్చును.

8. ఊసివాసులు–(377) 'పుసి, హుసి '=అబద్ధము అని కన్నడము. అదియే 'ఊసి' యైనచో 'ఊసివాసులు'=అసత్యములైన విలువలు కావచ్చును. 'ఊసివాసము'=ఈర్ష్య అని శ ర., సూ. ని. యు. దీని కాధార మగపడుట లేదు.

9. ఎత్తలఁ గొండలు–(421) 'ఎత్తుల కొండలు'?=ఎత్తైన కొండలు 'ఎత్తల్' అని ఎక్కడ అను నర్థమున కన్నడపదము గలదు. కాని, 'ఎందు' అనుపద మీవాక్యమందే యున్నది; గనుక పునరుక్తి యగును.

10. ఎదురాఁకలు—(584) ఎదురుగ అడ్డగించుటలు. విఘ్నములు;

11. కంకి గా—(97) గింజముదిరిన వెన్ను. ఇక్కడ లాక్షణికముగా నిండుఁదనము అని అర్థము.

12. కగ్గక—(88) 'కగ్గు'=వివర్ణ'మగు' అని సూ. ని. దాని ఛాయార్థము—గా 'సంకోచింపక' కావచ్చును.

13. కలికితనాలు—(596) కన్నడమున 'కల్'ధాతువు 'నేర్చు' అను నర్థమున నున్నది. దీని తెలుఁగు 'కఱచు'. కన్నడ ధాతుకృదంత భావరూపము 'కలికె'. ఇదియే తెలుగున ధర్మి వాచకముగ 'కలికి' అయినది. తక్కిన యర్థములు లాక్షణికములు.

14. కల్లమాడ దొడ్డముద్ర—(877) 'చెల్లనికాసుకు గిల్టులెక్కువ' అను సామెతవంటిది.

15. కినుకాటము—(148) 'కినుక' 'కృషి' శబ్దభవము. కిను కాటము=మోటుతనము.

16. కుసిగుంపు—(333) 'కుసిగింపు' అనికూడ వ్యవహారము గలదు.

17. కోడ తిరునాళ్లు—(240) 'కోడై=వేసవి' అని తమిళము. కోడతిరునాళ్లు=వసంతోత్సవము కాఁదగును.

18. గొదిలేను—(389) 'కొదలు=తడఁబడు' అని కన్నడము. 'సంకోచించు' అను తాత్పర్యార్థ మిందుఁ గావచ్చును. 'ఇంత కొదుల్తావేమిరా, కొతుకుతా వేమిరా' అని వ్యవహారము గలదు.

19. చండి పారనోపను—(503) చండిపారు=మూర్ఖత్వమున వర్తించు 'చండివడు' దానివంటిది. తెల్లఁబారు, వెలవెలఁబారు—మొదలగు వానివలె ఇక్కడను, 'పారు'—అగు, పరిణమించు,

వర్తించు—అను నర్థము నిచ్చును. 'చండిపోరు' అనుటకు పొరపడిన వ్రాఁతయైనను గావచ్చును.

20. చప్పుచాడు--(94) శప్పుచ్చవళ్=నిస్సారము, నిస్సారభూమి. చవటినేల—అని తమిళము. 'చప్పుచాడు'—దానివికారము కావచ్చును.

21. చల్లజంపు—(305,311) చల్లగాఁ జంపుటయే మో? తడిగుడ్డతో గొంతు గోయుటవంటిది గాఁబోలు. 'పృష్ఠశీతం ప్రాణనాశమ్' అని కలదుగదా? అరసున్న లేకుండుట వింత.

22. చల్లదుబ్బెడు—(89) చల్లదుత్తనిండ. 'దుబ్బి' కన్నడము. అర్థమిదే

23. చాయ సేసుకుండితే—(554) చాయ=మరుఁగు.

24. చిక్కుఁజీరు—(356) ఇవి జంటపదములు. 'చిక్కు=సంకటపెట్టుట' 'చీరు=కోపించుట' తమిళము. 'చిక్కుజీరు' శబ్దమును అరసున్న లేకుండ సూ. ని. బహుతాత్పర్యార్థములతోఁ జూపినది. 'చప్పుచాడు' వంటిది.

25. చిట్లు—(429) చిట్టి+లు=చిన్నకొలపాత్రలు, గిద్దెలు.

26. చిత్తరు వాఁతపటము—(466) వాఁత—వ్రాఁత. రేఫ సంయుక్తాక్షరములలో రేఫమే లోపించుట, ప్రాఁత—పాత, క్రొత్త—కొత్త ఇట్లు తెలుఁగు వ్యవహారపరిణామము. కాని. 'వ్రాఁత—వాఁత'గాఁ గాక 'రాత'గానే నేఁడు సర్వత్ర వ్యవహారమున నున్నది; 'వాత'కు వేరే అర్థము గలుగుటచే కాబోలు. కాని, 'వాఁత' అని కూడ ఈరేకులకాలమున వాడుకలో నుండి యుండును.

27. చౌసు—(94) ఈ 'చౌకు', 'జౌకు'కు ప్రాచీనరూపమేమో?

28. తలపోసేవు—(89) తలపోయు=రెండు కొలపాత్రల కొలత సరిచూచు. ఇది రేనాటి ప్రయోగము.

29. తిరువాముడి మంటపము -(868) తిరు + వాయ్ + మొళి=శ్రీ శ్రీయుతమైన నోటిమాట. దివ్యప్రబంధము పై అరవ శబ్దమే తెనుఁగున 'తిరువాముడి' యైనది. అది పారాయణము సేయు మంటపమే తిరువాముడి మంటపము.

30. తెమ్మ—(161) తేమయొక్క రూపాంతరమని శ.ర. 'తెమ్మల్' గుంపు అనికన్నడము. ఈ యర్థమే యిక్కడ సరిపడుచున్నది. శ. ర. చూపిన "మదగంధంబుల తెమ్మలకు" అనులక్ష్యమందుఁ గూడ నిదే యర్థము చెప్పవచ్చును.

31. తొట్టు దీరిచేవు—(198) తాఁకి, శాస్త్రము చెల్లింతువు. 'తొట్టు' అనునది, తమిళమునఁగల 'తొడు' ధాతువు 'క్త్వార్థక' రూపము కావచ్చును.

32. దేవుళ్ల నడుమ—(868) 'దేవి శబ్దము బహువచనము దేవులు. అది, గౌరవసూచకమై యేక వ్యక్తిపరముగా 'నేను నీదేవులు' ఇత్యాదిగ వాడుకలో నిల్చి బహుత్వమును బోఁగొట్టు కొన్నది. దాని బహువచన రూపమే దేవుళ్ళు. తెనుఁగులోని 'దేవేరి' శబ్దమును ఇట్టిదే. 'దేవి యరు' అను కన్నడ బహువచనరూపము, గౌరవ వ్యవహారమున నేకవ్యక్తిపరమై 'దేవేరి' అయినది.

33. నాపపంట—(73) 'నాంబు'=సన్నమగు అని తమిళము. ఇదే శక్తిలేమి, ఆలస్యము—అనునర్థములలోఁ గన్నడమున. వీని ఛాయార్థము 'లేఁత' గా తెనుఁగున నుండవచ్చు. అరసున్న లేకుండుట విచార్యము. లేఁతజొన్న, ఆముదపాకు- మొదలగు వానిని దినినఁ గలుగు పశురోగమునకుఁగూడ 'నాము'

అని పేరు. వరిమొదలగు వానిలో మరుగోలతో పండుపంటకుఁ గూడ నాపపంట యని పేరు.

34. నాపంలిటి దేవులవా–(538) నాతోసరిగ పాలుపంచుకోఁదగిన భార్యవా?

35. నిరుమోహి–(360) 'నిర్మోహి' శబ్దభవము. 'కానమురా నీవలె నిర్మోహిని' అని, 'మానములేదా' అనుకీర్తనలో త్యాగరాజస్వామి ప్రయోగము.

36. నీచుఁ–(841) వృద్ధాది గణములో 'నీచ' శబ్దమునకు, పుంస్త్వమున పాక్షిక 'డుజ్' లోపమును వైయాకరణులు విధించిరి. అది యిచ్చట స్త్రీత్వమునఁ గన్పట్టుచున్నది.

37. నెంజెరివి–(170) నెంజి+ఎరివు=ఎదలోని తాపము. మనో వ్యథ అని తమిళము. అదియే యిది కావచ్చును.

38. పగిడివెట్టి నవ్వితే–(245) 'పగిడి'=పరిహాసము, వెక్కిరింపు అని తమిళము.

39. పరిణాము–(37) 'పరిణామ' శబ్దభవము. తీర్మానము అని అర్థము. 'పరిణాపుమాటలు' ఇత్యాదుల సామాసిక పుంప్వాదేశములు గూడఁ గలవు.

40. పళి–(276) 'పళి'=నింద అని తమిళము. తెనుఁగు 'ప్రయి' యిదే.

41. పన్నారు కాఁగులలో–(456) పన్నారులు=చిన్నపాత్రలు, కాఁగులు=పెద్దవి, యీ రెండింటిలోని బియ్యమును చేతికి దొరికినట్లెల్లా సేసలు చల్లుచున్నాఁడని యర్థము. పన్నారులు, పన్నరులు=చిన్నగురిగెలు గూడనగును.

42. పయ్యాడించి–(32) 'పయ్య'=విభాగము అని కన్నడము. పయ్య+ఆడు=వేరుపడు. పయ్యాడించి=వేరుపరచి కావచ్చును. 547 వ పాటలో 'పయ్యాడితే' అను పలుకుబడి గలదు. అక్కడఁగూడ నీయర్థము సరిపడును.

43. పాటము గొమ్మనవే—(504) పాతము—పాటము. తనకు తానే వల్లించు కొమ్మనవే అని తాత్పర్యము.

44. పాదాలె చిగురుగాని ఖాపమెల్లా నిండుఁజేగ—(529) 'చిగురుఁ గొమ్మైనఁజేవ' అను నానుడిలోనిది 'చిగురుచెట్టే' కాని. 'చిగురు' గాదని, చిగరచెట్టు చేవ యెప్పుడును లేనిదని ఒక వాదమున్నది. అది సరిగాదని యీ ప్రయోగము తెలుపు చున్నది.

45. పారితేఁగా—(553) పారిరాఁగా. 'పారితేరఁగా' ఇట్లైనది కాఁబోలును.

46. పాలుదీసును—(99) దేహసత్త్వము తగ్గును.

47. పుణుఁగు పువ్వు గట్టినట్టు—(418) పునుఁగురాచి పువ్వు గట్టినట్లు. పునుఁగు తీడినదారముతో పువ్వులమాలకట్టుట మైసూరులో నుండినది.

48. పుఱవేదనలు—(387) పురువేదనలా? 'పురు భూయిష్ఠ'మ్ అని అమరము. ఇక్కడ తొందర, ఆత్రము—అని చెప్పవచ్చును. బండిఱా ఈవ్యుత్పత్తికి కొంత బాధకము.

49. పులుఁగాలు—(408) పులగమా? దీనికి 'పులుంగ' మనియు రూపము గలదా?

50. పూసగొండి—(292) 'పూశల్'=కలహము అని తమిళము. 'పూసగొండి'=కలహ స్వభావము గలవాఁడు. 'కొండి' లేక 'గొండి' అను ప్రత్యయము తాచ్ఛీల్యార్థమునఁ గలదు. 'లంచగొండి' 'జగడగొండి' వలె.

51. పైఁ బిల్లగొట్లాడు చున్నాఁ డు—(456) 'పిల్లగోటు', 'పిల్లగోరు', 'బిల్లగోడు'—అని సూ. ని.. 'బిల్లగోడు'—అని శ. ర. 'బిళ్లంగోడు 'అనియు వ్యవహారము. 'చిల్లాకోలు' 'చిల్లాకట్టె', జిల్లాకట్టె-అనికూడ వాడుక

52. పొడిఁబడి—(387) పొడిన్ + పడి. 'పొడివడు' అని యుండు నేమో ? చులుకనై, చిన్నతనముతో.

53. పొదపు—(162) ఇది పొదుపే కావచ్చును.

54. పొలమేర—(305) పొలము + మేర పొలిమేర. ఋదే పొలి—బలి·

55. బెంగ—(216) తాపము. ఇక్కడ తాపము గలది.

56. బేంట్లు—(576) ఎండిన పలుకులు. "బేఁటు" శబ్దము సాను స్వారమనుట కిదియు నొక యుదాహరణము.

57. మని మని—(268) పెద్దగాఁ బ్రదికి.

58. మలఘుని నిన్న పెరుమాళ్లు :—(368) మలై + కునియ + నిన్ర + పెరుమాళ్లు = కొండ క్రుంగునట్లు నిలుచున్న దేవుఁడు. వేంకటేశ్వరుని మూలమూర్తి. 'మలై కినియ' అని, 'తిరుమలై ఒళుగు' అనుగ్రంథమున నున్నది. ఇందు 'కినియ' కు వ్యాపించు అని యర్థము.

59. మక్కువ నేర్చితిఁగాని మంకు నేరనైతి—(548) 'మంకు' పదము—నకు అవివేకము, మొండితనము—మొదలైన అర్థము—లిక్కడ పనికిరావు. తాత్పర్యముచేత ఆర్జవము, మంచితనము అనఁదగును.

60. ముయి—(69,80) వివాహాదులందిచ్చునట్టి బహుమతి. దానికి బదులిచ్చుట 'ముయికి ముయి'

61. మేక తాఁకులు—(584) అజాయుద్ధము తుణికమని వినికి. అట్లే ఇవి తుణికములు.

62. మొగదారికి —(86) ముఖదాక్షిణ్యము — మోమోటము. 'సాక్షి' శబ్దము 'సాకిరి' యైనట్లు 'దాక్షిణ్య' శబ్దము 'దాకిరి'గా నిలుచును గాఁబోలు.

63. మొరయన్—(572) ఉరిమి చూచుటకు, 'ఏమిరా మొరుస్తా' వని చిత్తూరుజిల్లాలో నొక భాగమున వ్యవహారము. "అని

రుద్ధుతోఁగూడ నయ్యుషాకన్యఁ జెరవేయుఁడని క్రోధ చిత్తుఁడై యరిగె మొరయుచు" అని చిన్నన్న 'ఉషాకల్యాణము' 999 వ పం కి.

64. రండు(417) రెండు శబ్దవికారమా? అవును–కాదు అని రెండును చెప్పువారు. పట్టులేనివారు.

65. రాఁపు–(363) 'రంపు' ఇదియే కాఁబోలును.

66. వరుస పద్యము–(555) పదిమంది విద్యార్థులలో నెవనివంతు పద్యము వాఁడు చెప్పుట. తక్కిన పద్యముల జోలి వాని కక్కరలేదు. శాస్త్రము చెల్లించుట యని భావము.

67. వాగము– (1) 'వాగై' తమిళము. మంచినడత, సమృద్ధి మొదలగు నర్థములు గలవు. అట్లే 'వాగు' అనుపదము గూడ గలదు. 'అంద' మని యర్థము. ఇది తెలుఁగు 'బాగు'. ఇంకను అర్థము విచారింపఁ దగినది.

68. వాతరొట్టు–(214) 'వాతరట్టు' రూపాంతరము. నోటి దురుసు దనము గలవి. "కెలయుఁగీరంబు మిక్కిలి వాతరట్టు" అని చిన్నన్న పరమ యోగివిలాసము, 6278.

69. విటుకులాడి– (256) 'మిటుకులాడి' కి రూపాంతరమేమో?

70. విసువేఁటికి– (503) విసుగుధాతువు భావార్థక రూపము. 'విసువు' వలె, 'విసుపు' ను కావచ్చును. గెలువు–గెలుపువలె,

71 వెలకా వేగునిందాఁక–(343) వెల్లఁగాఁ (తెల్లఁగా) వేగువరకని యేమో?

72. వెలుమజోలి– (1) వెలమవారి సహవాసము? అది యెట్టిదో తెలియదు. వెలమ బంక చాల జిగురని 'వెలమబంకవలె అంటుకొన్నాఁడని' వాడుక రేనాఁటిలో కలదని ఒక పండిత మిత్రులన్నారు. ప్రకృతమున కీ యర్థము కొంత అనువుగా నున్నది.

73. వొందిలి—(125) 'ఒందిలి'=దుఃఖము. వ్యాకులత—అని సూ. ని. 'ఒంజిలి' రూపాంతరము. 'ఒంజిల్' అను తమిళ ధాతువునకు సిగ్గుపడు అను నర్థము కలదు. ఇక్కడ ఆత్రము తొందర కావచ్చును.

74. వొరట్లు— (67,86,108) మోటుపనులు

75. సుమాళము— (158) 'సుమాళము'=పారవశ్యము అని శ.ర. 'సుమాన' 'సుమ్మాళ'—అని కన్నడమందుఁ గలవు. సంతోష మని అర్థము.

76. సుసరాన— (64) 'సుస్వర' శబ్దభవము కావచ్చును. సులభ ముగా నని అర్థము. 'సుసర' శబ్దము కన్నడమున నీయర్థ మందే కలదు.

77. సెగ్గెము— (282) 'సెగ్గము' = రోఁత అని శ. ర. ఇక్కడ 'చింత' కావచ్చును.

78. సొలతు— (556) సొలయింతును. అంత ర్భావిత ణిజర్థము. 584 లోఁగూడ 'ఈతని నేల సొలసేవు' అని యిట్టి ప్రయో గమే కలదు.

79. సోలిగాను తప్పక చూచుట — (476) అరవమున 'శోలి' = పని. అదే పనిగా అని ఇక్కడ అర్థము. తెలుఁగు 'జోలి' గూడ ఈ పదమే కాఁగలదు.

★

# అనుబంధము ౨

## సంకీర్తన రాగముల అకారాది సూచిక

* * *

| రాగములు | సంకీర్తనల సంఖ్యలు |
|---|---|
| అమరసింధు | 73, 167, 253, 442, 556. |
| ఆందోళి | 56. |
| ఆరిబి | 524. |
| ఆహిరి | 35, 41, 49, 64, 72, 83, 101, 12 170, 214, 242, 305, 344, 360, 367, 382, 428, 431, 437, 499, 527, 530, 536, 548, 567, 593. |
| ఆహిరినాట | 5, 153, 254, 459, 514. |
| కన్నడగౌళ | 71, 90, 132, 151, 169, 179, 220, 330, 337, 399, 446, 480, 545. |
| కన్నడబంగాళం | 133, 511. |
| కాంబో(భో)ది | 34, 62, 111, 164, 221, 291, 322, 340, 376, 441, 450, 460, 507, 600. |
| కుంతలవరాళి | 65, 311. |
| కురంజి | 11, 76, 204, 363, 406, 519 |
| కేదారగౌళ | 81, 200, 216, 383, 472, 528. |
| కొండమలహరి | 190, 244, 339, 434, 526. |
| కోకిల పంచమం | 8. |

| రాగములు | సంకీర్తనల సంఖ్యలు |
|---|---|
| నాదరామక్రియ | 17, 39, 63, 153, 239, 312, 384, 416, 435 513. |
| నారాయణి | 9, 46, 88, 364, 452, 491. |
| నీలాంబరి | 4. 168. |
| పడవంజరం | 198, 257, 387. |
| పాడి | 2, 45, 48, 75, 87, 96, 108, 141, 144, 234, 245. 373, 389, 415, 447, 525, 561. |
| పూర్వగౌళ | 115, 541. |
| బలహంస | 218, |
| బౌళి (భవుళి) | 27, 57, 60, 104, 107, 147. 201, 241, 248, 269, 287, 289, 306, 310, 314, 319, 331, 355, 375, 405, 412, 429, 539, 579, 584. |
| బౌళిరామక్రియ | 185, 288, 295, 334, 372, 443. |
| భూపాళం | 13, 127, 469; 517, 559. |
| భైరవి | 31, 98, 152, 156, 157, 313, 379, 407, 425, 465, 488, 535, 577, 591. |
| మంగళకౌశిక | 106, 182, 330, 401, 457, 474, 504, 568, |
| మధ్యమావతి | 80, 99, 180, 215, 463, 576. |
| మనోహరి | 192, 293, 333 |
| మలహరి | 15, 19, 128, 159, 476. |

| రాగములు | సంకీర్తనల సంఖ్యలు |
| --- | --- |
| మాళవి | 113, 386, 466. |
| మాళవిగౌళ | 38, 84, 136, 159, 199, 255, 392, 532, 544, 580. |
| మాళవి(వ)శ్రీ | 283, 398, 505. |
| ముఖారి | 16, 92, 119, 154, 193, 203, 208, 262, 271, 280, 285, 298, 300, 303, 320, 329, 345, 362, 370, 395, 409, 419, 487, 496, 549, 574, 581, 592. |
| మేచబౌ(భౌ)ళి | 143, 292, 430 |
| రామక్రియ | 26, 44, 51, 53, 89, 93, 165, 210, 228, 231, 243, 299, 342, 359, 400, 408, 411, 424, 432, 486, 510, 512, 520 538, 551 590, |
| రీతిగౌళ | 172, 341; 440, 492, 588. |
| లలిత | 66, 78, 135, 181, 211, 217, 273, 278, 281, 284, 328, 349. 357, 361, 371, 390, 404, 418, 462, 498, 554, 573, 597. |
| వరాళి | 21, 40. 58, 155, 236, 426, 473, 493, 501, 547, 565, 582. |
| వసంతవరాళి | 189, 277. |
| వేళావళి | 310. |

| రాగములు | సంకీర్తనల సంఖ్యలు |
|---|---|
| శంకరాభరణం | 23, 24, 36, 125, 137, 168, 178, 202, 209, 230, 232, 249, 250, 267, 274, 286, 296, 297, 315, 316, 332, 347, 358, 414, 417, 423, 454, 458, 485, 515, 533, 546, 563, |
| శుద్ధదేశి | 82, 123, 206, 323, 572. |
| శుద్ధవసంతం | 25, 117, 162, 224, 261, 266, 351, 391, 464, 479, 595. |
| శ్రీరాగం | 10, 68, 85, 149, 212, 235, 246, 252, 270, 385, 439, 449, 478, 484, 531, 558, 594. |
| సామంతం | 3, 30, 42, 54, 77, 110, 126, 171, 195, 205, 226, 227, 229, 233, 253, 264, 265, 279, 282, 290, 294, 302, 304, 309, 317, 324, 335, 343, 348, 352, 358, 368, 396, 413, 422, 436, 489, 502, 506, 521, 543, 550, 566, 585, 596, |
| సామవరాళి | 207, 381, 467, 523. |
| సావేరి | 6, 146. |
| సాళంగం | 61, 122, 191, 256, 327, 346, 365, 540. |
| సాళంగనాట | 1, 18, 26, 52, 91, 116, 124, 148, 152, 176, 197, 240, 247, 374, 445, 453, 483, 495, 529, 599. |

# అనుబంధము 3

## అకారాదిగ సంకీర్తన, రాగ, సంఖ్యాసూచి

* * *

| సంకీర్తనల మొదలు | రాగము | సంకీర్తన సంఖ్య |
|---|---|---|
| బలవంతుఁడవు | .... లలిత | .... 462 |
| బాపుబాపు | .... లలిత | .... 418 |
| బావంటాఁజూడ | .... దేసాళం | .... 534 |
| భామలుచూడరే | .... దేసాళం | .... 456 |
| భావించరహస్య | .... శంకరాభరణం | .... 546 |
| మంచితనానవచ్చే | .... ధన్నాశి | .... 138 |
| మంచితనాలకే | .... శంకరాభరణం | .... 417 |
| మంచిముహూర్త | .... సామంతం | .... 110 |
| మంచివాఁడవంతే | .... దేసాళం | .... 237 |
| మందెమేళమైన | .... ముఖారి | .... 487 |
| మక్కువనామీఁద | .... లలిత | .... 328 |
| మగనితోనేమి | .... భూపాళం | .... 559 |
| మగవాఁడవు | .... బౌళి | .... 241 |
| మగవారితోడుత | .... హిందోళవసంతం | .... 508 |
| మట్టుమీరఁజాలక | .... సాళంగనాట | .... 197 |
| మదించినయేనిగె | .... నాట | .... 552 |
| మన్నించవయ్యా | .... ఆహిరి | .... 150 |
| మమ్మునేమియడి | .... నాదరామక్రియ | .... 17 |
| మమ్మునేల | .... ముఖారి | .... 574 |
| మమ్మేమియాడు | .... నాదరామక్రియ | .... 39 |
| మఱివేళలేదా | .... హిజ్జిజి | .... 130 |
| మలఘునినిన్న | .... సామంతం | .... 368 |
| మలసివాదులడువ | .... సామంతం | .... 413 |

